


# వస్తాదుగారి పుస్తకం

విపరీతంగా కండలు తిరిగిన మహా బలవంతుడిగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచాడు డాన్‌రాస్. 'మిస్టర్ వరల్డ్' అనీ, 'మిస్టర్‌మెర్క్యురీ' అనీ 'మిస్టర్ అమెరికా' అనీ ఇలా అనేక బిరుదులు సంపాదించుకున్నాడు ఈ దృఢకాయుడు. లెక్కలేనన్ని బలప్రదర్శనలిచ్చి ప్రేక్షకులను ముగ్ధులను గావించిన రాస్ ప్రస్తుతం 'ఫిజికల్ ఫిట్‌నెస్' మీద ఓ ఉద్గ్రంధాన్ని కండలు కరిగేలా కష్టపడి రాయనున్నట్టు ప్రకటించాడు. వస్తాదులు కాబోయే యువకులంతా ఈ పుస్తకం కోసం వువ్విళ్లూరుతూ ఎదురు చూస్తున్నారు.



# చతుర ప్రపంచం

## అభ్యాసం కూసువిద్యే

మద్రాస్‌లోని చెట్‌పట్ ప్రాంతం ఎన్నో సినిమా ధియేటర్లకీ పేరున్న ప్రయివేటు సంస్థలకీ ప్రసిద్ధి. అక్కడే వున్న ఒక ఓవర్ బ్రిడ్జి దిగువగా వందలాది గుడిసెలు కాల




నీలా ఏర్పడి వున్నాయి.

ఆ ప్రాంతం ఎన్నో నేరాలకు కీలకస్థానమని అందరూ నమ్మినా, పోలీసులు మాత్రం ఆ ప్రాంతం జోలికి అంతగా పోరన్న మాటకూడా వుంది. ఇంతకీ అసలు విషయం, ఆ ప్రాంతంలో కొంతమంది పేరు మోసిన రౌడీలు కలిసి అక్కడొక కాలేజీ తెరిచారు. ఆ కాలేజీలో చేరడానికి ఎలాంటి ఫీజులుగానీ, వయోపరిమితిగానీ, అర్హతగానీ అక్కర్లేదు. గాలికీ, ధూళికీ తిరిగే అల్లరి మూకంతా అందులో స్టూడెంట్లే. అక్కడ వాళ్లు జేబులుకొట్టడం, మత్తుమందులు అమ్మడం, బ్లాకులో సినిమా టిక్కెట్లమ్మడం, పోలీసులను ఏమార్చడం... వగైరా వగైరా పద్ధతులన్నీ నేర్చుకుంటారు. ఇవి నేర్పిన సీనియర్లకు గురుదక్షిణగా తమ వ్యాపారంలో ముప్పాతిక భాగం చెల్లించుకుంటారు. అంటే వీళ్ల సంపాదనే గురువులకి జీతభత్యాలన్న మాట!

అక్కడ జరిగే క్లాసుల్లో మొట్టమొదటగా జేబులు కొట్టడం నేర్పుతారు. ఆ పాఠంలో భాగంగా ఓ మట్టికుండ తినుకుని అందులో కొన్ని పర్సులను వేసి, మూతి బిగించి వెనకవైపు కొద్దిగా చెయ్యి పట్టే వీలున్నంతగా ఓ రంధ్రం చేస్తారు. కుండకి దట్టంగా సున్నం పూస్తారు. సున్నం చేతికంటకుండా ఆ రంధ్రంగుండా ఒడుపుగా పర్సును లాగాలి విద్యార్థి. అలా తీయడంలో ఏమాత్రం సున్నమంటకపోతేనే అతడికి ఫస్ట్‌క్లాస్ వచ్చినట్టు. కొద్దిగా అంటితే సెకెండ్‌క్లాస్ ఇస్తారు. బాగా అంటితే అతడిని ఫెయిలయిన విద్యార్థిగా భావించి స్టూడెంట్లందరి ముందూ చితకబాదుతారు. ఫస్ట్ క్లాస్ వచ్చిన విద్యార్థికి బహుమతిగా బీడీలు, సిగరెట్లు ఇచ్చి కాల్చుకోమంటారు.

దీని తరువాత కదిలే రైల్లోంచి పెట్టెతో సహా దూకి, జన సమ్మర్ధంలో వేగంగా పరిగెత్తడమెలా! అన్న అంశంపై ట్రెయినింగివ్వబడుతుంది. ఈ ట్రెయినీలు పోలీసులకు పట్టుపడకుండా మారు వేషాల్లో సీనియర్లను కాపలాదారులుగా నియమిస్తారు గురువులు.

ఇలా ఒక్కొక్క టీము విద్యార్థులూ క్లిష్టమైన ట్రెయినింగ్ పొంది ఆరితేరిన దొంగలుగా ఆ కాలేజీనుంచి బయటపడతారు.




# బురదప్రియులు

ప్రస్తుతం కొన్ని ప్రాంతాల్లో వున్న నీటికొరత కారణంగా 'జలకాలాటలలో' అన్న లెవెల్లో హాయిగా కరువుతీరా స్నానం చెయ్యడానికి వీలు లేకుండాపోతోంది జనాలకి. కాలంతో సంబంధం లేకుండా మరీ రెండూపూట్లా స్నానం చేసేవారి పాలిట ఈ నీటికొరత పెద్ద దెబ్బే అంటున్నారందరూ.

పూర్వం రాజులు, జమీందార్లు మొదలయిన ధనిక కుటుంబాల్లోని వ్యక్తులు స్నానాలు మొదలెడితే బిందెలుకొద్దీ నీళ్లలో పన్నీరు కలిపి మరీ చేసేవారు. ప్రస్తుతం ఆ పద్ధతులు వెనకపడ్డాయనే చెప్పొచ్చు.

స్నానాల్లో పన్నీటిస్నానాలు సూర్యస్నానాలతో పాటు 'బురదస్నానం' కూడా ప్రకృతివైద్యంలో ఉన్నా ప్రస్తుతం అమెరికాలో అది ఓ మామూలు విషయమయిపోయింది. కాలిఫోర్నియాలోని ఓ బురద స్విమ్మింగ్‌పూల్‌లో ప్రతి శనివారం 6 సంవత్సరాల బాలుడినుండి 60 ఏళ్ల వృద్ధుడివరకు ఆనందంగా బురదస్నానం చేస్తూ కనిపిస్తారు.

కొత్తగా అక్కడ 'మడ్ బాత్‌క్లబ్బులు' కూడా ప్రారంభించారు. మడ్‌పూల్స్‌లో రోజూ వందలాదిమంది స్నానాలు చేయడానికి వీలు కల్పిస్తున్నారు. ఈ బురదస్నానం అనేక రోగాలకి అద్భుత చికిత్సగా పనిచేస్తోందంటున్నారు. లక్సిన్ క్రాఫోర్డ్ అనే ఆసామి ఈ బురదస్నానం ప్రారంభించిన ఆరునెలల్లో తనను ఎంతో పీడిస్తున్న తలనెప్పి, క్షణాకావేశ లక్షణాలు మటుమాయమయ్యాయంటున్నాడు.

అయితే భారతీయులకు ఈ బురదస్నానం కొత్తగాదు. శతాబ్దాలనుంచీ వస్తున్నదే. గాంధీగారు ఈ బురదస్నాన చికిత్సని అలవాటుగా చేసేవారు. ఈ స్నానాలకు బురద పరిశుభ్రంగాను, బాగా తడిగాను, మెత్తగాను వుండటం అవసరం. అందులో ఇసుకగానీ, లవణాలుగానీ, సున్నం, సల్ఫర్, మైకా మొదలయిన పదార్థాలుగానీ కలవరాదు. మట్టిని కొంచెంసేపు నీటిలో నానబెట్టి వుంచాలి. ఆ నీరు కూడా స్వచ్ఛంగా, పరిశుభ్రంగా, తాజాగా వుండాలి. మట్టిని ఇనుప లేదా మరే ఇతర పాత్రలలోనూ నానపెట్టకుండా కేవలం మట్టి కుండలలో మాత్రమే మెత్తగా పిసికి పేస్ట్‌లా చేసి మరీ నానపెట్టుకోవాలి. దాన్ని ఒంటికి అతినెమ్మదిగా పట్టించి గంటా, రెండుగంటల పాటు ఆరనివ్వాలి. ఆపైన నోటికి, చెవులకి మాత్రం తగలకుండా, శరీరంలోని మిగతా భాగమంగా ఈ మట్టిని పట్టించవచ్చు.

రోజూ క్రమంతప్పకుండా చేసే బురదస్నానంవల్ల రక్తప్రసరణ సరిగ్గా జరగడం, నిద్రపట్టడం, నరాలు, చర్మసంబంధరోగాలు




రాకుండా వుండటం మొదలయిన ఎన్నో ఆరోగ్య లాభాలున్నాయని తెలుస్తోంది. మామూలుగా ఒంటిమీద ఎక్కడయినా పుళ్లు, గడ్డలు లాంటివి వస్తే వాటిపై ఈ చల్లటి తడిమట్టిని ఆరారగా వేస్తే అవి త్వరగా తగ్గుముఖం పడతాయి. ఒక బట్టను తడిగా, జారుడుగా వున్న మట్టిలో పొర్లించి దాన్ని పొట్టపై వేసుకుని ఆరనిస్తే అతివేడివల్ల వచ్చే కడుపునెప్పి

రక్తగ్రహణి మొదలయిన వాటిని అరికట్టవచ్చు.

అలాగే ఈ మట్టిబట్టను కాళ్లకు చుట్టుకుంటే కాళ్లు లాగడం తగ్గుతుంది. కానీ బురద పేరు చెబితేనే అసహ్యించుకునే చాలామంది ఈ బురదస్నానాలను చేయడానికి సాహసించరు. ఏదయినా రోగమొస్తే ఇంజక్షన్లో, బిళ్లలకో పరుగెడతారుగానీ ప్రకృతి మనకిచ్చిన సంపదను వినియోగించే ప్రయత్నం చెయ్యడంలేదు మనిషి అని కొందరు వాపోతున్నారు.

ఈ బురదస్నాన చికిత్స అనాదిగా మనం ఎరిగున్నా దీన్ని ఆచరణలో పెట్టడంలో మాత్రం అమెరికన్లే అగ్రగాములుగా వున్నారు.

ఓ డాక్టరునడిగితే "బురదస్నానంమీద ఇంతవరకూ పూర్తి శాస్త్రీయ పరిశోధన జరగలేదనీ, ప్రజలు కూడా దాని లోతుపాతులను పూర్తిగా తెలుసుకునే ప్రయత్నం చెయ్యడంలేదనీ ఒకటి రెండు స్నానాలు చేసి అటుపైన బద్ధకించి మానేస్తున్నారని, దాంతో బురద స్నానం యొక్క వైశిష్ట్యతకు ఓ రూపం రావడంలేద"నీ అన్నారు. అయితే ప్రస్తుతం అమెరికాలో మాత్రం ఈ బురద స్నానంమీద పరిశోధన జరుగుతోందని అంటున్నారు శాస్త్రజ్ఞులు.

---

## మ్యూజిక్‌డాక్టర్

అంగవైకల్యం వున్నా ఎంతో ఆత్మవిశ్వాసంతో చదువులోనో లేదా ఏదో ఒక కళలోనో నిష్ణాతులయి పేరు తెచ్చుకుంటున్న వాళ్లని ఎంతో మందిని చూస్తూనే వున్నాం. ఒక కళలో పూర్తి నైపుణ్యాన్ని ప్రావీణ్యతను సాధించాలంటే ఒక మాములు మనిషికే చాలాకాలం పడుతుంది. అలాంటిది ఎడమ భాగం పూర్తిగా చచ్చుబడిపోయిన బాలకుమార్ 64 వాయిద్య విశేషాలను అవలీలగా వాయించి అందులో పరిపూర్ణతను సాధించడం ఊహకందని విషయం. ఆధునిక వాద్యపరికరాలేకాక ఎప్పుడూ పేరు కూడా వినని ఎన్నో పురాతన వాద్య పరికరాలను కర్ణపేయంగా వాయిస్తూ శ్రోతలను ముగ్ధులను చేస్తున్నాడు బాలకుమార్.

ప్రాచీన గ్రంథాలను అధ్యయనం చేసి, పురాతన దేవాలయాల్లో శిల్పాలను క్షుణ్ణంగా పరిశీలించిన కుమార్ వాయిద్య పరికరాలని గురించి ఎంతో సమాచారం సేకరించాడు. ఈ సమాచారం ఆధారంగా అతడే స్వయంగా ఎన్నో వాద్య పరికరాలను తయారు చేశాడు.

అయిదు సంవత్సరాల వయసులోనే పక్షవాతానికి గురయిన బాలకుమార్‌కి ఎడమ భాగమంతా చచ్చుపడిపోయింది. అయినా దాన్ని పట్టించుకోక చిన్నతనం నుంచీ కష్టపడి చదివి, మ్యూజిక్ కాలేజీలో ఎమ్మేవరకూ చేశాడు. ఆ తర్వాత మ్యూజిక్‌లోనే ఎమ్.ఫిల్ కూడా



చేసిన బాలకుమార్ పి.హెచ్.డిని చేస్తున్నాడు. ఓసారి ఇంటర్ యూనివర్సిటీ మ్యూజిక్ కాంపిటీషన్‌లో 1411 మంది పోటీదారుల్లోనూ బాలకుమార్‌కే ఫస్ట్ ప్రైయిజ్ వచ్చింది.





# 'తృప్తి' పై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన బి. రమణీప్రభాకర్ నవల 'తృప్తి'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## భ్రాంతి

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

మనిషితో మనిషి కలిసి జీవించాలీ అంటే కొన్ని మౌలిక సూత్రాలూ, నిబంధనలూ, కట్టుబాట్లూ, సర్దుబాట్లూ, సహృదయతా, బాధ్యతా స్వీకారం - ఇవన్నీ కావాలి. అందుకే మన పూర్వీకులు 'డివిజన్ ఆఫ్ లేబర్' ప్రధాన సూత్రంగా ఇల్లు చక్కదిద్దుకుంటూ పిల్లల్ని అనుక్షణం కంటికి రెప్పలా కాపాడే బాధ్యతని స్త్రీకీ, అందుక్కావలసిన ఆర్థిక అవసరాల్ని తీర్చే బాధ్యత మగవాడికీ అప్పగించారు. కానీ కాలం మారుతున్నకొద్దీ వ్యక్తి మానసిక స్వరూపాలూ, బాధ్యతలూ వాటంతట అవే మారిపోవటం మొదలుపెట్టాయ్. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం కోరుకునే పరిస్థితి వచ్చింది. పెరుగుతున్న ధరలు, కోరికలూ కూడా స్త్రీ ఉద్యోగం చేయటాన్ని ప్రోత్సహించాయ్. రెండు బాధ్యతల్నీ మోయటంలో ఉరుకులు, పరుగులు, ఒడిదుడుకులు ఒక్కనిముషం తీరికగా నిలబడి పక్కమనిషి గురించి ఆలోచించలేని పరిస్థితి. దాంతో అపార్థాలు, అల్లర్లు, అశాంతి. ఇవన్నీ చక్కటి శైలితో, భావవ్యక్తీకరణతో నవల చదువుతున్నామా, చుట్టూవున్న ప్రపంచాన్ని చూస్తున్నామా అనే భ్రాంతి కలిగేవిధంగా రచయిత్రి ఈ నవలని మలిచారు.

అతిచెడ్డ అత్తగారూ, అతిమంచి అత్తగారూ వీరిద్దరిమధ్యా సమతూకంతో సమైక్యతని తీసుకువచ్చిన చక్కటి పాత్రలు కావేరీ, వర్ధనమ్మ. జీవితాన్ని ఎలా మలుచుకోవాలి అన్న సూత్రం కావేరీ కుటుంబంద్వారా చక్కగా చూపించారు రచయిత్రి.

అహంకారి కాకపోయినా మనసు మంచిదే అయినా నిలిచి అర్థం చేసుకోవటానికి టైం లేక అపార్థాలకి తన జీవితంలో కొంతవరకూ చోటిచ్చినా, తర్వాత తన తప్పు తెలుసుకున్న సింధు, కాస్త ఆలోచనా పరిథిని విశాలం చేసుకోవాలీ అని చెప్పే పాత్ర ఆమె అత్తగారు - ఈమె మన జీవితాల్లో చాలా తరచుగా కనిపించే పాత్ర.

శేఖర్, శిరీషల పాత్రలు నవలకి అంత అవసరం కానట్టుగా వున్నా- యమున, శేఖర్‌ల ప్రణయ సంభాషణలు, సన్నివేశాలూ నవలకి చక్కటి అలంకారంగా నిలిచాయి. శేఖర్ ప్రేమ ఔన్నత్యాన్ని శిరీష పాత్రద్వారా చూపించారు. నవలలో చర్చించిన ప్రధాన సమస్యకీ ఈ అంశం, పాత్రలు కొంచెంగా అనవసరం అనిపించాయ్. శేఖర్ పాత్రద్వారా రచయిత్రి కురిపించిన హాస్యం సునిశితంగా, హృదయపూర్వకంగా నవ్వు తెప్పించేలా వున్నాయ్.

ఈ నవలలోని ప్రతి పాత్రా మనచుట్టూ వున్నదే. నవలలో రచయిత్రి సమస్యని చర్చించటమేకాక చక్కటి పరిష్కారాన్ని కూడా చూపారు. 'నీకోసం ఆరాటపడేవాళ్ల గురించి నువ్వు కూడా నిస్వార్థంతో నిమిషంసేపు ఆలోచించి ఆరాటపడు' అన్న చక్కటి సందేశాన్ని ఈ నవలద్వారా అందించారు రచయిత్రి. అదే సాంఘిక వ్యవస్థకి మౌలిక సూత్రం.

-దర్భా లక్ష్మిఅన్నపూర్ణ
బెంగుళూర్.

## 'తృప్తి'లో అసంతృప్తి

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

ఈ రోజుల్లో స్త్రీలు, ముఖ్యంగా ఉద్యోగినులు

ఎదుర్కొంటున్న రకరకాల సమస్యలను వివిధ పాత్రలద్వారా నవలా రూపంలో చర్చించడానికి రచయిత్రి చేసిన కృషి అభినందనీయం. సస్పెన్స్, క్రైమ్, థ్రిల్లర్‌లు రాజ్యమేలుతున్న ఈ తరుణంలో ఈ సాంఘిక నవల దప్పిగొన్న పాఠకులకు 'చలివేంద్రం'లాంటిది అనడంలో అతిశయోక్తిలేదు.

కాని, పాఠకులకు పూర్తిగా సంతృప్తినివ్వలేదు ఈ 'తృప్తి'. కారణం... ఏ నవలకైనా కథకైనా చివరిపేజీవరకు చదివించే ఉత్కంఠత ఒక్కటే చాలదు. పాఠకుల మెదడుకి కాస్త మేత దొరకాలి. యాంత్రికంగా మొదటి పేజీనుండి చివరిపేజీవరకు చదివించేది నవల కావచ్చుగానీ 'మంచి' నవల మాత్రం కాదు. అందుకే 'తృప్తి' 'ఓల్డ్‌వైన్ ఇన్ ఓల్డ్ బాటిల్'లాగే ఉంది. కథాకథనంలో కొత్తదనం లేదు. 'శిల్పం' కొరవడింది. పాత్రలు అన్నీ కొడుకు, కోడలు, అత్తగారు ఇలా ఒకేకోవకి చెందినవై అయిదారు కుటుంబాల కథగా నడపడంతో పాఠకులలో ఆసక్తి కుంటుపడింది. జయ అత్తగారి పాత్రద్వారా కొన్ని సామెతలు తెలుగు నుడికారానికి జీవంపోసినా మరికొన్ని ఎబ్బెట్టుగా తోచాయి. ప్రభ అత్తగారు హేమలత మాటలు 'సినిమాటిక్'గా తోచాయి.

యమున, శేఖర్‌ల సంభాషణలలో సున్నితమైన హాస్యంతోపాటు శృంగారం కూడా మేళవించబడి యువహృదయాలను గిలిగింతలు పెట్టేవిగా ఉన్నాయి. యమున - 'ఏమైనా నాకిష్టమైన సంగతులు మాట్లాడొచ్చుగా' అన్నపుడు శేఖర్- 'మీ అమ్మగారు అనంతుడి వ్రతం చేసినప్పుడు సొజ్జప్పాలు చేస్తారా?', 'మీ వక్కింటావిడెప్పుడూ తెల్లచీరలో నీలం లంగా వేసుకుంటుందెందుకు?'లాంటి డైలాగులు మళ్లీ మళ్లీ చదివించాయి. మొత్తంమీద ఈ నవల కోడళ్లను 'కోడంటికం' పెట్టే అత్తగార్లకీ, అత్తగార్లని నిర్లక్ష్యం చేసే కోడళ్లకి, సంపాదిస్తున్నామని గర్వించే భర్తకు, పిల్లలను ఖాతరుచేయని ఆడవారికీ, భార్య నోటికి భయపడి 'తందానతాన' పాడే భర్తలకు... అందరికీ ఒక గుణపాఠంలాంటిది.

-పి. లక్ష్మి
కాకినాడ.

# చతుస్సాగర సంగమం

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**జ**నవరి నెల చతురలో ప్రచురించిన రమణీ ప్రభాకర్‌గారి 'తృప్తి' ఓ చక్కని సాంఘిక నవల చదివానన్న తృప్తిని కలిగించింది. నాలుగు వేర్వేరు కుటుంబాల నేపథ్యంలో ఈనాటి సమాజంలోని మహిళల ముఖ్యంగా ఉద్యోగినులైన మహిళల విభిన్న మనస్తత్వాలనూ, వారి నిత్యజీవిత సమస్యలనూ ఆసక్తిదాయకంగా ఎత్తి చూపించారు.

సింధు, కావేరి, యమున, నర్మద... ఈ విభిన్న నదీజలాల గమనంలాగానే ఆ నలుగురు స్త్రీల జీవనవిధానంలోనూ, ఆలోచనా దృక్పథాలలోనూ, జీవిత సమస్యలను పరిష్కరించుకోవటంలోనూ అనంతమైన వ్యత్యాసముంది. అయితే ఏ దారినుండి పయనించినా, ఎన్ని ఆటుపోట్ల నెదుర్కొన్నా అన్ని నదులకూ సాగర సంగమమొక్కటే గమ్యమైనట్లే, ఈ నలుగురు స్త్రీలూ తమతమ జీవితాలలో ఏ మార్గాల నవలంబించినా చివరికి వివేకంతో సమస్యల నధిగమించి తమవారి ఆనందంలోనే తమ తృప్తి ఆనందం దాగి ఉన్నాయనే జీవితసత్యాలను గ్రహించి తమ తమ సంసారాలను చక్కదిద్దుకొన్నతీరు ఈ నవలలో ఉన్న ఏకసూత్రం.

మధ్యతరగతి కుటుంబాలలో తరాలమధ్య అంతరాలతో, అత్తాకోడళ్లు మధ్యనుండే అవగాహనా లోపంతో తలెత్తుతున్న అనేకానేక దైనందిన సమస్యల్ని భార్యాభర్తల మధ్య దెబ్బతింటున్న సున్నితమైన సంబంధాల్ని యాంత్రికయుగంలో తల్లిదండ్రులకూ, పిల్లలకూ మధ్య పెరిగిపోతూన్న దూరాన్ని సింధు, నర్మదల కుటుంబ చిత్రణద్వారా కళ్లకు కట్టినట్లు చూపించారు. అదే సమయంలో కావేరి పాత్ర, ఆమె కుటుంబాన్ని నిర్వహించుకుంటూన్న తీరూ, ఆ సంసారంలోని పరస్పర అవగాహనా, అనురాగాలను ఆదర్శప్రాయంగా, ఆత్మీయంగా చిత్రించి ఆదర్శ కుటుంబమంటే ఇలా ఉండాలని ఎత్తిచూపారు. మధ్యలో యమున పాత్రద్వారా మధ్యతర





గతి కుటుంబాలలోని అవివాహిత యువతుల మనోక్షోభకు అద్దంపట్టారు. ఈవిధంగా అన్ని కోణాలలోనుంచీ ఈనాటి కుటుంబ వ్యవస్థను సోదాహరణంగా, ఆలోచనాత్మకంగా చర్చించి, వాటిలో తలెత్తే సమస్యలకు సహేతుకమైన పరిష్కారాలను సూచించారు. రచయిత్రి కృషి అభినందనీయం.

-విజయలక్ష్మి పాండే
హైదరాబాద్.

## అసం'తృప్తి'

*(నాలుగో బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

నవలకుండవలసిన విశిష్ట లక్షణాలు- మంచి కథాబలం, వైవిధ్యంగల ఇతివృత్తం, శైలి, శిల్పం, బరువైన సన్నివేశాలు, సంభాషణలు, తక్కువ పాత్రల సృష్టి పాత్రల ప్రాధాన్యత, ఉత్సాహంగా ఉత్కంఠతో చదవాలనిపించే కథాగమనం.

వీటిలో కొన్ని అంశాలు 'తృప్తి' నవలలో లోపించాయనిపించింది.

నవలలో ఒక కుటుంబం తర్వాత మరొక కుటుంబం గురించి వ్రాస్తూ, మధ్యమధ్య కొత్త పాత్రలను సృష్టిస్తూ, ఇంచుమించు విషయమంతా ఒకేమాదిరి ఇతివృత్తంగల పరిధిలో సాగింది. కథాగమనంలో కొత్తదనం లేదు. నవల కొన్ని పేజీలు చదివాక విసుగొచ్చింది. ఏదో నవల చదివాం అన్న 'అసంతృప్తి' కలిగిందిగాని, 'ఒక మంచి నవల చదివాం' అన్న 'తృప్తి' కలగలేదు.

రచయిత్రి నవలలో ఒకేచోట (పే.54) వరసగా అరడజనుకు పైగా తెలుగు సామెతలను ఏకరువు పెట్టారు. సహజత్వానికి భిన్నంగా ఎబ్బెట్టుగా అనిపించింది. అవి నవలలో అక్కడక్కడా వాడాల్సింది.

అయినప్పటికీ, రచయిత్రి స్త్రీ సహజ ధోరణిలో, అతిసామాన్య కుటుంబ విషయాల్నీ ఎదుటి స్త్రీల మనోభావాల్నీ విభిన్న మనస్తత్వాలను ఆప్యాయతల్నీ ఓపికతో చాలా చక్కగా చిత్రీకరించిన శిల్పచాతుర్యం మెచ్చుకోదగ్గది. కందివచ్చడి మొదలు కర్ర్యావరకూ గల అనేక విషయాల్ని నేర్పుగా మలచగలిగారు. నవలలో హాస్యం బాగా చోటుచేసుకుంది. శైలి, సంభాషణలు బాగున్నాయి.

-జి. కనకమహాలక్ష్మి
విశాఖపట్నం.

## 'తృప్తి' కలిగించిన అసంతృప్తి

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'తృప్తి' ఆరంభమే అసంతృప్తిగా ప్రారంభమైంది. సింధు పీడకలతో మొదలైన నవల ఆ పీడకలను పూర్తిగా మరచిపోయి- ఓ గమ్యం లేకుండా సాగిపోయింది. అనుభవాలను గుదిగుచ్చి కూర్చి పేర్చిన ఈ నవల ముఖ్యోద్దేశం ఏమిటో అర్థంకాలేదు. అత్తలకూ, కోడళ్లకూ, భర్తలకూ, భార్యలకూ, ప్రేమించని అమ్మాయికి, ప్రేమించబడ్డ అబ్బాయికి అందరికీ అసంతృప్తే. ఆ అసంతృప్తికి రచయిత్రి చూపించిన పరిష్కారం హాస్యాస్పదంగా వుంది. అలాంటి చిన్న చిన్న సంఘటనలకే మనస్తత్వాలు మారిపోతే ఈపాటికి ప్రపంచం స్వర్గధామంలా ఉండేదేమో. కుటుంబ భవిష్యత్తు కోసం పెళ్లిని వాయిదావేస్తున్న యమున ఆ విషయం ఎత్తకుండా పెళ్లికి ఒప్పుకోవడం, సమాజంలో వ్యక్తుల ప్రవర్తనను సహేతుకంగా, చదివించేలా చిత్రించగలిగినా, నవలా శిల్పం లోపించిందనే చెప్పాలి. కీలకమైన సంఘటన 'ఇది' అని చెప్పుకోదగ్గదే లేదు. ఓ నాలుగైదు కుటుంబాల జీవనవిధానాన్ని చిత్రించినట్టుగా వుంది. కథకు మధ్యలో కావలసిన వర్ణన, సస్పెన్స్, కీలకమైన సంఘటనలు లేవు. శైలి చదివించేదిగా, వాస్తవానికి దగ్గరగా వున్నా ఇలాంటి రచనలు ఓసారి చదివి మర్చిపోడానికి తప్ప మళ్లీ మళ్లీ చదివేందుకు పనికిరావు. చివరికి శుభం అంటూ పెళ్లితో ముగిసిన సంఘటన తెలుగు సినిమాల్లోలాగా పేలవంగా ఉంది.

-ఎస్. వసంతలక్ష్మి
హైదరాబాద్.

# చతుర

సంపుటి: 17　　సంచిక: 2　　మార్చి 1994

కూలీల చమటలో కాసులు పండించుకుంటూ, అంచెలంచెలుగా ఆకాశానికెదిగాడు దొర...

వజ్రకాఠిన్యమైన అతని మనసు పొరలను, విశ్వాసమనే ఆయుధంతో ఛేదించి... అతని హృదయంలో స్థానం సంపాదించుకోగలిగాడు ఆ యువకుడు.

కానీ... నిస్వార్థంగా, నమ్మకంగా, అతితక్కువ జీతంతో... అతడు దొరకు చేసిన సేవ, సహాయం... వికటించి... వికృతరూపం దాల్చడానికి కారణాలు ఏమిటి?

అయినవాళ్ళందరినీ కాదని, అతడినే నమ్మిన దొరకు మిగిలిందేమిటి?

'కాంట్రాక్టుల' పేరుతో అటు ప్రభుత్వాన్ని, ఇటు ప్రజలని దోచుకుంటున్న రాబందుల రాక్షస కృత్యాలకు అక్షరరూపం ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



## వేదప్రభాస్

# హననం

ప్రభాకరం బస్సులో జొరబడ్డాడు. అసలే చిన్నది. పైగా క్రిక్కిరిసిపోయి వుంది. అదే ఆఖరి బస్సు కావటాన, సినిమాలకి వచ్చిన వాళ్లూ, సాయంత్రం కాసేపు కులాసాగా గడిపి పోదామని టవునుకి వచ్చిన వాళ్లూ బస్సులో నిలబడ్డానికి కూడా జాగా లేకుండా నిండిపోయున్నారు. ప్రభాకరం భుజాన తగిలించుకున్న బేగ్ బరువుగా వుంది. పది నిముషాలకి బస్సు కదిలింది. వెనకనుంచి కండక్టర్ ముందుకు వచ్చేసరికి బస్సు ఊరుదాటి చీకట్లోకి పరుగెడుతోంది. టిక్కెట్టు తీసుకున్నాడతను. బస్సు ఆగిన ప్రతీ స్టేజిలో ఎవరో ఒకరు దిగుతూనే వున్నారు. కొంతసేపటికి సీటు దొరికి చతికిలబడ్డాడు. విశ్రాంతిగా వూపిరి పీల్చబోయేటంతలో బస్సు ఆగడం, కండక్టర్ కేక పెట్టడం ఒక్కసారే జరిగాయి. చటుక్కున లేచి కంగారుగా కిందకి దిగిపోయేడు ప్రభాకరం.

చీకట్లో వాతావరణం అంతా నల్ల ముసుగు కప్పుకున్నట్టుంది. బస్సు కదిలి ముందుకు పోగానే, అంతవరకు వున్న కాస్త వెలుగూ దూరమైపోయింది. పైన నల్లటి ఆకాశంలో నక్షత్రాలు కాంతివంతంగా మెరుస్తున్నాయి. అయితే ఆ తారలు పంచే వెలుగు ఎంత మాత్రం పరిసరాలను పరికించే అవకాశం ఇవ్వటంలేదు. రోడ్డు పక్కనే కాసేపు నిల్చడ్డాడు. చుట్టూతా పరీక్షగా చూసేడు. అతనికేం తెలియటంలేదు. బేగ్‌లోంచి టార్చిలైటు తీసేడు. దాని కాంతిలో రోడ్డు పక్కన ట్రెంచ్‌ల్లాటి గోతులు కనిపించాయి. వాటికి దూరంగా మిట్ట లాంటి ఓ ఎత్తైన ప్రదేశం అస్పష్టంగా కనిపిస్తోంది. దాని దగ్గర్లో కొన్ని కట్టడాల వంటివి లీలగా కనిపిస్తున్నాయి. ఇటు తిరిగి తూర్పు వైపు టార్చి వెలుగులో చూసేడు. అంతా ఆరుబయల్లా వుంది. దూరంగా రెండో, మూడో ఇటుక బట్టీలు కాబోలు ఎత్తుగా కనిపించేయి. తనకి హైద్రాబాద్‌లో శ్రీరాములు గారు చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకుని గోతుల్లేని దగ్గర రోడ్డు దిగి నడక ప్రారంభించేడు.

నాలుగడుగులు వేసేసరికి, 'ఎవరదీ' అన్న కేక వినిపించింది. అనుకోకుండా మనిషి ఎదురయ్యేసరికి కంగారుపడ్డాడు. ముడుకుల వరకూ ధోతీ కట్టి, కాలర్‌లేని చొక్కా తొడుక్కుని, తలపాగా చుట్టుకున్న వ్యక్తి కనిపించేడు టార్చి వెలుగులో. అతడి చేతిలోనూ టార్చి లైటు వుంది. దాన్ని చంకలో ఇరికించుకుని, చొక్కా పక్కజేబులోంచి, అగ్గిపెట్టె తీసి బీడీ వెలిగించేడు. పరీక్షగా ప్రభాకరం వైపు చూసేడు జవాబుకోసం.

"నేను... ప్రకాశరావు కంట్రాక్టరు దగ్గరకు పోవాలి. ఎటుపోవాలో కొంచెం చెప్పు" అడిగాడతణ్ణి ప్రభాకరం.

"పెద్దదొరగావాల్నా? గా ఎత్తుమీద కుడి పక్కకుబో... జరసేపైంది దొరొచ్చి" అతను చూపిన దిక్కుగా మళ్లీ నడవటం మొదలు పెట్టేడు ప్రభాకరం. సన్నటి టార్చి కాంతిలో, సరైన తోవలేని ఆ భూమిలో మధ్యలో వంతర్లు, ముళ్లపొదలు దాటాల్సివచ్చింది. ఎత్తుగా వున్న దిబ్బలాంటి ప్రదేశం చేరుకుని ఓ నిముషం పాటు నిలబడ్డాడు. నల్లరంగు కారొకటి చీకట్లో నిశ్చలంగా నిలబడివుంది. ఆ కారు నుండి వంద గజాల దూరంలో హరికేన్ లాంతరొకటి గుడ్డి వెలుగులు వెదజల్లుతోంది. లాంతరుకి ఇటువైపు ఒక వ్యక్తి కుర్చీలో కూర్చుని వున్నట్టూ, అతనికెదురుగా అయిదారుగురు నిలబడి వున్నట్టూ గమనించేడు. ఆయనే కాబోలు ప్రకాశరావంటే, అనుకున్నాడు. బ్యాగ్ కిందకి దించి, షర్టుకాలర్ సరిచేసుకున్నాడు. జేబులోంచి దువ్వెన తీసి, తల దువ్వుకుని, రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు.

చకచకా బేగ్ చేత్తో పట్టుకుని ముందుకి కదిలేడు. అక్కడి వాళ్లంతా తమ దగ్గరకి వస్తున్న కొత్తవ్యక్తిని తలలెత్తి చూసేరు. వాళ్ల కళ్లల్లో ఆశ్చర్యం కనిపించింది.

"నమస్కారం సార్" అన్నాడు ప్రభాకరం.

తల అతని వైపు తిప్పేడు ఆయన. తెల్లటి ఆ మొహానికి హార్డ్‌రిమ్‌డ్ కళ్లద్దాలు ప్రత్యేకతను సమకూర్చేయి. మధ్య పాపిడి తీసుకున్న చిన్న జుత్తు, పుష్టిగా వున్న బుగ్గలూ, పెద్దపులి చూపులూ ప్రభాకరాన్ని కలవరపరిచేయి.

"ఎవరు? ఏం కావాలి?" ప్రశ్నించేడు ఆయన.




"మాది కాకినాడసార్.. రాజారావుగారు పంపితే హైద్రాబాద్ వచ్చేను. మీరు ఇక్కడు న్నారు వెళ్లమని శ్రీరాములు గారు చెపితే వచ్చేను"

"చిట్టబ్బాయి పంపింది... నిన్నేనన్న మాట" అంటూ ప్రభాకరాన్ని పరీక్షగా చూసే డు. సన్నగా, పొడవుగా వుండి, ఇంకా కుర్ర తనం వదలనట్టున్న ప్రభాకరాన్ని అంచనా వేయడానికి ప్రయత్నించేడు.

"ఏం చదువుకున్నావు?"

"బి.ఎస్సీ" జవాబిచ్చేడు నమ్రతగా,

"ఏం పని చేయగలవు? నా దగ్గర వైట్ కాలర్ వుద్యోగాలు వుండవుమరి" హెచ్చరికగా అన్నాడు.

"ఏ పనైనా, నేర్చుకుని చేయాలని వచ్చే నండీ!" వినయంగా బదులిచ్చేడు.

"ఎకవుంట్లు చూడగలవా?"

"చూడగలను"

"నీకు భోజనం పెట్టి రెండు వందలిస్తాను. ఇష్టమైతే పనిలో చేరవచ్చు"

ఒక్క నిమిషమే ఆలోచించేడు ప్రభాకరం.. ఇల్లు విడిచి ఇంతదూరం వచ్చింది వెంటనే తిరిగి పోడానిక్కాదు. నచ్చకపోతే అప్పుడే మానేయవచ్చు, ఒక్క నెల చూసి అనుకున్నా డు. వెంటనే చెప్పేడు...

"చేస్తానుసార్"

"పాణీ!" కేకేసాడాయన.

ప్రభాకరం కన్నా చిన్న వయస్సు కుర్రాడొక డు ముందుకు వచ్చేడు.

"నీ పేరేంటి?" అడిగేడు ప్రకాశరావు.

"ప్రభాకరం"

"ఇంటిపేరు?" చెప్పేడు.

ప్రకాశరావు తృప్తిపడ్డట్టు కనిపించింది. మరికొన్ని వివరాలు కూడా అడిగి తెలునుకు న్నాడు.

"చూడూ... నా దగ్గిర పని అంటే... బాగా కష్టపడాలి. కష్టపడి పని చేసేవాళ్లకెప్పుడూ విలువ వుంటుంది. ఆ సంగతి గుర్తుంచుకుని పనిచేయాలి. జ్ఞాపకం పెట్టుకో" పాణి వంక తిరిగేడు.

"పాణీ... ఇతన్ని మీ అరకి తోల్కపో... రాజయ్యని తినేందుకేమైనా పెట్టమని చెప్పు. రేపట్నుంచి నువ్వు రాస్తున్న ఎకవుంటు, డే బుక్కు అతనికి అప్పచెప్పు. నువ్వెళ్లవోయ్ ప్రభాకరం" అని మిగిలిన వాళ్లవంక తిరిగే డు.

"రండి" అంటూ పాణి దారి తీయగానే, బేగ్ చేత్తోపట్టుకుని అతనికి వెనక నడిచేడు ప్రభాకరం, తను వచ్చిన పని సులువుగా అయినందుకు సంతోషిస్తూ.

★ ★ ★

"లేవండి.. బాస్ వస్తున్నారు" అని కుదుపు తూ ఎవరో లేపేరు. గాఢంగా నిద్రపోతున్న ప్రభాకరం తుళ్లిపడి లేచేడు. లేచిన వెంటనే అతనికి ఆ పగటి వెలుతుర్లో తానెక్కడున్నాడో అర్థం కాలేదు. ఎదురుగా అయిదడుగుల దూరంలో అడ్డుగావున్న పార్టీషన్ గోడ, ఎడమ వైపు సూర్యకిరణాలు ప్రసరిస్తున్న కిటికీ... అత నికి ఏదో జైలులో వున్నట్టు అనిపించింది. అటూ, ఇటూ సర్ది పెట్టివున్న పక్క బట్టలు, దిండ్లు తనతోబాటు మరో నలుగురు ఆ గదిలో వుంటున్నట్టు తెలియపరుస్తున్నాయి.

ప్రభాకరాన్ని నిద్రలేపిన వ్యక్తి అప్పుడే స్నానం చేసి వచ్చినట్టున్నాడు. గబగబా బట్ట లు మార్చుకుంటున్నాడు. లేచి కూర్చున్న ప్రభాకరాన్ని చూసి పలకరింపుగా నవ్వేడు. అతని పలువరున ఎంతో ముచ్చటగా వుంది.

"ఆరు గంటల తర్వాత పడుకుంటే, దొరకో పగిస్తాడు. లేచి తయారుకాండి" అన్నాడు, ఒళ్లు విరుచుకుంటున్న ప్రభాకరంతో.

"మీపేరేంటి?" అడిగేడు ప్రభాకరం.

"రంగారావు... మాది వనపర్తి. దొరమాకు దూరపు చుట్టమవుతాడు. ఇంగ నే పోయొస్త" అంటూ హడావుడిగా తల దువ్వుకొని బయ టకు పోయేడతను.

ప్రభాకరం లేచి, బేగ్‌లోంచి బ్రష్షూ, పేస్టూ తీసుకుని భుజం మీద తువ్వాలుతో బయటకు వచ్చేడు. పార్టీషన్ గోడకవతల ఒక సుమారుగా వున్న గదివుంది. ఆ గదిలో ఒక ఫోల్డింగ్ టేబులు, నాలుగు కుర్చీలు వున్నాయి. ఒక పెద్ద కావిడి పెట్టె లాంటిది వుంది. గాద్రెజ్

బీరువాలు చిన్న దొకటీ, పెద్దదొకటీ వున్నాయి. ఓ గోడకి తెలుగు కేలండరు వేలాడుతోంది. ఒకే ఒక ద్వారం బయటవైపు వుంది.

బయటకు వచ్చిన ప్రభాకరానికి ఆ లేత సూర్యకాంతిలో పరిసరాలన్నీ కొత్తగా కనిపించేయి. ఒకటీ, రెండు ఇళ్లూ కొన్ని పెద్ద బిల్డింగులూ కడుతున్నప్పుడు చూసేడుగానీ ఇంత విస్తృతంగా నిర్మాణమవుతున్న కాలనీ ఎప్పుడూ చూడలేదు. కనుచూపుమేర చుట్టూ ఖాళీ ప్రదేశం. దక్షిణం నుంచి ఉత్తర దిశగా, తూర్పునుంచి పడమరగా ఎన్నో పునాదులు వరుసగా చూపు ఆనినంత మేర కనిపించేయి. దూరంగావున్న కొండలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. రాత్రి తాను బస్సు దిగిన రోడ్డు కోసం చూసేడు కానీ ఎత్తుగా వున్న మిట్టలాటి ప్రదేశం రోడ్డు కనపడనివ్వలేదు. అక్కడ వేసివున్న రేకు షెడ్డు కిందవున్న కారు అద్దాలు డ్రైవరు కాబోలు తుడుస్తూ కనిపించేడు.

వెనక్కి తిరిగి రాత్రి తాను పడుకున్న క్వార్టర్‌వంక పరిశీలనగా చూసేడు. అది రెండు భాగాలు కలిపి ఒకే సిమెంట్ రేకుల రూఫ్‌తో వున్న క్వార్టర్. ఒక భాగంలో తామంతావున్నారు. సరిగ్గాఅంతే భాగం ఎడమవైపు వున్నట్టుంది. రెండింటికీ మధ్యగా ఒక పంచలాటిది ముందుకి దించేరు. దాన్ని ముందువైపూ, ఎడమ పక్కా తడికిలతో మూసేరు. ఒక పెద్ద పొయ్యి వుంది దాన్లో. వంట కోసం కాబోలు అనుకున్నాడు. అక్కడే ఓ మూలగా నాలుగు పెద్ద బానలు వున్నాయి. కూలీలు కాబోలు తల మీద ఇనుప బిందెల్తో నీళ్లు తెచ్చి వాటిలో పోస్తున్నారు. రెండు ప్లాస్టిక్ బకెట్లు, రెండు మగ్గులూ నీళ్లతో అక్కడేవున్నాయి. ఒక మగ్గులో నీళ్లు తీసుకుని క్వార్టర్ వెనకవేపు నడిచేడు. ఎన్నోకళ్లు తననే చూడటం అతను గమనించకపోలేదు. పట్టించుకోనట్టు నటించేడు. ఇరవై అడుగుల దూరంలో వున్న ఒక పునాది మీద కూర్చుని ముఖ ప్రక్షాళనానికి వుపక్రమించేడు ప్రభాకరం.

ఎవరో కేకలు వేస్తున్నట్టు వినిపిస్తే అటు వైపు తల తిప్పేడు. ఏభై అడుగుల దూరంలో వున్న క్వార్టర్ దగ్గర నిలబడి రంగారావు కేకలు వేస్తున్నాడు.

"ఫోండి... ఖాళీ సంచులిస్తేనే సిమ్మెంటు ఇచ్చేది. లేకపోతే లేదు" మేస్త్రీలు అతన్ని బతిమలాడుతున్నారు. అతను ససేమిరా కుదరదు పొమ్మంటున్నాడు. ఇతను స్టోరు చూస్తాడు కాబోలనుకున్నాడు. అక్కడ జరిగేదంతా వీలయినంత తొందరగా తెలుసుకోవాలన్న కుతూహలం వేగిర పెడుతుంటే తొందరగా మొఖం కడుక్కోవటంపూర్తి చేసి లేచేడు. తిరిగి క్వార్టర్‌లోకి వస్తుంటే వర్క్‌సైట్ నానుకుని రెండొందల గజాల దూరంలోవున్న ఓ ప్రదేశం అతని దృష్టినాకర్షించింది. అక్కడ అయిదారు ఈత చెట్లు దగ్గరగా వున్నాయి. వాటి మధ్య రెండు పాకలు కనిపించేయి. వాటి మీద పసుపు పూలతో గుమ్మడి పాదు బాగా అల్లుకుని వుంది. రెండు మేక పిల్లలు గంతులు వేస్తూ ఆడుకుంటున్నాయి. ఆ దగ్గర్లో... ఎవరో వ్యవసాయం చేస్తున్నారల్లేవుంది. దున్నిన కొంత భాగం కనిపించింది. కూరపాదులూ, అవీ కనిపిస్తున్నాయి. అటే చూస్తూ వస్తున్న అతని చెవులకి మోటారు సైకిల్ చప్పుడు వినబడడంతోనే తల తిప్పేడు. ముందుగా చప్పుడు మాత్రమే వినిపించింది. కొద్ది సేపయాక మిట్టమీద మోటారు సైకిల్ కనిపించింది. అది వేగంగా వచ్చి ఆఫీసు గది ముందు ఆగింది. ఇద్దరు దిగి లోపలకి వెళ్లేరు.

ప్రభాకరం స్నానం చేసి లోపలకి వెళ్లేసరికి ప్రకాశరావుగారు, మోటారు సైకిల్ మీదొచ్చిన ఇద్దరితో ఏదో మాట్లాడుతున్నారు ఆఫీసుగదిలో టేబులు వెనగ్గావున్న కుర్చీలో కూర్చుని. అప్పటికే ఆయన స్నానం, వగైరాలు పూర్తయినట్టున్నాయి. నీటుగా తయారయి వున్నాడు. నిగనిగ పాలిష్‌తో మెరుస్తున్న బూట్లు, టక్ చేసుకున్న తెల్లటి బట్టలతో, మీసం లేకుండా నున్నగా షేవ్ చేసుకున్న ఆ అయిదడుగుల మూడంగుళాలున్న మూర్తిని చూస్తే ఏదో తెలియని జంకు కలిగింది ప్రభాకరంలో.




ఎదురుగా నిల్చుని ఆయన్తో మాట్లాడుతున్న ఇద్దరిలో ఒకతను ప్రకాశరావుగారితో క్వార్టర్ల నిర్మాణం గురించి తొందరతొందరగా మాట్లాడుతున్నాడు. ఇంకో అతను చాలా తక్కువగా మాట్లాడుతూ ప్రకాశరావు అడిగిన దానికి క్లుప్తంగా సమాధానాలిస్తున్నాడు. పార్టీషను గోడకవతల తన బ్యాగ్ వుంచిన దగ్గరకుపోయి త్వరత్వరగా బట్టలు మార్చుకుని, తయారయి పోయేడు ప్రభాకరం.

రాత్రి తనను లోపలకు తీసుకొచ్చిన పాణీగానీ, వేరే ఇతరులుగానీ కనిపించలేదు ప్రభాకరానికి. ముందు గదిలోకి వచ్చేడు.

''నమస్కారం సార్!'' నమస్కరించేడు.

''ఆఁ... రాత్రి బాగా నిద్రపోయినట్లున్నావు. నాస్తా చెయ్యి'' అంటూ ''రాజయ్యా'' అని కేకపెట్టేడు.

''దొరా!'' అంటూ ఆడంగి నడకతో పరుగు పెడుతున్నట్టు లోపలకి వచ్చేడు రాజయ్య. ముక్కుకు పోగుతో, ముడుకులదాకా కట్టిన మాసిపోయిన పంచెతో విచిత్రంగా వున్నాడతను.

''నాస్తా చేసినవా!'' గద్దించి అడిగేడు దొర.

''చేస్న దొరా!'' వాడు భయపడుతూ జవాబిచ్చేడు.

''ఏం జేసినవ్రా?''

''అటుకులు పోనికేసినా!''

''అందరూ తిన్నార్రా!''

''తిని పోయిన్రు దొరా!''

''ఈనకు మల్లతేపోరా! ఔర! వెంకటేసా, తినరాదురా! నువ్వూ తిను నారాయణా!'' వాళ్ల వంక తిరిగి అడిగేడు.

''మాకొద్దండీ!! మేం తినొచ్చినం''

''తింటేమిరా! మల్ల తినండి''

మూడు ప్లేట్లలో పసుపు వేసి తాలింపు పెట్టిన అటుకులు తెచ్చి పెట్టేడు రాజయ్య.

ప్రభాకరం తన చేతిలోని అటుకుల ప్లేటు వంక చూసేడు. పొద్దున్నే అలవాటేలేని ఆ ఉపాహారం తినడం ఇష్టం లేకపోయినా, రాత్రి ఏం తినబుద్ధికాక పడుకున్నందున ఆకలి దహించుకుపోతుండటంతో ఒక స్పూన్తో అటుకులు తీసి నోట్లో వేసుకున్నాడు. గొడ్డుకారంగా, ఉప్పుకారుగా వున్న ఆ అటుకుల రుచికి పొలమారింది. కళ్లల్లో నీళ్లు తిరిగేయి. నములుతుంటే పంటికిందకి రాళ్లొచ్చేయి. గ్లాసెడు నీళ్లు తాగేడు. వెంకటేశ్వర్రావు, సూర్యనారాయణ కూడా వాటిని తినలేకపోయేరు. దొర మొహంలో కోపచ్ఛాయలు ప్రవేశించేయి.

''రాజయ్యా!'' గద్దించి పిలిచేడు.

''దొరా!'' వాడు భయపడుతూ పలికేడు.

''నాకు అటుకులు తేపోరా!''

గడగడ వణికేడు వాడు.

''ఏమిరా! కదలవు. ఛల్...తేపో''

విధిలేక పోయి తెచ్చేడు.

లేచి నుంచుని ప్లేటు అందుకుని, స్పూన్తో కొన్ని అటుకులు నోట్లో వేసుకున్నాడు ఆయన. పటపటమంటూ రాళ్లు నలిగిన శబ్దం వచ్చింది. రాజయ్య మొహం పాలిపోయింది.

మహోగ్రంగా ఆయనా ప్లేటు రాజయ్య వైపు విసిరేసాడు. గురితప్పి అది గోడకి వెళ్లి తగిలి పదారు ముక్కలైంది. రెండడుగులు ముందుకు వేసి దొర, రాజయ్య చెంప మీద బలంగా కొట్టేడు. వాడు తూలి వెనక్కిపడ్డాడు. అంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు. ప్రభాకరం చేష్టలు దక్కి నిలబడి పోయేడు.

''మాదచ్చోద్! కష్టపడి పోరగాండ్లు పని చేస్తుంటే వాళ్లకి గిట్లనా తిండి పెడుతవ్. తేరగా తినమరిగినవులే. నీ గుంజు తీస్త నుండు. ముందిక్కణ్ణుంచి పీకు. మల్ల నా కండ్ల బడితివా నంపి పారేస్త... నీ పనొద్దు నువ్వొద్దు. ఆడంగి గాడిదా ఛల్... నడువ్''

''వారే ఎంకటేసా, ఎన్నిసార్లు చెప్పిన మంచివంటమనిషి దొర్కుతలేదురా? పన్కిమాలిన గాడ్దెలంతా దొరుకతరేందిరా... సరె... గట్లనే సింగరేణి ఆఫీసుకుపోయి బిల్లు సంగతి విచారించి, నాకు ఫోన్ జెయ్యి... నేను మల్లీ వచ్చేనరికి కవ్రపని మేస్త్రుల్లు హాజరుండాలె''

''నారాయణా, ఆ!క్వారీ పని కాంగానే, ముక్తార్గాడి బండి తీస్క హైద్రాబాదు రా.ఇంజను పని చూడాలంటున్నావు గదా. వచ్చేటపుడు

కరీంనగర్‌పొయ్యి లింగయ్య కొట్లో మందులు తీస్కపోయి, షాన్‌పూర్ కాకకి అప్పజెప్పు. వానికి నేను పైసలు ఇచ్చిపోత.

"ఏయ్... ప్రభాకర్... నువ్వు ఎక్కవుంట్లతో పాటు, జర మెస్ సంగతికూడా జూడు. నేను మళ్లీ తొందర్లోనేవస్త"

డ్రైవర్ అహ్మద్‌హుస్సేన్, కారు దగ్గిర రెడీగా వున్నాడు. దొర బయటకు అడుగు పెట్టగానే లోపలకి వచ్చి ఆయన బ్రీఫ్ కేస్, తీసుకుపోయి కార్లో పెట్టేడు. ప్రకాశరావుపోయి కార్లో కూర్చున్నాడు. ఏదో ఆలోచించుకున్నాడు. "నారాయణా! నువ్వు రా! ఒకసారి ఆఫీసుకు పోదాం" అని సూర్యనారాయణని పిల్చి

"పోనీ అహ్మద్" అన్నాడు. కారు బయల్దేరి మిట్టవంటి ప్రదేశాన్ని దాటి కనుమరుగైంది.

వెంకటేశ్వర్రావు మేస్త్రీలతో మాట్లాడుతూ దూరంగా సైటులోకి వెళ్లిపోయేడు. ప్రభాకరం ఒక్కడూ ఆ గదిలో మిగిలిపోయేడు. తెలంగాణా దొరల గురించి ప్రభాకరం బాగానే చదివీ, వినీ వున్నాడు. అయినా సరే, ప్రకాశరావు దొర రాజయ్యను కొట్టడం చూసేక కొంత కలవరపడ్డాడు. ఇతని దగ్గర ఉద్యోగంలో చేరి, తప్పు చేశానా అనుకున్నాడో క్షణం.

★ ★ ★

లైమ్ గ్రైండర్లు చకచకా తిరుగుతూ సున్నాన్ని లైమ్ పిట్లలోకి వంపుతున్నాయి. గుంతల్లో చెక్కసున్నం పడీ పడకముందే మేసన్లు వంతులు వేసేసుకుని, గబగబా తాము కడుతున్న క్వార్టర్ల దగ్గరకు మోసేసుకుంటున్నారు. ఒకడి వాటాలో సున్నం ఇంకొకడు తీసుకుంటే గొడవలు పడటం, తమ కూలీ లెక్కువమంది కనుక తమకే ఎక్కువ సున్నం ఇవ్వాలని పేచీ పెట్టడం వాళ్లకి బాగా అలవాటు.

అందరికీ వంతులవారీగా సర్దుతూ వాళ్లమధ్య తీరిక లేకుండా వున్నాడు నారాయణ. ఆరడుగుల పొడవున్న చాకులాంటి ఆ కుర్రవాడు పనుంటే అన్నం, నిద్రా కూడా అక్కర్లేకుండా వుండిపోతాడు. పదవ తరగతి పరీక్ష పోతే ఇంట్లో వదినె ఏదో మాట అందని, ఎవరికీ చెప్పకుండా రాత్రికి రాత్రి బయల్దేరి వచ్చి, నాలుగైదు చోట్ల పనిచేసి చివరకు ప్రకాశరావు దగ్గర కుదురుకున్నాడు. ఎవరినీ ఏమీ అనకుండా, తన పనేదో తానేదో అన్నట్టుండే అతనంటే మేస్త్రీలకే కాదు అందరికీ చాలా అభిమానం. అతను చెప్పిన మాట మన్నిస్తారు.

ప్రభాకరం వచ్చినప్పటికీ, ఇప్పటికీ ఆ ప్రదేశం రూపురేఖలు బాగా మారిపోయేయి. కంట్రాక్టు పనుల్లో వరసా, పద్ధతీ మొదలైన వాటిని అతను చాలా త్వరగా ఆకళింపు చేసుకున్నాడు. పూర్తిగా డజను మంది కూడా లేని యువకులు, రెండేసి బ్లాకులుగావున్న ఆ అయిదు వందల టైప్ త్రీ క్వార్టర్ల నిర్మాణం అనే యజ్ఞంలో పాల్గొని, అంచనాల మేరకు చకచకా పనులు సాగించటం చూస్తూంటే, ప్రగతి అన్నిరంగాల్లో ఇంత చురుగ్గా వుంటే ఎంత బాగుండును అనిపించింది. కాల నియమంతో పనిలేకుండా నిరంతరం పనిలో మునిగితేలేవారికి పనే వ్యసనం!

క్వార్టర్లన్నీ సీల్‌లెవెల్ వరకు వచ్చేయి. అంతవరకు కనుచూపు మేర వరకు ఖాళీగా కనిపించే ప్రదేశం, ఇపుడు ఎటు చూసినా చైతన్యంతో సందడిగా గోచరిస్తున్నాయి. నాలుగు లారీలు విరామం లేకుండా బట్టీలనుండి, ఇటుకలు చేరవేస్తున్నాయి. ఇరవై ముఠాల మేసన్లు తమ కుటుంబాలతో, కూలీలతో కలిసి, వంతులవారీగా తమకప్పగించిన ఇళ్ల నిర్మాణంలో మునిగి తేలుతున్నారు. ఎవరు వెనకబడితే వాళ్ల ఇళ్లను మరొకరి కప్పగిస్తారన్న భయం వాళ్లతో పనిచేయిస్తోంది. అక్కడ మేస్త్రీల్లో చాలామంది నెల్లూరు ప్రాంతానికి చెందిన వాళ్లు. సంవత్సరంలో తొమ్మిది నెలలు రాత్రింబవళ్లు పనిచేసి, డబ్బు కూడబెట్టి ఫిబ్రవరి నెలలో వచ్చే భీష్మ ఏకాదశి నాటికి తప్పని సరిగా తమ ఊరు చేరుకుంటారు. అక్కడ తమ ఆస్తిపాస్తులు మరికొంత పెంచుకుని చక్కబెట్టవలసిన కార్యాలు చూసుకుని మళ్లీ బయల్దేరి పోతారు. కూలీలుగా చేరి అయిదారేళ్లు అనుభవంసంపాదించిన వాళ్లు, నలుగురైదుగురు కుర్రవాళ్లని కూలీలుగా తెచ్చుకుని మేస్త్రీలుగా మారి స్వంతంగా పనులు తీసుకోవడం చేస్తుంటారు. అందుకుగాను ఎడ్వాన్సులు తీసుకుంటారు. నమ్మకస్తులైన ముఠామేస్త్రీ




లను కంట్రాక్టర్లు బాగా చూసుకుంటారు. వాళ్ళకి భారీగా ఎడ్వాన్సులిస్తారు. సాధారణంగా ఇటుక కట్టడం దశలో ఏ మేస్త్రీ పని మానేసి రాకుండా వుండడు. వాళ్ళకి ప్లాస్టరింగు, ఫ్లోరింగు పనుల్లోను డబ్బు బాగా వస్తుంది. అదీ గాక ఒక కంట్రాక్టరు దగ్గర ఎడ్వాన్సు తీసుకు ఎగబెడితే, ఆ మేస్త్రీ ఆ ప్రాంతంలో మరెవరి దగ్గరా పనిచెయ్యలేడు. ఎవరో కొంతమంది తప్ప మిగిలిన మేస్త్రీలందరూ పని రెండేళ్ళు, మూడేళ్ళపాటు సాగినా, తాము ఒప్పుకున్న పని చేసే వెళతారు.

కందుల కొండయ్యా విసురుగా వచ్చేడు నారాయణ దగ్గిరకి.

"ఇట్టా బాదపెడితే మేం జెయ్యలేమయ్యా! పని వద్దనుకుంటాడో, ఏందో, ఆ రంగారావు చూడవయ్యా! గమాలలు గుంజుకుపోబట్టె.. ఈడ సున్నమెత్తుకొనేదెట్టబ్బా! చూడు... సున్నమారిపోతావుంది. ఈవయ్యా.. అంటే ముఠాకి నాలుగేనంటుండాడు. మరి రెండీకబోతే ఎట్టా. నాకు మందెక్కువలేరూ!"

లైమ్ గ్రైండర్లో పాళ్ళు లెక్క చూస్తున్న నారాయణ రెడ్డి తల తిప్పకుండానే కొండయ్యా వంక ఆగమని చేత్తో సంజ్ఞ చేశాడు. కొండయ్యా ఏదో గొణుక్కుంటూ, పక్కనేవున్న రాయిమీద కూర్చుని తలపాగా లోంచి చుట్ట తీసి వెలిగించేడు.

సర్వర్ మిల్లర్ స్టార్టు చేసేక, రెడ్డి ఇవతలగా నడచివచ్చేడు.

"ఏం కొండయ్యా! నువ్ మల్ల లొల్లిజేస్తుండవే. రంగారావేమన్నడు... అతన్కి నీకూ రాకిడేంది జెప్పవయ్యా. నీ ముఠాకెన్ని గమాలలిచ్చిండు?"

"నాలుగే ఇచ్చినాడయ్యా!"

"అందరికెన్నిచ్చిండు?"

"నాలుగేకదా!"

"మరింకేందయ్యా నీతంటా?"

"నామంది ఎక్కువ కాదా? నాకు మరి రెండియ్యవద్దా? పొద్దుగాల స్టోరునుంచి గమాలలు ఎత్తుకొచ్చేటపుడు మరి రెండు తీస్కరమ్మన్నా! మా సింగమ్మ తెచ్చిందయ్యా! సున్నం మోస్తావుంటే, సున్నం వంపేసి రెండు గమాలలు గుంజుకు పోయినాడు. సాయంత్రమిచ్చేస్తా నన్నా ఇస్లే... ఇట్టయితే నా పని తొందరగా సాగదు. మీరు చెప్పి ఇప్పించండి"

"అదెట్లయితది కొండయ్యా! అందరూ నీ లెక్క అడగబడితే నేనేం జెయ్యాలె... సర్సరె.. రంగారావుకి చీటీ రాసిస్త... పొయ్యి తెచ్చుకో. మళ్లీ సాయంత్రం ఆయన్కి లెక్క చెప్పు. లేకపోయినట్టయితే, నా పైసల్లో పట్టుకుంటరు. ఎవరికీ చెప్పకు సుమా" చీటీ రాసిచ్చేడు రెడ్డి.

సంబరంతో పొంగిపోయి నవ్వుకుంటూ "అట్లట్ల చేస్త... రెడ్డిగారూ! మీకు మాట రానియ్యనైండి" అంటూ రంగారావు దగ్గిరకి పోయేడు కొండయ్యా.

వాళ్ళంతే! స్వల్ప విషయానికి ఎంతో సంతోషిస్తారు. తాము చేసే కష్టానికి వచ్చే ప్రతిఫలంలో పావలా వంతు కూడా తమకు రాదనీ, మిగిలేదంతా తమ చేత పనిచేయించే వాడిదనీ వాళ్లకి తెలీదు.



ఆ రోజు పేమెంటు రోజు. ఎవరో కొద్దిమంది ముందు రోజు మొదలుపెట్టిన పని ఇంకా పూర్తికాని వాళ్ళు తప్ప మిగిలిన వాళ్లంతా శుభ్రంగా స్నానాలు చేసి, ఉతికిన బట్టలు కట్టుకుని వర్క్ సైటు చివరకొత్తగా వెలిసిన టీ దుకాణం దగ్గిర చేరి మాట్లాడుకుంటున్నారు. స్టాఫ్ అందరూ స్నానాలు చేయడం, బట్టలు ఉతికించుకోవడంవంటి స్వంత పనుల మీద దృష్టి కేంద్రీకరించేరు. ఆఫీసు గదిలో టేబులు ముందు కుర్చీలో కూర్చుని, డేబుక్కు దగ్గిర పెట్టుకుని పేషీటు తయారు చేస్తున్నాడు ప్ర

భాకరం.

బట్టీలనుండి తోలిన ఇటుకల పేమెంటు కోసం బట్టీలు పెట్టిన కుమ్మరి మేస్త్రీలు వచ్చేరు. వాళ్లకి లోడు తోలినప్పుడల్లా డ్రైవరు చేత పంపిన డూప్లికేటు రశీదులు చేతపట్టుకొస్తారు. వెంకట్రావును పూర్తిగా ఇటుక బట్టీల పర్యవేక్షణ మీద వుంచడంవల్ల అతను వాళ్లకి చెల్లించవలసిన మొత్తం లెక్కలు కట్టడంలో మునిగిపోయేడు.

అలాగే క్వారీ పేమెంటు, లారీల రిపేరింగు బిల్లులు, డీజిల్ ఎమౌంట్, నారాయణరావు ఇవ్వాల్సివుంది. నారాయణరావు అసిస్టెంటుగా రాములు, వాళ్లకి రావలసిన లోడింగు, అన్‌లోడింగ్ లెక్క చెప్పవలసివుంది. అందరూ తలో పనిలో వున్నారు. రంగారావు ఒక్కడే తీరుబాటుగా కావడి పెట్టె మీద కూర్చుని ఉత్తరాలు కాబోలు రాసుకుంటున్నాడు.

పాణిని మేనన్లు ఊపిరి పీల్చుకోనివ్వడంలేదు. అతన్ని వెంటబెట్టుకుని వాళ్లు ఆ పదిహేను రోజుల్లో చేసిన ఇటుక పని కొలతలు తీయించుకోవడంలో, సుమారుగా తమకు రావలసిన డబ్బులెక్క కట్టించుకోవడంలో చికాకు పరుస్తున్నారు. పాణి పని చేయించడంలో, లెక్కలు వేయడంలో దిట్ట. కానీ అతను విపరీతమైన బద్ధకస్తుడు. కాగితం, కలం ఎప్పుడో గాని వుపయోగించడు. అయినా అతను చెప్పిన ఎమౌంట్ ఎప్పుడూ సరిపోయేది. ఏ మేస్త్రీ ఎంతపని చేశాడో, అతనికి బాగా జ్ఞాపకం వుంటుంది. పాణీ ఆ పేమెంటుకి వాళ్లకెంతెంత ఇవ్వవచ్చో వివరాలిస్తేగానీ ప్రభాకరం పేషీటు పూర్తి చెయ్యలేడు. అది పూర్తయితేనేకానీ, ఆనాటి పేమెంటుకి కావలసిన డబ్బెంతో లెక్కతేలదు.

ఆ రోజు పొద్దున్నే ఎనిమిది గంటలకే గోదావరి ఖనిలో నివాసముంటున్న వెంకటేశ్వరరావు, సూర్యనారాయణ మోటారు సైకిలు మీద వర్క్ సైటుకొచ్చేరు. సాధారణంగా రోజూ పది దాటిపోయేకగానీ వాళ్లెవరూ రారు. దొర లేనప్పుడు వాళ్లు ఇతర వ్యాపకాలు చూసుకుని వస్తుంటారు. ఆయనొచ్చే రోజూ, ఆయన వున్న రోజుల్లో మాత్రం చాలా తొందరగా వస్తూ వుంటారు. వాళ్లు ఆయన దగ్గర పది, పన్నెండేళ్లబట్టి పనిచేస్తున్నారని విన్నాడు ప్రభాకరం. వాళ్లు ప్రకాశరావు దొర దగ్గర పనిమానుకుని వేరే స్వంతంగాకంట్రాక్టు పనులు మొదలు పెడతారని కూడా పుకార్లు విన్నాడతను.

వెంకటేశ్వరరావు ఎర్రగా, లావుగా వుంటాడు. తాగుడు వల్లకాబోలు, కళ్లు ఎప్పుడూ ఎర్రగా వుంటాయి. దూకుడుగా మాట్లాడుతాడు. సైట్లో వున్నంతసేపూ ఎవరిమీదో కేకలు వేస్తూనే వుంటాడు. నోటికొచ్చినట్టల్లా తిడుతూ వుంటాడు. చదువు బాగా తక్కువైనా, చొచ్చుకుపోయే స్వభావం వుండటం వల్లా, వ్యవహారజ్ఞత బాగా వుండటంవల్లా పనులు కుంటుపడకుండా చకచకా జరిపించగలుగుతాడు. అతనే ప్రకాశరావు తరపున మొత్తం సైట్‌ఇన్‌ఛార్జి. డిపార్ట్‌మెంట్ లావాదేవీలు, బిల్లులు చేయించడాలు, ఇవ్వవలసిన దగ్గిర ఇచ్చి పనులు చేయించడం వంటి వాటిలో బాగా ఆరితేరిన వాడు.

వెంకటేశ్వర్రావు ఒక భుజం, అయితే సూర్యనారాయణ రెండో భుజం ప్రకాశరావుగారికి. నారాయణ మెత్తటి మనిషి. ఎక్కువగా మాట్లాడడుగానీ, ఎటువంటి అసాధ్యమైన పనైనా పట్టుదలతో, ఓపిగ్గా, సాధించగలిగే నేర్పున్న మనిషి. టెండర్లు సంపాదించడంలో, కావలసిన మెటీరియల్, కావలసిన దగ్గిర్నుండి సకాలంలో డంప్ చేయడంలో, కంపెనీ వాహనాలను మంచి రన్నింగ్ కండిషన్లో వుంచడంలో ఏమాత్రం ఏమరుపాటులేని మనిషి. డ్రైవర్లకీ, క్లీనర్లకీ అతని మాట వేదం.

వెంకటేశ్వర్రావు విసురుగా లోపలకి వచ్చేడు.

"ఏమాయెనయ్యా! నీ పేషీటు... నీ లెక్కలు... పదవ్వబట్టె... నన్ను పదకొండు గంటలకల్లా బేంకు దగ్గిరుండమన్నడు. నీ పేమెంటు అంకె తేల్చకపోతివి. నేనెట్ల జెయ్యాలె. అందాజు లెక్కజెపితె వూరుకోని మనిషాయె. మా బాగ దొరికినవ్... పో" అంటూ ప్రభాకరం ఇంకా పూర్తి చెయ్యని పేషీటు కాగితాల్ని లాక్కుని చూసేడు. కాసేపు అంకెలు పరిశీలించి...




''ఏందిది... గింతవరకు లక్షా ముప్పై ఎని మిది వేలా? ఇంద్లమేనన్ల పేమెంటు లేదే.. అయన నంపి పోతడు అందర్ని''

''నేనేం చెయ్యాలి వెంకటేశ్వర్రావుగారూ! పాణిని నిన్నట్నుంచి వెంట తగుల్తున్నాను. ఇంతవరకు ఇయ్యకుంటే, నేనెలా రాస్తాను''

''కొమ్రయ్యా! పాణి పోరణ్ణిరమ్మను'' వంట వాణ్ణి పిలిచేడు. ''వొచ్చినంక నాకు జరంత చాయి జెయ్యి... పో''

కొమరయ్య పాణిని పిల్వటానికి పోయేడు. కొంచెం సేపట్లో చుట్టూ కొంతమంది మేనన్లు వెంటరాగా పాణి వచ్చేడు.

''మీరెందుకురా! ఫొండి'' వాళ్లను గద్దించి పంపేశాడు వెంకటేశ్వర్రావు.

''ఏమయ్యా! లాట్ సాహెబ్... ఎందుకీన దువు. నక్కంగ లేకపోయినాక. నీకన్నా గావెంక ట్రావు నయం... నద్వకపోయినా... బరాబర్ లెక్క ఎప్పటికప్పుడు ఇస్తడు''

పాణి వంక చూసేడు ప్రభాకరం... వెంకటే శ్వర్రావు మాటలు అతననలు పట్టించుకున్న ట్టేలేదు. తైల సంస్కారం లేకుండా రేగిపో యిన జుత్తుతో, ఎర్రగా నిద్రలేమిని సూచిస్తు న్న కళ్లతో తదేకంగా చేతిలో వున్న ఎక్సర్ సైజు పుస్తకంలోని కొలతల్ని గుణించు కుంటూ, ఏం మాట్లాడలేదు అతను.

ప్రభాకరానికి ఆశ్చర్యం వేసింది. ఎందుకీ మనిషి ఇంత నిర్లక్ష్యంగా వుంటాడని... తినడం కూడా అంతే.. ఏం తింటున్నాడో పట్టించుకోడు. రెండు పూటలూ తినకపోయినా ఆ విషయం పట్టించుకోడు. బద్ధకస్తుడని ము ద్రపడిపోయినా, అతని ప్రత్యేకత అతని కుంది. డిప్లొమా లేకపోయినా, టెక్నికల్ నాలె డ్జిలో అతనే ఇంజనీరుకీ తీసిపోడనీ, డిపార్టు మెంటల్ సూపర్వైజర్లు కూడా కొన్ని వేరే ప్లాన్ల ఎగ్జిక్యూషన్‌లో ఇతని సలహాలు తీసు కుంటుంటారని ప్రభాకరం విని వున్నాడు.

మేస్త్రీలతని గడ్డం పట్టుకు బతిమలాడుతా రు, తమ లెక్క త్వరగా కానిమ్మని... కాగితం మీద లెక్కవేయకపోయినా, పాణి ఈ మేస్త్రీ కింత పేమెంటు రాయమని అంకె ఇస్తే అంతకుమించి ఒక్క రూపాయి కూడా ఎక్కువ కాదు మెజర్‌మెంటు తీసుకుని లెక్కవేస్తే... బి.కాం. ఒక సబ్జెక్టు వుండిపోతే, అతన్ని శ్రీరా ములుగారు... ఇంజనీరింగ్ జీనియస్.. తమ్ము డికి తన టెక్నికల్ నాలెడ్జినీ, ఇంజనీరింగు నులువులనీ క్షుణ్ణంగా .నేర్పాడు.. అలా ఆయన నేర్పడం, డయాబెటిస్ ముదరడంవ ల్ల దృష్టి లోపం ఏర్పడిన ఆయనకెంతగానో వుపకరించింది. తాను హైద్రాబాదులోనే వై ద్యం నిమిత్తం వుంటూ, తన తమ్ముడిని తన బదులు వర్క్ సైటులో వుంచేడు.

ఐదు నిమిషాలు గడిచేక, తన లెక్కల పుస్తకం మూసి, ''మేనన్ల పేమెంటు, మొత్తం పదకొండు వేల అయిదు వందలు రాయ వోయ్ ప్రభాకరం! తర్వాత వివరాలు పేషీట్లో రాద్దువుగాని... నేను పోయి, స్నానం చేసి వస్తా!'' అని పోబోయేడు.

''ఆగవోయ్... తీస్‌మార్‌ఖాన్! నువ్వు... ము ద్ద పదకొండు వేలు రాయి అనబడితివి. నేను పోయి... దొరా! మొత్తం మేనన్ల పేమెంటు పదకొండు వేలు అంటే, నా నెత్తి వగుల్తది. ఎవ్వరికెంత... ఎడ్వాన్సులు పట్టుకున్నవా! లేదా! చెప్పినంకపో'' అరిచేడు వెంకటేశ్వ ర్రావు.

''గదంత నే మా జూసినగానీ... సిల్ లెవల్ బ్రిక్‌వర్క్ అని చెప్పు. ఎడ్వాన్సులు తీసినంక నేలే'' మరోమాట లేకుండా నిష్క్రమించేడు పాణి.

రెండు చేతుల్తో తల పట్టుకున్నాడు వెంకటేశ్వ ర్రావు.

''ఈనతో మా చావొచ్చి పడ్డది. నే జన్తన్న... మద్దెన... ఏమాయె. వార్నీయక్క కొమ్రయ్యా! చా.. తాపుతవా... లేదా గాడ్దెకొడకా'' బిగ్గరగా కేకేసాడు.

''తెన్తన్న దొరా!'' వాడు మూడు కప్పుల్లో టీ తెచ్చి బల్లమీద పెట్టిపోయేడు. సాసర్లో టీ పోసుకుని మూడే గుక్కల్లో జుర్రి లేచి నిలబడ్డా డు వెంకటేశ్వర్రావు మోటార్ సైకిల్ తాళం చేత్తో పట్టుకుని.

''నే పోయి వస్త... నీ పేషీటుతే... వచ్చేనరికి పేమెంటు పుస్తకం రెడీ చెయ్యి. నువ్వు కొత్త... నిన్ను అప్పుడే తిట్టడుగానీ మా తోలు వలుస్త డు. మళ్లీ రెండయ్యేసర్కి ఇక్కడ వుండాలె.

తిర్గలేక సచ్చిపోతన్న. మర్చిపోయిన ఆయన ఎక్కడా మంచినీళ్లు నోట్ల బెట్టడు. పొద్దున్న హైద్రాబాద్‌లో చేసిన నాస్త, తాగిన చాయ్...రాంగానే తింటనంటడు. అన్నం, చపాతీలు ఆ కుర్మిగానితోచెప్పి చేయించి వుంచు. ఉప్పు, కారం తక్వ వుండాలె. నిమ్మకాయలు దెచ్చిన్త.. దొరవున్నన్ని రోజులూ తెల్లవారకముందే లేచి స్నానం, పూజ అయినంక నిమ్మకాయ నీళ్లు దాగుతాడు. అవియ్యాలె. యాదుంచుకో... ఇంగనే అస్త... నారాయణా రా!'' అంటూ సూర్యనారాయణని వెంట బెట్టుకుని, మోటార్ సైకిల్ మీద సాగిపోయెడు వెంకటేశ్వర్రావు.

వాన వెలిసినట్లయింది వాతావరణం. అందరూఆఫీసు రూములోకి చేరిపోయేరు. రాములు సిగరెట్ వెలిగించి, టీకెటిల్‌లో మిగిలిపోయిన టీ, కప్పులో పోసుకుని తాగేడు. రంగారావు ట్రిమ్‌గా తయారయివున్నాడు. రిలాక్స్‌డ్‌గా కూర్చుని సినిమా పాటేదో కూనిరాగాలు తీస్తున్నాడు. నారాయణరెడ్డి సూది, దారం తెచ్చుకుని అడుగుకుట్లు విడిపోయిన పేంటు మరామ్మత్తు చేస్తున్నాడు. అంతవరకు ఇటుక బట్టీ మేస్త్రీలకు వాళ్లలెక్క సముదాయించి చెప్పిన వెంకట్రావు లోపలకి వచ్చేడు. అతనెప్పుడూ నవ్వు మొహంతో వుంటాడు. పసిపిల్లాడి నవ్వులోని నిర్మలత్వం కనిపిస్తుంది అతను నవ్వుతుంటే. మంచి తిండి పుష్టివున్నవాడు. తాశీల్ అనేదాన్ని ఊతపదంగా వాడుతూంటాడు.

రాగానే ''ఏం వోయ్... తాశీల్. ఈ బూట్లు చూసినావా... మొన్న హైద్రాబాద్ పోయినప్పుడు కొన్న. రెండు వందల ఏభై అయింది. మంచి గున్నయా?'' అని అడిగేడు రంగారావుని.

''నీకేమోయ్... నువ్వు హైద్రాబాద్ పోతవ్... వస్తవ్. ఏమున్న కొంటవ్. మాకెట్లయితద. మేం ఊర్లపొంటి తిరిగే బేకార్‌గాళ్లం. దొరకాడ కొల్వు లేకపోతే బొగ్గుబాయిల తట్టమోత గంతే... మా నశీబ్.. పూనా పేంటు కొనడానికి కూడా పైసలు వుండవ్ మా తాన'' అన్నాడు రంగారావు. అసూయ కన్పించింది అతని కళ్లల్లో.

''అవ్... పైసల్ వుండవులే.. ఏం జేస్తున్నవ్‌బే... నీ జీతం మీ నాయన కిస్తున్నవా? నీ సంగద్దెల్వదా నాకు. గాములాల ఇళ్ల కాడికి నువ్వు పోవడం నే జూట్టంలే.. ఆ బుల్లబ్బాయి గానింట చేరి ఈతకల్లు తాగడంలే. వాని పోర్కి నువ్వు లైనేస్తున్నవటగా! దానికి జాకిటు బట్టలు తెచ్చుడుకే నీ పైసల్ కర్చుబెడితే, నీకు పూనా పేంటు కొనడానికెక్కడ మిగుల్తయ్ బే... తాశీల్'' వెటకారం చేసేడు వెంకట్రావు.

''ఈన మాటలు నమ్మకు ప్రభాకరం... నీకు తెల్వదు. అంతా ఇట్లే బనాయిస్తడు'' విచిత్రంగా తామిద్దరి వంక చూస్తున్న ప్రభాకరంతో అన్నాడు రంగారావు.

''నాది బనాయింపంటావు తాశీల్. మీనమున్న మొగోనివైతే నువ్వు పందెంకట్టు. తియ్ పైసల్... నువ్వు బుల్లెబ్బాయి ఇంటికాడ ఆ రాములుగానితో కలిసి కల్లు తాగినవా, లేదా?'' సవాల్ విసిరేడు వెంకట్రావు.

''కల్లు తాగుతేంది... గదేమి తప్పా? పెయ్యికి మంచిది. నీకెరిక లేకపోతే, రెడ్డి నడుగు'' రెడ్డినుంచి సపోర్టుకోసం ఆశించేడు రంగారావు.

''కల్లు సంగతి పక్కనబెట్టు రంగారావూ.. ఆబుల్లబ్బాయి సోపతేంది నీకు. వాడు మంచోడు కాదు. వాని పోరిన్జూసి నువ్వు ఆశపడుతున్నావు. గది బలేటక్కరిపోరి. వర్కినస్పెక్టరు రాజు ఆ పోరి నుంచేగాదా బద్‌నామైపోయిండు. చివరికి నౌకిరీ కూడా పోయి, వానికుటుంబం మొత్తం ఆగమైపోలేదా. నీకు తాగమనసైతే రెండు లొట్టిలు గమ్మున తాగి, గుప్‌చుప్‌గా వుండరాదే'' ననసన్నగా మందలించేడు రెడ్డి.

రంగారావు ఏం మాట్లాడలేక లోలోనే గులుక్కున్నాడు. ఇంతలో కొమరయ్యలోనికి వచ్చి వంటైపోయిందని తెలియచేసేసరికి, అందరూ భోజనాలకి కదిలేరు. ప్రభాకరం మాత్రం పేమెంటు పుస్తకం రెడీ చెయ్యడంలో మునిగిపోయేడు.

★ ★ ★

రోజులు గబగబా గడిచిపోతున్నాయి. ప్రభాకరం దొర దగ్గిర పనిలో చేరి నాలుగు నెలలు పూర్తయ్యేయి. మొదట్లో ఎకవుంట్లుచూడడంతో ప్రారంభమయిన అతని పనిలో క్రమక్రమంగా




లారీల డీజిల్ ఎకవుంట్, స్టోర్ వెరిఫికేషన్, మెస్ మేనేజిమెంట్, మెటీరియల్ మెయిన్‌టెనన్సు, ఆఫీసు కరస్పాండెన్స్ చూడటం వగైరాలు కూడా చేరి పోయేయి. దొర వచ్చిన ప్రతీసారీ ఏదో ఒక కొత్త బాధ్యత ప్రభాకరానికి కేటాయించిపోతున్నాడు.

వేరే ఏ వ్యాపకం లేకుండా, ఎక్కడికీ పోకుండా, అక్కడ జరిగే పనులన్నీ క్షుణ్ణంగా తెలుసుకుంటుండడం, అప్పచెప్పిన పనులన్నీ జాగ్రత్తగా చేస్తుండడంవల్ల కాబోలు ప్రభాకరం అంటే అతనికి సదభిప్రాయం ఏర్పడినట్టుంది. మిగతా వాళ్లందర్నీ బండ బూతులు తిట్టి, తనెదురు పడటానికి వాళ్లు వణికిపోయేలా చేసేదొర, ఎంచేతనో గానీ ప్రభాకరాన్ని ఆనాటివరకు కనీసం కసురుకోవడం కూడా చెయ్యలేదు. ప్రభాకరం కూడా మాటపడకుండా వుండటం కోసం, అన్ని పనుల్లో అతనికి కావలసిన సమాచారాన్ని రెడీ చేసి ఆయన వచ్చేసరికి అందజేసేవాడు.

మొదటి నెల జీతం అందుకున్నపుడు ప్రభాకరానికి తనదీ అన్న డబ్బును చూసి, తృప్తిగా అనిపించింది. ఎంత దూరం నుంచో, ఈ మారుమూల ప్రాంతం వచ్చిన తన కష్టానికి ప్రతిఫలంగా వచ్చే ఈ డబ్బుకోసం, ఇంటి దగ్గిర, ఇంకా రెక్కలు రాని తమ్ముళ్లూ, పిల్లల కోసమే జీవితాన్ని పణంగా పెట్టి బతుకుతున్న తల్లి, ఆశగా ఎదురు చూస్తూంటారన్న భావన, అతని కళ్లల్లో నీళ్లు తిరిగేలా చేసింది. ఓచరు మీద సంతకం పెట్టి, డబ్బు జేబులోవుంచుకున్నాడు.

"నీ జీతం ఏం చేస్తావు? ప్రభాకరం" చాలా మామూలుగా అడిగేడు దొర. బ్రీఫ్ కేసులో పేమెంటు అవ్వగా మిగిలిన డబ్బు సర్దుకుంటూ...

"రేపు ఇంటికి మనియార్డరు చేస్తాను సార్!"

ఒక్కసారి తలెత్తి, ప్రకాశరావు ప్రభాకరాన్ని పరీక్షగా చూసేడు.

"మొత్తం పంపుతావా?"

"ఓ యాభై రూపాయలుంచుకుని మిగిలింది పంపుతాను సార్!"

"గుడ్... వృధా ఖర్చులు పెట్టకు" లేచి నిలబడ్డాడు ఆయన. అతని బ్రీఫ్‌కేస్ చేత్తో పట్టుకుని ఆయన వెనకే కారు దగ్గిరకి నడిచేడు ప్రభాకరం.

కారు బేక్ సీట్లో కూర్చుని, విండోగ్లాను కిందకి దింపుతూ

"నువ్వు మోటార్ సైకిల్ నడుపుతావా?" ఆకస్మికంగా అడిగేడాయన.

"రాదుసార్!" ఆ ప్రశ్న ఎందుకు వేసాడో అర్థంకాక జవాబిచ్చేడు ప్రభాకరం.

"వెంకటేశ్వర్రావుకి చెపుతాను. మన మోటార్ సైకిల్ నేర్పుతాడు. నేర్చుకో... దెబ్బలు తగుల్చుకోకు"

"అలాగే..."

"సైటు పనులు మొత్తం జాగ్రత్తగా అరుసుకో. నీతో చాలా పనుంది. నీ అసలు పని ఇక్కడకాదు హైద్రాబాద్‌లో. నేను పొయ్యొస్తా" దొర హుకుంతో కారుముందుకు కదిలి, మెల్లగా దృష్టిపథం దాటిపోయింది. ఆయన మాటలు పూర్తిగా అర్థంగాక, ఆలోచిస్తూ అక్కడే నిల్చుండిపోయేడు ప్రభాకరం.

★ ★ ★

ప్రభాకరం మొదటిసారిగా గోదావరిఖని బయల్దేరాడు... నాలుగైదు స్వంత వస్తువులు కొనుక్కోవడంతో పాటు సైటు పనులు కూడా చేసుకు రావడానికి. బస్సు దిగి, ముందుగా పోస్టాఫీసుకి వెళ్లి తల్లి పేర మనియార్డరు చేసేడు. రశీదు తీసుకుంటుంటే, అతనికి ఒక మంచి పని చేసిన ఆనందం కలిగింది. మనియార్డరు అందుకునే తల్లి మొహంలో ఆనందం, దూరానవున్న కొడుకుని తల్చుకుని ఆమె పడే బాధ అతని మనోనేత్రం ముందు స్పష్టంగా కనిపించేయి. అక్క చెల్లెళ్లూ, అన్నదమ్ములూ అందరూ మనసులో మెదిలేరు. ఇంతలో సార్! సార్! అన్న పిలుపు వినిపించి అటు చూసేడు. క్లీనర్ షెర్పుద్దీన్ పిలుస్తున్నాడు.

"లారీ తెమ్మన్నారు కద్సార్! కిషన్‌చంద్ అగర్వాల్‌కొట్టుముందు ఉంది సార్ బండి. మీరొస్తే పోదామంటున్నారు రాములు సార్!"

"వస్తున్నా పద!" అంటూ వాడి వెనకే నడిచేడు ప్రభాకరం. మెయిన్ రోడ్డులో ఓ చివర్నవుంది హార్డు వేర్ దుకాణం. ఎక్కడో గుజరాత్‌నించి వచ్చి అక్కడ అదుకాణాన్ని తెరిచిన అగర్వాల్ బాగా సంపాదించేడు.

సింగరేణిలో ఉన్నది బొగ్గుగనులే అయినా, వాటి చుట్టూ వాటిపై ఆధారపడి జీవిస్తున్న కంట్రాక్టర్లు, వ్యాపారస్తులు, వైన్ మర్చెంట్లు బంగారాన్ని పిండుకుంటున్నారు. గని కార్మికుల మూలంగా ఆ కార్మికులకు అంటుకున్న బొగ్గు మసి మాత్రం ఏడేడు జన్మలదాకా పోదేమోననిపిస్తుంది.

అగర్వాల్ దుకాణానికి వెళ్లేసరికి అక్కడ రాములు కూర్చుని వున్నాడు. శేఠ్ ప్రభాకరాన్ని నవ్వుతూ పలకరించేడు.

"ఆయియే... నారాయణ సాబ్ మీరొస్తారని చెప్పి వున్నారు. బాగా చదువుకున్న వారని కూడా అన్నారు. ప్రకాశరావు సాబ్‌కి మంచి మనిషి దొరికేరని ఖుషీ అయ్యింది. ఏం సామాను కావాల్నో చెప్పండి. తీసిస్తా... అరె... యాద్గిరీ... నువ్వు పోయి సార్‌కి లిమ్కా తేపో..." అని కుర్రవాణ్ణి తరిమేడు. రాములు బీడీ అంటించుకుని బైటికి పోయేడు ఇప్పుడే వస్తానంటూ..

అక్కడున్న కుర్చీమీద కూర్చుని చేతిలోవున్న డైరీ పేజీలు తిప్పేడు ప్రభాకరం. మేస్త్రీలకు కావలసిన గమాలలు, పారలు మొదలు కొని, కొత్తగా వచ్చిన కార్పెంటర్లకు కావలసిన మేకులు, మడతబందులు, మొదలైనవన్నీ వరుసగా చదువుకుపోతే, సేట్ పేడ్ మీదున్న కాగితంలో రాసుకున్నాడు.

"అగర్వాల్‌జీ! మీరవన్నీ తీసి సిద్ధంగా వుంచండి. నేను పోయి పచారీ సరుకులు కొని రావాలి. లారీ ఇక్కడే వుంటుంది" అని బయటకు వచ్చేడు.

అంతవరకు ఊళ్లోకి పోయినట్టున్నాడు. అప్పుడే వచ్చి లారీ దగ్గిర నిలబడ్డాడు డ్రైవర్ బసవరావు. రాములు అతన్తో ఏదో మాట్లాడుతున్నాడు.

"రాములూ! నాతో పచారీ అంగడికి రా!





మెస్ సరుకులు కొనాలి. షెర్పుద్దీన్... ను వ్వారా... లారీలో తెచ్చిన గోనె సంచులు తీసుకురా!'' అని రాములు వెంట రాగా, కిరాణాషాపుకి బయల్దేరాడు ప్రభాకరం.

ఆ నాలుగు రోడ్ల జంక్షన్‌లో పడమటినుండి తూర్పుకి పోయేరోడ్డు వర్క్ సైట్ దిక్కుగా పోతుంది. దక్షిణం వైపున్న రోడ్డులో, కొంత దూరంలో సింగరేణి ఆఫీసు బిల్డింగులు వున్నాయి. ఆ ఆఫీసులకు చాలాముందే రోడ్డుకి కుడివేపున బస్టాండు, ఎడమవైపు ఒక సినిమా హాలూవున్నాయి. ఉత్తర దిక్కుగావున్న రోడ్డు ఊర్లోకి పోతుంది. రోడ్డు సన్నగా వుంది. ఎండాకాలంలో తల దాచుకునేందుకు నీడనిచ్చే ఆధారం ఏదీలేదు. వాహనాలు వచ్చేపోయేటప్పుడల్లా ఎర్రమట్టి రేగుతోంది.

రోడ్డుకు కుడివైపు కూరగాయలు గంపల్లో పెట్టుకుని అమ్ముతున్నారు కొందరు ఆడవాళ్లు.

మెష్‌తో బిగించిన తలుపులున్న చిన్నచిన్న కర్రబీరువాల్లో తెల్లటి పౌల్ట్రీ కోడిపెట్టలు చప్పుడు చేస్తూ తిరుగుతున్నాయి. సాయిబు ఒకడు మేక తొడ ఒకదాన్ని కైమాగా కొట్టి వేస్తున్నాడు బేరగాళ్లకోసం.

రోడ్డుకు ఎడం పక్క దుప్పటి పరచి సెకెండ్‌హాండ్ బట్టలను కుప్పలుగా పోసి సస్తామాల్! సస్తామాల్! అని ఒక చువ్వలా పొడుగ్గా వున్న యువకుడు కేకలు వేస్తున్నాడు.

రాములు వెనకే నడుస్తూ, ఆ బజారు దాటి, నాలుగైదు ఇరుకు సందుల్లో ప్రయాణం చేసి, వెంకటేశం దుకాణం చేరుకున్నాడు. పదడుగుల వెడల్పున్న వీధి కొట్టు అది. దానిముందు అరుగు మీద గంపల్లో ఉల్లిపాయలు, బంగాళా దుంపలు మొదలైన దినుసులు పెట్టి వున్నాయి. పైన పాలిథీన్ సంచులు, కొబ్బరి తాళ్లు, ప్లాస్టిక్ చెంబులు వేలాడ దీసి వున్నాయి. కొట్టులోపల కుడి వక్క గోడనానుకుని అడుగున్నర మేర లోపల గదివరకూ ఖాళీ జాగా నడవటానికి వీలుగా వుంది.

గల్లా పెట్టెముందు, ప్రౌఢ ప్రాయంలో వున్న స్త్రీ చురుగ్గా కదులుతూ, గిరాకీ చూస్తోంది. వెనుకకు బాగా, లాగి బిగించి ముడివేసుకుంది. వంటిమీద తోపురంగు గల్లనేత చీరతో, జాకెట్టు లేకుండా, పైట బిగించి కట్టుకున్న ఆమెని చూసి రవంత ఆశ్చర్యపడ్డాడు ప్రభాకరం.

డబ్బు తీసుకుంటున్నప్పుడూ, సరుకులు ఇచ్చేటపుడూ పైటలో బరువుగా కదులుతూన్న ఆమె స్తనద్వయం, చూపరుల గుండె లయత ప్పికొట్టుకునేలా చేస్తోంది. చీర కూడా మోకాళ్ళ వరకే వుంది. నల్లగా కండరాల బిగితో వున్న ఆమె మోకాళ్లు, వాటి దిగువగా పాదాలమీద బరువుగా కనిపిస్తున్న తెల్లటి వెండికడియాలూ, ఇంకా యవ్వనం ఆమెలో నడలిపోలేదని తెలియజేస్తున్నట్లున్నాయి.

''గిటెటచ్చినవ్... రాములన్న... సామాని య్యాలె...'' పలకరించిందామె.

''ఔ... గానీ... చంద్రక్క... ఎంకటేసుబావ లేడేమే''

''బెల్లం దిమ్మలచ్చినయ్. తేబోయిండు... వస్తడు... కూసుండరాదు''

''మా కూసుంట. మాకో కొత్తసారొచ్చిండు. ఈనే... ఈన సిట్టి ఇస్తేనే, ముఠాలోళ్ళకు సామానియ్యండి. మీ పైసల్ మల్ల ఈనే తెచ్చిస్తడు. నారాయణరావు చెప్పమన్నడు.

బావను పిలిపించాలె. లారీ రోడ్డుమీదున్నది. ఏడుంటడో చెప్పు. షెర్పుద్దీన్‌ను తోల్త''

లేచి ముందుకు వచ్చిందామె. ఓ స్టూల్ తెచ్చి అరుగుమీద ఒక మూలగా వేసింది. ''కూసోండి సారూ!'' అని ప్రభాకరంతో చెప్పి, షెర్పుద్దీన్‌తో

''గా మూల అశోక్ సేటు బార్‌షాపున్నది... షెర్పుద్దీన్... షాపుపొంటి నాగేను కొట్టున్నది. ఆ జాగల్నే వేన్లొంచి బెల్లం దింపుడవుతున్నది. అక్కడుంటడు పిల్వు'' అంటూ లోపలకి వెళ్లింది.

షెర్పుద్దీన్ అటువైపు వెళ్ళేడు, ప్రభాకరం మౌనంగా పరిసరాలు పరిశీలిస్తున్నాడు. రాములు ఒక బియ్యంబస్తామీద కూర్చుని గుప్పెటతో, బఠానీలు తీసుకుని నముల్తున్నాడు. ఇంతలో లోపల్నుంచి వెంకటేసు షావుకారి కూతురు కాబోలు చెంబుతో మంచినీళ్ళు, గ్లాను తెచ్చింది.

రాములు వాటినందుకుంటూ,

"ఏమే పోరీ! మన పెండ్లెప్పుడే" అని హాస్యమాడేడు.

"చీ... పో... గవేం మాటలు" సిగ్గుపడింది ఆ పదేళ్లపిల్ల. తల విసురుగా తిప్పుకుందేమో, ఒక జడ వొచ్చి చెంపమీద తగిలింది ఆ పిల్లకి.

"పెద్ద పల్లిలో వొదినె... యిక్కడ నువ్వు... నిన్ను పెండ్లాడితే.. గంతకన్న ఈ పోరికి మంచి సుకముంటాదన్న? నీ పనేం మంచిగలేదు ఈ మద్యపోయినవా పెద్దపల్లి. అమ్మ... అయ్య మంచిగున్నరా!" వెనకనే వొచ్చిన చంద్రమ్మ రాములన్నడిగింది.

"గదే మంచి. గడమంచి... నాన్నకి కంటాప రేనును చెయ్యాలన్నరు. కరీంనగర్ తోల్కపో వాలె. తమ్ముడు సెపితే ఇనెటోడు కాకపోయే... ఎగసాయం తీన్‌తారయితాంది. ఈ కొల్వు ఇడిసిపెడితే, ఈ పైసల్ సుత వొచ్చే తొవ్వలేదు. కాలం మంచిగలేదే... అక్కా" రాములు నిట్టూర్చేడు.

సానుభూతిగా తలాడించింది పావుకారమ్మ.

ఇంతలో వెంకటేసం గబగబా వొచ్చేడు. నలభై అయిదేళ్ళుంటాయ్ అతనికి. బట్టతల ప్రారంభమయ్యింది. లుంగీ మడిచి కట్టేడు. జందెం నల్లగా మురికిపట్టిపోయివుంది. రాగానే భుజంమీది తువ్వాలుతో ముఖం తుడుచుకున్నాడు.

"ఏం రాములూ... నువ్వొచ్చినవు. ఈ నేనా కొత్తసారు" అంటూ ప్రభాకరంవైపు చూసి

"నమస్కారం సారూ! సామానియ్యాల్నా... చీటీ యియ్యండ్రి" అని, భార్యతో "నువ్ పోయ్... చా జెయ్యి" అని ఆదేశమిచ్చేడు. చటాలున బయటకు పోయి, "నర్సిమ్మా! ఓరి... నర్సిమ్మా... ఇట్రా" అని గట్టిగా కేకపెట్టాడు.

నర్సిమ్మ రాగానే "అయిదు నిముషాలు కూసోండి సారు" అని ప్రభాకరంతో చెప్పి, అతనిచ్చిన చీటి ప్రకారం, ఇరవై నిముషాల్లో చకచకా మెస్‌రేషన్ అంతా కట్టేసాడు.

చంద్రమ్మ టీ తెచ్చి ఇచ్చింది. రాములు ఎవరో స్నేహితులు కనిపిస్తే వారితో మాట్లాడటానికి బయటకిపోయేడు. షెరుద్దీన్ బీడీ దమ్ముపక్కకు పోయి లాగుతున్నాడు.

"మీరు అయ్యోర్లా... సారూ! నెయ్యి వుంది. ఇస్తా... భోం చెయ్యండి. ఈ బోర్నవిటా డబ్బా మీకోసం ఏస్తన్నా... తాగండి సామీ. పైసలియ్యక్కర్లేదు..." అన్నాడు వెంకటేసం.

"నాకెందుకు... అవసరంలేదు... తీసెయ్యి వెంకటేసం" అన్నాడు ప్రభాకరం... ఎందుకి స్తానంటున్నాడో అర్థంకాలేదు అతనికి.

"మీరు కొంచెం మదత్ చెయ్యాలె సారూ! చూసీ, చూడనట్లు మేసన్ల రేషన్లలో, మెస్ రేషన్లో, పోతుంటే మీకు మంచిది. నాకు లాబముంటది. పైసలు కూడా, అక్కరైతే కబురు చెయ్యండి సార్. పంపుత... నాతాన మీకు మొగమాటం వొద్దు" అన్నాడు.

షావుకార్లు ఎంత సులభంగా అడ్డుదోవలు తొక్కగలరో, లాభాలు సంపాదించుకోవటానికి ఎంత సునాయాసంగా తప్పుడు పన్లకి సిద్ధపడి పోగలరోనని ఆశ్చర్యపోయేడు ప్రభాకర్. కానీ వెంకటేసంతో అతనేమీ అనలేదు. మాట్లాడకుండా బోర్నవిటా డబ్బా తిరిగిచ్చేడు. కట్టిన సామాన్లన్నీ విలియా చూసుకున్నాడు.

"చూడు వెంకటేసం...నువ్వేసిన రేట్లు, మిగిలిన చోట విచారించేక నీ బిల్లు ఇస్తాను. మేస్త్రీల రేషన్లు కూడా నేను రాసిచ్చిన చీటిలన్ని నువ్వు చూపితేనే నీకు డబ్బుముట్టేది... నాకు నువ్వేం మద్దత్ చేయక్కర్లేదు, నానుండి నీకే సహాయం వుండదు. మా ఖాతా నీకక్కర్లేదనుకుంటే చెప్పు... వెంటనే వేరే దగ్గిరకి మార్చేస్తాను... ఇచ్చేవాళ్ళు చాలామంది ఉన్నారు" ఒక్కోమాట స్పష్టంగా చెప్పేడు.

విలవిలలాడేడు వెంకటేసం. వేలకి వేల రూపాయల ఖాతా, క్రమంతప్పకుండా పేమెంట్లు చేసే ప్రకాశరావు దొర ఖాతా ఇంతకాలంనుంచి మధ్యవాళ్లకి ముడుపులిస్తూ నిలబెట్టుకుంటూ వచ్చేడు. ప్రభాకరం ఆ మాట అనేసరికి, మొదట్లోనే బెడిసికొట్టిందేమా అని కంగారుపడ్డాడు. అయినా ఆరితేరినవాడు కనక అంతలోనే తేరుకున్నాడు.

"మీరు రేట్లు తెలుసుకుని, ఆ ప్రకారమే ఇవ్వండి సార్... ఖాతా మార్చుకోవటమెందుకు నాలుగేండ్ల నంది నేనే ఇస్తున్న... ఇంతకు





ముందున్న సార్లకిచ్చే అలవాటు మీదన్న... నాది పొరబాటయింది. ఈ తప్పుకి వదిలెయ్యండి'' మరేం మాట్లాడలేదు ప్రభాకరం.

''షెర్ఫుద్దీన్ సామాన్లుతే'' అని చెప్పి లారీ వైపు సాగేడు.

★ ★ ★

మధ్యాహ్నం రెండు గంటలయ్యింది ఆదివారం.

పేమెంటు డే.

ఇటుకబట్టీల పని పూర్తయిపోయింది. వాళ్ళ ఫైనల్ పేమెంటు కూడా అదే రోజు. రెండ్రోజులనుంచీ వెంకట్రావుతోపాటు ప్రభాకరానికి కూడా ఊపిరి సలపకుండా వుంది.

ఫైనల్ పేమెంటు తాను క్షుణ్ణంగా పరిశీలిస్తేనే గాని డబ్బుఇవ్వడు ప్రకాశరావు. ఆ వివరాలు అన్నీ వెరిఫై చేసి పెట్టాల్సిన బాధ్యత ప్రభాకరం మీదవుంది. రెండు లక్షలు దాటి పోయింది ఆనాటి పేషీటు, సైటు పేమెంట్లతో పాటు. ఆ సంవత్సరంలో అప్పటికి అదే పెద్ద పేమెంటు. ఫోన్లో పేమెంటు వివరాలు కనుక్కుని హైద్రాబాదునుంచే డబ్బుతో వచ్చేడు దొర. ఎప్పుడూ పేమెంటు దగ్గర కూర్చోకుండా డబ్బిచ్చి, ప్రభాకర్నీ, వెంకటేశ్వరరావునీ పేమెంటు చేసెయ్యమనే అతను, ఆరోజు తానే పేమెంటు చేస్తానని కూర్చున్నాడు. అందరికీ ముళ్ళమీద కూర్చున్నట్టుంది.

కిటికీ దగ్గిరగా గాడ్రెజ్ టేబుల్ నాలుగు కుర్చీలు వేయించేడు ప్రభాకరం. అతను పేషీటు ప్రకారం పేర్లు పిలుస్తుంటే, పాణి ఆ వ్యక్తులచేత కిటికీ దగ్గరే ఓచర్లమీద వేలిముద్రలు వేయించి ఆ ఓచర్లన్నీ ఒక స్టాండుకున్న ఇనుప వూచకు గుచ్చుతున్నాడు. ప్రకాశరావు డబ్బులెక్కపెట్టి ఇస్తుంటే, వెంకటేశ్వరరావు అందుకుని, మళ్ళీ లెక్కచూసి, పేమెంటు చేస్తున్నాడు. ప్రభాకరం పేమెంటు అయినట్టు రాసుకుంటున్నాడు. నారాయణరావు, రంగారావులు ప్రశాంతంగా, పేమెంటు అయిపోయేలా ఆజమాయిషీ చేస్తున్నారు.

పేమెంటు చాలా భాగం అయిపోయింది. ఇంకొక్కపాతిక వేల రూపాయల వరకు పేమెంటు మిగిలివుంది. అది మేనన్ల పేమెంటు. ఆ లెక్క చూసుకుని, పాతికవేల రూపాయలు తీసి ప్రభాకరానికిచ్చేడు ప్రకాశరావు. అతను లెక్క చూడబోతుంటే, లెక్క సరిగా వుంది. నువ్ తొందరగా పేమెంటు పూర్తిచేసి, బేలన్సు తేల్చు... మళ్ళీ నేను పోవాలి డబ్బు జాగ్రత్త'' అని చెప్పి, బ్రీఫ్‌కేస్ తీసుకుని తన గదిలోకి వెళ్లిపోయేడు ఆయన. ప్రభాకరం మరేం మాట్లాడలేదు. డబ్బు టేబులు సొరుగులో పడేసుకున్నాడు. దొర అక్కడ లేకపోయేనరికి వాతావరణం తేలికైంది. చకచకా అరగంటలో మిగిలిన పేమెంటు పూర్తయింది. పేమెంటు అయిపోయేక బయట పిట్టమనిషి మిగల్లేదు. అప్పటివరకు భోజనం చెయ్యని వాళ్ళు భోజనాలకు కూర్చున్నారు. ప్రకాశరావు భోజనం కూడా అయిపోయింది.

ప్రభాకరం దగ్గరకి వచ్చి ''పేమెంటు పూర్తయిందా?'' అనడిగేడు.

''అయిపోయింది సార్! బేలన్సు చూస్తున్నా...'' జవాబిచ్చేడు.

''తిని చూడరాదయ్యా!''

''వద్దుసార్! లెక్క తేలినాకే తింటాను''

''సరె... తొందరగా తేల్చు... నేను పోవాలి''

''ఒక్క అరగంటలో తీసుకొస్తాను'' తల వొంచుకుని కూడుతూ చెప్పేడు.

జాగ్రత్తగా లెక్కచూసేడు. మిగిలిన డబ్బు లెక్క పెట్టేడు. తేడా వచ్చినట్టనిపించి మరో సారి చూసేడు. నాలుగు వందలు తక్కువ వచ్చింది. సందేహంలేదు. చెమటలు పట్టేయి. కాసేపు కూల్‌గా ఆలోచించేడు. ఎవరికైనా డబుల్ పేమెంటు అయిందేమోనని... అజ దొరకలేదు. తల విదిలించేడు. ఇంతవరకు మాట పడని తను ఈనాడు తిట్లు తినడం ఖాయం అని అనుకునే నరికి పట్టరాని భయం కలిగింది. పాణి అతని పరిస్థితి గమనించేడు.

''ఏం గురూ! తేడా గాని వచ్చిందా?'' అని పక్కకి చేరేడు. ఆప్యాయంగా అతను అలా వచ్చేసరికి, అవమానం ఎదుర్కోవాలన్న తలంపుతో దుఃఖం వచ్చింది ప్రభాకరానికి లోలోపల. అతనికేమీ పాలుపోలేదు. తల కిందకు దించుకున్నాడు.

''నువ్వుకాసేపు ఆలోచించకు... నేను చూస్తాను'' అని అతని పక్కనే కూర్చుని కాగితాలు ముందుకి లాక్కున్నాడు. దీక్షగా లెక్కచూడటం ప్రారంభించేడు. తను చేసిన పొరబాటు పాణి కనుక్కోగలడని ఆశ కలిగింది ప్రభాకరంలో. పదినిముషాలు చూసేక పాణి కూడా నాలుగు వందల తేడా గమనించేడు.

''ఎవరికైనా రెండోసారిచ్చేవేమో. గుర్తుతెచ్చుకో...'' అన్నాడు.

లేదని తల అడ్డంగా ఊపేడు. అతని ధైర్యం సన్నగిల్లింది. పాణి మరి కాసేపు ఆలోచించినా ఏం తట్టలేదు. టేబుల్ సొరుగులో అంతటా వెదికేడుగానీ తేడా కలవలేదు. కంగారు పడకు, చూద్దాం అంటున్నాడు పాణి, ఇంతలో దూకుడుగా వచ్చేడు వెంకటేశ్వరరావు.

''ఏమాయెనయ్యా! ఓ ప్రెభాకరం... లెక్కకల్సిందా? దొర మళ్లీ పోవాల్నంట... చూపు మంటున్నడు'' పాణినీ, ప్రభాకరాన్నీ చూస్తూనే గ్రహించేడతను ఎమౌంటు టాలీ కాలేదని.

''లెక్క తేలలేదా? చంపినవ్... పో... మేం చేసెటపుడెన్నడన్నా గిట్లయిందా... కొత్త పోరలు... ఒళ్ళు దగ్గిరుంచుకోలేరు గన్ని పైసల్ జూస్తె... ఇటు తే... నే చూస్త...'' ఆ కాయితాలు గుంజుకుని చూసేడు. అతని మొహంలో ఏదో ఆనందం కనిపించింది ప్రభాకరానికి.

ఆ తేడా చూసి, పోయి ప్రకాశరావు చెవిన వేసేడు బేలన్సు సరిపోలేదని. ఆయన అప్పటికే తయారయి, సిద్ధంగా వున్నాడేమో, చరచరా తన బ్రీఫ్‌కేస్ తీసుకుని ప్రభాకరం దగ్గిరకి వచ్చేడు.

సమయం నాలుగున్నరైంది. దక్షిణంవైపు నుంచి వేగంగా వీస్తున్న గాలికి గోడనున్న కేలండరు రెపరెపలాడుతోంది. ఆయన రావడం చూసి ప్రభాకరం లేచి నిలబడ్డాడు.

''లెక్క తేలిందా?'' సూటిగా ప్రశ్నించేడు.

ఆ కళ్లల్లోని కాఠిన్యానికి నోట మాటరాలేదు. స్వరం కంపిస్తుండగా, ''లేదు...!'' అని ఎలాగో




జవాబిచ్చేడు.

"ఏం?... ఏమయింది?... దిమాక్ ఖరాబయ్యిందా... నీకు... వారమంత ఖాళీగానే తిర్గుతవు కదా... ఒక్క రోజు పేమెంటు చేసెడిదాన్కి నీర్సమొచ్చిందా?... ఎంత తేడా వచ్చింది?"

"నాల్గు వందలు"

"నాల్గువందలు... తీసి పెట్టుకున్నవా... నాల్గు తిట్టిపోతే, తిందమనుకున్నవా?... వచ్చి ఆరునెల్లన్నా కాలేదు... అపుడే మింగనేర్చినవే... ఏం చెయ్యాలె... నీ తాత ముల్లెనుంచి ఇస్తవా, నాల్గు వందలు"

రోషం వచ్చింది ప్రభాకరానికి...

"నా జీతంలో కట్ చెయ్యండి సార్!" అన్నాడు.

"ఔ... నీ జీతంలో కట్ జెయ్యాలె... సరె... ఈ నాల్గువందలు గట్లే కట్ జేస్త... రేపు పదివేలు తేడా వస్తే ఏం చెయ్యాలె. నీ ముండ... పౌరుషం మాత్రం తక్వలేదు. జీతంలో తియ్యాలె... లెక్క బరాబర్ మరోసారి చూడు"

ప్రభాకరానికి తటాలున జ్ఞాపకం వొచ్చింది. ఇందాక ఆయన తన గదికి వెళ్ళబోతూ, తన చేతికి ఇచ్చిన పాతికవేల రూపాయల్లో వందకట్ట తను లెక్కపెట్టబోతుంటే, ఆయనే 'ఎందుకయ్యా, ఆలస్యం చేస్తావు. సరిగా వుంది. నే చూసా'ననే సరికి, అలానే దాంట్లోంచి లెక్కపెట్టితాను పేమెంటు చేసేడు...

వెంటనే అన్నాడు పట్టుదలగా...

"నా లెక్క పొరబాటు లేదు. ఒక్క పైసా ఎవరికీ ఎక్కువ ఇయ్యలే... నా జేబులో దాచుకోలే... ఇందాక మీరిచ్చిన వందకట్ట సీల్డ్‌కాదు. రబ్బర్ బాండ్ పెట్టివుంది. దాన్లో తక్కువ వుండాలి. నేను లెక్క పెట్టబోతే, మీరే వద్దన్నారు" ఉక్రోషంగా, నిర్భయంగా అతనలా చెప్పే సరికి,

ఒక్కక్షణం పాటు ప్రకాశరావు కళ్ళల్లో మెచ్చుకోలు కనిపించింది. పెదాలపై కనీ, కనిపించకుండా చిరునవ్వు మెదిలింది.

"ఔరా! వెంకటేసూ... నువ్వేనా యాద్ జెయ్యావేమిరా! గోదావరి ఖన్లో మిల్లర్ డ్రైవర్ నర్సర్‌కి హేండిల్స్ కొనమని నాల్గు వందలిస్తి కదరా! గది చెప్పవేమిరా!" అని మందలించేడు.

అని ప్రభాకరంతో,

"ఆ... నర్సరె... నర్సర్ పేర ఖర్చు రాయి ఆ నాల్గు వందలకూ... తర్వాత వాని దగ్గర లెక్క తీసుకో... పొరబాటొస్తే నిదానంగా ఆలోచించాలె... జీతంలో పట్కో... నోటు రాసిన్త... అట్ల మాట్లాడతారయ్యా... నీకు లోకం తెల్వదు" అన్నాడు.

ప్రభాకరానికి దుఃఖం ఆగలేదు. నలుగురిలో బాగుండదని తల వొంచుకుంటే, కళ్ళ నుండి నీళ్లు గవ్వల్లా జారిపోతున్నాయి.

దొర దగ్గిరగా వచ్చేడు... భుజం మీద చెయ్యి వేసేడు.

"ఊకో... అరె ఊర్కోమంటుంటె... చినపిల గాడివేమయ్యా... ఏడ్వకు... కోట్ల రూపాయల పన్లు తిట్టకుండ, అర్వకుండ అవుతయ్యా... వచ్చేసారి నువ్వు నాతో హైద్రాబాద్ వస్తున్నావు. అక్కడ నీకోసం వేరే లెక్కలు చూసేవని తయారున్నది... పో... పోయి ముఖం గిట్ల కడుక్కో... సిన్మాకి గిన పోతే, అందరు లారీ మీద పొండ్రి... మనమంత ఒక కుటుంబం... నేనేమన్న మీ అమ్మ, నాన్న అన్నట్లే అనుకోవాలె. తప్పు చేస్తే అమ్మ, నాన్న మందలించరా?" సముదాయించి వెళ్ళిపోయేడు ఆయన.

అక్కడకు వచ్చిన తరువాత మొదటిసారి మనసుకు కష్టం కలిగింది ప్రభాకరానికి.

ఆరోజు ప్రభాకరానికి తల్లి దగ్గర్నుంచీ, ఓ దగ్గిర మిత్రుడు నుంచీ, ఉత్తరాలు తెచ్చి ఇచ్చేడు పోస్ట్‌మెన్.

ఆత్రంగా చింపి చదువుకున్నాడు.

తల్లి రాసిన వుత్తరం నిండా అతడిపట్ల ఆమె ప్రేమ, దూరాన ఉన్నందువల్ల ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమన్న హెచ్చరికలతోపాటు, వీలయితే ఒకసారి వచ్చి వెళ్ళమన్న కోరికా వ్యక్తపరిచిందామె. అంతేగాక చెల్లెలు పాలిటెక్నిక్ డిప్లమో పరీక్ష పాసైందనీ, తొందర్లో ఉద్యోగం కూడా వస్తుందనీ తెలిపింది.

కుటుంబ ఆర్థిక సమస్యలు తీరి ఒడ్డున పడతామనీ, తల్లి పడుతున్న కష్టాలకు ప్రతి ఫలం లభించే రోజులు అట్టే దూరాన లేవనీ అనిపించి, ప్రభాకరానికి మనసంతా సంతో షంతో నిండిపోయింది.

మిత్రుడు రాసిన ఉత్తరం క్లుప్తంగా వుంది. దూర ప్రాంతంలో, పరిసరాలకు సర్దుకు పోగలి గినందుకు అభినందిస్తూ ప్రైవేటు ఉద్యోగాల్లో ఉద్యోగ భద్రత వుండదని హెచ్చరిస్తూ వీల యినంత త్వరలో ప్రభుత్వోద్యోగంకోసం ప్రయ త్నం చెయ్యమనీ, బద్ధకించకుండా కాంపిటే టివ్ ఎగ్జామ్స్ రాయమనీ గుర్తుచేసాడు. అతని ఉత్తరంలో కూడా ఉన్న తన ఆరోగ్యానికి సంబంధించిన హెచ్చరికలు నవ్వు తెప్పించేయి ప్రభాకరానికి.

ఈ ప్రాంతానికి వచ్చిన మొదట్లో ఒక నాలు గు రోజులు జలుబు, దగ్గు, జ్వరంతో అతను బాధ పడకపోలేదు. కానీ యువ రక్తం కావ డాన, నిరంతరం పరిశ్రమ కారణంగానూ శరీరం గట్టిపడి, అనారోగ్యం ఆమడదూరం పారిపోయింది.

మిత్రుడు చేసిన హెచ్చరికలు ప్రభాకరం మనసుమీద ప్రభావాన్ని చూపేయి. భావిజీవి తాన్ని గురించి ఆలోచించుకుంటూ, ఆఫీసుగ దిలో ఒక్కడూ పడుకున్నాడు మధ్యాహ్నంవేళ ప్రభాకరం.

పనులన్నీ అప్‌టుడేట్‌గా వుండటంతో, తీరిక చిక్కింది ఆరోజతనికి. స్టాఫ్ అందరూ సైట్‌లో ఎవరి పనుల్లో వాళ్లున్నారు. మధ్యా హ్నం మూడవుతోంది సమయం... ఎవరో లోనికి వచ్చిన శబ్దం వినిపించింది. ఇనుప బిందె బరువుగా నీళ్ళతో కిందికి దించి పెట్టిన చప్పు డైంది. ఎవరో... నీళ్లు పెట్టి పోతారని, అలాగే చలనం లేకుండా పడుకున్నాడు. లుంగీ, బనీను మాత్రమే ధరించి వున్నాడు.

ఇంతలో తన ముఖంమీదకు ఎవరో వంగి,

''ఏం సారూ! తలకాయ నొస్తుండాదా?'' అని అడగ్గానే చప్పున కళ్ళకడ్డంగా వున్న చెయ్యి పక్కకు తప్పించి, లేచేడు. మేస్త్రీ బసవయ్య మరదలు సింగమ్మ అని గుర్తుపట్టేడు.

వారం పది రోజులుగా, ఆ అమ్మాయి తన వంక చూసి నవ్వడం, కల్పించుకుని ఏదో మాట్లాడటానికి ప్రయత్నించడం గమనించినా ఆమె తత్వమేఅది కాబోలనుకున్నాడు. దగ్గ రగా ఆమెను చూసేక, ఆమె రూపం, అతనికి విభ్రమం కలిగించింది. అతనింకా ఆ విభ్ర మంలోంచి తేరుకోకుండానే

''తల రాసేదా? నెప్పి తగ్గుతుంది... మరేం కొల్లబోదులే... సారూ... పండుకో...'' మని చను వుగా అతన్ని వెనక్కి తోసి, నుదుటిమీద బొటనవేలూ, చూపుడువేలితో అడ్డంగా రాయటం ప్రారంభించింది.

'తల నొప్పీలేదు... ఏంలేదు... అవతలకి పో...' అందా మనుకున్న ప్రభాకరాన్ని ఏదో బలహీనత ఆవరించింది. అతనా మాట అన లేకపోయేడు. పక్కనే మోకాలు వేసి కూర్చుని ఆమె అలా రాస్తుంటే, దగ్గరగా లయబద్ధంగా కదులుతున్నట్టున్న ఆమె ప్రాయపు సిరుల వంక దృష్టి నిలపకుండా వుండలేకపోయేడు. సంవత్సరాలుగా మది లోతుల్లో మణిగిపోయు న్న కోరిక విజృంభించి, రక్తప్రసరణ వేగాన్ని పెంచుతోంది.

రెండు పదుల వయసు దాటినట్టున్న ఆ పడుచుపిల్ల ఆ చుట్టూ చూసి దగ్గరలో ఎవరూ లేరని నిర్ధారించుని ప్రభాకరం మీదకి వంగి, చెవుల దగ్గిర నోరుంచి, మెల్లగా అంది

''నాకు నీ మీద మనసుంది. నువ్వేమన్న అంటవేమో అని చూస్తే... ఉలకవు... పల కవు... నేను బాగలేనా... సారూ... నీకిష్టమైతే, రాత్రి మా బావ ఈరోజు దువ్వారాలెత్తిన బిల్డింగుకిరా... మర్చిపోబాకు... పదయ్యేసరికి ఆడుంటాను.. నే పోత... మళ్ళ ఎవురేనా రాగల్రు...'' అని ప్రభాకరం బుగ్గమీద చిన్నగా ముద్దుపెట్టి గబగబా వెళ్లిపోయింది.

ముంచెత్తిన పుష్ప సౌరభానికి మత్తిల్లిన మధుపంలా అయిపోయేడు ప్రభాకరం. కళ్ల ముందు రంగుల లోకమేదో తరంగంలా పరు చుకున్నట్టయింది. నిశ్చేష్టుడై, ఆశ్చర్య చకితు డై, ఎంతోసేపు అలానే వుండిపోయేడు. జల పాతం హోరులో మాట్లాడాలనుకున్నా తన మాట తనకే వినిపించని వాడిలా అయ్యేడు. అంత నిస్సిగ్గుగా ప్రవర్తించిన సింగమ్మమీద అతనికేం ఏహ్య భావం కలగలేదు. కొత్త




లోకపు ద్వారాలు ఏవో తనకోసం తెరుచుకున్నట్టు అనుభూతి చెందేడు.

లేడి పిల్లలా చురుగ్గా కదులుతూ, చకచకా పని పాటలు చేసుకుపోయే సింగమ్మ, కొత్త రూపంలో అతనిముందు కదిలినట్లయింది. బుగ్గమీద చేయివేసి తడుముకునేసరికి వొళ్లంతా, ఎలిక్ట్రిక్ షాక్ తగిలినట్లయిపోయింది. మరొక్కసారి ఆమెను చూడాలనిపించింది. నల్లటి ఆమె మొహంలో, తెల్లగా మెరిసిన కొంటెనవ్వూ, వెడల్పయిన కళ్ళల్లో అల్లరిగా తిరిగే కంటిపాపలూ ప్రభాకరం కంటి ముందు కదలాడేయి.

కాసేపు పోయేక లేచి బట్టలు వేసుకుని, తల దువ్వుకుని, అద్దంలో తన మొహం చూసుకునేసరికి, దాన్లో ఒక కొత్త నూనూగు మీసాల యువకుడెవర్నో చూసినట్లనిపించింది. తనమీద తనకు విశ్వాసం పెరిగింది. వర్క్‌సైట్లోకి పోదామని బయల్దేరేడు.

కొమరయ్యా ఎప్పుడొచ్చేడోగానీ, పొయ్యిమీద నీళ్ళు మరిగిస్తున్నాడు. చెప్పులు తొడుక్కుని బయటకు నడవబోతున్న ప్రభాకరాన్ని చూసి,

"జరసేపు ఆగుసారూ! 'చా' జేస్తన్న... తాగి పోదుగాని..." అన్నాడు. మాట్లాడకుండా గడప ముందున్న మెట్లమీద చతికిలబడ్డాడు.

ఎదురుగా మిట్టమీదనించి, దూరంగా నీలంగా ఉన్న కొండల బారు వరుసగా కంచె పెట్టినట్లు చుట్టూతా, కనుచూపు మేరలో కనిపిస్తోంది. ఆకాశంలో ఒక్క తెల్లమబ్బు పింజైనా లేకుండా నీలంగా, నిర్మలంగా వుంది. ఆ నీలపు ఆకాశంలో తెల్లటి రెక్కలను పూర్తిగా చాచి, నెమ్మదిగా వరుసల్లో ఎగురుతున్నాయి కొంగలు. గాలి వీచకపోయినా, వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. పరిసరాలన్నీ సూర్యకాంతిలో తన్మయత్వం చెందిపోయినట్లున్నాయి. ప్రకృతి పూర్తిగా, ధ్యానంలో మునిగిపోయిన పరమయోగిలా నిశ్చలంగా వుంది.

కప్పులో పోసి కొమరయ్యా ఇచ్చిన టీ నెమ్మదిగా చప్పరిస్తున్నాడు ప్రభాకరం. ఆ పక్కనే నేలమీద కూర్చున్నాడు కొమరయ్యా.

"సారూ!" కొమరయ్యా పిలుపుకు తన పరధ్యానంలోంచి బయటపడ్డాడు ప్రభాకరం.

"ఏంది... కొమరయ్యా?"

"నాకు మూడ్రోజులు సెలవు కావాల్సారూ! ఊర్కి బోయొస్త... మా బాపు కారటు రాసిండు"

"ఎలాగవుతుంది కొమరయ్యా! ఈడ వంటపనెవరు చెయ్యాలె... దొర సుత వస్తడేందో... ఆయనొచ్చినంక పోదువులే"

"అట్లంటి కాదు దొరా! నేను గాడ కొల్వులోకి చేరేముందు పెండ్లయింది. నా పెండ్లమప్పుడు చిన్న పోరి... ఇప్పుడు నేను పొయ్యి దాన్ని తెచ్చుకోవాల్దొరా...! కాదనకుండ్రి"

"అయితే పోదువుగాని... కానీ వంటకు అంత వరకు ఎవర్నయినా పెట్టిపో" అని చెప్పి వర్క్‌సైట్‌లోకి నడిచేడు. హుషారులో చూడకుండాపంచదార డబ్బా తిరగదోసేశాడు కొమరయ్యా.

★ ★ ★

కొమరయ్యా వండిపోయిన వంట ఎవరికి తోచినప్పుడు వాళ్లు తిన్నారు ఆ రాత్రి మెస్ మెంబర్లందరూ.

మొదట్లో అక్కడ భోజనం, అదీ ఏం బాగుండేది కాదు. అన్నం, ఒక కూరా, చారూ మాత్రమే వండేవాళ్లు. పొద్దున్నే టీ, తర్వాత చపాతీలో, లేకపోతే ఉప్మా. అదేదీ కాకపోతే తాలింపు పెట్టిన అటుకులో నాస్తాకింద ఇచ్చేవారు.

నారాయణరెడ్డి మాత్రం ఈ నాస్తాలు, టీలు తీసుకునేవాడుకాదు. మూడుపూట్లా అన్నమే తినేవాడు. వంటవాళ్ళంటూ ప్రత్యేకంగా ఎవరూ వుండేవారు కాదు. మిగతా పనులేవీ అంత బాగా చెయ్యలేని వాళ్ళనెవ్వర్నో ఎంచుకొని, వాళ్లచేత వంటపని చేయించుకోవలసి వచ్చేది. ఆడవాళ్ళని వంటకి పెట్టడానికి వీల్లేదని, వాళ్ళు తనముందుకి వడ్డనకిగానీ, గదులు ఊడ్చటానికిగానీ పంపకూడదని ఏనాడో ప్రకాశరావు స్టాండింగ్ ఆర్డరు పాస్‌చేసినట్లు విన్నాడు ప్రభాకరం.

నెలంతా సరిపడే రేషన్ వెంకటేసం కొట్లో తెచ్చుకోవడం నెలకోసారి పేమెంటు అప్పుడు మెస్‌బిల్ పేరుతో ఆ డబ్బు రాసి తీసుకు

పోయి వెంకటేసానికివ్వడం చేసేవారు. ప్రతీ నెల, మెస్ బిల్, ఇరవై, ముప్పైరూపాయల తేడాతో సరిపోతే దొర పట్టించుకునేవాడుకాదు. ఏ కారణంవల్లనైనా వందరూపాయలు వరకు తేడా వస్తే మాత్రం తిట్టేవాడు. ''తిండికెక్కువ పనికి తక్కువ'' అని. ప్రభాకరాన్ని మెస్ మేనేజి చెయ్యమన్నప్పుడు మెస్‌లో తినే మెంబర్లు తలకొక్కటికీ, నూట యాభైరూపాయలు దాటి బిల్ పెరగనివ్వద్దన్నాడు.

ప్రభాకరం మెస్ తన చేతుల్లోకి రాగానే కొన్ని మార్పులు చేసేడు. అంతవరకూ పాలడబ్బాలతోనే టీ చేస్తుండేవారు. ప్రభాకరం డబ్బాలు కొనడం తగ్గించేడు. సైటును ఆనుకునే వున్న బుల్లెబ్బాయి అనే రైతు దగ్గిర పాలు వాడిక పెట్టేడు.

బుల్లెబ్బాయి కృష్ణాజిల్లానుంచి పొట్ట చేత్తోపట్టుకుని, ఇటువైపు వచ్చాడు. కారు చవగ్గా భూములుకొని, బేంకులోనుతో బావి కొట్టించి, మోటారుపెట్టి వ్యవసాయం ప్రారంభించి బాగుపడ్డాడు.

అంతవరకు ఎటువంటి వ్యవసాయ వద్ధతులు లేని ప్రాంతం అది. పండితే జొన్నల్లో, గంట్లో పండించేవారు. లేకపోతే ఉనూరు మంటూ, కూలీ, నాలీ చేసుకునేవారు. పది, ఇరవై ఎకరాల భూమున్న ఆసాములైనా సరే!

ఒకసారెప్పుడో కొమరయ్య చెప్పేడు. 'జమ్మికుంట' అవతలెక్కడో వాళ్ళ ఊరుందని, అక్కడ తమకు ఇరవైమూడెకరాల భూమున్నా మేకల మేత కూడా దొరక్కపోవడంతో, గడిచే దారిలేక నౌకరీకి ఇటువైపు వచ్చేనని... అప్పుడు ప్రభాకరం ఆశ్చర్యపోయాడు.

బుల్లెబ్బాయి దగ్గిర తనకోసం ప్రత్యేకంగా పెరుగు వాడిక పెట్టుకున్నాడు ప్రభాకరం. అతనికి ఇద్దరు కూతుళ్లు. పెద్దకూతురు, అల్లుడు, బుల్లెబ్బాయి వ్యవసాయ పనుల్లో సాయపడుతుంటారు. రెండోకూతురు పెళ్లైనా భర్తతో సరిపడక, తండ్రి దగ్గిరే వుంటోంది. పుష్టిగా, కాలు బారుగా వున్న ఆమెను ఒకటి రెండుసార్లు, వాళ్ల ఇంటికి పోయినప్పుడు చూసేడు ప్రభాకరం. ఆమెమీద అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. బొత్తిగా కారెక్టర్ లేని ఆడదని, ఆమె వలలో పడిన మగాడు, ప్రపంచాన్ని ఎడంకాలితో తన్నిపారేసేవాడిలా ప్రవర్తిస్తాడనీ, ఆమె 'మరులు మందు' ప్రభావానికి గురై ఎందరో జీవితాల్ని నాశనం చేసుకున్నారనీ అంటారు. రంగారావు ఆ అమ్మాయి ఆకర్షణలో పడిపోయేడని, అందరూ అతన్ని తీవ్రంగా మందలించేరు. కానీ అతనెవరి మాటా చెవిన పెడుతున్నట్టు లేదనిపించింది ప్రభాకరానికి.

అక్కడ వర్కర్స్‌కాలనీ కట్టడానికి కొంత భూమి బుల్లబ్బాయినించి కొనవలసి వచ్చింది సింగరేణి యాజమాన్యానికి. ముందు వప్పుకోకపోయినా, తరవాత తన అల్లుడికి ఉద్యోగం వేయించుకుని, తనకు కావలసినంత ఉంచుకుని మిగతాది అమ్మేసేడు. వర్క్ సైట్‌కీ, తన భూమికీ మధ్య కంచె వేసుకున్నాడు.

కంచె అవతల బావి, బావిదగ్గర గుంపుగా అరటిచెట్లు, ఒక గున్నమామిడిచెట్టూ ఉన్నాయి. నాలుగైదు ఈత చెట్లు కూడా ఉన్నాయి. మధ్యలో గడ్డినేసిన బుల్లెబ్బాయి ఇల్లూ, చుట్టూ కూరపాదులతో, పచ్చగా వున్న ఆ వాతావరణం చూస్తూంటే, నడివేసవి కాలంలో, కూజాలోంచి వంపుకుని చల్లటినీళ్లు గ్లాసెడు తాగినట్టూ, ఎడారిలో నడిచి, నడిచి, దాహంతో అలమటిస్తున్నవాడికి, ఒయాసిస్సు కళ్లముందు ప్రత్యక్షమయినట్లూ వుంటుంది.

రాజయ్యని దొర వన్లోంచి తీసేసిన తర్వాత రెండురోజులు స్టాఫంతా, తిండికి నానా బాధలూ పడాల్సివచ్చింది. పొద్దున్ననగాలేచి వాడు వడేసిందేదో ఇంతతిని సైట్లోకి పనికి పోయేవారు. పన్నెండున్నరకల్లా కడుపులో పేగులు కరకరలాడుతూ వుంటే, ఆవురావురుమంటూ, తినడానికి వచ్చేసరికి, వుడికీ, ఉడకని, రుచి సరిగ్గా లేని తిండేదో ఒకటి సిద్ధంగా వుండేది. రాజయ్యని తిట్టుకుంటూనే, గబగబా కడుపు నింపుకునేవారు. రాములుకి కూరలో కారం ఎక్కువ ఉండాలి. లేకపోతే గిన్నెలు కోపంగా విసిరేసి, నానాహంగామా చేసేవాడు. రాజయ్యని బండబూతులు తిట్టేవాడు. మిగతావాళ్లు అతన్నేం అనలేకపోయేవారు.

దొర వెళ్లిపోగానే, వెంకటేశ్వర్రావు వంటవాళ్లెవరూ అంత త్వరగా దొరకరని చెప్పి,




# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

మార్చి 'చతుర' నవల పయనం

..................................................

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

ప్రభాకరంతో మిగిలిన వాళ్ళనడిగి, సైటు మనుషుల్లో ఎవరితోనో వంట చేయించమని చెప్పి, కాసేపుండి తానూ వెళ్లిపోయేడు. ప్రభాకరం, మిగిలిన వాళ్ళద్వారా వాకబు చేయిస్తే ఎవరూ లేరని తెలిసింది. కిందమీదవుంటే పాణి ఓ మేస్త్రీని పిలిపించేడు. అతను ముందు కాదన్నా పాణిమాట తీసెయ్యలేక, తన అక్క కొండమ్మని పంపించడానికి ఒప్పుకున్నాడు. ఆమెకి నలభైఅయిదేళ్లుంటాయి. మళ్లీ ప్రకాశరావు రావడానికి పదిహేనురోజుల పైనే పడుతుంది. గనుక, ఈ లోపున ఇంకో వంటవాణ్ణి వెతుక్కోవచ్చని నిర్ణయించుకున్నారు.

రోజూ కొంతమంది ఆడకూలీలను మస్తరు ప్రకారం వేసుకుని వాళ్లకి ఇనుపబిందెలు ఇచ్చి పంపేవారు. వాళ్లపని పొద్దున్నుంచి సాయంత్రంవరకు గోడలను, తడపటం, అలా రోజంతా క్యూరింగ్ చేసినందుకు వాళ్లకి దిన సరి ఆరురూపాయల కూలీ ఇచ్చేవారు. ప్రతీ పేమెంటుకీ వాళ్ళకి డబ్బిచ్చేవారు. కొండమ్మ అలా క్యూరింగ్‌చేసే వాళ్లల్లో ఒకర్తె. మిగిలినవాళ్లు వయస్సులో వున్న స్త్రీలవ్వడంచేత, ఎటు పోయి, ఎటు వస్తుందో, అని వాళ్ల వాళ్లెవరూ వంటపనికి అంగీకరించలేదు. చివరికెలాగో కొండమ్మ పనిచేయడానికి ఒప్పందం కుదిరింది. వంటచేసిపోతే చాలు కూలిచ్చేస్తాననీ, మరేం ఇతరపని ఆమె చెయ్యక్కర్లేదనీ ప్రభాకరం ఆమెతో చెప్పేడు. అందుకు వెంకటేశ్వర్రావు కూడా ఒప్పుకున్నాడు.

కొండమ్మకీ అంతంత మాత్రంగానే వంటొచ్చు. అయినా రాజయ్య వంటమీద ఆమె వంట మెరుగ్గానే వుండేది. ప్రభాకరం దగ్గరుండి, ఏదో ఒక పప్పు, కూర, సాంబారు వండించేవాడు. వంటలో కొన్ని మెలుకువలు అతనికి తెలుసు. ఆమె అతని సూచనల ప్రకారం వంటచేసేది. అలా ఆమెచేత ఓ పదిరోజులు వంట చేయించేసరికి కొండమ్మకి క్యూరింగ్ పనికన్నా వంటపనే కష్టమని పించింది. క్యూరింగ్ లేబర్ అయితే, నాలుగు బిందెలు చకచకా రెండుగోడలమీద దిమ్మరించి, ఏ గోడచాటునో, మిగిలిన వాళ్ళతో కబుర్లాడుతూ కూర్చోవచ్చు.

ఇంచుమించుగా, అదే సమయానికి 'కొమరయ్య' ఏదోపని ఇప్పించమని సైటులోకి వచ్చి ప్రభాకరాన్ని అడిగేడు. ముప్పై ఏళ్లకన్న లేని అతన్ని చూడగానే ప్రభాకరానికి, కొండమ్మ వంటపని మానేస్తాననంటున్న విషయం జ్ఞాపకానికొచ్చింది. అతని ఊరూ, పేరూ, తెలుసుకున్నాడు. ఏపనైనా వొళ్లువంచి చేస్తానని అతడన్నాక, 'వంట పనొచ్చా' అని అడిగేడు ప్రభాకరం.

గొర్రెలమంద కాపుకి వెళ్లేటప్పుడు, అందరికీ వండిపెట్టేవాణ్ణని చెప్పేడు కొమరయ్య. 'సరే... ఎలాగైనా తాను చెప్పి చేయించుకోగలను' అనుకున్న ప్రభాకరం, అతణ్ణి వంటమనిషిగా కుదిర్చేడు నెలజీతంమీద. వాడు వంట మనిషిగా చేరిన రెండురోజులపాటు, ప్రభాకరం వాడికేం చెయ్యాలో, ఎలా చెయ్యాలో వివరంగా చెప్పేడు. కొమరయ్య చెప్పగానే అందుకునే చురుకుతనం వున్నవాడు కావడంతో, వంటపనిలో బాగా ఇమిడిపోయేడు. స్టాఫంతా ఇన్నాళ్లకి మంచి వంట తినగలుగుతున్నాం అని సంబరపడ్డారు. సన్నగా, రేకుల్లా వాడు చేసే చపాతీలు, ప్రభాకరం ఎంతో ఇష్టంగా తినేవాడు. వాడు కూడా తనకి, తోవ కల్పించేడన్న కృతజ్ఞతతో ప్రభాకరాన్ని బాగా చూసుకునేవాడు.

ఆలోచనలతో ఆఫీసు రూమ్‌లోకి అడుగుపెట్టేడు ప్రభాకరం. మిగిలినవాళ్లంతా తీరిగ్గా కూర్చుని బాతాఖానీ వేస్తున్నారు. ప్రభాకరం కూడా వాళ్లతోచేరి ఏదో మాట్లాడుతున్నాడు. కానీ, మనసంతా డోలాయమానంగా వుంది. అతన్లో సంఘర్షణ చెలరేగుతోంది. మరో గంటలో ఎదురవ్వబోయే, తొలిసారి స్త్రీ సుఖాన్ని అందుకోవాలో, మానుకోవాలో తేల్చుకోలేకపోతున్నాడు. నల్లగా వున్నా సింగమ్మ మొహంలో చెప్పలేని ఆకర్షణేదో, అతని మనస్సును పట్టి లాగుతోంది. కొంటెగా, కదులుతున్న ఆమె కళ్లూ, నవ్వులూ, అతన్ని గాలంవేసి లాక్కుంటున్నాయి. అతనికేమీ తినాలని పించలేదు.

"గురూగారేదో పరాగ్గా ఉన్నారు!"

"ఏందోయ్! ప్రభాకరం... రంగారావు ఏదో



అంటున్నాడు... విన్నావా?''

''ఏమంటున్నాడు?'' ఈ లోకంలోకి వచ్చి అడిగేడు.

''వాడు కొలువుమానేసి వాళ్లూరు బోత డంట!''

''ఏం? ఏమైందట?''

''వాళ్ల కాక కబురు చేసిండు. మన రామ్లు గానితో... బొగ్గుబాయిల పైరవీకారుడొకడు ఆయన కేర్నాటనీ, కొన్ని పైనల్ కడితే, తట్ట మోసే నౌకరీ ఇప్పిస్తడనీ... కనక ఆలీసం చెయ్యకుండా రమ్మనమనీ చెప్పిండంట''

''నీ నశీజ్ మంచిగున్నది రంగరావు... పర్మ నెంటు కొల్వు దొర్కుతది పోరాదే. నాకుగిన అట్లిచ్చెటోడుంటె భూమి అమ్మి మరీపోత... థూ... ఈ బాడ్కావు నౌకరీకంటె అదె మంచిది. మస్తు పైనలొస్తయ్'' రాంపూర్‌నుండి వచ్చిన అశోక్ అన్నాడు.

''గట్లనే అంటవ్.... ఆ కొల్వు జేస్తున్నవాల్ల నడిగితెగాని గదెంత కష్టమో తెల్వదు. బాయి లోపల్కి దిగేతల్కి పేణం చాలొస్తది. ఎప్పుడు చస్తమో, బత్కుతమో తెల్వదు. మొన్న టూ ఇంక్లైన్ దగ్గర నల్గురు చచ్చిలే. దినాము గండమేనాయె... బత్కు తల్లిని కుక్కలుదిన'' కరీముల్లా అశోక్ మాటలకంగీకరించలేదు.

రంగారావు మొహం దించుకుని కూర్చున్నా డు. అతని మనస్సులో ఏం మెదులుతోందో తెలియటంలేదు.

ప్రభాకరం కాసేపు సాలోచనగా చూసేడు. బతికిచెడిన ఆ దొరలకుటుంబం కుర్రవాడు జీవితం నాలుగురోడ్ల కూడలి మధ్య నిలబడి ఏ తోవ తన్ను గమ్యాన్ని చేరుస్తుందో, తేల్చుకో లేక నలిగిపోతున్నాడు.

''రంగారావు... మీరెంతమంది?'' ప్రభా కరం అడిగేడు.

''నేను, ఒక తమ్ముడు, చెల్లె...'' తల ఎత్తి ప్రభాకరం మొఖంలోకి దేనికోసమో ఆశగా చూసేడు.

''తమ్ముడేం చేస్తున్నడు?''

''తమ్ముడు ఏడవతరగతి చదువుతుండు. నా లెక్కగాదు. నాకు సదువురాలే. వాడు అట్లగాడు. మంచి హుషారు. మా స్కూల్‌సారు వాడు మంచిగ సదివి పెద్ద ఉద్యోగం జేస్త డంటుంటడు''

తమ్ముడి గురించి చెప్పేటప్పుడు గర్వంగా ఫీలయ్యాడు రంగారావు.

''చెల్లె పెండ్లికుందా? చిన్న పోరా...?''

''ఔ... పెండ్లికే ఉంది. మా యవ్వ దాని కోసం బెంగపడుతాంది. ఈ ఏడు చేద్దామన్నా డు మా నాయ్న...'' దిగులుగా అన్నాడు.

''యవసాయం ఉన్నదా?''

''చాలా తక్వ ప్రభాకరం...! తిండిగింజలు మల్లరావు. మా బూములన్నీ మా పెదనాయన అమ్మి జల్సా చేసేసినాడు. నాన్నకు నోట్ల నాల్కలేదు''

''నీకు నౌకరీ, నీ కాకేకద ఇప్పిస్త నంటుండు?''

''ఔ... పైనల్ మల్ల ఆయనే కట్టిపిస్తడంట. బదులువాని బామ్మర్ది కూతుర్ని పెండ్లి చేసుకో వాలంటుండు. మా నాన్న మల్ల అట్లే జేయ మంటున్నడు. నాకైతే ఏదీ మనసున పడ్తలే దు''

''ఒకపని చెయ్యి నువ్వు రేపు దొర రాంగనే ఊర్కి పోయొస్తనని చెప్పి పో. మీ కాక చెప్పెడి దేందో పూరా విను. పైరవీ చెయ్యనీ బాయిలో నౌకిరీ. నీ పేరుమీదిసైనే చేస్తానని చెప్పు వేరొకని పేరుతో జెయ్యనను. గదంతా పక్క అయినంకనే, నౌకిర్లో చేరినంకనే పెండ్లి అని చెప్పు. నౌకరీ వచ్చినంత వర్కు నువ్వుగాని, మీ నాయనగాని ఒక్క పైన యియ్యకండి. నువ్వు కొలువులోచేరి జాగ్రత్తగా వుంటే, నీ తమ్ముడి చదువు, చెల్లె పెండ్లి మంచిగ చెయ్యొచ్చు...''

ప్రభాకరం అక్కడకు వచ్చేక తన భాష కూడా మార్చుకున్నాడు. అన్ని ప్రాంతాలవా ళ్లూ, సుమారుగా వున్న ఆ సైటులో, మొదట్లో తన ప్రాంతీయం, వాళ్లకి అర్థంకాక, వాళ్ళ వాడుక పదాలు, ఉచ్చారణ తనకర్థంకాక, నాలుగైదు సందర్భాల్లో ఇరుకునపడ్డాడు. తర్వాతర్వాత, వీలయినంతవరకు, వాళ్లువాడే పదాలనే వాడటం నేర్చుకున్నాడు.

మాట్లాడుతూనే నారాయణరెడ్డి నిద్రలోకి జారిపోయేడు. వెంకట్రావు, రాములు, కరీము




ల్లా బయల్దేరి గోదావరిఖనికి సినిమాకి పోయేరు. రంగారావు, అశోక్‌లు కూడా నిద్రపోతున్నట్లున్నారు. పాణి మంచంమీద బోర్లా పడుక్కున్నాడు. అతను నిద్రపోతున్నాడో, లేదో ఆ ఆరుబయట లేత చంద్రకాంతిలో ప్రభాకరం గుర్తించలేకపోయేడు. నెమ్మదిగా లేచి అక్కడ నుంచి ఇవతలకి వచ్చేడు. సమయం దగ్గర దగ్గరగా పదవుతోంది.

తలెత్తి పైకి ఆకాశంలోకి చూసేడు.

ఆకాశంలో నెలవంక, తెల్లగా తేలుతూన్న మబ్బుల మధ్య దోబూచులాడుతోంది. వెన్నెల చాలా తక్కువగా ఉంది.

మేస్త్రీల గుడిసెల్లో ఎక్కడా అలికిడి వినిపించడంలేదు.

వరుసల్లో ఉన్న బిల్డింగులు మవునంగా కళ్లు మూసుకుని తపస్సులో మునిగిపోయిన మునుల్లా వున్నాయి.

ఉండీ, ఉండీ మేస్త్రీలెవరిదో పెంపుడుకుక్క మొరుగుతోంది. ప్రభాకరంలో ద్వైదీభావం తొలగిపోయింది.

సంస్కారాన్ని కాంక్ష లొంగదీసుకుంది.

నెమ్మదిగా కుడివేపు కనిపిస్తున్న బిల్డింగుల వరసలవైపు నడిచేడు. నడుస్తున్న ప్రతీ అడుగూ అతన్ని ఉద్రేకపు మడుగులో మునకలు వేయిస్తోంది.

ఉత్తరంవైపునించి, దక్షిణంవైపు మొత్తం పదకొండు వరసల్లో పదేసి బిల్డింగులు వున్నాయి మరో మూడు వరసల్లో పాతికవున్నాయి. మిగిలిన బిల్డింగులు, ఆఫీసు బిల్డింగు వెనుకవేపు వరుసగా వున్నాయి. మొత్తం కట్టడాలన్నీ 'ఎల్' ఆకారంలో వున్నాయి వర్క్‌సైట్‌లో.

బసవయ్య చేస్తున్నవి తొమ్మిది బిల్డింగులు. అవి మేస్త్రీల గుడిసెలకి దగ్గరగా వున్నాయి. అతని వరుస బిల్డింగులు తర్వాత మరో నాలుగు వరసల్ని దాటితే, మేస్త్రీలు గుంపుగా వేసుకున్న గుడిసెలు వస్తాయి. సాధారణంగా పగలంతా పనిచేసిన మేస్త్రీలు, పనికాగానే తమ కోసం బుల్లెబ్బాయి అమ్మే కల్లు పట్టించి, ఇంతతిని పడుక్కుంటారు. మళ్లీ కోడి కూస్తేనే వాళ్లు నిద్రలేచేది.

బసవయ్య బిల్డింగులవరకూ వచ్చి ప్రభాకరం ఒక్క లిప్తకాలం ఆగేడు. బసవయ్య ఆ సాయంత్రమే తన బిల్డింగుల్లో చివరిదానికి, ద్వారబంధాల్నెత్తి పెట్టి, సర్వీబాదులతో సపోర్టు చేసి నిలబెట్టేడు. మర్నాడు ఇటుక కట్టవచ్చని.

వీలయినంత నిశ్శబ్దంగా, ఆ బిల్డింగుల మధ్యకి చొరబడ్డాడు. కిటికీలింకా ఎత్తని ఆ బిల్డింగు దగ్గరకి వచ్చేడు.

దూరంగా ఎక్కడో వాచ్‌మేన్ తిరుగుతున్నట్టు టార్చికాంతి తెలువుతోంది.

ఆ బిల్డింగు దగ్గర నిలబడ్డ ప్రభాకరానికి ఒక్క తృటికాలం వెనక్కి తిరిగిపోవాలనిపించింది.

ఇంతలో కిటికీ ఖాళీలోంచి ఓ చెయ్యి అతన్ని ఆపింది.

''ఇటు... ఇటురా... సారూ...'' అన్న పిలుపు గుసగుసగా వినిపించింది.

మంత్రబద్ధుడిలా ప్రభాకరం కిటికీ ఎక్కి లోపలకి దిగేడు.

అతను లోపలకు అడుగుపెడుతూనే, ఆమె అతన్ని ఎక్కడా సందులేకుండా, అల్లుకుపోయింది.

ప్రభాకరం గుండె గతితప్పిపోతోంది. భావావేశంతో ఒళ్లు వణికిపోతుంటే వణుకుతున్న చేతుల్ని ఆమె వెనుకవేసి తన దగ్గరగా హత్తుకున్నాడు.

తన ఎదమీద మెత్తగా ఒత్తుకుంటున్న ఆమె వక్షం, అతణ్ణి తమకంతో పిచ్చివాణ్ణి చేస్తోంది. తల కిందికి దించిన అతనికి, ఆమె తన పెదిమలను అందించింది. మత్తుగా మూలుగుతోంది ఆమె.

''ఎప్పట్నుంచో నీ మీద ఆశ పెట్టుకునుండాను. నేపిలిస్తేగానీ నువ్ రాలేదు... నేపోతానుండు'' గునుస్తూ వెనక్కి జరగబోయింది.

ఆమెను కదలనీకుండా తన పట్టు బిగించేడు ప్రభాకరం.

ఆమె నెమ్మదిగా... కింద ఎర్రమట్టి వేసి దిమిసాకొట్టిన నేలమీదకి వాలి, అతణ్ణి తనమీదకు లాక్కుంది.

ఒక్కసారి అతడికి మరో ప్రపంచలోకి అడుగుపెట్టిన భావన కలిగింది.

పైనుంచి నెలవంక, తెల్లమబ్బునొకదాన్ని అడ్డుపెట్టుకొని, వారిరువురివంకా దొంగచూపులు సారిస్తోంది.

నక్షత్రాలు తెల్లబోయి చూస్తున్నాయి.



**దడ**... దడ్‌మని మోటార్‌సైకిల్ చప్పుడు మిట్ట అవతల వినిపించింది. అంతవరకు ఆఫీసురూములో చేరీ హస్కు కొడుతున్న రాములు, అశోక్ ఒక్కసారి కంగారుపడి లేచి సైట్లోకి వరుగుతీసేరు.

వెంకటేశ్వర్రావు మహాదూకుడు మనిషి. నోటికొచ్చినట్లల్లా కేకలు వేస్తాడు, పగటివేళ ఎవరైనా రికామీగా కనిపిస్తే.

వెంకట్రావు వక్కనే ఉన్న కార్పెంటర్ల షెడ్‌లోనికి పోయేడు కర్రపని గురించి తెలుసుకోడానికి. ఇటుక బట్టీల పని అయిపోయేక వెంకట్రావుకి కర్రపని ఆజమాయిషీ అప్పగించేరు.

పాణి మాత్రం తీరిగ్గా అద్దంముందు నిలబడి తల దువ్వుకుంటున్నాడు. ఆ రోజెందుకో గాని నీట్‌గా డ్రస్ చేసుకుని ఉన్నాడు పాణి.

రాజ్‌ధూత్ స్టాండువేసి ఒక్క అంగలో లోపలకొచ్చేడు వెంకటేశ్వర్రావు.

పాణిని చూస్తూనే కోపంగా అరిచేడు.

"ఏమోయ్... లాట్‌సాబ్! నీకేమైన బుద్ధుందా లేదా... గింతవర్కు సైటుమీదకి పోలేదు. పెండ్లి పిల్లోడి లెక్క తయారయినవ్. మాసిగ్గు తీయడానికొచ్చినవ్. ఈ దినం చీఫ్ ఇంజనీర్ వస్తాడని తెల్వదా. ఆ లంగముండకొడుకులు ఎట్లెట్లో కట్టిపడేస్తరు. దొర ఇజ్జత్, నా ఇజ్జత్ పోతది. నీకేం గాదు. గంతెకదా! తియ్ పో. నేపోత... సైట్లకు" గిరుక్కున వెనక్కు తిరిగేడు.

"ఎందుకంతగనం కేకలు వెట్టుడు. నేను నిన్న పొద్దుమీకి చెప్పినా, పార్టీషన్ గోడలు మాత్రం ఈ దినం కట్టుమన్నా. సర్వర్‌కి చెప్పి సున్నం లెక్క బరాబర్ చూడమన్నా. రెడ్డి అక్కణ్ణే వున్నడు. కరీముల్లాతోపాటుగా అశోక్ మల్ల క్యూరింగోల్ల ఎన్కనేవున్నరు, నేనిప్పుడు పోతున్నకదా. మీరు పోయేంజేస్తరు?" అంటూ బయటకి కదిలేడు.

అతన్ని మరేం అనలేకపోయాడు వెంకటేశ్వర్రావు.

"ఓయి వెంకట్రావు! షరాబోల్ల మొగుడా! ఏడమునిగినవయ్యా!" అని గుమ్మం దగ్గిరకు పోయి కేకపెట్టేడు.

వెంకట్రావు వచ్చేడు.

"ఎందుకా లొల్లి! ఏం సంగతి..." అనడిగేడు చురుగ్గా చూస్తూ.

"కర్ర సంగతేంది? సరిపోతదా. లేకుంటె ఎంత పడ్తది. ఎన్ని ద్వారాలుండాలె. ఎన్నయినయ్. ఏమన్న లెక్కున్నదా? లేక ఊకె అల్లు జేస్తావుంటె నువ్వు చూస్తావుంటవా?"

"అల్లు జేసెడిదేంది? నేను చూసెడిదేంది. గవన్నీ తాశీల్ మాటలు. నా కాడొద్దు వెంకటేశ్వర్రావు. ఎవర్నయిన అను. గానీ నా జోలికి రాకు. నా పని బరాబర్. నేనేం ఇయ్యాల, రేపు ఈ పన్లోకి రాలే. నీ లెక్కనే నేనూ పనికి పాతోడినే. ఎనిమిదేండ్ల కొల్వు నాది దొర దగ్గిర. మొన్న దొరచ్చినపుడే, నే మాచెప్పినా కర్ర హిసాబు. పది దినాల్లో బల్లార్షానించి కర్ర తేకపోతే మేస్త్రీలు లేచిపోతరని. ఆయన ఇంట లేడు. ఈ షరాబులు గిన లేచిపోతే, మరి నేను తెచ్చెడిదిలేదు. దువ్వారాల్లెక్కడిగినవ్‌కదా! ఈ బుక్కులో నిన్న సాయంత్రంవరకు, ఏ మేస్త్రి ఎన్ని చేసిండో లెక్కున్నది. జూడు... పో... తాశీల్ పని... తాశీల్ రుబాబ్!" చేతిలోని నోటుబుక్కు టేబులుమీద పడేలా విసిరిపడేశాడు కోపంగా.







"ఎవరితో మాట్లాడ్తమన్న నక్కగ లేరేమయ్యా! అందర్కి కోపాలయితే పని జరగొద్దా? నీకు చిరాకు. నీ తమ్మునికి వరాకు. ఈ ప్రభాకరం దొర దగ్గిర మంచిగ మాట్లాడతడు. నాకాడ నోరే మెదవడు. ఎట్లనో సెయ్యండి. నేనొక్కసారి సైట్లకు బోయొస్త. దొర, ఇంజనీర్ సాబ్‌ని తోలుకువొస్తడు. సైట్ల ఏమన్న గలతుంటే నా ప్రాణం దీస్తడు. ప్రభాకరం తినేందుకు తాగేందుకు ఏదన్న ఇంతజామ్ చెయ్యి" అని గబగబా సైటువంక పోయేడు.

వెంకట్రావు చప్పుడు చేస్తూ, కుర్చీ ముందుకు లాక్కుని టేబులుమీద చేతులు పెట్టుకుని రిలాక్సవుతున్నాడు.

"ఈనో పెద్ద పీకుడుగాడు. ఉట్టపుడు దినాం సైట్ల మనం జస్తావుంటే, రెండ్రోజులకో, మూడ్రోజులకో ఓసారొస్తడు. పనంతా తానే చేయిస్తున్నట్టు బోడిరుబాబ్ చెలాయిస్తడు. ఈన దంద, గాసూర్యనారాయణ దంద, నాకు మా ఏర్పాటె. నాకెందుకని ఊకుంటుంటె, నామీదే చలాయిస్తుండు" కోపంగా అన్నాడు.

సిమెంటు స్టాకు, ఇండెంట్లు ప్రకారం సరి చూస్తున్న ప్రభాకరం వెంకట్రావు మాటల్లో, వెంకటేశ్వర్రావు మీద అతనికెందుకో ఆగ్రహం వున్నట్టు గ్రహించేడు.

"ఔగానీ... వెంకట్రావు నాకొక్క సంగతి చెప్పుతావా? మన లారీలు, రాత్రి సైటుమీద కాకుండా, గోదావరిఖనిలో ఎందుకుంచుతున్నరు? ఎవరుంచమన్నరు?"

"అడిగినవా? నీకు మల్ల తెల్సిందన్న మాట...? ఎవరుంచమన్నరు. వెంకటేశ్వర్రావే వుంచుతనన్నడు. ఊర్ల వాని ఇంటిముందయితే, భద్రంగా వుంటయ్యంట. అదీగాక పొద్దున్నే క్వారీ ట్రిప్పు తొందరగాయితదంట. దొర వద్దనే అన్నడు. కానీ ఆయనెన్నెట్లో నుదరాయించిండు. ఎందుకో నీ కేర్పాటైనదా?"

"నాకు నరిగా తెలవదు" కారణం పూర్తిగా అర్థంకాలేదుగానీ, ఏదో దుర్వినియోగం కోసం అని మాత్రం గ్రహించేడు ప్రభాకరం.

"నాకు బాగా తెలుసు. రాత్రి లోకల్ ట్రిప్పులు ఏపిస్తడు. ఆ పైసల్ తీసుకుంటడు. నారాయణ కూడా దొంగే. వీళ్లకుతోడు ఆ డ్రైవరు బసవరావు జతయిండు. రాముల్కి తెలిసినా వాడు చెప్పడు. వానికేదో ముట్టజెప్పుతరు"

నిర్ఘాంతపోయేడు ప్రభాకరం. నమ్మలేకపోయేడు. కానీ ఒక్కొక్కప్పుడు లారీలు చాలా లేటుగా రావడం, డ్రైవరుకి ఒంట్లో బావుండదన్న నెపంతో ఒక్కోరోజు అసలే రాకపోవడం అతనికి జ్ఞాపకంల్లో మెదిలాయి. మునుపట్లా ట్రిప్పులుతిరక్కపోయినా డీజిల్ వాడకం పెరుగుతోందిగానీ, తగ్గటంలేదు. ఆ విషయం ఒకసారి అతను నారాయణరావునడిగితే "బండ్లు బోరకచ్చినయ్. గందుకే డీజిల్ ఖర్చవుతాంది ప్రభాకరం" అని అతడు బదులిచ్చేడు.

వెంకట్రావు మాటలు, ప్రభాకరంలో అనుమానాన్ని పెంచేయి. విషయం మొత్తం తెలుసుకోవాలని లోలోపలే తీర్మానించుకున్నాడు. పచ్చనిచెట్టులా శాఖోపశాఖలుగా జరుగుతున్న నిర్మాణ ప్రక్రియలో మూలాన్ని వేరుపురుగులు తొలుస్తున్నట్లు భావించేడు.

వెంకట్రావు లేచేడు.

ప్రభాకరం కూడా లేచేడు దొరకీ, వచ్చే ఇంజనీరుకూ ఆతిధ్యపు ఏర్పాట్లు చేయించడానికి.

"అవును...గానీ, వెంకట్రావ్! ఇంజనీరు సైటు ఇనస్పెక్షన్ చేసినంక, చెడ్డగా రాస్తే, ఏమయితది?" ఆసక్తిగా అడిగేడు ప్రభాకరం.

వెంకట్రావు నవ్వేడు.

"ఏంది చెడ్డగా రాసేది. రాసేందుకేం లేక గాదు. రాయలేరంతే. దొర రాయనియ్యడు కూడా. దొర ఎన్క ఆయ్న సైట్ల తిరుగుతడు. సున్నం సాంపిల్సు తీసుకుంటడు. ఇటుక కట్టుడు ఛూసి, ఏవో రెండు మూడు బిల్డింగులు బాగలేవంటడు. క్యూరింగ్ చెయ్‌పిస్తలేమంటడు. దొర, ఆయన ముందుగాల అందర్ని నాల్గు తిడుతడు. వొచ్చినాక దొర గదిలోకి పోయి తిని తాగి ఆయనిచ్చింది తీస్కపోతాడు. గంతె... గంతకంటె మరేంకాదు"

ప్రభాకరం వింటూవుండిపోయాడు.

వెంకట్రావే మళ్లీ అన్నాడు... "బాగా పెద్ద ఇంజనీర్లు వొస్తే, దొర అమ్మా బాబూ అంటూ ఎనకాలె తిరుగుతాడు. ఆళ్లేమన్నా అన్నా నోరు మూస్కుపడుంటాడు. చిన్న ఇంజనీర్లయితే, ఖాతర్ మల్లజెయ్యడు. నీకు తోచింది రాస్కో... పో... అని రుబాబ్ చేస్తడు. ఇన్నవా, అందితే జుట్టు... అందకుంటె కాళ్లు పట్టెరకం.

ఒకసారేమయ్యిందో ఏర్పాటేనా... ఈడగాదు. ఎఫ్.సి.ఐ. సైట్ల బ్రిక్‌వర్కు జరుగుతున్నది. పని తొందరగా జరగాల్సున్నది. మేసన్లను ఉరుకుమంటున్నము. ఇట్కలు కూడా బాగా కాలలేదు. పొద్దున్న లేచినసంది సాయంత్రంవరకు మూడు గజాలెత్తున గోడలు గబగబ లేచిపోతున్నయి. గప్పుడొచ్చిండు ఓ ఇంజనీరు దొర సైట్లనే వున్నడు. ఆయన వస్తూనే తొందర తొందరగా పనిజరిగిపోతున్నదని తెలుసుకున్నడు. కోపమయిండు. దొర ఏమనలే ఊకున్నడు.

మేస్త్రీలందరు భోజనాలకి దిగిపోయిన్రు. టైము పన్నెండు దాటుతాంది. ఆ ఇంజనీరు, కోపంగా ఓ మేస్త్రీ బిల్డింగు దగ్గిరకిపోయి, రెండు వరుసల ఇటుక గోడ వుంటే దాన్ని కాల్తో తన్నేడు. ఆ గోడ పడిపోయింది. దానిమీద దొర ఇంగ్లీషులో ఢాం... ఢూం... మని ఏదేదో అన్నాడు. ఆ మేస్త్రీ పరుగు పరుగున వచ్చేడు. వానికి మంచి కోపమొచ్చింది. దొర ఏమన్లే. ఎవ్వర్నీ మాటాడొద్దన్నాడు.

పక్కన్నే... మల్లయ్యనీ, ఇప్పుడా మిట్టపక్క వరుసలు చేస్తున్నడు. ఆ మేస్త్రీ కట్టిన బిల్డింగున్నది. నాలుగడుగుల ఎత్తు గోడ అప్పటివరకు కట్టి అప్పుడే దిగిపోతున్నడు. అక్కడికి నడిచేడు దొర. ఆ ఇంజనీర్ను తనతో రమ్మన్నడు. బేస్‌మెంటు పైకెక్కిన్రు ఇద్దరూ... మాకెవరికీ ఆయనేం చేస్తడో. ఏం చెపుతాడో తెలియలే.

ఉన్నట్టుండి, కుడికాలు పైకెత్తి వెనక్కిలాగి పెట్టి బలంగా తన్నేడు ఆ గోడని. మొక్కాసిన్ బూటున్నదిలే ఆ కాలికి. ఆ ఒక్కతన్నుతో గోడ మొత్తం పేకమేడలా కూలిపోయింది. మా అందరికీ మతిపోయిందనుకో ప్రభాకరం. ఆ ఇంజనీరు కూడా ఏం మాట్లాడలేక నోరు తెరుచుకున్నాడు.

అప్పుడు తిట్టిండయ్యా... వాన్ని. నువ్వేం




ఇంజనీరువన్నాడు. నీకీ నౌకరెవరిచ్చిండు. నీకు నదువెవడు చెప్పిండు. నీకు పట్టా ఎట్టి చ్చిండు అన్నాడు. ఇంకేదేదో ఇంగ్లీములో అరగంట తిట్టినతిట్టు తిట్టకుండ తిట్టినడు. సిమెంటు సెట్ కావడానికి కొంత టైము పడు తుందని తెలీని ఇంజనీర్లు, బిల్డింగు పని ఎట్ల సూపర్వైజు చేస్తరని ఆ తర్వాత పై ఆఫీసర్లతో గట్టిగా అడిగిండంట. గదీ గట్లుంటాది ఆయన పని. సమజయిందా'' అని నవ్వుతూ అని.

''నే పోయొస్త'' అంటూ కార్పెంటర్ల షెడ్‌లో నికి వెళ్ళిపోయాడు.

దూరంగా, కారు వస్తున్న చప్పుడు విని పించింది. మిట్ట అవతలకి రాగానే డ్రైవరు అహ్మద్‌హుస్సేన్ హారన్ మోగించేడు. అది సైట్లోని స్టాఫ్‌కీ, అహ్మద్‌హుస్సేన్‌కీ మధ్య కుది రిన అండర్‌స్టాండింగ్. ఆ హారన్ వినగానే అందరూ అలర్ట్ అయిపోతారు.

ప్రభాకరం, కూజాలో నీళ్ళువంచుకుని గ్లా సుతో గడగడా తాగేడు. ముందుకి కదిలేడు. కొమరయ్య తన బదులుగా పెట్టిన జమీర్‌కు అన్నీ సిద్ధంగా వుంచమని చెప్పేందుకు.

★ ★ ★

''నేనొక్కసారి ఇంటికి పోయొస్త...'' నెమ్మ దిగా అన్నాడు ప్రభాకరం ప్రకాశరావుతో.

''ఏమైంది? ఎందుకిప్పుడు పోవుడు. రెండు నెల్లాగి పోరాదు'' దొర చిరాగ్గా చూసేడు. కారు విండో దింపుతున్నవాడల్లా ఆగిపోయి. ''కొంచెం పనుంది సార్. ఒక్కసారి రమ్మని ఉత్తరం వచ్చింది...''

''మీతో ఇదే పరేషాన్. వొస్తరు నాలుగుదినా లు పని చేస్తరో లేదో. ఇంటికి పోతమంటరు. పాలుదాగే పోరల్లెక్క. అయితే ఎప్పుడు పోతవు. మళ్లెప్పుడొస్తవు''

''రేపుపోయి, వారంరోజుల్లో వచ్చేస్తాను''

''అట్లంటెగాదు. ఖచ్చితంగా చెప్పాలె''

''రేపుపోయి, వచ్చే బుధవారం నాటికి వచ్చే స్తానండీ''

''రేపొద్దు. రేపు నువ్వు లేబరాఫీసుకు కరీంనగరు పోవాలి. అక్కడ ఇనస్పెక్షనున్నది తెల్సుకదా. ఎప్పుడూ వెంకటేశ్వర్రావు పోతుండె. వాన్ని నేను ఊరుతోల్తన్న. గావనికి నువ్‌పోయొచ్చినంక ఎల్లుటపో... మళ్లీ బుధ వారం నాటికి రావాలె''

''పోనీ... అహ్మద్‌హుస్సేన్'' కారు స్టార్ట య్యింది.

''నాకో వెయ్యిరూపాయలు కావాల్సార్'' జంకుతూనే అడిగేడు. అహ్మద్‌హుస్సేన్ కారా పేడు.

ప్రకాశరావు కోపంగా చూసేడు.

''ఎందుకు నీకన్ని పైసలు. మొన్ననేగద జీతాలిచ్చినా. కావాలంటే మరో నూరో ఇన్నూరో తీస్కపో. వెయ్యి రూపాయలేం జేస్తవు. డబ్బు జాగ్రత్తగా కర్చు చెయ్యాలి. అయిన ఇప్పుడన్ని లేవు...''

''అట్లంటే కాదు సార్. అవసరముంది'' ప్రభాకరం వదల్లేదు.

విసుక్కుంటూ బ్రీఫ్‌కేస్ తీసేడాయన. లెక్క పెట్టి ఆరువందనోట్లు ఇచ్చేడు.

''వీటితో సరిపెట్టు. అవసరం లేకుండా ఎక్కువ పైసలడగొద్దు. నెలనెల జీతంలో నూ రురూపాయలు పట్టుకుంట. అందరి జీతాల, అడ్వాన్సుల లెక్క సరిగా రాసిపెట్టు. నేనొచ్చి నంక జూస్త. నువ్‌పోయి తొందరగా రా. అసె స్మెంట్‌కి లెక్కలు రాసెడిదుంది...''

కారు బయల్దేరిపోయింది. ప్రభాకరం తన పని పూర్తిగా కానందుకు కాస్త బాధపడ్డాడు. నోట్లు జేబులో వుంచుకున్నాడు.

ఇంతలో టేపు చేత్తో పట్టుకుని అటువైపుగా వున్న బిల్డింగుల మెజర్‌మెంట్లు తీయడానికి కాబోలు పాణి అటు వచ్చేడు. వెనక నలుగురై దుగురు మేసన్లు వున్నారు.

''ఏం గురూ! ఊరుపోతున్నవా? దొరేమన్న డు?''

''ఆ... ఎల్లుండి పోతా... పాణీ-''

''నిజమె! దొర నీకు అడగ్గానే సెలవి చ్చిండా. నశీబంటె నీదేనయ్యా ప్రభాకరం. గాఅశోక్‌గాడు చెల్లె పెండ్లికి పోవాల్సివుంటే నీ చెల్లి పెండ్లికి నివ్వేం జేస్తవు. మీ అమ్మా, నాన్న లేరా జేసెందుకు. పోదువుగాన్లే. అని పెండ్లి దినం రేపనంగా ఈ సాయంత్రం పంపిండు.

వాడేడ్చుకుంటపోయిండు. నీకు మంచిగనే సెలవిచ్చిండే...''

''సెలవయితే ఇచ్చేడు పాణీ. పైసలడిగినా. అన్నియ్యాలే''

''అట్లిస్తె... ప్రాణముంటాదయ్యా దొరకు'' అని నవ్వేడు ప్రభాకరం కూడా నవ్వేడు.

★ ★ ★

వరండాలో కట్టేసివున్న బొచ్చుకుక్కపిల్ల ఊరికే మొరుగుతోంది. సీ- షెల్స్‌తో చేసిన తెర వత్తిగించుకుంటూ వరండాలో అడుగుపెట్టింది సాకేత. ఎదురుగా కుర్చీలో కూర్చుని చేతివేళ్లవంక చూసుకుంటూ వున్న ప్రభాకరం. తల ఎత్తేసరికి ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. ఆమె నేత్రాల్లో విస్మయం, ఆనందం ఒకేసారి చూడగలిగేడతను. తనివితీరా ఆమెను చూసుకున్నాడు.

అతన్ని చూసిన వెంటనే సాకేత ఎందుకోగాని మాట్లాడలేకపోయింది.

''నాతో మాట్లాడాలనిపించటం లేదేమిటోయ్. ఊర్కే చూస్తూండిపోయావ్. నేను ప్రభాకరాన్ని గుర్తున్నానా?''

తల అడ్డంగా ఊపింది సాకేత. ఏదో భావోద్వేగం ఆమెను మాటాడనీయకుండా చేస్తున్నట్టుంది. ఆవేశపు ఝరో, ఆవేదన తీవ్రతోగాని ఆమెను ఉక్కిరి బిక్కిరి చేయగా, రెండు చేతుల్తో మొహం కప్పుకుని లోపలికి పారిపోయింది సాకేత. ఆమె కాలికున్న మువ్వలు నందడి చేశాయి.

ప్రభాకరం నిలువునా నీరయ్యేడు. తను వస్తున్నట్టు ఆమెకి తెలీదు. తెలియపర్చకుండా వచ్చేడు. అంతకుముందు నెల్లో ఆమె తనకు వ్రాసిన ఉత్తరంలో పరీక్షలయిపోయేయని, బాగా రాసేనని, వీలయినంత తొందరగా తనని రమ్మనమనీ, ఒక్కసారి చూడాలని వుందనీ వ్రాసింది. తనూ జవాబు వ్రాసేడు. రావాలనే ప్రయత్నిస్తున్నాననీ, కానీ ఎప్పుడు బయల్దేరేదీ తెలీదనీ ఆమెకు రాసేడు. తీరా వచ్చేక, ఆమె ఎందుకు అలా ప్రవర్తించిందో అతనికేం అర్థంకాలేదు. మనసులో ఏదో నంశయం కలిగింది. మనను పరిపరి ఆలోచన్లు చేయడం మొదలుపెట్టింది.

ఇంతలో సాకేత నెమ్మదిగా తిరిగివచ్చింది. ఆమె చేతిలోవున్న కాఫీ కప్పు ప్రభాకరం ముందున్న టీపాయి మీద మెల్లగా పెట్టింది.

''తీసుకో... ప్రభాకరం! చాలా రోజులైంది నిన్నుచూసి. బాగా మారిపోయేవు'' ఎర్రబడ్డ నేత్రాలు అతను చూడకూడదని తల దించుకు కూర్చుంది.

తన ఎదురుగా కుర్చీలో కూర్చున్న ఆమె వంక చూసేడు ప్రభాకరం.

కోలగా, పచ్చగా వున్న ఆమె మొహంలో ఎర్రరాయి ముక్కుపుడక తళతళమని మెరుస్తోంది.

పైపెదవి దగ్గిరగా వున్న నల్లటి పుట్టుమచ్చ ఎప్పటిలాగే అతణ్ణి పిచ్చివాణ్ణి చేయసాగింది.

శుక్రవారం కావటాన తలంటి, స్నానం చేసిన ఆమె జుట్టు, పైనుండి వీస్తున్న ఫేన్ గాలికి అల్లరిగా రేగుతోంది.

ముగ్ధ సుందరంగా, సుమనోహరంగా వుంది సాకేతరూపం. ఆమెను చూస్తూ, తన్మయత్వంతో, మాటలు మర్చిపోయేడు ప్రభాకరం.

తనవంక పోయిన దేనికోసమో వెతుక్కుంటున్నట్టుగా చూస్తున్న అతడి చూపులను ఎదుర్కోలేక తలదించుకుంది ఆమె.

''కాఫీ చల్లారిపోతుంది. తీసుకో ప్రభాకరం''

తెప్పరిల్లేడు ప్రభాకరం ''థేంక్స్... సాకేతా'' అని కాఫీ కప్పు అందుకని గబగబా తాగేడు.

''చాలా మారేవు ప్రభాకరం. ఈ సంవత్సరంలో'' పొడిగా అంది.

''అందరూ అలాగే అంటున్నారు. ఈ మార్పు నీకు బాగుంటే, నాకూ సంతోషమే. నువ్వు మాత్రం అలాగే వున్నావు సాకేతా. కొంచెం బిడియపడటం కొత్తగా నేర్చుకున్నట్టున్నావు... ఔనా!''

ఆమె కొద్దిగా నవ్వింది. ఆ నవ్వు సహజంగా లేదనిపించింది ప్రభాకరానికి.

''నీలో వచ్చిన మార్పు నాకు బాగుండటమెందుకు ప్రభాకరం! నేను నీకేమవుతాను'' ఆ మాటలంటున్నప్పుడు ఆమె కంఠంలో దుఃఖపుజీర విన్పించి, ఆశ్చర్య చకితుడయ్యేడు ప్రభాకరం.




"మనం కన్నకలలు కాలిపోయాయి ప్రభాకరం. మన జీవితాలు వేరయిపోతున్నాయి. ఇంక నీ దారి నువ్వు చూసుకో" ఆమె గబగబా ఆ మాటలని చప్పున తల కిందికి దించు కుంది. బిగుసుకున్న ఆమె చెంపలు, ఆమె దుఃఖాన్ని అదిమిపెట్టేందుకు కింది పెదవిని కరిచిపట్టుకున్నట్టుగా తెలియజేస్తున్నాయి.

ఒక అగ్నిశిఖ మొహంమీద తాకినట్ల యింది.

ఒక పెనుపర్వతం పైన పడినట్లయింది.

కారు నల్లని మేఘాలు కమ్ముకుని వచ్చి సంఘర్షిస్తే, పుట్టే మెరుపు వెలుగులా, నిజం కాకూడని నిజం వొకటి, స్పష్టమై, ప్రభాకరం మనస్సును సంక్షుభితం చేసింది.

పిడుగుమీదపడినవాడిలా అయిపోయేడత ను. నిస్సత్తువ శరీరాన్ని కమ్ముకుంది. గొంతు విహ్వలం అయిపోతూండగా,

"సాకేతా...!" అని అరిచేడు. కానీ, ఆ పిలుపు అతిమెల్లగా వినిపించింది.

తలెత్తి, నిండారులైన కళ్లతో, అతన్నోమారు చూసింది ఆమె. అతను అనుభవిస్తున్న బాధ, రక్తం తోడేసినట్లయిపోయిన అతని మొ హంలో పూర్తిగా ప్రతిఫలిస్తోంటే, తను కూడా తట్టుకోలేకపోయింది.

"ప్రభాకరం! నన్ను క్షమించు. నా చేతుల్లో లేనిదానికి నన్ను నిందించకు. నాకు పవన్‌తో పెళ్లి నిశ్చయించేరు. అది జరగాలి. తప్పదు. అంతకంటె ఇప్పుడు నేను నీకేమీ చెప్పేస్థితిలో లేను. ఇక్కడ మనం మాట్లాడుకోవటానికి కుద రదు. సాయంత్రం గాంధీపార్కులో మాట్లాడుకో వచ్చు. వీలయితే, ఒక్కసారి రా...! దయ వుంచి, ఇప్పటికి వెళ్లిపో..." లేచి నిలబడి చేతులు జోడించింది.

ప్రభాకరం కర్రాటే అయ్యేడు. ఆమె అంటున్నదేమిటో అతడికేం అర్థం కావటంలే దు. ఈ ఇంట్లోకి అడుగుపెట్టేటపుడు ఎన్నెన్నో మధుర స్వప్నాలను మాలగా ధరించి వచ్చేడు. సంవత్సరకాలంపాటు దూరమైన తన ప్రేమ మయిని, తృప్తిగా, కళ్ళనిండా చూసుకోవచ్చనీ, మనసారా మాటాడుకోవచ్చనీ, ఎన్నెన్నో ఆశలు పెట్టుకుని ఆదరాబాదరాగా వచ్చేడు. భావిజీ విత భవ్యప్రణాళికలు ఇద్దరూ కలిసి ఆలో చించుకోవచ్చని ఆత్రపడ్డాడు.

కానీ... కానీ... ఇదేమిటి? ఈమె ఇలా అంటోందేమిటి? తన ఆశల హరివిల్లు ఇంత చులాగ్గా తునా, తునకలు చేసేస్తోందెందు కని... తమ కలల కౌస్తుభాన్ని కాల్చి బూడిద చేస్తున్నది దేనికోసం... తన ప్రతీక్ష, తన తప స్సు అంతా...వ్యర్థమేనా...? ఇంతవరకేనా... ఇక్కడిదాకానేనా తమ ప్రేమ పల్లవం తీగెలు సాగింది.

ఊహించని ఆ పరిణామానికి దెబ్బతగిలిన గువ్వపిట్టలా అయిపోయేడు ప్రభాకరం.

సాకేత మొహంమీద రెండు చేతులూ కప్పు కుని వుంది.

ప్రభాకరం మనస్సు త్రుటిలో ప్రశాంతమైపో యింది. ఎందుకు? ఏమిటి? అన్న ప్రశ్నలు కూడా రాకుండా అతని మస్తిష్కం తెల్లకాగి తంలా మారిపోయింది. లేచి గిరుక్కున వెన క్కుతిరిగేడు... రెండు అడుగులు ముందుకు వేసి గడపదాటబోతూ, ఆగి ఆమెవంక ఒక్క సారి చూసేడు

"వస్తాను... సాకేతా... సెలవు... నా నీడ కూడా నీ జీవితంమీద మరి పడనివ్వను... ఇన్నాళ్ల నీ సాహచర్యానికి నా కృతజ్ఞతలు. బై..."

ఆమెతో ఆ మాటలన్నాక మరి అతడు ఆగలేదు...

"ప్రభాకరం...!" అని సాకేత, పిలిచినా అతడు పట్టించుకోనే లేదు... గబగబా గుమ్మం దగ్గరకు పరుగెత్తింది ఆమె.

తలవంచుకుని... ఎటు నడుస్తున్నాడో కూడా ఆలోచించకుండా, రోడ్డు వదిలి, ఎదు రుగా వున్న మామిడి తోటలో, కింద రాలిన ఎండుటాకుల్ని విసురుగా తొక్కుకుంటూ వెళ్ళి పోయేడు ప్రభాకరం.

అంతే... ఆ తర్వాత ఆమె తిరిగి ఎన్నడూ ప్రభాకరాన్ని చూడలేదు. ప్రభాకరం ఆమె తనను చూడనివ్వకుండా చేసుకున్నాడు.

అతని జీవితంలో ఆమె అధ్యాయం అంత టితో ముగిసిపోయింది. అవును మరి... శావగ్ర



స్త జీవితాలకు, కోరుకున్నవేవీ లభించకపోవడం, లభించినవన్నీ భరించలేనివి కావడం... ఓ విధిలీల. ఓ పరిణామహేల.

ఆ సంఘటనతో ప్రభాకరం జీవితనౌక పయనించే దిశలో, ప్రచండమైన మార్పు కలిగింది.

నిశ్శబ్దంగా ఇంటికి వచ్చి, ఏం చెప్పకుండానే పెట్టెసర్దుకుంటున్న ప్రభాకరాన్ని చూసి తల్లి ఆశ్చర్యపోయింది.

"ఏరా ప్రభా! అక్క దగ్గిరకి వెళతావా?" అనుమానంగా అడిగింది.

"లేదు... హైద్రాబాదు వెళ్ళిపోవాలి" క్లుప్తంగా జవాబిచ్చేడు.

"అదేమిట్రా... మరో వారం వుంటానన్నావుగా... నిన్న రాజారావుగారడిగితే" ఆమె కంగారుపడుతూ అంది.

"లేదమ్మా! చాలా అర్జెంటు పనుంది. నేను చేయవలసిన పనొకటి మధ్యలోనే వదిలొచ్చేను. ఇప్పుడు వెడితేగానీ అది పూర్తి కాదు... మళ్ళీ త్వరలోనే వస్తానులే" తల్లిని సమాధాన పర్చడానికి అన్నాడు గానీ, అతనికి మరెంత మాత్రం ఆ పరిసరాల్లో వుండటానికి మనస్సంగీకరించటంలేదు.

బంధాలూ, అనుబంధాలూ అశాశ్వతమనీ, మమకారం, మోహం వొట్టి భ్రాంతులనీ, అతనికి సాకేత మరి లభించదని తెలిసేక బలంగా అనిపించింది. మొదట్నుంచీ అంతర్లీనంగా అతన్లో ఒక విధమైన తీవ్రస్వభావం వుంది. పెరిగిన వాతావరణం, పరిసరాలూ, దాన్ని బయటపడకుండా అణిచివేసేయి. ఇప్పుడు అతను పని చేస్తున్న వాతావరణం, అతని స్వంత వ్యక్తిత్వాన్ని బయటపడేలా చేసింది. జీవన పోరాటం ప్రారంభంలోనే అతని లక్ష్యం దెబ్బతినిపోయింది. ఆర్థికంగా బలపడి, తను కోరుకున్న జీవిత సహచరిని సొంతంచేసుకోవాలన్న ఆశయం నీరుకారిపోయేసరికి, అతన్లో నిర్వేదం చోటుచేసుకుంది. తన కుటుంబం గురించి కూడా తనేమీ పెద్దగా చేయాల్సింది లేదు. చెల్లెలుకీ, తమ్ముడికీ మంచి ఉద్యోగాలు లభించేయి. కుటుంబ పరిస్థితి చక్కబడింది. తానెక్కడున్నా ఏమైనా ఫరవాలేదన్న భావం కలిగింది ప్రభాకరంలో...

కనిపెంచిన తల్లివైపు అభిమానంగా చూసేడు. ఆమె కళ్ళల్లో వొత్తులు వేసుకుని నిరీక్షించింది ఇంతకాలం... తన పిల్లల అభివృద్ధి కళ్ళారా చూడాలని ఆమెకున్న ఒకే ఒక కోరిక. ప్రభాకరం అమాయకుడనీ, స్వచ్ఛమైన పాలవంటి వ్యక్తిత్వం కలిగిన వాడనీ, ఆమె ప్రగాఢ విశ్వాసం.

'సాకేత' ఆమెకు తెలుసు. ఆమె తన ఇంటికోడలవ్వాలని కూడా ఆమె ఆశపడకపోలేదు. కానీ సాకేత తండ్రి, నారాయణమూర్తి ధనమదంతో, తమ మధ్య బంధుత్వాన్ని కూడా గుర్తించడన్న విషయం తెలిసేక ఆమె తన ఆశను మొగ్గలోనే తుంచేసింది. ఐతే, ప్రభాకరం, సాకేతలమధ్య కొనసాగిన ప్రణయం, ఆమె కాదు ఎవ్వరూ గుర్తించలేకపోయేరు.

అందుకే ఆమె హృదయం కొడుకు అర్థాంతర ప్రయాణానికి కారణాన్ని గుర్తించలేక పోయింది. కానీ ఎందుకో ప్రభాకరం మనస్సు బాగా గాయపడిందని, ఖిన్నంగా వున్న అతన్ని చూసి ఆమె గుర్తించగలిగింది.

ప్రభాకరం దగ్గరగా వచ్చిందామె.

"ఏరా! ప్రభా... ఏమైందిరా నీకు...? ఎవరైనా ఏమైనా అన్నారా?" లాలనగా అతడి భుజంమీద చెయ్యివేసింది.

ఉబికివస్తున్న దుఃఖావేశాన్ని నిలవరించుకోలేకపోయేడు. అలాగని అతడేమీ చెప్పలేకపోయేడు. కళ్ళనీళ్లు తిరిగిపోతుండగా మొహం పక్కకు తిప్పుకున్నాడు.

అతడు తీవ్రంగా గాయపడ్డాడని, అది అతని మనసుకు తగిలిన గాయమనీ ఆమెకు అర్థమైపోయింది. ఎప్పుడూ ప్రతీ చిన్న విషయానికీ, తన సలహానడిగే ప్రభాకరం అతడు కాదనీ, ఒక్క ఏడాదిలోనే మానసికంగా బాగా ఎదిగిపోయిన యువకుడనీ కూడా ఆ తల్లి గుర్తించింది. తన పెంపకం మీద, తన రక్తం మీదా ఆమెకున్న దృఢవిశ్వాసంతో ఆమె అతన్ని మరేం అడగలేదు. అతనే కుదుటపడతాడనీ, అతని సమస్యకు పరిష్కారం అతనే చూసుకోగలడనీ నమ్మి, ఆవిడ అక్కడనుంచి




వెళ్ళిపోయింది. వెళ్ళిపోయేముందు మాత్రం ఒకే మాట అంది.

"నీమీద నాకు చాలా నమ్మకంవుంది ప్రభా! నువ్వెందుకు వెళ్లిపోతున్నావని గానీ, ఎందుకు బాధపడుతున్నావనీ, నేనడగను. నువ్విపుడు పెద్దవాడివయ్యేవు. నీకు ఎదురయ్యే ప్రతీ సమస్యా, నువ్వే పరిష్కరించుకోగలగాలి. ఆ శక్తీ, సంయమనం నువ్వు ఏర్పరుచుకోవాలి. నువ్వు వెళ్లాల్సివుంటే, ఈరోజే, ఇప్పుడే వెళ్లిపో. కానీ వెళ్ళేముందు, భోజనంచేసి మరీ వెళ్ళు. నేను వంటింట్లో నీకోసం చూస్తూవుంటాను"

ఆమె అన్న ఆ మాటలతో ప్రభాకరం, మరీ ఒంటరితనాన్ని అనుభవించేడు. మరతనికి ఆత్మీయులెవరూ మిగల్లేదు. నిర్దయగా తల్లి తనను దూరం చేసిందనిపించింది.

క్షణాల్లో తేరుకున్నాడు. బాత్రూంకు వెళ్ళి మొహం కడుక్కున్నాడు. తల్లి పెట్టిన భోజనం కాసేపు కెలికి కంచంలో చెయ్యికడుక్కుని లేచేడు. స్కూల్నుంచి వచ్చిన ఆఖరి తమ్ముడికీ, చెల్లెలికీ వెళ్ళివస్తానని చెప్పి, వాళ్ళ చేతుల్లో కొంత డబ్బు పెట్టేడు. తల్లితో మరోమారు వెళ్ళివస్తానని చెప్పేడు. ఆవిడ అతన్ని దగ్గరగా తీసుకుంది.

"జాగ్రత్తరా... బాబూ... ఆరోగ్యం జాగ్రత్త... దేనికీ ఇబ్బంది పడకు. మనోధైర్యం ముఖ్యం. దాన్ని పోగొట్టుకోకు. నువ్వక్కడ వుండలేకపోతే, వెంటనే వచ్చెయ్... ఇప్పుడు మన పరిస్థితి బాగానే వుంది. ఇక్కడే ఏదో చూసుకోవచ్చు... తరచూ ఉత్తరాలు రాస్తూండు" ఆప్యాయంగా చెప్పింది.

ప్రభాకరం మవునంగా తలూపి రిక్షాఎక్కేడు. తననుంచి శాశ్వతంగా దేన్నో పోగొట్టుకున్న భావన అతన్లో బలంగా కలిగింది.

★ ★ ★

కాలం, గాలి కెరటంలా ముందుకు సాగిపోతోంది.

ఊరునుంచి తిరిగి వచ్చిన తరువాత, ప్రభాకరం కొన్నాళ్లపాటు, యాంత్రికంగా తన పనులు చూసుకునేవాడు. అప్పుడతని మానసిక పరిస్థితి అన్నిటిపట్లా నిరాసక్తంగా వుండేది. ఐతే ఎంతోకాలం అతనాస్థితిలో లేడు. శూన్యం నుంచే సర్వం జనించినట్లు, అతన్లో కొత్త వ్యక్తిత్వం, అంత స్వచ్ఛంగా లేని మూర్తిమత్వం అంకురించింది. మాటలో కాఠిన్యం, మనిషిలో పట్టుదలా పెరిగేయి. క్రమంగా వర్క్‌సైట్‌లో జరిగే అన్ని పనులూ అతని సూచనల మేరకు జరగడం మొదలయ్యింది. దానికి మరో కారణం కూడా వుంది. వెంకటేశ్వర్రావు, సూర్యనారాయణ, ప్రకాశరావు కంపెనీలో వుంటూనే, వేరే స్వంత కంట్రాక్టు పనులు రహస్యంగా తీసుకోవడంవలన, వాళ్లకి ఈ సైటుమీద ఆసక్తి తగ్గిపోయింది. అయినా తాము వేరయిపోతున్న సంగతి అప్పుడు ఆయనకి తెలియకూడదని గుంభనంగా వుంచేరు. అయితే ఆ సంగతి ప్రకాశరావు దొరకీ తెలుసు. అయినా వాళ్లనే బయటపడనీ అన్న దృష్టిలో ఊరుకుని వాళ్లకి ప్రత్యామ్నాయంగానే ప్రభాకరాన్ని ఎంచుకున్నాడు.

వెంకట్రావు బాధ్యతకు బారెడు దూరంలో వుంటాడు. పాణి సోమరిపోతు, అజాగ్రత్త పరుడని అతన్ని సాధారణంగా నమ్మడాయన. మిగిలిన వాళ్లు స్థిరంగా పనిచేసేవాళ్లు కారనీ, కార్యదక్షత లేనివారనీ ఆయన భావం. అందువల్ల ప్రభాకరానికి వర్క్‌సైటుకు సంబంధించిన అన్ని పనుల్లో, తప్పనిసరిగా జోక్యం కలిగించుకోవలసిన అవసరాన్ని అధికారాన్ని ఆయన చాలావరకు అప్పగించేడు.

అరగదీసేకొద్దీ పరిమళిస్తూ, వ్యాపించిపోయే చందన గంధంలా, ప్రభాకరం ఆ నిర్మాణ కార్యక్రమంలో అన్ని పనుల్లో చురుగ్గా చొచ్చుకుపోయేడు. తనకు దొర ఇచ్చిన కొద్ది వెసులుబాటుతో పనెక్కడా కుంటుపడనివ్వకుండా, పనిచేసేవాళ్లకు పెద్దగా కష్టం కలగనివ్వకుండా, వీలయినంతవరకు కృషి చేయడం మొదలుపెట్టేడు.

క్వార్టర్ల నిర్మాణం చాలావరకు పూర్తికావచ్చింది. అందువల్ల అది పూర్తికాకముందే, మరో రెండు మూడు వర్కులు తీసుకోవాలన్న అభిప్రాయంతో ఉన్నాడు దొర. హైద్రాబాద్‌చుట్టుపక్కల రెండు మూడు టెండర్లు వుంటే వాటికోసమని అతను రెండు నెలలుగా హైద్రాబాద్‌లోనే వుండి పోయేడు.

వర్క్‌సైట్‌లో పేమెంటుకోసం వెంకటేశ్వ్రరావు ఒకసారీ, ప్రభాకరం ఒకసారీ హైద్రాబాద్ వెళ్ళి చెక్ తీసుకొచ్చి పేమెంటు చేసేరు.

★ ★ ★

చలిగాలి విసురుగా కొడుతోంది. బస్సు కిటికీలు దగ్గిరగా లాగి సిగరెట్ వెలిగించేడు. ప్రభాకరం. అది కొత్తగా అలవాటైందతనికి. వెచ్చగా పొగ పీల్చేడు. పొద్దున్నే అయిదు గంటలకే నిద్రలేపేసేడతన్ని ప్రకాశరావు.

ముందురోజు రాత్రి వొంటిగంటవరకు శ్రీరాములుగారు, ప్రకాశరావులతోపాటు, ప్రభాకరం కూడా నిద్రపోకుండా కూర్చుని, ఓపెన్‌కాస్ట్ దగ్గిర కేరేజి షెడ్ టెండరు షెడ్యూల్ ఒకటీ, కొత్తగూడెంలోని కొన్ని టైప్ టూ క్వార్టర్లకోసం మరొకటీ, కాలుక్యులేషన్లు చెయ్యటంలో వుండిపోయేడు. కళ్లులేక పోయినా, కంప్యూటర్‌లా పనిచేసే శ్రీరాములుగారి మాస్టర్‌మైండ్‌వల్లనే కంట్రాక్టరుగా ప్రకాశరావు ఇంత ఎత్తుకు ఎదిగాడనీ, కోట్లు సంపాదించాడనీ, అందరూ అనుకునే మాటలు జ్ఞాపకంలో మెదిలీ అవి యదార్థమేనని అనుకున్నాడు స్వయంగా చూశాక!

ఎక్కడో ఆంధ్రాలో... బొబ్బిలిదగ్గర గ్రామంలో పుట్టిన ఆ రైతువారీ కుటుంబపు వ్యక్తి, తన మేథాసంపత్తితో ఇంజనీరింగ్ పట్టభద్రుడై, హైద్రాబాదులో వున్న ఓ ప్రభుత్వ సంస్థలో ఇంజనీరుగా చేరేడు. అప్పటికే ఆ సంస్థకు చెందిన చిన్నచిన్న కంట్రాక్టు వర్క్‌లు చేస్తున్నాడు ప్రకాశరావు. శ్రీరాములుగారు పనిచేస్తున్న తీరుకి, అతని బ్రిలియన్సీకీ, ప్రకాశరావు ఆకర్షితుడై, తనతో జాయింటుగా కంట్రాక్టులు చేయమని ఆఫర్ ఇచ్చేడు. ముందు అందుకు అంగీకరించలేదు శ్రీరాములు. ఆ తర్వాత ఆర్థిక ఇబ్బందులవల్లా, మరికొన్ని ఇతర కారణాలవల్లా కూడా ఆయన తన అభిప్రాయాన్ని మార్చుకుని ప్రకాశరావుతో చేయికలిపేడు.

ఆనాటినుండి ప్రకాశరావు కంపెనీ అప్రతిహతంగా పైకి ఎదుగుతూ వచ్చింది. మొదట్లో వేలమీద కంట్రాక్టులు చేస్తూ వుండే ప్రకాశరావు ఈరోజు కోట్లరూపాయల పనులు చేబట్టి, సక్రమంగా పూర్తిచేయగలుగుతున్నాడంటే, అందుకు రాత్రింబవళ్ళు పరిశ్రమించిన శ్రీరాములుగారే కారణం.

తనకింద పనిచేసేవాళ్ల పాలిట సింహమైన ప్రకాశరావును రింగ్‌మాస్టర్‌గా ఆడించగలిగేది శ్రీరాములుగారొక్కరే.

ఆలోచనలో పడి సిగరెట్ చివరికంటా కాలిపోవడాన్ని గుర్తించలేదతను. అది పారేసి, మరోటి వెలిగించేడు. ఎడం చేత్తో గడ్డం తడుముకున్నాడు. గరుగ్గా తగిలింది. కాసేపు కిటికీ గాజుతలుపుకు మొహాన్ని ఆనించేడు. చల్లగా వుంది. తెలతెలవారుతూ వుందేమో, ఆ చలికాలపు ఉదయం ఎంతో ఆహ్లాదకరంగా వుంది. దూరంగా రవిబింబం ఎర్రటి బంతిలాగా పైకి లేస్తూ వుంది. ఆ కాంతి వినీలాకాశంలో మిళితమైపోయి అందమైన తైలవర్ణ చిత్రంలా కనిపిస్తోంది ఆకాశం. ఒకటో రెండో ఈతచెట్లు ఆ నేపథ్యంలో, రాత్రి కురిసిన మంచుకు తడవటంవల్ల కాబోలు చెక్కిన శిల్పాల్లా కనిపిస్తున్నాయి. తెల్లటి కొంగల బారు ఉల్లాసంగా, రెక్కలు బాగా చాచి ఎగురుతున్నాయి.

బస్సు మాత్రం తన దారిలో ముందుకు సాగిపోతోంది. పల్లెదృశ్యాలు కంటికింపుగా వుండటంతో ప్రభాకరం సర్వం మరచి, కిటికీలోంచి చూస్తూ వుండిపోయేడు. ఏకాగ్రత క్రమక్రమంగా మాయమై మళ్లీ అతన్లో ఆలోచనలు చోటుచేసుకున్నాయి. మగతలాటి నిద్ర ఆవరించింది.

అప్పటికి ఆరునెలల కిందట ప్రకాశరావుతో కలిసి మొదటిసారిగా హైద్రాబాద్ వచ్చేడు ప్రభాకరం.

ఇందిరాపార్కు పక్కనుంచి పోయి, అశోక్‌నగర్ బ్రిడ్జి దాటి కొంతదూరం పోయేక, ఒక పెద్ద నాలుగంతస్థుల బిల్డింగుముందాగింది కారు. అహ్మద్‌హుస్సేన్ హారన్ మోగించగానే, 'మాలి' వచ్చి గబగబా పెద్ద గేటు తీసేడు. కారు పోర్టికోలోకి పోయి ఆగింది. ముందు సీట్లోంచి ఎడమవైపు డోర్ తెరిచి కిందకి దిగి అలాగే నిలబడిపోయేడు ప్రభాకరం.

పోర్టికోలో మరి రెండు కార్లతో పాటు జీప్ ఒకటి పార్కు చేసివుంది. కార్లలో ఒకటి ఫియట్, మరొకటి మారుతీ... ఆ పోర్టికో చాలా విశాలంగా వుంది. నాలుగు వాహనాలు పార్కు




చేసినా, కుడివైపు ఇంకా నడవటానికి వీలుగా సన్నటి జాగా వుంది. పోర్టికో అంతా మొజాయిక్ ఫ్లోరింగుతో వుంది. కుడిపైపు పోర్టికో స్థంభాలమధ్యగా, పైకప్పునుంచి వేలాడుతున్న ఇత్తడి గొలుసులనుంచి, అందమైన నగిషీలు చెక్కిన ఇత్తడి కుండీల్లో పూల మొక్కలు పెరుగుతున్నాయి.

పోర్టికోనానుకుని కుడివక్కగా నలబై అడుగుల పొడవు, ఇరవై అడుగుల వెడల్పుతో ఖాళీ జాగా వుంది. కానీ ఆ జాగా ఖాళీగా లేదు. దాంట్లో చక్కటి తివాసీలాటి పర్షియన్ లాన్ పెంచబడివుంది. లాన్ మధ్యలో క్రీమ్ కలర్ పెయింట్ వేసివున్న దీప స్థంభంపై అమర్చిన మెర్క్యూరీ వేపర్ లాంప్ బకెట్లతో వంపుతున్నట్టు వెండి వెలుగులు కుమ్మరిస్తోంది. లాన్‌కి నాలుగు మూలలా పదంగుళాల ఎత్తులో, చిన్న ఫౌంటెన్లు గిర, గిరా తిరుగుతూ నీటిని క్రమబద్ధంగా విరజిమ్ముతున్నాయి. లాన్ అంచు వెంబడి వరుసల్లో కాపలాగా నిలబడ్డ గార్డుల్లా క్రోటన్ మొక్కలు నిలబడి వున్నాయి. వీధివైపుకు ప్రహరీ గోడకు నాలుగడుగుల ఇవతలగా ఒక ఏడాకుల అరటి చెట్టువుంది. ఆ దగ్గర్లో ఒక చిన్న నుయ్యివుంది. పోర్టికోతోబాటు, నుయ్యి గట్టు కూడా రవ్వగచ్చుతోనే వుంది.

కారు వచ్చిన మెయిన్‌గేటు కాకుండా ఇంటి ద్వారానికి సరిగ్గా ఎదురుగా ఒక చిన్న ఐరన్‌గేటు వుంది. గేట్లు రెండూ కూడా ఆకర్షణీయమైన డిజైన్‌తో వున్నాయి. నీట్‌గా పెయింట్ వేసేరు ఆ గేట్లకి.

ఇంద్రభవనంలా, సినిమా సెట్టింగ్‌లా వున్న ఆ ఇంటి వైభవానికి ఆశ్చర్యపోతూ కారు దగ్గిరే నిలబడిపోయిన ప్రభాకరాన్ని డిక్కీ లోంచి సామాన్లు కిందకి దించిన అహ్మద్ హుస్సేన్, భుజంమీద తట్టేడు. తెప్పరిల్లి అత నివంక చూసిన ప్రభాకరానికి కంటితోనే ప్రకాశరావును చూసి వెళ్లమన్నట్టుగా సైగచేసేడు. తన సూట్‌కేస్ చేత్తో అంది పుచ్చుకుని గబగబా నడిచి ఇంటిముందున్న పాలరాతి మెట్లు ఎక్కి ప్రకాశరావు దొర వెనకే గ్రిల్స్‌తో వున్న వరండాలోకి అడుగుపెట్టేడు ప్రభాకరం.

అహ్మద్‌హుస్సేన్ అతని పక్కనుంచి వొచ్చి వరండాలో వున్న గ్లాస్‌టాప్ గాడ్రెజ్ డబుల్ ఛెస్ట్ టేబుల్‌మీద ప్రకాశరావుగారి బ్రీఫ్‌కేస్ వుంచి, మిగిలిన సామాన్లు తేవటానికి మళ్లీ బయటకి పోయేడు.

టేబుల్‌కి అటువక్క 'స్వివెల్ ఛెయిర్' ఫుల్లీ కుషన్డ్ వుంది. ఆ వసారాలోనే నాలుగు ఫోముతో చేసిన బాక్స్ ఛెయిర్లు ముఖమల్‌దిళ్ళతో వున్నాయి. గది గోడలు స్పాంజ్ ప్లాస్టరింగ్ చేయబడి, ఐవరీగ్రే ఎనామిల్ పెయింట్‌తో మెరిసిపోతున్నాయి.

అద్భుతమైన నైపుణ్యం వుట్టిపడుతున్న ఆ ఇంటి పనితీరుకీ, శోభాయమానంగా వున్న ఇంటీరియర్ డెకరేషన్‌కీ పరవశం చెందేడు ప్రభాకరం. కన్‌సీల్డ్ లైటింగుతో కాంతిస్నానం చేస్తున్నట్టున్నాయి వరండా చుట్టూ వున్న కుండీల్లో మొక్కలు. లోహంతో చేసిన శిల్పాల్లా వున్నాయవి.

వరండాలో ప్రభాకరం లోపలకి అడుగుపెట్టిన ద్వారానికి తిన్నగా లోపలికి ఓ గుమ్మం వుంది. దానికి మందమైన కర్టెన్ రింగుల సహాయంతో వేలాడుతోంది. ప్రకాశరావుగారు ఆ కర్టెన్ తొలగించి లోపలకి వెళ్ళబోతూ అంతలోనే ఆగి వెనక్కి తిరిగి ప్రభాకరంతో అన్నారు

"నీ సంగతే యాదమరచిన... నువ్వో పని జెయ్యి. అందాక పైన గదున్నది దాన్లవుండు. అవుట్ హౌస్ ఖాళీ చెయిపిస్త.. ఎనకసిరి దాన్ల వుందువుగాని..." అంటూ

"విజయా! ఒకసారిటొచ్చిపోవే" అని కేకేసాడు.

"ఆఁ" అన్న స్వరం వినిపించి, కొంచెం సేపయ్యేక ఎడమవైపున్న కర్టెన్ వెనుక కాలి మువ్వలు చప్పుడుచేసేయి. కళ్లద్దాల వెనుక నుంచి ప్రకాశరావు కళ్లు అసహనంగా చూసేయి. ప్రభాకరం కర్టెన్‌వైపు చూసేడు.

నలబై ఏళ్ళు పైబడి, తెల్లగా పొడవుగా, ఆ పొడవుకు తగ్గ వళ్ళుతో వున్న ఒక స్త్రీ తెర వత్తిగించి చూసింది. తెల్లటి ఫ్రేమున్న కళ్ళద్దాలు పెట్టుకున్న ఆమె నుదురుపైన, పాపిట దగ్గర్లో ఒక పాయ వెంట్రుకలు వెండితీగెల్లా కనిపిస్తున్నాయి.

ఆమె మొహం చూసేసరికి కంటిముందు లక్ష్మీదేవి ప్రత్యక్షమయినట్టు అనుభూతి చెందేడు ప్రభాకరం. అప్రయత్నంగానే రెండు చేతులూ జోడించేడు.

''మన ప్రభాకరం వొచ్చిండు... ఇకమీదొచ్చి పోతావుంటడు. ఆయన తిండీ, తిప్పలూ చూడు... మాంసం... గుడ్లు పెట్టొద్దు... ఆయన తినడు'' అని ఆమెతో చెప్పి లోపలకి పోయేడతను.

''గట్లనా... ఏం పేరన్నవు?'' నవ్వి అడిగిందామె.

''ప్రభాకరమమ్మా'' నమ్రతగా జవాబిచ్చేడు ప్రభాకరం.

''ఊరెక్కడ?''

''కాకినాడమ్మా''

''ఓ చిట్టిబ్బాయి పంపింది నిన్నే కదూ! శ్రీరాములుగారు మా చెప్పినరు... పోయి స్నానం చేసిరా'' అని లోపలకి తిరిగి,

''యశోదా... ఓ యశోదా'' అని కేక వేసింది.

''వస్తన్న'' అని ఆ మాట వెనకే, వడివడిగా వచ్చింది సన్నగా, నల్లగా వున్న ఓ స్త్రీ... సుమారు ఏభై పైనే వుంటుంది ఆమె వయస్సు. కొంచెం భుజాలు ముందుకు వంగి, గూని వుందేమో అని పిస్తుంది చూసేవారికి. పాత చీరె ఒకటి ముడుకుల కింద ఆరంగుళాల వరకే వుంది. చేతులకు మట్టిగాజులు నాలుగు వున్నాయి. మొహంలో బొట్టులేదు.

''ఈనకు గెస్టు రూం చూపు'' అని పురమాయించి ఆవిడ లోనికి వెళ్ళిపోయింది.

''రాండయ్యా'' అని అంటూ వరండాలో నుంచే ఓ పక్కగా వున్న మేడమెట్లమీదకి దారితీసిందామె. ఆమె వెనకాతలే తన సూట్‌కేస్ పట్టుకుని కదిలేడు ప్రభాకరం.

ఇరవైమెట్లు ఎక్కేక, మెట్లకి కుడివేపు వున్న ఓ గది తలుపు తోసి లోపలకి అడుగుపెట్టిందామె. అది మొదటిఫ్లోరు. ఎడమవేపు నుంచి పైకి మళ్ళీ మెట్లున్నాయి. తలెత్తి అటువేపు చూసి గదిలోకి నడిచేడు. ఆ గదిని గది అనడం కన్న హాలు అని చెప్పవచ్చు.

గది వెడల్పునా గుమ్మానికి ఎడమపక్కగా నాలుగడుగుల పొడవైన గ్లాస్ విండో ఒకటి పార్టీషన్లుతో, గోడలో అమర్చబడి వుంది. పైన ఓ సీలింగ్ ఫేన్, దానికింద ఓ డబుల్‌కాట్ బెడ్ వున్నాయి. ఒక కర్ర బీరువా ఆరడుగుల దిగదిలో ఓ పక్కగా వుంది. తన సూట్‌కేస్ ఓ వారగా వుంచేడు ప్రభాకరం.

యశోద బీరువా తెరిచి ఇస్త్రీ మడతలున్న బెడ్‌షీటు తీసి పక్కమీద పరుస్తూంది.

ఆమె వంక చూస్తున్నాడు ప్రభాకరం. వయస్సు తక్కువే వుండొచ్చు కానీ ఆమె, బాగా వయసు మీరిన దానిలా కనిపిస్తోంది. చాలా చురుగ్గా పనిచేస్తున్న ఆమె కదలికలను ఆసక్తిగా గమనించేడు.

ఆమెనడిగి కొన్ని వివరాలు తెలుసుకోవాలనిపించింది ప్రభాకరానికి.

''ఇంకెవరుంటరవ్వా... ఈ ఇంట్ల..''

''గీ బంగ్లలో మనుసులకి కరువున్నది బాబూ... నాలుగంతస్తులున్న నల్గురే వుంటరు. దొర, దొర్సానీ, ప్రశాంతూ, ప్రమీలమ్మే వుంటరు''

''దొరకెందరవ్వా పిల్లలు''

''ఎందరో ఎక్కడ. ఒక్కతే బిడ్డ... ఒక్కడే కొడుకాయె'' బిడ్డ పెండ్లయి అమెరికో గదేందో ఆ దేశంల వున్నది. బాబు బయటకు పోయిండు కాబోలు ఏరాత్రో వస్తడు''

ఇంతలో ''ఎసోదా? ఏడ పన్నవే'' అన్న దొరసాని పిలుపు కింద మెట్ల దగ్గిర్నుంచి వినిపించింది.

''వస్తన్న... దొర్సానీ...'' అంటూ యశోద కిందకిపోయింది.

ఆలోచన మాల తెగిపోయింది. బస్సు వేగంగా, పరుగుతీస్తోంది. ఎండ తీవ్రత ఎక్కువగానే వుంది.

ప్రభాకరం చెయ్యి జాపి తన బ్రీఫ్‌కేస్ దగ్గరకి లాక్కున్నాడు. అందులో సీల్ చేసిన టెండరు షెడ్యూల్ ఉంది. అది ఇస్తూ అన్నాడు ప్రకాశరావు...

''నువ్ రామగుండం పోయేంతవరకు ఒక్క గంటైతది. మధ్యాన్నం నే ఫోన్ చేసి చెప్పిన. వెంకటేశ్వర్రావు బస్టాండుకు సైకిల్‌మోటార్‌తో నొస్తడు. అక్కణ్ణే 'గింతంత ఏదో హొటల్లో




తిను. ఎనకసిరి మీరిద్దరు సింగరేణి ఆఫీసుకు పొయ్యి, మూడు గాకముందు టెండరిచ్చెయ్యి దానికి మంచి కాంపిటీషనుంటది. అదయి నంక టెండర్లిప్పినదాక వుండి, ఏమయిందో నాకు ఫోన్‌జెయ్యి... ఇంటన్నవా ఓయ్... ప్రభాకరం''

"వింటున్నా సార్! ఫోన్ చెయ్యమంటున్నరు కద!''

''అదే... ఎక్కడికి చేస్తవు''

''మీరెక్కడికి చెపితే, అక్కడికే చేస్తా సార్!''

''హైద్రాబాద్ చెయ్యకు... నేనూ, శ్రీరాములుగార్నితోల్కొని కొత్తగూడెం టెండర్ల పనిమీద పోవాల్సున్నది. ఆడ సెవెన్‌హిల్స్ హొటల్కి ఫోన్ జెయ్యి మనకిగిన టెండర్‌వస్తె. టెండర్ రాకపోతే నువ్వు సైటుకుపో... అక్కడ లారీలు రెండు తీస్కాని, ఎల్లుండికల్లా నువ్విక్కడుండాలె. సిమెంటు రేకులు తీస్క ఈ రోజు పోయెడిదుంది. ఇరవై తారీఖు... ఇరవై ఆరున ఇన్‌కమ్‌టాక్సు ఎస్సెస్‌మెంటు, నువ్వు లేకపోతే కాదు. ఆ 3233 లారీకేదో రిపేరున్నది అన్నాడు నారాయణ. దాన్ని రమ్మనమని చెప్పు. టెండరు జాగ్రత్త. మన రేటు లీక్ జెయ్యకు ఎవ్వర్తో'' అని వివరంగా చెప్పి.

ప్రభాకరం దగ్గిరున్న బ్రీఫ్‌కేస్, తన ముందుకు లాక్కుని సరిచూసి, లాక్‌చేసి, ఆ తాళం ప్రభాకరానికిచ్చేడతను. స్వయంగా ఆ తెల్లవారుఝామున తానే కారు నడుపుకుంటూ వచ్చి ప్రభాకరాన్ని గౌలిగూడా బస్టాండులో బస్సెక్కించి బస్సు కదిలేక ఇంటికి పోయేడాయన.

ప్రభాకరం బస్సు దిగేనరికి సరిగ్గా పావు తక్కువ రెండయ్యింది సమయం. వెంకటేశ్వర్రావు మోటార్ సైకిల్ దగ్గిర నిలబడి చెయ్యి ఊపేడు. ఇద్దరూ కలిసి గబగబా కరీంఖాన్ హొటలుకి పోయేరు. వెంకటేశ్వర్రావు భోజనం చేసొచ్చేను నాకేం వద్దు అనడంతో ప్రభాకరం ఒక్కడే గబగబ తన భోజనం పూర్తికానిచ్చేడు.

హొటల్నుంచి బయటకొచ్చేక, ప్రభాకరం సిగరెట్టు వెలిగించడం చూసి కాస్త ఆశ్చర్యపడి అడిగేడు వెంకటేశ్వర్రావు.

''ఏమయ్యో... ప్రభాకరం ఇదెప్పట్నుంచి.. మందుకూడా...'' నవ్వుతూ అతనడిగేనరికి,

''ఇంకాలేదు... నువ్వు పోయిస్తె తాగుతానేమో ఇకనుండి'' అని నవ్వుతూనే జవాబిచ్చేడు ప్రభాకరం.

''నడు... నడు... జాదా హుషారయినవులే. ఇదంతా పెండ్లయేదాకనేలే... తర్వాత అన్నీ బందయితయిలే... లేటయితాంది పద''

ప్రభాకరం మోటార్ సైకిలు వెనుక కూర్చోగానే, వెంకటేశ్వర్రావు దాన్ని ముందుకి దూకించేడు.

★ ★ ★

సింగరేణి ఆఫీసు ఆవరణలో ఆగింది రాజ్‌దూత్. వాచీ చూసుకున్నాడు ప్రభాకరం. సమయం రెండున్నర కావస్తోంది. మూడు గంటలు దాటిపోతే, టెండరు వేయటానికి వీల్లేదు. ఇంకా వెంకటేశ్వరరావు స్టాండు వేస్తూనే ఉన్నాడు, అంతలోనే అతన్నెరిగిన వ్యక్తెవరో గబగబా అక్కడికి పరుగులాంటి నడకతో వచ్చేడు.

''గంటనుంచీ మీ కోసమే చూస్తున్నామండీ వెంకటేశ్వర్రావుగారూ! ప్రకాశరావుగారు రాలేదా! టెండరు మీరే వేస్తున్నారా!'' అంటూ అతడు పక్కనే ఉన్న ప్రభాకరాన్ని పట్టించుకోకుండా ఆత్రుతగా అడిగేడు. ఆ వ్యక్తి తెల్లగా, పొడవుగా ఉన్నాడు. కళ్లద్దాల వెనుకనుంచి అతని కళ్లల్లో కనబడుతున్న కంగారెందుకో ప్రభాకరానికి అర్థం కాలేదు. కొంతమంది కంట్రాక్టర్లు కాబోలు, ఆ ఆవరణలోవున్న చెట్ల కింద చేరి ఏదో విషయాలు మాట్లాడుకుంటున్నారు. కేంటీన్ కుర్రాడు చేతిలో టీ గ్లాసులున్న చట్రం పట్టుకుని, వాళ్లల్లో కొందరికీ టీ సప్లయి చేస్తున్నాడు. నాలుగైదు కార్లూ, డజను పైగా టూవీలర్లూ ఆ ఆవరణలో పార్కు చేసి వున్నాయి.

వెంకటేశ్వర్రావు పేంటు పైకి సర్దుకుంటూ అతనికి జవాబు చెప్పేడు...

''ప్రకాశరావుగారు రాలేదు. మా ప్రభాకరాన్ని పంపిండు ప్రసాద్‌భాయ్. సంగతేంది... టెండర్లు పోస్ట్‌పోన్ అయినయ్యా?'' ప్రసాద్ వెంటనే కారణం చెప్పలేదు.

''చిన్నమాట.. అలా పక్కకి రండి'' అని

వెంకటేశ్వర్రావుని పిలిచేడు. ప్రభాకరం వంక సంశయంగా చూసేడు.

వెంకటేశ్వర్రావు నిశితంగా చూసేడు ప్రసాద్‌వంక.

''కతేంది ప్రసాద్.. టెండరు ముచ్చటా.. వేరే ముచ్చటేదన్నా వున్నదా ఏం?'' అనడిగేడు సూటిగా.

''టెండరు గురించే భాయ్'' అసహనంగా అన్నాడు అతను.

''టెండరు ముచ్చటయితే ప్రభాకరం మల్ల వుండాలె. దొర ఆయన్ని ఒప్పజెప్పిండు. రావేమే ప్రభాకరం జర ఈన చెప్పేదేందో వినిపోదాం రారాదూ'' అని పిలిచేడు.

''మీరూ రండి'' అని ప్రసాద్ ప్రభాకరాన్ని మరి తప్పేది లేక పిలిచేడు.

టైము చూసుకున్నాడు ప్రభాకరం.

''నేను టెండరు వేయాలి... టైము లేదు'' అన్నాడు.

''ఆ విషయమే కొంచెం మాట్లాడాల్సి వుంది. ఇంకా అరగంట టైముంది. నేను చెప్పేది విని... ఆ తర్వాత వేయొచ్చులెండి...'' అని ఇంకా ప్రభాకరం కదలక పోవటంతో... ''అయిదే నిమిషాలు... ప్లీజ్'' అని రిక్వెస్టు చేసేడు.

వెంకటేశ్వర్రావు రమ్మని, కనుసైగ చేయడంతో, అటు కదిలేడు ప్రభాకరం వారితోబాటుగా. ప్రసాద్ వాళ్లిద్దర్నీ ఎవరూ లేని ఒక చెట్టుకిందకి తీసుకుపోయేడు. వెంకటేశ్వర్రావుని ఎరిగున్న చాలామంది అతన్ని నవ్వుతూ పలకరించేరు. వాళ్లల్లో కొందరు ప్రభాకరాన్ని కూడా తెలిసున్నవారు, అతన్ని కూడా విష్ చేసేరు.

అక్కడికి వెళ్లేక ప్రసాద్ క్లుప్తంగా, విషయం చెప్పేడు.

''మా కంట్రాక్టరు గుణరెడ్డి... మీకు తెలిసే వుంటుంది. ఓపెన్‌కాస్ట్ దగ్గిర మాకీ మధ్య కోటి రూపాయల వర్క్ ఒకటి వచ్చింది. ఆ వర్క్ పక్కనే, ఈ గారేజి షెడ్ పనీ వుంది. వర్క్‌లో, వర్క్‌గా కలిసిపోతుందనీ, మా మెయిన్‌టెయినెన్స్ ఖర్చు కలిసొస్తుందనీ మేం ఈ టెండరు తీసుకోవాలనుకుంటున్నాం'' అని ఒక్క లిప్త కాలం, ఊపిరి తీసుకోడానికా అన్నట్టు ఆగేడు. చేతి రుమాలుతో మొహం తుడుచుకున్నాడు.

వెంకటేశ్వర్రావు విషయం గ్రహించినట్లున్నాడు. అయినా అతనేం బయట పడలేదు. ప్రభాకరానికి సంగతేదో బొత్తిగా అంతుపట్టలేదు. అతన్లో అసహనం పెరిగిపోతోంది. మరోసారి వాచీ చూసుకున్నాడు.

ప్రసాద్ మరి ఆలస్యం చెయ్యకుండా విషయంలోకి సూటిగా దిగిపోయేడు.

''మొత్తం మనం పదకొండుమంది ఈ షెడ్యూళ్లు తీసుకున్న వాళ్లం. అంటే మేం కాక మరో పదిమంది ఈ వర్క్‌కి మాతో కాంపిటీషన్లో వున్నారు. ఇంతకుముందే మీరు తప్ప మిగిలిన వాళ్లందరూ, ఈ వర్క్ మాకు వదిలెయ్యడానికి వప్పుకున్నారు. మీరు అప్పటికింకా రాలేదు. సంగతి మీకు చెప్పేను. మీరు కూడా వప్పుకునేటట్లయితే నాతో మీ షెడ్యూల్ తీసుకుని, ఆ మూలనున్న గెస్ట్ హవుస్‌కు రండి. ముప్ఫయి అయిదువేలకు స్టేట్ బేంక్ ఆఫ్ హైద్రాబాద్‌మీద, పదిరోజుల తర్వాత డేట్‌వేసి చెక్కు .ఇచ్చేస్తాం. అప్పటికి వర్క్ ఎల్.ఓ.ఐ. సాంక్షన్ అయిపోతుంది.

ఎవరికీ అనుమానం రాకుండా వుండేందుగ్గాను మీ షెడ్యూల్ ఓపెన్ చేసి, కొన్ని రేట్లు మార్చేద్దాం. మీ ఫిగర్, మాదానికంటే ఎక్కువ చేసేస్తాం కనుక, మనం ఇట్లా రింగ్ ఫార్మ్ అయినట్లు ఎవరూ గుర్తుపట్టలేరు. ఆఫీసులో కూడా మేం మేనేజి చేసుకోగలం'' అని చెప్పి,

''మీరేం నిర్ణయించుకున్నా మీ ఇష్టం. ఓ ఐదు నిమిషాల్లో నాకు మీరు ఏం నిర్ణయించుకున్నదీ చెప్పండి'' అని పక్కకిపోయి, ఎవర్నో పిలిచేడు ప్రసాద్. అతన్తోమాట్లాడుతూ అక్కడే నిలబడ్డాడు.

అది ఊహించని పరిస్థితి. సమయమూ ఆట్టేలేదు. ఏం చెయ్యాలా అన్నది ప్రభాకరం వెంటనే తేల్చుకోలేకపోయేడు. అంతసీనియర్ వెంకటేశ్వర్రావు కూడా కాసేపు ఊగిసలాడేడు.

ప్రభాకరానికి ఇంకా ఏదో అస్పష్టంగావుంది. మరికొంచెం వివరాలు కావాలి. వెంటనే ఏం అడగాలో ఫ్లాష్‌లా ఆలోచనవచ్చింది. రాగానే, సైగ చేసేడు ప్రసాద్‌కి. అతను హుషారుగా




వచ్చేడు.

"చిన్న ఇన్‌ఫర్‌మేషన్... ప్రసాద్‌గారూ! మి గిలిన అందరు కంట్రాక్టర్లూ ఒప్పుకున్నారని చెప్పేరు నిజమేనా?"

అతను నవ్వేడు "మీకా అనుమానం అఖ్ఖర్లే దు. వాళ్లంతా వాళ్ల పెడ్యూళ్లు మాకిచ్చి, తలో ముప్పై అయిదువేల చెక్కూ తీసుకున్నారు. అది వాస్తవం. మీరే మిగిలిపోయేరు"

"సరే... నాకిది చెప్పండి. మీరెంతకు కోట్ చేస్తున్నారు?" సూటిగా తనకి కావలసిన వివరం అడిగేడు.

ప్రసాద్ జవాబు చెప్పటానికిసంకోచించేడు.

"మీరు మీ ఫిగర్ చెపితే... మేం నిర్ణ యించుకోవడానికి వీలవుతుంది. లేకపోతే, మేం తిన్నగా పోయి టెండరు వేసుకుంటాం. ప్రకాశరావుగారు వేసి రమ్మనమనే పంపారు. ఆయన గురించి మీకు బాగా తెలును అనే అనుకుంటాను. మీరిచ్చే ముప్పై అయిదు వేలకు, ఆయనేం కక్కుర్తిపడే మనిషి కాదన్న సంగతి మీకు నేను వేరే చెప్పక్కర్లేదు. పద వెంకటేశ్వర్రావ్ మనం పోదాం" అని కదల బోయేడు ప్రభాకరం.

"సారీ... ప్రభాకరంగారూ! ఇందులో రహ స్యమేం లేదులెండి. మొత్తం ఎస్టిమేషన్ కాస్ట్ ముప్ఫయి రెండు లక్షలు కదా! మా మార్జిన్ అయిదు లక్షలూ, మీ పది మందికీ ఇచ్చే మూడున్నర లక్షలూ కలిపి నలభై లక్షల ఏభయివేల చిల్లరవుంది మారేటు. మిగిలిన వాళ్లరేట్లు అంతకంటే ఎక్కువ వుండేలా మార్చేము. అదీ నేను చెప్పవలసింది. ఇంక నిర్ణయంమీదే" అన్నాడతను. అతను సరైన ఫిగర్‌కాక బాగా ఎక్కువ చెప్పాడేమో అనుకు న్నాడు ప్రభాకరం అతడు కాస్త అంకెల దగ్గిర తడుముకోవటం చూసి.

"సరే" ఒక్కక్షణం మాత్రమే ఆలోచించి ప్రసాద్‌తో అన్నాడు ప్రభాకరం.

"ఇప్పుడు టైము రెండూ నలభై అయ్యింది. రెండూ ఏభయికల్లా మిమ్మల్ని కలుస్తాను వస్తా ను"

"వెంకటేశ్వర్రావు... స్టార్టు చెయ్యి సైకిల్ మోటార్" అని వెంకటేశ్వర్రావుని హెచ్చరించే డు. తనతో ఏం మాట్లాడకుండా ఏ సంగతీ చర్చించకుండా బండి స్టార్టు చెయ్యమంటున్న ప్రభాకరాన్ని వినుగ్గా చూసేడు వెంకటేశ్వ ర్రావు.

"ఏడకిపోదమంటున్నావు. నీ ముచ్చటేందో నాకర్థమయి లేదు" అని అంటున్న అతన్ని భుజం మీద చెయ్యివేసి రాజ్‌దూత్ దగ్గిరకు లాక్కొచ్చేడు.

"ముందు పోస్టాఫీసుకి పోనియ్యి. లేకపోతే దగ్గర్లో ఏ ఫోన్ వుంటే ఆడికి పోనియ్యి" అంటూ.

వెంకటేశ్వర్రావు మళ్లీ మాట్లాడకుండా ఒకే ఒక్క కిక్కుతో బండి స్టార్టు చేసి, ప్రభాకరం ఎక్కీ ఎక్కగానే శరవేగంగా పోనిచ్చేడు. ఐరన్‌గే టు దాటి బయటకు పోతున్న వాళ్లిద్దర్నీ చూసి ప్రసాద్ అయోమయంలో పడిపోయేడు. మళ్లీ ప్రభాకరం వచ్చేదాకా అతనికి టెన్షన్ తప్పలే దు.

తారాజువ్వలా దూసుకుపోయి దగ్గర్లో ఉన్న పోస్టాఫీసు దగ్గిర ఆగింది వాళ్లమోటార్ సైకి లు. దిగీ దిగడంతోనే ఎస్‌టీడీలో కొత్తగూడెం, సెవెన్‌హిల్స్ రిసెప్షనిస్టును ఎంక్వైరీ చేసేడు ప్రభాకరం. వాళ్లు రూమ్, రిజర్వ్ చేసుకున్నా రుకానీ, ఇంకా చెకిన్ కాలేదని చెప్పిందామె.

ఫోన్ పెట్టేసి ఆలోచనలో మునిగిపోయేడు ప్రభాకరం.

వెంకటేశ్వర్రావు అంతవరకు ఎలాగో ఓపిక పట్టేడు. కానీ మరింక అతడు వుండలేక చిర్గాగ్గా అడిగేడు.

"ఏందయ్యా... ఏం సంగతి. ముంగోలె మాట్లాడవ్. టయిం గడిచిపోతాంది. టెండరే సుడున్నదా? లేదా? దేనికంత గనం ఆలో సించుడు"

మరొక్కసారి డయల్ చేసి, ప్రకాశరావుగారు రాలేదని కన్‌ఫర్మ్ చేసుకున్నాడు. హైద్రాబాద్‌కి కూడా ఒకసారి ఇంటికి ఫోన్ చేసేడు. ప్రకాశ రావు కొడుకు ప్రశాంత్ ఫోన్ ఎత్తి వాళ్లు బయల్దేరిపోయి చాలా సేపయిందని చెప్పేక... ప్రభాకరం వెంటనే నిర్ణయానికొచ్చేడు. రెండూ ఏభై దగ్గరవుతోంది సమయం.

''రండి వెంకటేశ్వర్రావుగారూ పోదాం'' అని బయటకు కదిలేడు. అతని వెనుకనే అడుగేస్తూ, అతని చొక్కా పట్టి నిలవరించేడు వెంకటేశ్వర్రావు.

''సంగతేందోముందు చెప్పు'' అంటూ

తాపీగా అన్నాడు ప్రభాకరం... ''మన షెడ్యూల్‌లో మనం కోట్ చేసిన రేటు, నలభై రెండు లక్షల చిల్లర. టెండరు మనకే రావాలంటే శ్రీరాములుగారు ముప్ఫై తొమ్మిది లక్షల చిల్లరకే వేయమన్నారు. కానీ ప్రకాశరావుగారు ఆమార్జిన్ చాలదని, వుడ్‌వర్క్, మరికొన్ని వర్క్‌ల రేట్లు పెంచి ఆ ఫిగర్‌కు తీసుకొచ్చేరు.

వస్తేరానీ... లేకపోతే కొత్తగూడెం వర్కు వుందికదా! అని ఆయన వుద్దేశం. అంటే ఏమైందన్న మాట. మనం ఇలాగే టెండర్ దఖల్ చేస్తే మనకది నిజంగా రాదు. ఆ గుణరెడ్డిగానికే పోతుంది. అర్థమైందా. మనం నిజంగా రింగ్ కాకపోయినా, రింగయినట్టే లెక్క. కనుక ఇపుడు పోయి ఆ ప్రసాద్ దగ్గిర చెక్ తీసుకుంటిమా, టెండర్ రాకపోయినా, ముప్ఫయి అయిదు వేలన్న వొస్తయిగదా! ఏమంటావు వెంకటేశ్వర్రావూ'' అని అతని వంక నవ్వుతూ చూసేడు.

వెంకటేశ్వర్రావు ప్రభాకరాన్ని కౌగలించుకున్నాడు. ''నీయవ్వ నువ్వెంత చాల్‌బాజ్‌గానివయినవే... చూస్తూంటే దొరను మల్ల మింగేటట్టున్నవు. ఛల్‌ఛల్ పోదాం పట్టు. ఆ ప్రసాద్ గాడు కాలుకాలిన పిల్లి లెక్క తిర్గతావుంటాడు'' అని హుషారుగా పోయి బండి స్టార్టు చేసేడు.

తోవలో వెంకటేశ్వర్రావు ప్రభాకరాన్ని హెచ్చరించేడు. ''ఆ ప్రసాద్‌గానితో నువ్వే మాట్లాడు. నేనేమన. వాడు వక్కా బద్మాష్. సంగతి పసిగట్టిండంటే ఇచ్చే పైనల్ ఇయ్యడు''

మోటార్ సైకిల్ దిగి తన బ్రీఫ్‌కేస్ పట్టుకు నిలబడిన ప్రభాకరం దగ్గరకి పరుగెడుతున్నట్టే వచ్చేడు ప్రసాద్.

''టైములేదు... ఏం చేస్తారు చెప్పండి. కలుస్తరా లేదా?'' ఆదుర్దాగా అడిగేడు.





ఎంతో ప్రయాసతో మిగిలిన అందర్నీ వొప్పించేరువాళ్లు. ఈ ఒక్క టెండరూ తమకు వ్యతిరేకమైతే, చేతి కొచ్చిన స్వీటు నోటికందకుండా పోతుందేమోనని అతను భయపడుతున్నాడు. తన నడగడమేతప్ప ఇంతవరకూ ఏదీ తేల్చి చెప్పనందుకు, అతనికి వీళ్లిద్దరి మీదా పీకలదాకా కోపం వచ్చింది. పక్కనే ఉన్న గెస్ట్ హవుస్‌లో గుణరెడ్డి ముళ్లమీద కూర్చున్నట్టు కూర్చున్నాడు.

ప్రభాకరం ఒకటే మాట అన్నాడు.

''ప్రకాశరావుగారి పేరుతో ముప్ఫయి అయిదు వేలకి చెక్కు రాసివ్వండి''

ప్రసాద్ మొహం పువ్వులా వికసించింది. తనను తానే అభినందించుకున్నాడు.

ముందుకు చెయ్యి చాచేడతను.

''మీ షెడ్యూల్ ఇటియ్యండి. ఫిగర్ ఎంతో చూసి రేట్లు మార్చెయ్యాలి తొందరగా'' అన్నాడు.

''ముందు చెక్కిచ్చి, అప్పుడు తీసుకోండి'' నిక్కచ్చిగా అన్నాడు ప్రభాకరం. అతనివంక తీక్షణంగా చూసేడు ప్రసాద్. వెంకటేశ్వర్రావు ఎటో చూస్తూ నిలబడ్డాడు.

గుణరెడ్డి సంతకంతోవున్న చెక్కు మీద ప్రకాశరావు పేరు రాసి, పుస్తకంలోంచి చింపి ఇచ్చేడు ప్రసాద్.

ప్రభాకరం, అతని చేతికి టెండర్ షెడ్యూలిచ్చేడు. అతను సీల్ చింపబోతూంటే వారించేడు.

''సీల్ తియ్యక్కర్లేదు. అలాగే బాక్సులో వెయ్యండి ప్రసాద్‌గారూ. ఎందుకంటే మేం కోట్ చేసిన రేటు, నలభై రెండు లక్షల పదహారువేల రెండు వందల డెబ్బై మూడు రూపాయలు. కనుక ఫిగర్ మార్చే అవసరం రాదు. మీరు నన్ను పూర్తిగా నమ్మొచ్చు. వెళ్లి రండి'' అన్నాడు.

అతన్తో అలా చెప్పి వెంకటేశ్వర్రావు భుజంమీద చెయ్యివేసి పక్కకి నడిచి, సిగరెట్ తీసి వెలిగించేడు ప్రభాకరం.

ప్రసాద్ మొహం పాలిపోయింది. తేలు కరిచిన వాళ్లా అయిపోయి, కంగారుగా చేతిలో సీల్డ్ షెడ్యూల్ వంకా, వాచీవంకా చూసుకున్నాడు. సరిగ్గా మూడే నిముషాలు వుంది మూడు

కావటానికి. ప్రభాకరాన్ని మింగేసేలా చూస్తూ పరుగెత్తుకుంటూ వెళ్లి బాక్సులోపడేశాడు ఆ కవరు.

''రావయ్యా... మగడా! చాయ్ తాగుదువు'' అని వెంకటేశ్వర్రావు ప్రభాకరాన్ని కేంటీన్‌కు లాక్కుపోయేడు.

★ ★ ★

నాలుగున్నర గంటలకు టెండర్లు తీసినపు డు, అందరూ మొక్కుబడిగా, హాల్లో కూర్చున్నా రు. వాళ్లందరికీ లోయస్ట్ టెండర్ ఎవరిదో, ముందుగానే తెలునన్న సంగతి ఆ అధికారుల కి తెలీదు. సాధారణంగా ఈ రకం, రింగ్‌ఫార్మ్ కావటం అడపాదడపా జరుగుతూనే వుంటుంది. ఒక్కోసారి కొందరు బాగా చితికిపో యిన కంట్రాక్టర్లు డమ్మీగా కేవలం రింగ్‌మనీ కోసమే టెండర్లు వేసిన సమయాలూ వున్నాయి.

ఒక వర్క్‌లో కంట్రాక్టర్లు రింగ్ అయ్యేరని తెలిస్తే, వాళ్లని డిపార్ట్‌మెంట్ బ్లాక్‌లిస్ట్‌లో వుంచుతుంది. అందుకే ఆ పని చాలా రహ స్యంగా చేస్తారు కంట్రాక్టర్లు. రింగ్‌డ్ టెండర్ అన్న అనుమానం వస్తే, ఆ టెండరు కాన్సిల్ చేసి మళ్లీ వేరే టెండర్లు పిలిచే హక్కు డిపార్ట్‌మెంటుకి ఉంది.

టెండర్లన్నీ చదవటం పూర్తయ్యింది. కంట్రాక్టర్లందరూ, డిఫరెన్సు స్టేటుమెంట్లు రాసుకున్నారు. లోయస్ట్ టెండరు గుణరెడ్డి దేనని డిక్లేర్ చేసేసేరు. లెటర్ ఆఫ్ ఇంటెంట్ ఇచ్చేక పని ప్రారంభించమని చెప్పేరు.

అందరికీ కాఫీ ఫలహారాలు, గెస్ట్ హవుసులో ఏర్పాటు చేసేడు గుణరెడ్డి. సమయం ఆరవు తూ వుండటంతో, కొంచెం పని చూసుకోవలసి వుంది రాలేమని చెప్పి సారీ చెప్పి బయటకు వచ్చేసేరు వెంకటేశ్వర్రావు, ప్రభాకరం.

ప్రభాకరాన్ని నేరుగా తన ఇంటికి తీసుకు పోవాలనుకున్నాడు వెంకటేశ్వర్రావు.

''వద్దు... వెంకటేశ్వర్రావు. నేను సైటుకు బండి తీసుకుపోత''

''మీ అక్క మంచిగ వండుతది. తిని పండమంటుంటె నక్రాల్ జేస్తున్నవేమయ్యా. జరుండు... నీ పని చెపుత'' అని ప్రభాకరాన్ని బలవంతంగా లాక్కువెళ్లేడు వెంకటేశ్వర్రావు.

ముందు గదిలో కూర్చుండబెట్టి లోపలికెళ్లి వస్తూనే మెక్‌డొవెల్ ప్రీమియర్, విస్కీబాటిలు ఓ చేత్తో, నీళ్లతో ఉన్న జగ్ రెండో చేత్తో పట్టుకు వచ్చేడు. గోడకున్న ఆల్మైరా తెరిచి రెండు గాజు గ్లాసులు బయటకు తీసి టీపాయ్ మీద పెట్టేడు. అంతసేపూ అతను సీరియస్‌గా వున్నాడు.

ప్రభాకరం కొంచెం బెదిరేడు. వెంటేశ్వ ర్రావు తాగుతాడని తెలుసుగానీ ఇంత ఇదిగా ఇంట్లోనే తాగుతాడనుకోలే.

లేచి గబగబా వంటింటి గది గుమ్మం దగ్గిరకి వెళ్లేడు. వంటింటి గుమ్మం మీద రెండు చేతులూవేసి,

''నువ్ నూస్తలేవక్కా... ఏం జేస్తున్నడో మీ ఆయన'' అని అటువేపు తిరిగి స్టవ్వు దగ్గిర నిలబడిన శ్యామలతో కంప్లయింటు చేసేడు.

శ్యామల వెనక్కి తిరిగి ప్రభాకరాన్ని చూసి పలకరింపుగా నవ్వింది.

సన్నగా, నాజూగ్గా వుంటుందామె. చామన చాయే అయినా మంచి కళగల మొహం. ఆవిడ నవ్వితే ఎంత కొత్తవాళ్లైనా ఆత్మీయత ననుభవిస్తారు. ఎప్పుడు ప్రభాకరం వెళ్లినా, సైటునుంచి వెంకటేశ్వర్రావు కోసం ఎవరు వెళ్లినా ఆదరించి తినడానికేదో ఒకటి పెట్టి గానీ పంపదు శ్యామల. వెంకటేశ్వర్రావు మీద ఎందరికెంత కోపంవున్నా ఆమె అంటే అంద రికీ చాలా అభిమానం. వెంకటేశ్వర్రావుకి కూడా భార్య అంటే చాలా గురి. తన అభివృద్ధికి పరోక్షంగా ఆమే కారకురాలన్న భావం అతన్లో చాలా బలంగా వుంది.

కొత్త చీరె కట్టుకుని ఉందామె. వేయించి ఉప్పూ, కారంచల్లిన పచ్చిబఠాణీ గింజల్ని ఓ ప్లేటులో వేసి, స్పూన్ గుచ్చి అతని దగ్గిరగా వచ్చి అందిస్తూ అందామె...

''ఈ ఒక్కనాటికి పోనీలే... తమ్మీ... నేనే తెచ్చుకోమన్నలే'' ప్రభాకరం ఏదో అనబో తుంటే చేత్తో వారించింది.

''ఈ దినం మా లగ్గం రోజుతమ్మీ'' చల్లగా నవ్వింది. నోరుమూసుకుని ప్రభాకరం వెనక్కి

వచ్చి వెంకటేశ్వర్రావు ముందు కూలబడి బఠానీలు తినడం మొదలుపెట్టేడు.

ఎవరో కుర్రాణ్ణి పిలిచి బెత్తాయించినట్లున్నాడు వెంకటేశ్వర్రావు. వాడు పోయి ఫ్లాస్కుతో ఐసూ, నాలుగు సోడాలూ, తెచ్చిపెట్టేడు.

ఆ సరంజామా అంతా టీపాయ్ మీద నీటుగా సర్దేడు వెంకటేశ్వర్రావు. తర్వాత స్థిమితంగా కూచుని బాటిల్‌లోని విస్కీ రెండు గ్లాసుల్లోకి ఓ లెక్క ప్రకారం పోసేడు.

గ్లాసులు పైకెత్తి రెండు గ్లాసుల్లో వున్న విస్కీ సమానంగా వుందనిపించేక సోడా సీసాలు ఓపెన్ చేసి ఆ గ్లాసుల్లో పోసేడు. ఆ పని చేస్తున్నంతసేపూ అతనేం మాట్లాడలేదు.

వెంకటేశ్వర్రావు చేత్తో గ్లాసు నొకదాన్ని ఎత్తిపట్టుకుని ప్రభాకరం వైపు జాచేడు.

"నువ్వు సిగరెట్లు దాగుతున్నవుగా... నేను పోస్తే మందు మల్ల తాగుతవుగా... ఇధ్గో పట్టు ఎంత తాగుతవో... నేను చూస్త"

ప్రభాకరం తడబడ్డాడు. కొంచెం వెనక్కు తగ్గేడు.

"అయ్యయ్యో గిదేంది. నేను నవ్వుతాలకు అంటి... నిజం చేస్తవా... ఏంది?నాకు నీతిండొద్దు, నీ తాగుడొద్దు. ఏదో లారీ పట్టుకు సైటుకు పోత" అనేసి లేచిపోయేడు.

"ఏడకి పోతవ్‌బే... సైటు సైటు అనబడితివి. ఏందికత... ఏ పోరినైనా తగులుకున్నవా ఏంది! గా రంగారావుగానిలెక్క దూ.. వాడు నాకు చుట్టమయిండు. గానీ నా ఇజ్జత్ మొత్తం తీసిండు"

రంగారావు ఏదో చేసాడని తెలిసింది.

"ఏమైంది... రంగారావుకి"

"ఏమైతది... చెయ్యరాని పని చేస్తే ఏమన్న అయితది. గా బుల్లెబ్బాయిగాని రెండో కూతుర్ని తగులుకున్నాడు పిస్సపోరడు. వాని పైసల్, గియిసల్ మల్లదానికే బెట్టిండు. సిమ్మెంటు అమ్ముడు సురూ చేసిండు. దొరకది తెల్సిపాయె. మెత్తగా తిట్టి ఎల్లగొట్టిండు. ఆ లంగపోరి వీనికేదో జబ్బు తగిలించింది. చాన దినాలు దాచిపెట్టిండు. బాగా ముదిరిపోయినంక బయటవడ్డది. గిప్పుడు కరీంనగరం దవాఖానలో చేర్పిన్రు. అందరు తిట్టుడేనాయె. వానికింక పెండ్లికాదు. నౌకరీమల్ల కష్టమే" రంగారావుని తల్చుకుని కాస్త జాలిపడ్డాడతను.

ప్రభాకరం కూడా కాసేపు రంగారావు గురించి బాధపడ్డాడు.

"ఎటో జూడబడితివి. తాగమంటుంటే" అప్పటికే తన గ్లాసులోని విస్కీ సగం పైగా తాగేసేడతను.

"నోరు పగల్దీసిపోస్త... తాగు" గద్దించేడు.

"చంపుతె చంపు... నేతాగ... నాకొద్దు... ప్రశాంత్ ఎంత బలవంతం చేసినా నేతాగలే... ఈడ తాగుతనా... నాకు మంచి గుండదది తాగనీకి. ఆ వాసనమల్ల నాకు పడదు"

ప్రశాంత్‌తో బాగ సోపతయిందిలే నీకు. వాడొకడు. అన్నీ ఉన్నా అల్లుని నోట్లో శని వుందన్నట్టయిండు. మంచి గున్నడా? ఏం జేస్తున్నడు" కుతూహలంగా అడిగేడు వెంకటేశ్వర్రావు.

ప్రభాకరం మనసులో ప్రకాశరావు కొడుకు ప్రశాంత్ మెదిలేడు. అతన్తో ప్రభాకరానికి బాగా స్నేహమయింది. సిగరెట్ బాగా వ్యసనమవడానికి అతనే కారణం.

మొదటిసారి ప్రశాంత్‌ని చూడగానే ఎందుకోగాని బలమైన ఎడ్మిరేషన్ కలిగింది ప్రభాకరానికి అతడిపట్ల. కొడుకు పక్కన నిలబడితే, తండ్రి అతని భుజాల దగ్గిరకి కూడా రాడు. పచ్చని పసిమిఛాయతో, ఆరడుగులపైనే వున్న ఆ అజానుబాహువైన యువకుణ్ణిచూడగానే పద్మనాయక రాజులు ఇలాగేవుండేవారు కాబోలు అనుకున్నాడు ప్రభాకరం.

ముచ్చటైన ఉంగరాల జుత్తు, ఎత్తైన నుదురు, గ్రీకు వీరుల నాసిక వంటి నాసిక, పొడవుకు తగ్గ ఒళ్లుతో చాలా మేన్లీగా వుంటాడు ప్రశాంత్.

అతని కళ్లు చాలా విశాలంగా వుండి, వివేకానందుడి నేత్రాల్లా భావగంభీరంగా వుంటాయి. పాలల్లా తెల్లగా వుండే ఆ నేత్రాలు కోపం వస్తే రక్తవర్ణం ఇట్టే దాల్చటం చూస్తే అద్భుతం అనిపిస్తుంది.

"పలుకవు" హెచ్చరించేడు వెంకటేశ్వ




్రావు.

"ఏం లే... ప్రశాంతు గురించి అడిగినవు కదా! ఏం చేస్తడాయన. తిని, తిరగడమేగా... సిన్మాలు చూసుడు... బార్లల్ల తాగుడు ఆయన జేసెడి పన్లు" జవాబిచ్చేడు ప్రభాకరం.

వెంకటేశ్వర్రావు తల పంకించేడు.

"ఈ ఒక్కగ్లాసు తాగు ప్రభాకరం. ఎక్కువద్దులే... మన పన్లల్ల టెన్షనుంటదయ్యా! గాటెన్షను పోవాల్నంటే దీన్ని మించింది లేదు తెల్సా..." ఒక్క నిముషం ఊరుకుని,

"నిన్నేమో అనుకుంటినయ్యా... వచ్చినప్పటి తీరు లేవు. చాలా మారినవు. గందుకే దొర నిన్ను ఇడుస్తలేడు" గ్లాసెత్తి నోట్లో పోసుకున్నాడు.

"పట్టుకుంటే మాత్రం నాకేం లాభంవున్నది వెంకటేశ్వర్రావూ! మొదట్లో రెండొందలయాభై జీతమిచ్చెటోడు. ఈనాటికి అయిదొందలు చేసిండు. కాదంటలే... గానీ చేసెకష్టం ఆయనకి పట్టదాయె. ఇన్‌కంటాక్సు లెక్కలు రాస్తే సంవత్సరానికి అయిదువేలు బోనసు ఇస్తనన్నడని, ఆర్నెల్లు రాత్రింబగళ్లు ఆడిటర్ల ఆఫీసులో గాడిద చాకిరీ చేసి లెక్కలు మొత్తం నేర్చి, రాసిచ్చినా చెల్లె పెండ్లున్నది పైసల్ కావాలిమ్మని రెండు నెల్లనంది అడుగుతున్న గానీ ఇగో అగో అంటాడేకానీ ఇచ్చెడిది కనబడదు. పైపెచ్చు ఏం జేస్తున్నడో నీకేర్పాటేనా? జీతమంతా ఎందుకు నీకు? తీస్కుంటే కర్చు చేస్తవు. ఊరికి పోయేటప్పుడిస్తనని సగం జీతం నాలుగు నెల్లనుండి ఇస్తలేడు. ఆయన సంగతేందో సమజయితలేదు. నాకీన తీరేం నచ్చుటంలేదయ్యా వెంకటేశ్వర్రావూ!"

"మూడేండ్లు నిండలేదు నువ్వొచ్చి. పదేనేండ్లనుండి నాకు మీసాలు నుతరాని వయస్సునుండి చేస్తున్న గిదే పని. ఎన్నడైన మా పైసల్ సక్కగ మాకిచ్చిండేమో నారాయణనడుగు.

ఈ వర్క్ పట్టేముందు మేమిద్దరం కొల్వు మానేస్తమన్నం. ఆయన ఇన్లే... గడ్డం పట్టుక

బతిమలాడిండు. ఈ ఒక్క పని వర్కు వుండు మని... ఈ పని కగ్గితగల ఎంతకీ నడుస్తలేదు. మాకు పైసలక్కరయితే నాల్గునెల్ల ముందు నించి అడ్గుతేగాని అవసరానికియ్యడు. ఇచ్చె టపుడు మొగమెట్లనో పెడతడు. ఊకే ఇచ్చిన ట్లు''

కొంచెం సేపు ఆగేడు. శ్యామల రెండు ప్లేట్లతో చుడువా తెచ్చి పెట్టింది టీపాయ్ మీద గ్లాసులు పక్కకి సర్ది.

గుప్పెటతో ఇంత తీసుకుని నోట్లో పోసుకుని కరకరా నముల్తూ,

''నువ్ తాగవయితే! తాగవన్నమాట... బె నువ్వెట్ల తాగుతవ్‌లే... నువ్ సదివినోడివి. మేం కాదు. నీ మాట మేం కాదన్లేం. మా మాట నువ్ వినే పన్లేదు. పో పో.. మాలాటోళ్లతో నువ్వు స్నేహం చెయ్యవు. నాకు మా తెల్సు'' విసు రుగా అన్నాడు.

ప్రభాకరానికి మనసులో ఏదో మూల కొద్దిగా బాధ కలిగింది. వెంకటేశ్వర్రావు డబ్బుకోసం అడ్డ దారులు తొక్కే మనిషే కావొచ్చు, చులాగ్గా మాట వినరేసే మనిషే కావొచ్చు. గానీ వొట్టి బోళా మనిషని అతనికి ఎందోకోగాని అని పించింది. ఏదైనా మాట ఎవరికైనా ఇచ్చినట్ల యితే అందుకోసం ప్రాణం పణంగా పెట్టే మనిషని కూడా అతను చాలా మంది ద్వారా వినీ, కొన్ని విషయాల్లో గమనించీ వున్నాడు.

అసలా ప్రాంతంలో ఆల్కహాలు ఏదో ఓ రూపంలో తీసుకోని వాళ్ల సంఖ్య చాలా తక్కువ వుంటుంది. గోదావరి ఖనిలో వున్నన్ని బ్రాందీ షాపులు ఇంకే ఊళ్లోనూ వుండవేమోనని పించింది ప్రభాకరానికి. బొగ్గు గనుల్లో పని చేసే కార్మికులు, కిళ్ళీ కొట్లలో ఖాతాల్లాగ, ఆ షాపుల్లో ఖాతామీద తాగుతుంటారని అతను విని వున్నాడు. జీతాలనాడు, వాళ్లకి అందే జీతంలో పెద్ద మొత్తం ఈ ఖాతా కిందే ఖర్చవుతుంది. అందుకే వాళ్లకొచ్చేది ఎక్కువే అయినా, ఇంటి దగ్గిర భార్యాబిడ్డలకి నిత్యదా రిద్ర్యం తప్పదు. వాళ్ల బతుకుల్లో జిల్లేడు మొక్కలే తప్ప, మందారాలెన్నడూ పూయవు.

ప్రభాకరం నిశ్చయించుకున్నాడు. అంతవ రకు సడలని అతని దృఢ నిర్ణయం ఆ పూట సడలిపోయింది. వెంకటేశ్వర్రావు కోసం ఒక్క సారి తాగి మానేయాలనుకున్నాడు.

పతనమనే పాతాళంలోకి దిగడానికి ఎదు రుగా వున్న మెట్టుమీద కాలుపెడదామా, వద్దా.. అన్న సంశయంలోనే తనముందు టీపాయ్ మీద వున్న గాజుగ్లాసు వైపు చెయ్యి జాచేడు.

దాన్లో టీ డికాషన్లావున్న విస్కీ మీద కరిగివు న్న ఐస్ ముక్కలు కమనీయంగా తేలుతు న్నాయి.

''తాగు ప్రభాకరం... ఏం కాదు... వొంటికి మంచిది. మనసు ఖుషీగుంటది'' ఎంకరేజ్ చేసేడు వెంకటేశ్వర్రావు.

సంశయానికి సంకెళ్లు తెగిపోయేయి.

ఆలోచన అడవిదారి పట్టింది.

గ్లాసందుకుని ఒక్కసారి గొంతుకలో వొంపు కున్నాడు. ముందు ఏరుచీ తెలియలేదు. కొండనాలిక దగ్గిర్నుంచి కింది భాగం మండి పోతున్నట్లనిపించింది. వాంతొచ్చేలా అని పించేసరికి, అతని వంకే చూస్తున్న వెంకటేశ్వ ర్రావు బఠానీల ప్లేటు చప్పున అతని ముందుకు తోసేడు. గుప్పెడు బఠానీలు నోట్లో పోసుకుని నములుతుంటే విస్కీ రుచి ఘాటు తగ్గినట్లనిపించింది. ఎగ్జయిటింగ్‌తో వణుకు తున్న చేతుల్తో సిగరెట్ తీసి వెలిగించేడు. ఓరగా వెంకటేశ్వర్రావు వంక చూసేడు. అతని మొహంలో తానిచ్చిన చేదుమందు బుద్ధిగా తాగుతున్న పిల్లవాడంటే వైద్యుడికి కలిగే వాత్సల్యం లాంటి భావం తొంగి చూస్తోంది.

ప్రభాకరం మొహం జేవురించి పోయింది.

ఇంకో గ్లాసు నింపి అతని ముందుంచేడు వెంకటేశ్వర్రావు. అతనప్పటికే మూడోది పూర్తి చేసి, నాలుగోది ప్రారంభిస్తున్నాడు. ఎర్రగా వుండే అతని మొహం గీసిన కందగడ్డ రంగు లోకి తిరిగింది. మాటల్లో తడబాటు మొద లైంది.

ప్రభాకరాన్ని ఏదో మైకం క్రమంగా ఆవ రించుకుంటోంది. మనసులోని మారుమూల గదులు ఒకటొకటీ తెరుచుకుంటున్నాయి. అక్కడి భావాలు విచ్చలవిడిగా విహరించటం అతనికి తెలుస్తోంది. అనుకోకుండానే తప్పు




చేశానన్న భావమేదో అంకుశంతో పొడుస్తున్న ట్లుంటే దాన్నుంచి తప్పించుకోవడానికా అన్న ట్టు తన ముందుంచిన గ్లాసును పైకెత్తి పట్టుకున్నాడు.

అతని చెయ్యి పట్టుకు ఆపేడు వెంకటేశ్వర్రావు "గట్ల తాగొద్దు తబీయత్ ఖరాబవుతది. నేను తాగినట్లు తాగు. నెమ్మదిగా నిషా ఎక్కుతది. ఊకే తాగొద్దు. బఠానీలో చుడువనో నంజు... మజావుంటది. ఇగదాగు" అని తన గ్లాసెత్తి ఒక్క గుటక విస్కీ మింగేడు.

అతను చెప్పినట్లే తాగడం మొదలు పెట్టేడు. అంతవరకు సీసాలో బంధించబడిన నిషా భూతం, అతన్ని తనమీద కూర్చుండబెట్టుకుని ఎటో తీసుకుపోతోంది.

★ ★ ★

తార్రోడ్డు మీదనించి వర్క్ సైటుకి వెళ్లే మట్టి రోడ్డు మీదకి తిరిగింది రాజ్‌దూత్. చాలావరకూ బిల్డింగులన్నీ సిమెంటు రేకులతో కప్పబడ్డాయి. సైట్లో కార్పెంటర్ల పని జోరుగా సాగుతోంది. ముందునించీ చేస్తున్న పది ముఠాలు కాకుండా, మరో నాలుగు ముఠాలవాళ్లు ముందురోజే వచ్చి చేరేరు.

క్వార్టర్లకు కావలసిన టేకు తలుపులు, మామిడి చెక్క తలుపులు, అతి వేగంగా తయారవుతున్నాయి. చాలా కోలాహలంగా వుంది కార్పెంటర్లకు కేటాయించిన షెడ్.

కొంతమంది మేస్త్రీలు ప్లాస్టరింగ్ పని చేస్తున్నారు.

దొర కారు కోసం వేసిన రేకుషెడ్‌లోకి మోటారు సైకిలు పోనిచ్చేడు వెంకటేశ్వర్రావు. అది ఆగీ ఆగగానే ముందుగా ప్రభాకరం దిగిపోయేడు తన బ్రీఫ్ కేసు చేతపట్టుకుని.

కొమరయ్య ఎక్కడనుంచో పరుగెత్తుకుంటూ వచ్చి, "దండాలు దొరా" అంటూ అతని చేతిలో బ్రీఫ్‌కేసు అందుకున్నాడు.

"బాగున్నవా! కొమరయ్యా! తల నొప్పి గున్నది. స్ట్రాంగ్‌గా చాయ్ చేసిస్తవా" అడిగేడు ప్రభాకరం అతన్ని.

"గట్లేదొరా! గింతంతలో జేయనా" అని ఆఫీసుగది వైపు ఉరికేడతను.

వెంకటేశ్వర్రావు అప్పటికే కార్పెంటర్ల షెడ్ దగ్గిరకి పోయి నట్టున్నాడు. అతను వేస్తున్న కేకలు గట్టిగా వినిపిస్తున్నాయి.

"ఏయ్ బాల్రాజూ! బొక్కలిరగదన్నాలి. ఎడ్వాన్సు తీస్కపోయి ఇగో అన్త మందిని తెస్తనని చెప్పి పది దినాల కింద పోబడి తివి.. ఫికరు లేకపాయె. దొర నా జుట్టు పట్టిండు. ఫైనల్‌పాయె. పనీ పాయె" అని "థూ... నీయక్క రెండో పూటకు గినతిండుంటే ఎన్నొక్కి కూర్చునేటోనివే. మందొచ్చినరా? లేక మళ్లీ పోవాల్నా?"

బాలరాజు నెమ్మదిగా అంటున్నాడు.

"నల్గురిని తెచ్చిన దొరా... రేపటెల్లుండి మరి నల్గురొస్తరు. వాండ్లేమో మస్తు పైసలడ్గుతున్నరు. మీరేమో పట్కపోతమని ఈయరాయె. నడుమ నామాట పోయినట్లాయె"

"నర్సారె... కహానీలకేంగాని... పని సురూజేసినవా?"

"నిన్ననే మొదలు పెట్టిన"

"నువ్‌మల్లజెయ్యి మేస్త్రీనని రుబాబ్ చలాయించి కాల్లుతన్నిపెట్టి కూనుంటె పనిగాదు" హెచ్చరించి వెంకటేశ్వర్రావు, ఆ షెడ్‌లోంచి బయటకొచ్చి సైటులోకి నడిచేడు.

**అంతవరకు బయటనే నిలబడ్డ ప్రభాకరం ఆఫీసుగదిలోకి వచ్చేడు.**

ఆఫీసు వాతావరణంలో మార్పు కనిపించింది. మధ్యమధ్యలో వచ్చిపోతున్నా ప్రభాకరం కొంతకాలంగా హైద్రాబాదులోనే ఎక్కువగా వుండిపోయేడు. పేరుకుపోయిన ఇన్‌కంటాక్సు అసెస్‌మెంట్ల కోసం, అతను ఆరు నెల్లపైనే అక్కడవుండిపోవలసి వచ్చింది. సైటులో రెగ్యులర్ ఎక్కవుంటు మెయిన్ టైన్ చేయడం కోసం నూర్ అహ్మద్ అనే ముస్లిం కుర్రాణ్ణిఎవరి రికమెండేషన్ మీదనో, కొత్తగా వేసుకున్నాడు దొర.

అతను టేబులు దగ్గర కూర్చుని డేబుక్కు రాస్తున్నాడు. అతన్ని చూస్తే, అప్పుడే హడావిడిగా పని మొదలు పెట్టినట్టు తెలుస్తోంది. ప్రభాకరం లోపలకి రాగానే, లేచి నిలబడి "నమస్కారం సార్!" అన్నాడు.

సన్నగా పొడవుగా ఉన్నాడు. సిగరెట్లు తెగ

కాల్చే అలవాటు వున్నట్టుంది పెదాలు నల్లగా కమిలిపోయినట్టు ఉన్నాయి. గెడ్డం, మీసం లేకుండా నున్నగా షేవ్ చేసుకున్నాడో లేకపోతే అవి అసలు పుట్టలేదో తెలీని మొహం అత నిది. అతని వినయం చూసి నవ్వు వచ్చింది ప్రభాకరానికి.

ప్రభాకరం చేరి మూడేళ్లవుతోంది. ఈ మూడేళ్లలో అతను చూస్తూండగానే ఎంతోమంది ఉద్యోగాల కోసం రావటం, పనిచేయలేక, దొర చేత మాటలు పడలేక, ఉద్యోగాలు వదలి వెళ్లిపోవటం జరిగింది.అతను చేరినప్పుడున్న వాళ్లలో చాలామంది ఇప్పుడు లేరు.

ఎంతో కష్టపడి, పనిచేసే నారాయణరెడ్డి కూడా ఒక బిల్డింగు మార్కింగ్ చేయటంలో ప్లాన్‌లో జరిగిన పొరబాటువల్ల తేడా వచ్చిందని, ప్రకాశరావు అనరాని మాటలనేసరికి, మనసు విరిగిపోయి పని మానేసుకున్నాడు. అతన్ని లింగారెడ్డి అనే కంట్రాక్టరు ఎంతో సంతోషంగా తన వర్క్సు మేనేజరుగా వేసుకుని చక్కగా చూసుకుంటున్నాడు. రెడ్డి చాలా హాయిగా ఉన్నాడిపుడు. ఒకసారి గోదావరి ఖనిలో కన్పించి,

"నువ్వు కూడా వదిలెయ్యకూడదా? నువ్వు ఊ అంటే సాగర్‌రావు మంచి జీతమిచ్చి తన కంపెనీలోకి తీసుకుంటనన్నడు. ఆ పాపిష్టోని కొల్వు జేస్తె ప్రాణాలు పీల్చేస్తడు. నువ్వొచ్చేట్ల యితే చెప్పు. ఇప్పుడే పోయి మాట్లాడుదాం" అన్నాడు.

ప్రభాకరానికి ఆ మాటలు నచ్చక, "తర్వాత చూద్దాంలే" అనేశాడు.

**రంగారావుని తిట్టి పన్లోంచి తీసేశారు.** అశోక్‌ను నారాయణరావు తను గోదావరిఖనిలో పెట్టిన అంగడిలో వ్యాపారం చూడటానికి తీసుకున్నాడు. తక్కెళ్లపల్లి సిమెంటు ఫ్యాక్టరీలో ఏదో చిన్న ఉద్యోగం సంపాదించుకుని పెద్దపల్లి రాములు వెళ్లిపోయేడు. వాళ్ల జాగాల్లో కొత్తగా ఎవరెవరో వచ్చి చేరేరు. కొందర్ని ఇంకా ప్రభాకరం చూడనేలేదు.

పాతవాళ్లు వెంకట్రావు, పాణి, తానూ మిగిలేరు. వెంకటేశ్వరరావు, నారాయణరావులు మునుపట్లా సైటు పనులు ఆసక్తిగా పట్టించుకోడం లేదు. వాళ్లు స్వంతంగా వ్యాపారాలు, కంట్రాక్టులు తీసుకుని ఆ పన్లమీదే దృష్టి పెడుతూ అడపాదడపా సైటుకు వచ్చి పోవడం మాత్రమే చేస్తున్నారు. పనిలో కూడా మునుపటి వేగంలేదు.

"ఏం నూర్ అహ్మద్... పేషీటు తయారయిందా?" అడిగేడతన్ని.

"ఒక్క గంటలో అయిపోతుంది సార్" అన్నాడతను.

"ఆ నారాయణగారు ఊరు పోయేడట. రాములు జాగాలో లారీలు చూస్తున్నాయన్ను పిల్వండి"

నూర్ అహ్మద్ బయటకి పోయి, ఒకతన్ని వెంట బెట్టుకువచ్చేడు. పొడవుగా మధ్య వయసులో వున్నాడతను. మధ్య పాపిడితీసి తల దువ్వేడు. చెంపల దగ్గర జుట్టు నెరసింది. చేతిలో డైరీ వంటిది ఒకటి పట్టుకుని ఉన్నాడు.

"మీపేరేమిటి?" పరిశీలనగా చూస్తూ ప్రశ్నించేడతన్ని ప్రభాకరం,

"శివున్నాయుడండీ!"

ఆ పేరు వినగానే తటాలున అతడు విజయనగరం జిల్లా వాడేమోననిపించింది.

"ఏ ఊరండీ.. మీది?"

"బొబ్బిలికాడ కోవిటిపల్లండి"

అతని విగ్రహానికి తగ్గ కంఠంలా లేదది. సన్నగా కీచుగా వుంది అతని స్వరం.

"మన లారీలు ఏం తోల్తున్నాయి?"

"గోదావరికి ఇసక తేడానికెల్లాయండి. ఈ ట్రిప్పులో సిమెంటుకు పోవాలండి"

"మీరొకపని చెయ్యండి శివున్నాయుడుగారూ! సిమెంటు అయ్యేక వీలయినన్ని ఇసుక ట్రిప్పులు వేసేయండి. తర్వాత ముప్పై తొమ్మిదీ అరవై మూడూ, ఎనభైమూడు నలభై ఒకటి డ్రైవర్లను తయారుగా వుండమనండి. ఆ రెండు లారీలు ఈ రాత్రికి హైద్రాబాద్‌పోవాలి. తొమ్మిది దాటేక బయల్దేరిపోవాలి! మీరు వెళ్లండి" సూచనలిచ్చి పంపేసాడు.

తనోకుర్చీ వెనక్కి లాగి కూర్చుంటూ, "నిలబడి పోయారేం కూర్చోండి నూర్




అహ్మద్'' అన్నాడు నిలబడి వున్న అతన్ని చూస్తూ. అతను కూర్చున్నాడు.

టేబుల్ మీద వున్న పుస్తకాలను చూస్తూ, ''మీ ఎక్కవుంటు బుక్ ఇటివ్వండి... అప్టుడేట్‌గా వుందికదా!'' సంజాయిషీ ఇస్తున్నట్లుగా చెప్పేడతను... ''ఒక్క అరగంటలో ఇచ్చేస్తానుసార్... నిన్నటి వద్దులు కొన్నుండిపోయేయి'' వన్లో అలసత్వం వుందనిపించింది ప్రభాకరానికి. మవునంగా లేచి నిలబడ్డాడు.

ఇంతలో కొమరయ్య టీ తెచ్చి ఇచ్చేడు.

తాగుతుంటే అన్నాడు... ''మీ ఇంటి దగ్గర అమ్మ అంతా మంచిగున్నరా సారు'' వాడి మాటలో ఆర్ద్రత అతన్ని కదిలించింది.

''బాగనే వున్నరు కొమరయ్యా... నువ్వెట్లున్నవ్''

''నాకు బిడ్డపుట్టిందయ్యా'' మొహం వెలిగిపోతుండగా చెప్పేడు.

''చాలా మంచి కబురు చెప్పినావు. తండ్రివైనావన్నమాట'' జేబులోంచి ఇరవై రూపాయలనోటు తీసిచ్చేడు.

''పట్టు బిడ్డకేదైన కొను''

కొమరయ్యదోసిలితో అందుకున్నాడు. ''సారుది మంచి మనను. మీలాటోళ్లుఎవ్వరు లేరు సారూ! మీ పెండ్లెప్పుడు సారూ''

ఆ ప్రశ్న బలంగా తాకింది. అదే ప్రశ్న అడుగుతున్నారు అందరూ... పెళ్లా? ఎందుకు ఎవరితో.

సాకేత ప్రతిమ తొలగిపోయేక గుండెగుడిలో శూన్యం మాత్రమే మిగిలింది. ప్రేమ భావన అంకురంలోనే అణగిపోయింది. హృదయం శిలావతుగా మిగిలి, మనిషి యంత్రం మాదిరిగా మారిపోయేడు.

అయినా జీవితంలో స్థిరపడ్డాక కదా, ఎప్పుడైన మమతల మాధవీలత మళ్లీచిగురిస్తే పెళ్లి కానీ తన ప్రస్తుత జీవితం అంతా అస్థిరమేనే. ఏరోజు ఎక్కడ వుంటాడో ఏ రోజు ఈ ఉద్యోగం మానుకోవాలో తెలీని పరిస్థితి ఇప్పుడతనిది.

ఈ జీవితం ఊపిరి సలపనివ్వడంలేదు. నిత్యం ఏదో ఓ టెన్షన్. ఏ పనివల్ల ఏం కష్టం, నష్టం వస్తాయో, ఎవరి అజాగ్రత్తవల్లో లేదా ఎవరి స్వార్థ చింతన వల్లో పనికుంటుపడుతుందో ధనం దుర్వినియోగం అవుతుందో అన్న అనుమానంతోనే అతనికి ప్రతీక్షణం అప్రమత్తతగా వుండవలసి వస్తోంది. లేకపోతే ప్రకాశరావు అనే భరించశక్యం కాని మాటలతో గుండె చిల్లులు కాక తప్పదు.

తెలిసో తెలియకో, ఈ కొలువులో చేరి క్రమంగా ప్రకాశరావు పూర్తి నమ్మకాన్ని చూరగొనడంతో మంచి పొజిషన్‌లోకివచ్చేడు. అతని జాగాలో వేరెవరున్నా సులభంగా కావలసినంత డబ్బు సంపాదించుకునే అవకాశాలు అనేకం వున్నందుకు ఎంతో కొంత సంపాదించుకోకుండా వుండలేరు.

ప్రభాకరానికి డబ్బు తాపత్రయంఇంకా మనసుకు అంతగా పట్టలేదు. ఇంటి పరిస్థితి సంతృప్తికరంగా వుండటంతో తన అవసరాలకు కావలసిన డబ్బు ఎప్పుడూ తన అందుబాటులోనే వుండటంతో అతనికి అక్రమంగా సంపాదించాలన్న ఊహే రాలేదు. తనకి డబ్బు ఇవ్వవలసి వుండికూడా, అడిగినప్పుడు ప్రకాశరావు ఇవ్వకపోతే బాధపడే వాడు తప్ప అతన్ని మోసం చెయ్యాలన్న ఆలోచన అతనికి కలగనే లేదు.

అతని వ్యక్తిత్వం స్వచ్ఛమైన పాలలాంటిది. మొదట్లో చదువు పూర్తయే వరకు తల్లినీడలో బతుకులో భయమంటే ఏమిటో తెలియకుండానే తల్లి రెక్కల చాటునున్న కోడి పిల్లలా పెరిగేడు. ఇటుపక్క వచ్చి ఉద్యోగంలో చేరినపుడు కూడా అతన్లో ఉత్సాహం, ఒవిధమైన పట్టుదల బలంగా వుండబట్టే ఇక్కడి వాతావరణానికి, పరిస్థితులకి అనుగుణంగా వదిగిపోటానికి ప్రయత్నించేడు. సఫలీకృతుడయ్యేడు.

అయితే అతన్లో వివేకం ముందు పని చేయకపోయినా తర్వాత వర్క్ సైటులో పనీ, అక్కడ జరుగుతున్న దోపిడీ ఒక్కొక్కటిగా గ్రహింపుకురాగానే మేల్కొంది. ఒక్క గడ్డపారైనా చేత్తో పట్టని దొర, ఒక్క ఇటుక రాయైనా ఇటునించి అటు పెట్టని ఆ కంట్రాక్టరు ఒక్కో వర్కులో లక్షలకి లక్షలు లాభాలు పోగేసుకుపోతుంటే ఎర్రని ఎండల్లో చెమటలు గక్కుతూ

పనిచేసేవాళ్లు అతని కటాక్ష వీక్షణం కోసం కనిపెట్టుకు, అతను ఇచ్చే పని కోసం చేతులు కట్టుకు తిరగడం అతన్లో ఆలోచన్లు రేకెత్తించింది.

కంట్రాక్టరు స్వయంగా ఏ పనీ చెయ్యడు. అతను కనీసం ఇంజనీరు కూడా కానక్కర్లేదు. ఒకసారి ప్రభాకరం సూర్య నారాయణ చెపుతుంటే విన్నాడు. సత్యారెడ్డి కంట్రాక్టరు దగ్గిర నెలకి పదివేలు జీతంతో పని చేసే ఇంజనీర్లు ఆరుగురువున్నారని వాళ్లంతా చాకుల్లాటి వాళ్లని గ్లోబల్ టెండర్లలో సత్యారెడ్డి కోట్లు సంపాదించడం వాళ్లవల్లనే అని..

ఎందుకోగాని అతన్లో అసహనం ప్రవేశించింది ఈమధ్య. మనస్సులో సంఘర్షణ మొదలైంది. పాలల్లో బొగ్గుమసి పడ్డట్టు అతని అంతరంగంలో వ్యాకులత ప్రవేశించింది. అతన్లో ప్రాక్టికాలిటీకంటే సెన్సిటివ్‌నెస్ ఎక్కువ. అందుమూలంగా ప్రభాకరం ఫ్రస్టేషన్ అనుభవిస్తున్నాడు. ఇది ఇలా వుండకూడదు. ఇలా జరక్కూడదు. అని ఎందుకోగాని అతనికి దృఢంగా అనిపిస్తోంది.

పనిలో ఏమాత్రం పాలుమాలకుండా, విరామం లేకుండా, కంట్రాక్టుపనికి సంబంధించిన అన్ని వ్యవహారాలనూ చక్కబెడుతున్న ప్రభాకరం ప్రకాశరావు దొరకి ఓ మరయంత్రలా దొరికేడు. అన్ని పనుల ఆజమాయిషీ క్రమంగా ఒక్కటొక్కటిగా అతని మీద వేయడం మొదలు పెట్టడంతో నలుగురితో కావలసిన పనులు తానొక్కడే చేయవలసి రావడంతో ప్రభాకరం శారీరకంగా, మానసికంగాఅలసిపోవడంమొదలైందిపాతికేళ్లప్రాయంలోనే.

ఆరోగ్యంలో కూడా మార్పు వస్తోంది. అప్పుడప్పుడూ దగ్గు బాగా వస్తోంది. అతనికా స్థితిలో ఒక తోడు, ఒక ఆసరా కావాలి. తనకి ఆత్మీయంగా వుండే వారొకరు కావాలి.

ప్రశాంత్ మెదిలేడు ప్రభాకరం మనసులో. అతను తన మనసుకు దగ్గరగా రాగలిగేడు. రాత్రుళ్లు చాలాసేపు అందరూ నిద్రపోతున్న ఆ బంగాళాలో దీపకాంతిలో, ఏకవుంటు పుస్తకాలు ముందేసుకుని లెక్కలు రాస్తూ వుంటే ఏ అర్ధరాత్రో దాటేక బార్లు మూసే వేళయ్యేక ఇంటికొచ్చే అతను మెల్లెక్కి తన గదిలోకి వెళ్లబోతూ ఒక్కొక్కసారి ప్రభాకరాన్ని పలకరిస్తాడు. రాత్రిళ్లు అంతగా కష్టపడితే ఆరోగ్యం చెడిపోతే ఎలా అని మందలిస్తుంటాడు. ప్రభాకరం దగ్గిర సిగరెట్టడిగి తీసుకునో, లేకపోతే తన జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి అతనికి ఆఫర్ చేసో, కాసేపు గడిపి, విజిల్ వేసుకుంటూ మెట్లెక్కి వెళ్లిపోయే అతన్ని చూస్తే ప్రభాకరానికి అభిమానం కలిగింది.

అయితే అదే సమయంలో ప్రభాకరానికి మరో విషయం అంతుపట్టకుండా వుంది. అతను దొర ఇంట్లో చేరిన కొత్తలో ప్రశాంత్ భార్య ప్రవీణ అతని కంట పడేదికాదు.

ఒకసారి ప్రశాంతరావే, భోజనాల సమయంలో వడ్డన కోసం ఆమెని పిలిచేడు. ఆమె వెంటనే రాకపోయేసరికి,

"గదేమె... ప్రవీణా రావేమే... ప్రభాకరం మనమనిషేనే... నీకు తమ్మునసంటోడు. వొచ్చి పెరుగు పొయ్యి" అని పిలిచేక వచ్చింది. ఆమెను యథాలాపంగా చూసిన ప్రభాకరం ఆ సౌందర్యానికి అబ్బురపడ్డాడు. చందనంవంటి మేనిరంగు, బారైన నల్లటి జడ ఆమె రూపాన్ని రమణీయం చేసేయి. చాలా సౌమ్యంగా ఎంతో సీదాసాదాగా వుందామె. ఓ కోటీశ్వరుడి కోడల్లాకాక, ఒక మధ్య తరగతి మహిళలా వుందామె వస్త్రధారణ. ఆభరణాలేవీ లేకుండానే అలౌకికమైన అందం ఆమెలో గోచరించింది.

ఆ తర్వాత తర్వాత ఆమె ప్రభాకరంతో ఒకటి రెండు మాటలు మాట్లాడేది. అతని నడవడిక అతను ఆమెతో మాట్లాడే విధానం ఆమెకు అతని పట్ల ఆదరాన్ని కలిగించినట్లున్నాయి. అభిమానంగా అతనికేదైనా తినడానికి చేసి పెట్టడం, చిన్నచిన్న స్వంత పనులు చెప్పడం చేస్తూ వుండేది.

ప్రవీణ, ప్రశాంత్‌కి పరాయిదేమీకాదు. స్వయాన అతడామెకి బావ అవుతాడు. ఆమె తల్లీ, తండ్రీ ప్రకాశరావు దొర, స్వంత ఊర్లోనే వుండి, ఆయన పొలంవన్నూ తోటల వ్యవహారం చూసుకుంటూ ఉంటారు. ఆమె తండ్రి




అంత సమర్థుడు కాదు. అదీగాక ఆయనకి ప్రవీణతోపాటు, ప్రసూన అనే ఇంకో ఆడపిల్ల తప్ప మగపిల్లలెవరూ లేరు.

ప్రశాంత్ తల్లి పట్టుపట్టి, దొర కంతగా ఇష్టంలేకపోయినా, ప్రవీణను తన కోడలిగా చేసుకుంది. ప్రసూనకి మాత్రం ఇంకా పెళ్లికావలసివుంది.

ప్రశాంత్, ప్రవీణల జంట చూడముచ్చటగా, ఎంతో ఆకర్షణీయంగా వుంటుంది. వాళ్లకి పెళ్లయిన ఆరేళ్లకి ఒకబ్బాయి మాత్రం కలిగేడు. పైకి ఎంతో ఆనందంగా కనిపిస్తున్నా ఆ దంపతుల మధ్య ఏవో కనబడని తెరలున్నాయని ప్రభాకరం గ్రహించేడు. వాళ్లిద్దరూ కలిసి, ఎక్కడికైనా వెళ్లటంగాని, నవ్వుతూ మాట్లాడుకోవటంగానీ ప్రభాకరానికి కనబడలేదు. వాళ్ల విషయాలు తన కనవసరం అన్న భావంతో అతను గమనించనట్టుగానే వుండిపోయాడు తప్ప, ఎవరితో అనలా నంగతే ప్రస్తావించలేదు.

కుర్చీలో కూర్చుని, లేబరు ఆఫీసునుంచి వొచ్చిన కాగితాలు చూస్తున్నాడుగానీ, ప్రభాకరం అన్యమనస్కంగానే ఉన్నాడు. ఎందుకో శరీరం బడలికగా అనిపించసాగింది. రాత్రి పుచ్చుకున్న విస్కీ ప్రభావం వల్లనే కాబోలు విడవకుండా తలనొప్పి పుడుతోంది. ఫైలు మూసేసి లేచి నించున్నాడు.

''మీపని అవగానే చెప్పండి'' అని నూర్అహమ్మద్‌కి చెప్పి వక్కనున్న గదిలోకి వెళ్లి అక్కడున్న కాంప్ కాట్‌మీద నడుంవాల్చి దిండు తలకింద సరిగ్గా సర్దుకుని కళ్లు మూసుకున్నాడు.



తెలతెలవారుతూ ఉంది. నగరంలో ప్రత్యూషం ప్రశాంతంగా వుంది. లారీలు రెండూ, వేగంగా మలుపుతిరిగి, అశోక్‌నగర్ బ్రిడ్జిమీదుగా ప్రయాణంచేసి దొర ఇంటిముందు ఆగేసరికి దగ్గర దగ్గర ఏడు కావొస్తూంది. లారీలోంచి తన బ్రీఫ్‌కేస్ చేత పట్టుకుని కిందికి దిగేడు ప్రభాకరం. వెనక లారీలోంచి, శివున్నాయుడు దిగి గబగబా అతని దగ్గిరకొచ్చేడు.

''నాయుడూ! డ్రైవర్లు, క్లీనర్లని ఎటు పోవద్దను. మొకాలుగానీ కడుక్కోవాలంటే, అదిగో ఆ అవుట్‌హౌస్ దగ్గిర బాత్‌రూమ్ వగైరాలున్నాయి. ఒక్కగంట, గంటన్నర్లో అఫ్జల్‌గంజ్, మెకానిక్ షెడ్‌కి పోదాం''

అలాగేనన్నట్టు తల ఊపేడు శివున్నాయుడు.

గేటు తీసుకుని, లోపలకు పోయేసరికి అహ్మద్‌హుస్సేన్ ఎదురయ్యేడు. ప్రభాకరాన్ని చూస్తూనే అతడు నవ్వి తలెగరేశాడు.

ప్రకాశరావు స్నానం పూర్తయినట్లుంది. రివాల్వింగ్ ఛైర్లో కూర్చుని, కళ్లద్దాలు పెట్టుకుని, న్యూస్‌పేపరు చదువుతున్నాడు. తెల్లటి బనీను, తెల్లటి లుంగీ ధరించివున్నాడు. బనియన్ పుష్టిగా వున్న శరీరానికి అతికినట్టుగా వుంది. పేపరు చూస్తున్నానరే ఆయన మొహం ప్రశాంతంగా లేక బొమముడి పడేవుంది.

ఆ దగ్గర్లోనే కుర్చీమీద శ్రీరాములుగారు కూర్చుని వున్నాడు. ఆయన కూడా తెల్లటి పేంటు, తెల్లటి షర్టు తొడుక్కుని వున్నాడు. నల్లటి బూట్లు, నల్ల కళ్ళద్దాలు ధరించి, నలుపురంగు చిన్న చేతికర్రను రెండు చేతుల్లో వుంచుకుని తిప్పుతూ, ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

లోపల అడుగుపెడుతూనే ''నమస్కారం సార్!'' అంటూ ప్రభాకరం తన చేతిలో వున్న బ్రీఫ్‌కేస్ గ్రిల్స్ కానించి పెట్టేడు.

లారీల చప్పుడు వినబడడంతోపాటు, ప్రభాకరం రావటం కనబడుతూనే వున్నా అప్పుడే చూసినట్టు తల ఎత్తేడు దొర. అతని చూపులు తీక్షణంగా వున్నాయి. ప్రభాకరం కొంచెం కలవరపడ్డాడు.

''లారీలు ఫిట్‌నెస్‌కు తీసుకొచ్చేను సార్!''

అన్నాడు.

"నువ్వు తెచ్చుడేంది... నారాయణేమ య్యిండు" తుపాకీ తూటాలా వొచ్చిందామాట.

"నారాయణ తమ్ముని పెండ్లికి కాశీపట్నం పోయిండు సార్ నాయుణ్ణి తెచ్చినా"

"గా కొత్తగొచ్చిండాయనా... వానిముండ. వానికేమీ చేతయితది. వాడేం చూస్తడు"

"మన డ్రైవర్లున్నరు గదసార్... ముక్తార్, షెర్పుద్దీన్‌వాళ్లు కూడనే వుంటరు. నేను మళ్ల పోతూవుంటగదా"

"అందరికీయన కితాబిస్తుండు. నాకు తెల్వ్యదు. నీకు మా తెల్సు ఎట్లనో ఏడ్వు" నిరసనగా అన్నాడతను. ప్రభాకరం కించపడ్డాడు. పొద్దున్నే ఈయన మూడ్ బాగా లేదెందుకో అనుకుని సరిపెట్టుకున్నాడు.

"టెండరేమైంది?" దొర ప్రశ్నించేడు. ప్రశ్నలో ఎందుకోగాని వాడికనిపించింది.

ఇంతలో మెట్లమీదనుంచి నైట్ డ్రస్‌ల్లోనే ప్రశాంత్ కిందకి దిగివచ్చేడు. తండ్రి టేబులు మీదున్న పేపర్లలో ఇంగ్లీషు పేపరంది పుచ్చుకుని, ఓ కుర్చీలో కూర్చుని తిరగేయడం మొదలుపెట్టేడు.

ప్రభాకరం గొంతు సర్దుకున్నాడు.

"నేను పోయేసరికే కంట్రాక్టర్లందరు రింగయినారు సార్. మనల్ని కూడా రింగ్‌లో జాయిన్ కమ్మన్నారు. వెంకటేశ్వర్రావూ, నేనూ కల్సి ఆలోచించి ముందు మీకోసం కొత్తగూడెం ఫోన్ చేసేం. మీరు ఇంకా రాలేదన్నారు. బాగా ఆలోచించేను. వాళ్లు ఒక్కొక్కరికీ, ముప్ఫయిఅయిదు వేల చెక్కులిచ్చి షెడ్యూళ్లు మార్పించేరు. వాళ్లు కోట్‌చేసిన రేటు మన షెడ్యూల్ రేటుకన్న లక్షాయాభైవేల పైనే తక్కువుంది. మనం చెక్కు తీసుకోకుండా టెండరేసినా, మనకా వర్క్‌రాదు. వాళ్లకేపోతుంది. పైనలు కూడా ఎందుకు పోగొట్టుకోవాలి అని, చెక్కు తీసుకుని, మన టెండర్ ఏం మార్చకుండ అట్లనే వేసేసినా. గుణరెడ్డికే అయింది టెండరు. నిన్న మీకు ఫోన్ చేద్దామంటే, హైదరాబాద్ లైను కల్వలే..." అని ఆగి ఊపిరి పీల్చుకున్నాడు.

జేబులో సిద్ధంగా వుంచుకున్న చెక్కుతీసి టేబులుమీద పెట్టేడు.

ప్రకాశరావు దొర ఆవేశంతో ఊగిపోయేడు. మొహం ఎర్రగా మారిపోయింది. ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచిపోయి, టేబులుమీదున్న చెక్కు ప్రభాకరంవేపు గిరవాటేశాడు. నోటికొచ్చినట్టు తిట్టడం మొదలుపెట్టేడు పెద్ద పెద్ద కేకలు వేస్తూ... చివరగా,

"ఛూ... నీయవ్వ. నువ్వేమి హౌలాగానివా...? దిమాక్ లేదా? గింతంత తెల్విలేదు. నన్ను ముంచినవు. నీ కడుపు నిండిందా. నీ ముండ... అంతా ఎదవైపోబట్టి చల్ పీకు. నీ వనొద్దు. నువ్వొద్దు. నా ముందలకెల్లి నడువ్. ఇన్ని దినాలనా పేరు నీవల్ల బద్నామైపోయింది. నా ఇజ్జత్ తీసిపారేసినవు. నువ్వసలు మనిషి పుట్టుకే పుట్టినవా? నీకన్న గాడ్దినయం. పో... పో" తర్జని చూపుతూ అరిచేడు.

ప్రభాకరం షాక్ తిన్నాడు. అవమానంతో అతనికి వెంటనే నోటమాట కూడా రాలేదు. బయట లారీ డ్రైవర్లు, శివున్నాయుడు మొదలైవాళ్లు, దొర తిట్టడం విని, బొమ్మల్లా నిలబడిపోయేరు. ఇంట్లోపల కూడా వున్నట్టుండి అంతా నిశ్శబ్దమైపోయింది. లోపలెక్కడనుంచో సన్నగా వినిపిస్తున్న పాట ఒక్కసారిగా ఆపేసినట్టున్నారు. ఆగిపోయింది. ఎడమవైపున్న తెరలో స్వల్పంగా కదలిక. ఎవరో ప్రకాశరావు కేకలు విని చూడటాని కొచ్చినట్టున్నారు. ప్రభాకరం మొహం అవమానంతో కందిపోయింది.

శ్రీరాములుగారి వంక చూసేడు. ఏమైనా మాట్లాడుతారేమోనని. ఆయన ఉలుకూ పలుకూ లేకుండా కూర్చుని ఉన్నాడు. ఆయన పెట్టుకున్న నల్లకళ్లద్దాలు ఆయన మొహంలో భావమేదో తెలియకుండా చేస్తున్నాయి. ప్రశాంత్, వెనక్కు జేరబడి మొహానికి పేపరు అడ్డంగా పెట్టుకుని దీక్షగా చదువుకోవటంలో మునిగిపోయేడు.

చటుక్కున రెండడుగులు ముందుకు వేసేడు ప్రభాకరం. ఆవేశం అతన్ని దహించేస్తోంది. తన తప్పేమిటో అతనికి తెలీటంలేదు.

"నేను బాగా ఆలోచించే, కంపెనీకి లాభమనే ఆ పనిచేశాను. వెంకటేశ్వర్రావు కూడా




మంచిపనే చేసేనన్నాడు. ఇందులో నా లాభంకోసం నేనట్లా చెయ్యలేదు. మీరనవసరంగా తిట్టొద్దు'' కంఠం వణుకుతుండగా జవాబిచ్చేడు.

''నీ బుర్ర... నీకు ఆలోచన కూడున్నదా. పైన ఆ గాడ్డి వెంకటేశ్వర్రావుగాని సలహానా. మిమ్ము నమ్మి పని అప్పచెబుతే గుండు కొట్టించుకోవాలె. లాభమట లాభం. ఏం లాభం? నువ్వ్ నాకు లాభం చేసెటంతోనివి అయినవా? పైగా మాట్లాడుతడు. నోరుముయ్యి. నాముందుకెల్లి నడ్వు అవతల్కి. నీ పనొద్దు. నువ్వొద్దు'' చీదరించుకుంటూ అన్నాడు.

''పోన్లెండి. తెలియదు. వదిలెయ్యండి'' శ్రీరాములుగారు అక్కడితో ఆపబోయేరు. కాని అది మరికాస్త కోపకారణమైంది దొరకి.

ఆయనవైపు తిరిగి అన్నాడు.

''మీరేమంటున్నారు శ్రీరాములుగారూ. తెలునుడేంది. తెల్వకపోవుడేంది. గీటెండర్‌గన్న రింగయ్యిందని డిపార్టుమెంట్ల బయటపడ్తే రెప్యుటేషనేమయితది. మన కంపెనీ గుడ్‌విల్ ఏం కావాలె? మీరు ఊరుకోండి''

ప్రభాకరం మనసు గాయపడింది. నా బొందో అని ఇరవైనాలుగు గంటలూ, పనిచేస్తూవుంటే, తనకి దొరికిన ప్రతిఫలం ఇది. తను తప్పుచేస్తే చేసుండొచ్చు. కానీ దాన్ని తెలియచెప్పే పద్ధతి ఇది మాత్రం ఖచ్చితంగా కాదు. అతని మనసు విరిగిపోయింది. బాధ కలిగి, కళ్లమ్మట నీళ్లు తిరిగేయి. తమాయించుకున్నాడు. మరొక్కమాట ఆడలేదు. గిరుక్కున వెనక్కితిరిగేడు. గ్రిల్స్ దగ్గరున్న సూట్‌కేస్ అందుకుని బయటకు నడుస్తుంటే.

''ఆగు...'' అని గద్దించేడు దొర.

ఆగలేదు.

''నిన్నే... ఆగమంటుంటె వినిపిస్తలేదా. ఎటు బోతున్నవ్?'' మెట్లుదిగబోతూ, తల వెనక్కితిప్పి స్ఫుటంగా బదులిచ్చేడు.

''నేను మా ఊరు పోతున్నాను. పనిమాను కుంటున్నాను''

''ఎప్పుడుబడితె అప్పుడెట్లపోతవు. గిదేం పిల్లలాట అనుకున్నవా ఎల్లుండి ఎసె న్మంటు నీ తాత జేయిన్తడా?'' కవ్వించేడు.

''నేను చెయ్యను. నా తాత చేసేపని అదికాదు. మీకు తోచిన వాళ్లతో చెయ్యించుకోవచ్చు. నాకేం అభ్యంతరంలేదు. నేను పోత'' మెట్లు దిగిపోయేడు. అవుట్ హవుస్‌లోకి నడిచేడు.

అప్పుడు మాట్లాడేడు. చేతిలో వున్న పేపరు అవతలకి విసిరికొట్టి ప్రశాంత్, ప్రభాకరం పడుతున్న బాధ అతను గుర్తించేడు. అతనంటే వాత్సల్యం కలిగింది ప్రశాంత్‌లో. తండ్రి ఎంత దురుసుగా ప్రవర్తించినా మర్యాద తప్పకుండా మాట్లాడిన ప్రభాకరం అతనికి నచ్చేడు.

''చేసెటోల్లను మా చెడగొడుతరు ఇట్లనే. అందుకే మన దగ్గిర పనిచేసెటోల్లు ఎవ్వరూ నిల్వరు. గాపోరనికేం దెల్సు. మొదటిసారి బెండరేసుడు. రింగయితే ఏం చెయ్యాలో మీరు చెప్పిన్రా... మీరయినా చెప్పిన్రా శ్రీరాములుగారూ... ఎవురూ చెప్పక ఫోన్‌జేస్తె అందు బాట్ల లేకపోతే ఆయన మాత్రం ఏం చేస్తడు. తిరిగి తిరిగి ఇంట్ల కాలుబెడ్తె, నోటికచ్చినట్టల్ల తిట్టిపోస్తరు. గాని మంచి చెడులు అరుసుకోవద్దా. ఎన్నొండ్లయిన మంచిగ మాట్లాడకపోతె ఎవరు పడుతరు? పోనియ్ ఆయన పోయినంక మల్ల మరొకరి కొరకు దేవులాడి తెస్తెనె గాని తెల్వదు...''

ఇంతలో యశోద చా తెస్తె అందుకుని కుర్చీలో కూర్చుని తాగసాగేడు.

ప్రభాకరం గెస్టుహవుసులోకిపోయి, బట్టలు సర్దుకున్నాడు. పెట్టె సర్దుతుండగా ముక్తార్, షెర్పుద్దీన్ మొదలైన వాళ్లంతా అతని చుట్టూ చేరేరు. వాళ్లలో సానుభూతి పొంగింది. అతన్ని దొర అంత హీనంగా తిడుతుంటే కోపం వచ్చింది.

ముక్తార్ పండ్లు పటపట కొరికేడు. ''నీకేం సారూ! గీబాడుకవ్ కొల్వుజేసుడు. చదువుకున్నోడివి. నీకేమవసరం. దఫ్తర్ల కొల్వు మాదొర్కు తది. దినాము పస్జేసుడు. పైకెల్లి తిట్లువడుడు. మీ ఊరుపొండి. మల్ల ఎన్కఉరికొస్తడు. రా... రమ్మని సైతాన్ కహీకా...''

ప్రభాకరం మవునంగానే వున్నాడు. లేచి బయటకొచ్చి పోర్టికోలోంచి నడుస్తుండగా, గ్రిల్స్‌లోంచి చూసేడు దొర. ప్రభాకరం అటువైపే చూడలేదు.

దొర కేకేసాడు ''ఏ ప్రభాకరం''

వినిపించుకోలేదు ప్రభాకరం.

''పిలుస్తుంటే పలుకవు. పొగరు బల్సిందా...? పైసల్ దీస్కపోతన్నవా ఏంది...?''

''అహ్మద్ హుస్సేన్ ఆ పెట్టె గుంజుకో...''

ప్రభాకరం విసురుగా వెనక్కి వచ్చేడు. పెట్టె ఆయనముందు పెట్టేడు. ఆగ్రహం వళ్లంతా ఊపేస్తుండగా, జేబులోంచి, చిన్నపాకెట్ నోట్‌బుక్ తీసి ఆయన ముందు పడేసాడు.

''నేనేమీ దొంగనికాను. నాకు మీరిచ్చిన దాన్లో రెండువందలు మిగిలేయి. ఆ పుస్తకంలో అరగంట కిందటివరకు అయిన లెక్కున్నది. చూసుకోవచ్చు. ఇంక మీనుండి నాకే, నా జీతంలో మినహాయించి మీరు దాచి వుంచిన డబ్బు ఎనిమిదొందలపైనే రావాలి. మీరిస్తానన్న బోనస్ కూడా మీరే వుంచుకోండి. నాకక్కరలేదు. సెలవు'' అని రెండు చేతులూ జోడించేక శ్రీరాములుగారివైపు తిరిగేడు.

''వస్తాను శ్రీరాములుగారూ... మూడేండ్లు పైనే నా జీవితం మొత్తం ధారపోస్తే నాకు మిగిలిందేమీలేదు. అవమానం తప్ప... ప్రశాంత్‌బాబూ! నేను పోయొస్త. నమస్కారం'' అని చెప్పి బయటకు కదిలేడు.

దొర తగ్గిపోయేడు. మొహంమీద ఎవరో లాగిపెట్టి తన్నినట్లయింది. ప్రభాకరంలోని నిజాయితీకి అతను కంగారుపడ్డాడు. అంతవరకు అతను, తిడితే నోరు మూసుకున్నవాళ్లనే చాలావరకు చూసేడు. ఎదురుతిరిగిన వాళ్లను అతితక్కువ మందిని మాత్రమే చూసేడు. పనిలోంచి వెంటనే వాళ్లని తీసేశాడు. కానీ ప్రభాకరం, వెళ్లిపోతే మాత్రం చాలా సమస్యల నెదుర్కోవాలని అతడికి తెలుసు.




తన బదులుగా అటు సైటులో, ఇటు హైదరాబాద్‌లో అన్నిపనులూ సమర్థవంతంగా నిర్వహించుతూ వస్తున్న ఆ యువకుడు వెళ్లిపోతే, మళ్లీ తను అంతగా ఆధారపడగలిగే మరో మనిషి దొరకడేమోనన్న భయం కూడా కలిగింది. వదలకూడదనుకున్నాడు. కొడుకు ప్రశాంత్ తనకెప్పుడూ వ్యతిరేకే. ఇక శ్రీరాములుగారివల్లే ఆ పని కావాలి.

"ఏం... పలుకరేంది శ్రీరాములుగారూ. పోతుంటె చూస్తరు. పనిచేసినపుడు రెండు మాటలంటె పడాలి. రెండు పెడితె తినాలి. గంతెకాని ఇల్లిరిగిపోతే, మరెక్కడా పనిచెయ్యక్కర్లే. నా దగ్గిరయితే మానుకుంటడనుకోండ్రి. అన్ని దగ్గిర్ల అల్లె చేస్తడా. మీరు చెప్పండి" చటుక్కున పాయింట్ అందిపుచ్చుకున్నాడాయన.

"ప్రభాకరం" పిలిచేడు.

"కాస్త నిదానంగా అలోచించవయ్యా! ఆయన కోపం సంగతి మనకి తెలియదా. కోపంలో, పో... అంటే పోవడమే. పోయి నువ్వు మాత్రం ఏం చేస్తావు. ఏదో సర్దుకుపోవాలి తప్ప, పౌరుషం తెచ్చుకోకూడదు. నువ్వు పోవద్దు నా మాట విను"

"సారీ... సర్. పోయిన తర్వాత ఏం చెయ్యాలో నేను ఆలోచించుకోగలను. ఇక్కడ చేసి నేను సంపాదించింది ఏమీలేదు. దూరపు కొండల భ్రమ నేటితో తీరిపోయింది. నేను ఈ తిట్లు పడలేను. ఇక్కడ చేసే కష్టం ఎక్కడ చేసినా, ఇంతకంటె బాగా బతగ్గలను. ఆ నమ్మకం, ధైర్యం నాకున్నాయి"

శ్రీరాములుగారింకేదో అనబోతుండగా, దొరే కల్పించుకుంటూ అన్నాడు.

"మీ నాన్న, అమ్మ తిట్టిన అల్లెపోతవా? నేను నీకేం లోటు చేస్తున్న. ఎవ్వరినీ ఇంట్ల అడుగు నుతపెట్టనీని మా ఇంట్ల వుంచుకుని, నా పిల్లగాని లెక్క జూస్తలేనా. మేం తినేది నీకు పెడుతలేమా. అమ్మగానీ, ప్రవీణగాని, నిన్ను మా ఇంట్లో మనిషిగానే అరునుకుంట లేరా? నీ ఖర్చు మొత్తం పెట్టుకుంట నీ జీతం ఎందుకుంచుతున్న. నీ చెల్లె పెండ్లికో, తమ్ముని చదువుకో అక్కరయితే, దానికి మరింత కలిపి ఇస్తనని చెప్పలేదా? ఏదైనా డబ్బక్కరయితే సార్ నాకు పదివేలియ్యి. ఇరవైవేలియ్యి. అంటే నీకు కాదంటనా?' ఎవరికైన లేదంటగానీ, నీకు అట్లంటనా...?

నాకు మంచిమనిషి దొర్కిండని ఎందరితోనో చెప్పుతున్న. నా తీరు నీకు తెల్వదు. పనిజేసెటోడు నాకు పెద్దకొడుకు లెక్క. నిన్ను ఊకే ఇడిచిపెడతనా. ఇల్లిస్త. అన్నిచ్చి మంచిగ బతికేటందుకు ఇంతజామ్ నేచేస్త. కోపమస్తె నేను ముందెనుక జూడ. ఇంట్ల మనిషనీ, పైమనిషనీ కూడా లెక్కజెయ్య. నాలుగు తిట్టినట్లయితే, నువ్వు నీ తప్పు తెలుసుకుంటవనీ, మల్ల ఎన్నడు తప్పు చెయ్యవనీ అట్లన్న. తిట్టకుంటే తెలుస్తదా? చిన్నప్పటినంది నిన్నెవరు తిట్టకుండ, కొట్టకుండ పెద్దోనవైనవా? నీ తండ్రిలాటి దొర తిడితే, ఊ అంటూ ఉరికిపోవటమేనా? ఆ రోషం వన్నచూపిస్తెనేనేమన్నంటనానిర్సారె గదంతతియ్.

అహ్మద్‌హుసేన్ ఏం జూస్తున్నవు. పోయి ఆ పెట్టె లోనబెట్టు. ప్రభాకరం నువ్ పొయ్యి స్నానం చేసిరా. యశోదా ఏడ నచ్చినవే. ఆయన్కి చా తెచ్చియ్యి. స్నానమైనంక అమ్మ నాస్తా పెట్టినంక తిని రెస్టుతీసుకో. ప్రశాంతూ, నీతో ప్రభాకరాన్ని తీస్కపో. మీరు ఫియట్‌లో పోండి. నేనూ శ్రీరాములుగారూ, అఫ్జల్‌గంజ్ పోతం. లారీల పన్జూసేందుకు. మంచోనివయ్యా. ఇద్గో పట్టు. ఈ పైనల్ కర్చు చేస్కో" అని రెండువందలు డ్రాయర్లోంచి, తీసి ప్రభాకరం చేతిలో, బలవంతంగా పెట్టి, మరక్కడ వుండకుండా లేచి, లోపలకిపోయేడు దొర.

చూస్తున్నవాళ్లంతా, నోటమాట లేక తెల్లబోయేరు అంతలోనే ప్లేటు తిరగేసిన దొర తెలివితేటలకి. ఒక్క నిమిషంపాటు అక్కడ నిశ్శబ్దం పహరా తిరిగింది. తర్వాత అందరూ ఒక్కసారి పెద్ద బరువేదో, దింపుకున్నట్టు. అంతవరకు బిగబెట్టుకున్న ఊపిరి విడిచిపెట్టేరు. ననన్నగా మాటలు మొదలయ్యాయి.

ప్రభాకరం ఏమీతోచక స్థాణువులా నిలుచుండిపోయేడు. అతనికంతా అయోమయంగా వుంది. దొరయితే సులువుగా మాట మార్చుకోగలిగేడు గానీ, ప్రభాకరం, తన మన

న్ను మాత్రం అంత తేలిగ్గా మార్చుకోలేకపోతున్నాడు. అతనికి ససేమిరా అక్కడ వుండటం ఇష్టం లేకపోయింది. కానీ అక్కడ వాతావరణం తేలికవ్వడంతో, దొర లొంగిరావటంతో, ప్రభాకరం వెంటనే తన నిర్ణయాన్ని అమలు పరచలేని పరిస్థితి వచ్చింది. ఖండితంగా చెప్పడానికి దొరలేదు. అతను లోపలకి వెళ్లిపోయేడు. శ్రీరాములుగారు చిరునవ్వు నవ్వుతున్నారు.

అప్పుడు ప్రశాంత్ లేచి వచ్చేడు. బలిష్టమైన అతని చేతిని, ఆదరంగా, ప్రభాకరం భుజంమీద వేసేడు. ప్రభాకరం తలెత్తి అతని మొహంలోకి చూసేడు. స్నేహపూర్వకంగా వున్న అతని విశాలనేత్రాలు, ప్రభాకరంలో, నుడులు తిరుగుతున్న దుఃఖప్రవాహానికి గండికొట్టేయి.

బరస్టయ్యేడు. బాధ భరించలేకపోయేడు. కన్నీరు ఉబికివచ్చింది ఇంకా ఏమూలో, వసితనం మిగిలిపోయున్న ప్రభాకరంలో.

"ఊర్కోండి. ఆ తీరే అంత. మీరు పదండి" అని అతని నడుంచుట్టూ చేయి వేసి, నడిపించుకుపోయేడు ప్రశాంత్ అవుట్ హవుస్‌వైపు. కుర్చీలో కూలబడ్డాడు ప్రభాకరం. పక్కనే వున్న మంచంమీద గోడకానుకుని చేరబడి, సిగరెట్ వెలిగించేడు ప్రశాంత్. యశోద రెండు కప్పులతో టీ తెచ్చిచ్చింది ఇద్దరికీ.

ప్రశాంత్ తన టీ కప్పు అందుకుంటూ, ప్రభాకరాన్ని హెచ్చరించేడు.

"టీ తాగండి. తాగినంక లేచి స్నానం చేసివస్తే బయటకు పోదాం"

ఇంతలో నీటుగా తయారై దొర బయటకి వచ్చేడు. శ్రీరాములుగారితో కలిసి. డ్రైవరు ముక్తార్‌తో, రెండు లారీలను అఫ్జల్‌గంజ్ తమ వెనుకే తీసుకురమ్మని చెప్పి, వాళ్లిద్దరూ కార్లో బయటికి పోయేరు. ప్రభాకరం తెప్పరిల్లేడు. మొహం కడుక్కురావటానికి వెళ్లేడు. పూజకు పువ్వులు కోస్తున్న ప్రవీణ కనిపించింది. ఆమె కళ్లు సానుభూతిని వర్షిస్తున్నాయి. అతను తలొంచుకుని గబగబా వెళ్లిపోయేడు అక్కడ నుంచి.

అరగంట గడిచేక, ప్రశాంత్, ప్రభాకరాన్ని పిలిచేడు. ఇద్దరూ ఫియట్ ఎక్కేక అది, సికింద్రాబాద్‌వైపు దూసుకుపోయింది.

అది మొదలు, ప్రభాకరానికీ, ప్రశాంత్‌కీ మధ్య స్నేహబంధం దృఢంగా మారింది. ఆ తర్వాత ప్రభాకరం హైదరాబాద్‌లో ఎక్కువ కాలం వుండలేదు. కానీ అతను వున్నప్పుడు ప్రశాంత్ అతన్ని విడిచివుండేవాడు కాదు. నిర్మల హృదయుడూ, సహజ శాంతస్వభావుడూ, అయిన ఆ యువకుడు దొరవంటివాడికి కొడుకు అయినందుకు చాలామందిలాగే ప్రభాకరం కూడా ఆశ్చర్యపోక తప్పలేదు. స్వభావంలోనూ, స్వరూపంలోనూ కూడా ఆ ఇద్దరూ భిన్న ధృవాలే.

★ ★ ★

ఆరునెలల తర్వాత ఓ రోజు సాయంత్రం... మహవీర్ హాస్పిటల్ అవుట్‌గేటులోంచి రోడ్డు మీదికి తీసుకొచ్చేడు అహమ్మద్ హుస్సేన్ కారుని. వెనుక సీట్లో కూర్చుని వున్నారు ప్రకాశరావు, శ్రీరాములు. కొంచెంసేపటివరకూ వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకోలేదు. ఇద్దరి మనసుల్లో వేరువేరు ఆలోచనలు నిండిపోయున్నాయి.

"మీరేం వర్రీ కావొద్దు... ఆపరేషను సక్సెసయితది. ఈ రోజుల్లో కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషనేం పెద్ద ముచ్చటగాదు... వింటున్నారా... శ్రీరాములుగారూ... చెప్పరేంది" ప్రకాశరావే ముందుగా మాట్లాడేడు.

భారంగా శ్వాస తీసుకున్నాడు శ్రీరాములుగారు. నెల రోజులపైగా ఆయన ఆరోగ్యం చెడిపోతూవస్తోంది. అన్నిటెస్టులూ అయ్యేక ఈరోజు కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్ చెయ్యకపోతే, పరిస్థితి విషమించిపోతుందని డాక్టర్లు చెప్పేసేరు. అదీ వీలయినంత తొందరగా జరగకపోతే, తర్వాత ఆపరేషన్ చేసినా ఫలితం దక్కదని హెచ్చరించేరు. గత్యంతరంలేని పరిస్థితిలో ఆ ఆపరేషన్‌కి ఆయన అంగీకరించక తప్పలేదు. ఆ రోజు తారీఖు ఎనిమిది. పదిహేడో తేదీ శుక్రవారం ఆపరేషను నిర్ణయమైంది. నలభై ఎనిమిదేళ్ల శ్రీరాములుగారికి తను మృత్యువు ముంగిట్లో నిలుచున్నట్లనిపిస్తోంది. ఆయన కెందుకోగానీ ఈ ఆపరేషను నుండి తాను బతికి బయటపడననిపిస్తోంది. తనకు మిగిలున్నది అతి స్వల్పకాలమేనన్న భావం




కలిగేక, ఆయనకి ఇంకా రెక్కలురాని తన బిడ్డలూ, అమాయకంగా ఇల్లే తప్ప లోకం తెలీని భార్యా, మనసులో మెదిలి బాగా తల్లడిల్లేడు. వాళ్ళ బతుకులేమవుతాయోనని దిగులుపడ్డాడు. తను పూర్తి ఆరోగ్యంతో వున్నట్లయితే, ఆయనకా దిగులుండేదికాదు. ప్రకాశరావు దొరని పూర్తిగా నమ్మి ప్రభుత్వోద్యోగం వదులుకున్నందుకు, అతనికేం పెద్దగా ప్రతిఫలం దొరకనేలేదు. ఇక ఇల్లు తన జాగాలోనే దొర కట్టించి శ్రీరాములుగారిని అందులోనే ఉండమన్నాడు కానీ, ఆ ఇల్లు రిజిస్ట్రేషన్ మాత్రం ఎప్పుడడిగినా ఏదో వంకతో వాయిదా వేస్తూ వచ్చాడేగానీ చెయ్యనేలేదు. ఆర్థికంగా కూడా పెద్ద మొత్తమేదీ ఆయన చేతికింతవరకూ రాలేదు. లక్షా, ఏభైవేల రూపాయలవరకు మాత్రం, అప్పుడు పాతికా, ఇప్పుడు ముప్ఫై వంతున ఇస్తూ వచ్చినవి మాత్రమే శ్రీరాములుగారికి వున్న బేంకు బేలన్సు. అందుకే ఆయన ప్రస్తుతం సతమతమవుతున్నాడు. తన ఆపరేషన్ జరిగేలోగా, ఇంటి రిజిస్ట్రేషను పూర్తిచెయ్యమని మరికొంత డబ్బు తన వాటా లెక్క తేల్చి ఇమ్మని అడగాలన్న ఆలోచనల్లో ఆయనున్నాడు.

''అహ్మద్‌హుస్సేన్! కారు గుడి దగ్గరాపు...'' అని దొర హెచ్చరించేడు.

ఆంజనేయస్వామి కోవెలముందు కారాపేడు డ్రైవరు. డోర్ తెరిచి పట్టుకున్నాక ప్రకాశరావు, దొరదిగి నిలబడ్డాడు. అతని వెనకనే శ్రీరాములుగారు దిగేరు తడుముకుంటూ. ఆయన చేయి పట్టుకుని నడిపిస్తూ, గుడిలోకి నడిచేడు ప్రకాశరావు.

ఒక్కొక్కప్పుడు అతి చిన్న సంఘటనవల్లనే మనం ఒక్కోవ్యక్తి స్వభావాన్ని తేలిగ్గా గ్రహించగలుగుతాం. మనలో భ్రాంతి పొరలు ఒక్కొక్కటిగా వీడిపోయి, ఆ వ్యక్తిపట్ల మన అవగాహనా లోపాన్ని స్పష్టంగా తెలుసుకోగలుగుతాం. మన అంచనాలు తలకిందైతే, కుప్పకూలిపోతాం కూడా. అభేద్యమైన గ్లేషియర్‌లాటి ఆత్మవిశ్వాసం పొగమంచులా కరిగిపోయేది అప్పుడే. అలాటి సంఘటనే అతి చిన్నదే, శ్రీరాములుగారి మనోబలాన్ని పటాపంచలు చేసింది.

గుడిలోంచి బయటకు వస్తున్నారిద్దరూ. జేగంటలు వినబడుతున్నాయి. ఎవరో హనుమాన్ చాలీసా బిగ్గరగా చదువుతున్నారు. ప్రకాశరావు దొర చెయ్యి పట్టుకోగా నెమ్మదిగా అడుగులు వేస్తున్నారు శ్రీరాములుగారు.

పాతికేళ్ళు వుండొచ్చువాడికి. నల్లగా ఉన్నాడు. చిరిగిన నిక్కరు, మాసిపోయిన పాత బనీను ఒకటి ధరించి వున్నాడు. మనిషి ఏపుగా వున్నాడు. సన్నపాటి వెదురు కర్రనొకదాన్ని నేలను తాటించుకుంటూ ప్రకాశరావు దొర ముందుకు వచ్చేడు. గడ్డం బాగా పెరిగివుంది. వాడి రెండు కళ్ళలో కనుగ్రుడ్లు లేవు. రెప్పలు మాత్రమే ఉన్నాయి.

''బాబూ! కండ్లు లేనోణ్ణి, ధర్మం చెయ్యండి. మీ బిడ్డా పాపలు చల్లగుంటారు తండ్రీ'' అని చేతిలో వున్న సొట్టలుపడ్డ సిల్వరుగిన్నె నొకదాన్ని వాళ్ళముందుకు చాచేడు.

శ్రీరాములుగారు జేబులు తడుముకుంటుండగానే, ఫిరంగి గుండులా దొర నోటి నుంచి వచ్చింది వాడికి సమాధానం.

''పోరా... పో... పో... ధర్మం... గిర్మంలేదు... నడు అవతలకి. లంగకొడుకులందరు ధర్మమంటు పోగయితరు... గందుకే గిట్లున్నది దేశం తీరు. కండ్లు లేనోడివి. బత్కుడెందుకురా... మంది పేణం తీసెడందుకు కాకపోతే... ఈడకెల్లి... పో'' అని చీదరించుకున్నాడు.

శ్రీరాములుగారి మొహం తెల్లకాగితంలా అయిపోయింది. ఆయన మనసులో ఎక్కడో మూలగా, దొర మాటలు తీవ్రమైన గాయాన్ని చేసేయి. ఆయన పేర్చుకున్న ఆశాసౌధం కుప్పకూలినట్లయింది. నోట మాట రానట్లయి ప్రకాశరావు వెంట నడిచి కారెక్కి ఇంటికి చేరుకున్నాడు.

శ్రీరాములుగారి ఆపరేషను జరిగేరోజు ప్రభాకరం ఆయన వెంటే వున్నాడు. వర్క్‌సైటు నుంచి పాణీ, వెంకట్రావులు కూడా వచ్చేరు. ప్రభాకరానికి శ్రీరాములుగార్ని చూసి ఆశ్చర్యం కలిగింది. మిన్ను... పడ్డా చలించనట్టుండే మొదట తను చూసిన శ్రీరాములుగారికీ, ఈరోజు తను చూస్తున్న శ్రీరాములుగారికీ, ఎంతో భేదం కనిపిస్తోంది. మరణం తప్పదే

మోనన్న శంక ఆయన మనోబలాన్ని బాగా గాయపర్చింది.

బెడ్‌మీద నీరసంగా పడుకున్న ఆయన కళ్ళువెంట నీళ్లు కారిపోతున్నాయి. చుట్టూ చేరివున్న ఆయన పిల్లలు, తండ్రినా పరిస్థితిలో చూసి తట్టుకోలేక పెద్దగానే ఏడ్వటం మొదలుపెట్టేరు. ఆయన భార్య, భర్త నీడనే బతుకు హాయిగా వెళ్ళబుచ్చాలనుకున్న ఆ అమాయకురాలు... గుండె పగిలినట్లయ్యి, ఆయన ఛాతీమీద వాలిపోయింది మవునంగా రోదిస్తూ. ఆ దృశ్యాన్ని చూస్తున్న ప్రశాంత్‌కీ, ప్రభాకరానికీ గుండె కలతబారింది.

ప్రశాంత్ వెంటనే తేరుకుని ఒక్కడుగు ముందుకేసేడు.

"నువ్వు లే.. అక్కా... నీ కేమన్న పిచ్చి పట్టిందా ఏం? నువ్వే అట్ల ఏడ్వబడితే, పిల్లలేమయితరు, ఆయనకేంగాదు. మంచిగ ఆపరేషను అయి, పైలావచ్చీస్ మనిషయితరు. నువ్వు ముందులే... లేచి మొహం కడుక్కొనిరా. లే... లే..." అని శ్రీరాములుగారి భార్యని లేవదీసేడు.

శ్రీరాములుగార్ని చనువుగా మందలించేడు.

"మీరేమండీ... అట్లవుతున్నరు... బుగులు పడుతున్నరా ఏం? ఎంతెంత పెద్ద ప్రాబ్లమ్సొచ్చినా, నవ్వుతూ, సాల్వ్ చేసెటోల్లు... గీ ఆపరేషన్ కోసం బెంగపెట్టుకున్నరా ఏంది? స్టేట్స్‌లోనే జూసినాగదా... టాన్సిల్స్ ఆపరేషన్ల లెక్కనే కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్లు చేసి పడేస్తరు.. నే చెపుతున్న గదా... మీకీ ఆపరేషనయి వొచ్చినంక 'ఔ ప్రశాంతూ... నువ్ చెప్పినట్లె అయింది. చూడు ఎంత మంచి గయిననో' అని అనకపోదురా. అక్క తోని నాకు మంచి స్వీటు తినిపించరా? ఏం బుగులొద్దు... డాక్టర్ను కలిసినా. నాన్నమల్ల చెప్పిన్రంట... ధైర్యం తెచ్చుకోన్రి" అని ఆయనకి ధైర్యం చెప్పేడు.

శ్రీరాములుగారు ఆ మాటకి కొంచెం కంట్రోలయ్యేరు. ఆయన మొహంమీద చిరునవ్వు వెలిసింది. ప్రభాకరం, పాణీ, ఈలోగా పిల్లల్ని సముదాయించేరు.

అంతా ప్రకాశరావుగారి రాకకోసం చూస్తున్నారు. ఆపరేషన్‌కు ఇంకా అరగంటే వ్యవధి వుంది.

శ్రీరాములుగారు తమ్ముళ్లని పిలిచి ఏవో జాగ్రత్తలు చెపుతున్నారు. ప్రశాంత్ ప్రభాకర్ భుజంమీద చెయ్యి వేసేడు.

"మనం ఆయనొస్తున్నడేమో చూసొద్దాం పదండి" అంటూ అవతలకి నడిపించుకు వెళ్ళేడు. శ్రీరాములుగార్ని ఆయన కుటుంబం మధ్య వదిలిపెట్టి వాళ్ళిద్దరూ బయటకు పోయి సిగరెట్లు వెలిగించేరు.

"ఈయన సంగతి చూసిన్రా... ఇక్కడీయన ఆపరేషన్ టైమవ్వబట్టె ఇంతవర్కు రాక పాయె... చూసిన వాళ్ళకేమనిపిస్తది. చేసినంతకాలం చేపిచ్చుకున్నడు. అక్కరకురాక పోయెప్పుడికి, అవసరం లేనోడిలెక్క చూస్తున్నడని అనుకోరా"

ప్రశాంత్ మాటలు పూర్తికాకముందే హాస్పిటల్ ఆవరణలోకి వేగంగా వచ్చి ఆగింది నీలంరంగు మారుతికారు. దాన్లోంచి ప్రకాశరావు, ఆయన భార్య విజయమ్మ, ప్రవీణలు దిగేరు.

సిగరెట్ పక్కన పడేసి ముందుకు నడిచేడు ప్రశాంత్. ఆయన్ననుసరించేడు ప్రభాకరం.

"ప్రశాంతూ ఏర్పాట్లన్నీయినట్టేనా... శ్రీరాములుగారేమంటున్నరు?" అడిగాడు ప్రకాశరావుగారు కొడుకుని.

"ఆఁ ఆపరేషన్కి అన్ని రెడీగనే వున్నయి. మరొక్క పావుగంటలో థియేటర్‌కి తోల్కపోతరట... మీ కొరకు చూస్తున్నడాయన" ముక్తసరిగా జవాబిచ్చేడు ప్రశాంత్. ఆ మాటలంటున్నపుడు అతను తండ్రిమొహం వంక చూడకుండా మాట్లాడేడు.

"ఇక్కడేమి చేస్తున్నవు... ప్రభాకరం నడువు" అంటూ వడివడిగా లోపలకి నడిచి మెట్లెక్కాడు ప్రకాశరావు. ఆయన వెనుకనే అంతా శ్రీరాములుగారున్న గదిలోకి నడిచేరు. అప్పటికే ఆయనను తీసుకు వెళ్లటానికి వార్డు బోయ్‌లు వచ్చేరు.

ప్రకాశరావుగారు గదిలో అడుగుపెడుతూనే శ్రీరాములుగారి దగ్గరకు పోయేడు. ఆయన

 

చెయ్యి అందుకున్నాడు.

"బేంకుకి పొయ్యి వచ్చేసరికి ఆలస్యమైంది శ్రీరాములుగారూ... ఇంకా ముందుగనే వద్దామనుకున్నా... కుదర్లేదు. మీకేం ఫికరొద్దు... ఆపరేషన్ మంచి ఎఫిషియంట్ డాక్టరుతోని అయ్యేట్లు మాట్లాడినా"

శ్రీరాములుగారు ప్రకాశరావు దగ్గర్నుంచి ఆశించింది అది కాదన్నట్టు, ఆయన మొహంలో భావాలు తెలియజేస్తున్నాయి. చుట్టూ చేరిన అందరివంకా ఆయన ఒకసారి చూసేడు. ఆ తర్వాత సూటిగా ప్రకాశరావు వంక చూస్తూ మెల్లగా అడిగేడు.

"నేనొకమాట అడిగేను గుర్తుందా మీకు? ఇంటి రిజిస్ట్రేషనూ, చెక్కూ"

ప్రకాశరావు మధ్యలోనే కల్పించుకుంటూ అన్నాడు.

"అబ్బ మీదంత చాదస్తమేంది శ్రీరాములుగారూ. నన్ను మీరు నమ్మండి. మీకిల్లు కట్టిచ్చినంక రిజిస్ట్రేషన్ చెయ్యనా... నేను మస్తుకోషిష్ చేసినగానీ అదిప్పుడుగాదు... మీకాపరేషనయ్యినంక, బాగయ్యినంక చేయొచ్చు... దాని గురించేం పరేషాన్ కావొద్దు... మీరడిగిన రెండు లక్షలకి ఇదుగో చెక్ తీసుకోండి" అని షర్ట్ జేబులోంచి మడత పెట్టివుంచిన చెక్ తీసి ఆయన చేతికిచ్చేడు.

శ్రీరాములుగారు వణుకుతున్న చేతుల్తో ఆ చెక్ అందుకున్నాడు. ఆయన మనసులో ఏయే భావాలు చెలరేగుతున్నాయో చెప్పటం కష్టం కానీ, ఆయన చూపు మందగించి పోయి నేత్రాలు నిండారులయ్యేయి.

"ప్రకాశావుగారూ... మీ వితరణ గొప్పది. మరి నాకేం దిగుల్లేదు. నేను బతికినా బతకక పోయినా, నా కుటుంబానికి గొప్ప అండ దొరికిందన్న తృప్తి మిగిలింది" అని రెండు చేతులూ జోడించి శ్రీరాములుగారు ప్రకాశరావుకి నమస్కరించేడు.

చూస్తున్నవాళ్ళందరికీ, ఆ దృశ్యం హృదయాల్ని బరువెక్కించింది.

"అయ్యయ్యో... అట్లనొద్దు... నేనేం ఎక్కువ చెయ్యలే... మీకుటుంబం ఒకటీ, నా కుటుంబం ఒకటీ కాదండీ శ్రీరాములుగారూ... మీరు ధైర్యం తెచ్చుకొండి"

"ప్రబాకరం చెక్ ఫాయిల్‌మీద ఆయన దస్కత్ తీస్కో" అని ప్రభాకరానికి పురమాయించేడు ప్రకాశరావు.

ప్రకాశరావందించిన చెక్ ఫాయిల్‌మీద వెనక తన జేబులో పెన్ను తీసిచ్చి శ్రీరాములు గారితో సంతకం ,చేయించాడు ప్రభాకరం. ఫాయిల్ ప్రకాశరావుగారికివ్వబోతూ, యధాలాపంగా దాన్ని చూసిన ప్రభాకరం ఒక్కసారి తుళ్ళిపడ్డట్టయ్యేడు.

శ్రీరాములుగారు "శ్యామా!"అని పిలిచేడు.

"ఆయన భార్య కదిలి దగ్గరగా వచ్చింది. ఆమె చేతికి ప్రకాశరావు తనకందించిన చెక్కు ఆయనిచ్చేడు.

"జాగ్రత్త... ఇదే బహుశా నేను మీకోసం ఇవ్వగల ఆఖరి సంపాదన... పిల్లలు జాగ్రత్త... నేను వున్నా లేకపోయినా, నువ్వు వున్నావన్న ధైర్యంతో నేను చావుకి కూడా సిద్ధపడతాను దీన్ని డిపాజిట్ చెయ్యి" అని ఆయనంటుంటే, ప్రభాకరానికి కడుపులోనుంచి ఆక్రోశం పొంగివచ్చింది.

"అయ్యో... శ్రీరాములుగారూ... ఆ చెక్ పోస్ట్ డేటెడ్ చెక్ సార్... ఈ ప్రకాశరావు... మీ ఆత్మబంధువు కాదు సార్... మీ పాలిట రాబందు... ఆఖరి క్షణంలో, అందరి సమక్షంలో, మీ తృప్తికోసం ఇతనాడిన నాటకం కళ్ళులేక మీరు గ్రహించలేదు. కళ్ళారా చూసిన నేను చెప్పి మిమ్మల్ని అశాంతిపాలు చెయ్యలేను" అనుకున్నాడేగానీ, అనలేకపోయాడు.

శ్రీరాములుగారిని ఆపరేషన్ థియేటర్ లోపలకి తీసుకుపోయేరు... ఆయన భయపడ్డట్టే, ఆపరేషన్ అయ్యేక స్పృహలోకి రాకుండానే ప్రకాశరావు చేసిన మోసం తెలుసుకోకుండానే ఆయన చనిపోయేడు.

ఆ తర్వాత శ్రీరాములుగారి గురించీ, ఆ కుటుంబం గురించీ చెప్పడానికేం లేదు. ప్రకాశరావు దొర స్వార్థానికి బలైపోయిన కుటుంబాలెన్నో... అందులో మరొకటి చేరింది.

★ ★ ★



ప్రభాకరానికి ఆ సంఘటనతో ప్రకాశరావు మీద విపరీతమైన అసహ్యం కలిగింది. పులి వేషం వేసుకున్న గుంటనక్కలా కనిపించేడతని కంటికి. వెంకటేశ్వర్రావులాటి వాళ్లెంత మందో చెప్పినా, ప్రభాకరం వాళ్ళ మాటలను పట్టించుకోకపోవడానికి, అతను ప్రకాశరావు మీద ఏర్పరుచుకున్న నమ్మకమే బలమైనకారణం. కానీ శ్రీరాములుగారిపట్ల అతను ప్రవర్తించిన తీరు, మృత్యుముఖంలో ఆయనున్నపుడు అతను చేసిన మోసం, ప్రభాకరం నమ్మకాన్ని మంచుపొరను సూర్యకాంతి కరిగించినట్టు కరిగించేయి. ఇక ఎంత మాత్రం అటువంటి వ్యక్తి దగ్గర పనిచెయ్యకూడదని అంతరాత్మలో తీర్మానించుకున్నాడతను. కానీ వెళ్ళిపోయేముందు ఆ వ్యక్తికి సరైన గుణపాఠం చెప్పితీరాలని ఎందుకోగానీ అతన్లో సంకల్పం కలిగింది. అందర్నీ బొమ్మలుగా చేసి ఆడుకుంటున్న ఆ కర్కోటకుడికి కళ్ళు చెదిరిపోయేలా, చెయాలన్న లక్ష్యం ఏర్పరుచుకున్నాడు ప్రభాకరం. నిర్దిష్ట గమ్యమేదీ లేకుండా ఇక్కడవరకు సాగిన తన పయనం ఎటో ఎంతవరకో... అని అప్పటివరకు తేల్చుకోలేని ప్రభాకరానికి అతి చేరువలో తన పయనానికి గమ్యం కనిపించినట్లయింది. అందుకే



ఉక్రోషంతో ముందుగా తన దగ్గరకొచ్చిన పాణీ, వెంకట్రావులను చూసి ప్రభాకరం తొందరపడ లేదు.

"ఆ బద్మాష్ ముండకొడుకెట్లజేసిండో... తెల్సునా ప్రభాకరం... బేంకుకి పోయొస్తె ఆ చెక్కు కాన్సిలయిందంటున్నరు... అన్నను, ఆయన కుటుంబాన్ని నిలువునా ముంచిండు గదయ్యా... తాశీల్ మనిషి... ఇప్పుడెపోయి గల్లా పట్టి నిలేస్త... నేనిడిచిపెడతననుకుంటున్నడో ఏమో... దొరంట దొర ఏం దొర... వీని పుటక్కి అగ్గి తగల" వెంకట్రావు పళ్లు పట పట కొరికేడు.

"మీకేమిచ్చినా ఇయ్యకపోయినా... అన్న మొహం చూసి... ఆయనకి మాటరావొద్దని దినాం వీని తిట్లకు తీర్పులకు ఓర్సుకుంట వీని పని కాలబెడుతుంటె... ఇట్లనా చేస్తడు.. ప్రాణాలు తీసి పడేస్త... పాణంటె ఏమనుకున్నాడో ఏమో" ఆవేశంగా మాట్లాడుతున్నాడు పాణి.

ప్రభాకరం వాళ్ళిద్దర్నీ సానుభూతితో చూసేడు. నిజమే వాళ్ళిద్దరికీ శ్రీరాములుగారి మాటంటే శిలాశాసనం. వాళ్ళకే కాదు ఆయన్నభిమానించే వారెవ్వరూ ఆయన మాటకి ఎదురు చెప్పలేకపోయేవారు. ఆయన నిర్మలమైన మనస్సుకీ, మంచి వ్యక్తిత్వానికీ, అందరూ ఆయనను అభిమానించే వాళ్ళేగానీ ఆయనంటే ఇష్టంలేని వారెవరూ లేరు.

"నువ్వు చెప్పు ప్రభాకరం... ఎట్ల చేస్తె మంచిగుంటది?" అడిగేడు పాణి.

"అవ్... ఇదెట్లయిన తెంపుకుంటెగాని, మేం ఎక్కడికీ పోయెడిది లేకుంటది" వెంకట్రావు కొంచెం శాంతపడి అన్నాడు.

వాళ్ళలో ఆవేశం తగ్గి ఆలోచన కలిగింది

ప్రభాకరం కొంచెంసేపు ఆలోచించేడు. చనిపోబోయే వ్యక్తినే మోసం చేసిన ప్రకాశరావు ఆ వ్యక్తి చనిపోయేక, మంచి చేస్తాడన్న ఆశ ఏమీ లేదు. అయినా కానీ, అతని మనస్సులో వుద్దేశం మొదట తెలుసుకుంటేగానీ, తర్వాతేం చేయాలన్నది తేలదు. అందుకే అన్నాడు.

"వెంకట్రావు... ముందు మీరిద్దరు ఒక పని చెయ్యండి. ఇప్పుడు ఎనిమిదైంది. మరొక్క అరగంటలో ఆయన పూజ పూర్తి కాంగనే, వసారాలోకి అడుగుపెట్టండి. పూజ అవుతూనే ఆయనొచ్చి పేపరు చూసుకుంట అర్ధగంట అక్కణ్ణే కూచుంటడు. మీరు నెమ్మదిగా అడుగుతే ఏమంటడో తెలుస్తది. గట్టిగ ఏమన్న మీరు మాత్రం పట్టు విడవొద్దు... బాబు కూడా అదేటయిముకి నిద్రలేచొస్తడు... అవసరమయితే నేను కూడా వస్త... ఒకటి మాత్రం యాద్ మరవొద్దు... ఆయనెంత వొర్లినా, మీరు మాత్రం మెల్లగనే మాట్లాడున్రి ఆయనెక్కడికీ పోడు... మనం కూడా ఎక్కడికీ పోయెటోల్లంకాదు...

పోయిరండి'' అని వాళ్ళకి చెప్పి పంపేడు.

ప్రభాకరం వెళ్లకముందే వాళ్ళిద్దరు తిరిగొచ్చేసేరు. మొహాలు జేవురించి ఉన్నాయి. ఒక్క నిముషం ఆగి అడిగేడు ప్రభాకరం.

''ఏమైంది వెంకట్రావు...?''

''ఆయన మనసుకు కష్టం కలుగతదేమొనని ఆయనట్ల ఆ చెక్కిచ్చిండట... అంతే గాని హిసాబ్ చూస్తె అన్న వాటాకొచ్చే పైసలు గన్ని రావంటున్నడు... ఎంతొస్తె అంత మా ఇస్తడట''

''హిసాబా... హిసాబేంది? అన్న మాకెవరికీ చెప్పిపోలే... ఆయన పోయినంక ఆయన హిసాబ్ చూసెటోల్లు ఎవరు? చూసెడిదెట్ల?'' పాణి మాటలను ఖండిస్తూ, మధ్యలో అడ్డుతగిలేడు వెంకట్రావు.

''ప్రభాకరం... ఆ లెక్కజూసి ఎన్ని పైసలొస్తయో తేల్చినంక చెక్కు రాసిచ్చేస్తడంట... ఆయన దగ్గిర ఏవో లెక్కలున్నయ్యంట. అన్నీ నీకు సముదాయిస్తనన్నడు... మా అన్న ఈ రెండేండ్లలో వాడుకున్న పైసలు, దవాఖాన ఖర్చులు, కిడ్నీ ఆపరేషనుకయినవీ పట్టుకుంటె ఏభైవేలు కూడా రావేమొనంటుండు దొంగ బాడుకవు'' పాణి అక్కడ జరిగిన విషయం చెప్పేడు.

ప్రభాకరం ఆలోచిస్తూ ఉండిపోయేడు. కొంచెంసేపుండి పాణి, వెంకట్రావులిద్దరూ ఇంటికి పోయేరు. వాళ్ళు వెళ్ళిన కాసేపటికి దొర ప్రభాకరాన్ని రమ్మనమని కబురు చేసేడు. ప్రభాకరం వెళ్ళగానే అడిగేడతన్ని.

''ఏం చేస్తున్నవు... ఇంతసేపు''

''చెక్‌బుక్ ఫాయిల్స్, బేంకు స్టేట్‌మెంట్లు టాలీ చూస్తున్న... సార్''

''ఎప్పటికీ ఏదో చేస్తున్ననంటవుగానీ... మూడు నెల్లయిపాయె. ఇంతవర్కు లెక్కలు పూర్తి చెయ్యలే... నీకు బద్ధకం పెరిగిపోతున్నది ప్రభాకరం... ఇట్లయితెకాదు''

''మీరట్లంటరేమి సార్... మూడు నెల్లనబడి తిరి... నెల్రోజులు సైట్లనే వుండాల్సొచ్చె... వెంకట్రావు, పాణి ఇద్దరూ, శ్రీరాములుగారి దగ్గిరున్నరు. నువ్వు పోయుండక తప్పదని మీరేనన్ను అక్కడ వుంచిన్రాయె... ఇక ఆ లేబరాఫీసు రిజిస్టర్లు, రిటర్న్‌లు అర్జెంటు పనంటె... వారం... పది దినాలవి చేస్తి... ఇగ ఈ లెక్కలెట్లవుతయి.. నేను బద్ధకించకుండ చేస్తెనే కాలేదంటె మరెట్ల చేయమంటరు సార్'' ప్రభాకరం మాటలాడే తీరు బాగా మారిపోయింది.

దొరకి బాగా కోపం వచ్చింది. కానీ అతనేమీ అనలేకపోయేడు... కుడి భుజంలాటి శ్రీరాములుగారు చనిపోయేరు. వర్క్‌సైట్లో నమ్మిన బంటుల్లా పనిచేసే వెంకటేశ్వరావు, నారాయణరావులు ఆయన్తో తాము పని మానుకుంటున్నామని చెప్పలేదుగానీ, వాళ్ళు నెమ్మది, నెమ్మదిగా అన్ని పనులనుంచీ తప్పుకున్నారు. ఇక ఆయన నమ్మగలిగేదీ, ఆయనకు సక్రమంగా పనులు చేసి పెట్టగలిగేదీ, ప్రభాకరం, పాణి, వెంకట్రావులే... శ్రీరాములుగారు చనిపోయేక వెంకట్రావు, పాణి పని చేస్తారో, మానుకుంటారో అనుమానమే... వెంకట్రావుకు చాలా కాలంనుంచే, ఇతర కంట్రాక్టర్ల దగ్గిర్నుంచి ఆఫర్లు వస్తున్నాయి. శ్రీరాములుగారు వద్దనబట్టి అతను ఇంకెవరి దగ్గిరకీ పోలేదు...ఇకిప్పుడు వాళ్ళిద్దరూ కూడా, తమ అన్నకు ద్రోహం చేశానని తన దగ్గర పనిచేయకపోవచ్చు... ఈ ఆలోచనలో ఆయన ప్రభాకరాన్నేమీ అనలేదు.

''సరి... నువు బాగా పెద్దోనివైనావు... మాటలు చాలా నేర్చినవులే... నిన్ననవన్లే... కాలమట్లున్నది... అదట్లుంచు... ఇగో... ఈ డైరీల్ల శ్రీరాములుగారు వాడుకున్న పైసలన్ని రాసిపెట్టిన... ఆయన బీమారికయిన డాక్టరు బిల్లులు, మందుల బిల్లులు మొత్తం ఆఫైల్లవున్నయి. రెండేండ్లకిందవరకు లెక్కలు పూర్తయినయి. ఈ రెండేండ్లకు లెక్కజూసి ఆయనకు పొయ్యే పైసలు ఇస్తె ఆయన రుణం తీరిపోతది... ఈ లెక్క మొత్తం చూసి నాకు చెప్పు... తర్వాత నువ్వేగా వెంకట్రావుకి సమ్‌జాయించాలె... ఆపోరలీడికెల్లి సైటుకు పోతలేరు. అక్కడ పనేమయితుందో... ఏమో... నువ్వైనా అక్కడుంటె నాకు ఫికరులేకపోవు...'' అని చెప్పి ఆ కాగితాలు అందించేడు.

ప్రభాకరం ఆ కాగితాలందుకుని తన గదిలోకి వచ్చేడు.

మర్నాడు పొద్దున్నే ప్రకాశరావు, ప్రభాకరా




న్ని శ్రీరాములుగారి లెక్క ఎంతయిందో చెప్ప మన్నాడు. డైరీలో వున్న వాటి ప్రకారం, ఆ రెండేళ్ళలో శ్రీరాములుగారు ఇంటిఖర్చు నిమిత్తం అరవై రెండువేల చిల్లర వాడుకున్నారని చెప్పేడు ప్రభాకరం. మందులకుగాను, కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్‌కింద, కిడ్నీ దాతకిచ్చిన డబ్బు, డయాలిసిస్‌ల ఖర్చు, డాక్టర్ల బిల్లులకు లక్షా నలభైమూడువేలదాకా ఖర్చయినట్టు తేలింది.

ఆ లెక్క మొత్తం చూసి, ప్రకాశరావు దొర, టేబులుమీదనే వున్న కళ్లద్దాలు తీసి పెట్టుకున్నాడు. చిన్న కాగితంమీద ఏవో లెక్కలు వేసేడు. పదినిముషాలు పోయేక భారంగా నిట్టూర్చేడు. ఆ కాగితాన్ని చిన్న ముక్కలుగా చేసి వేస్ట్ బాస్కెట్‌లో పారేసేడు.

"చూస్తివా... ప్రభాకరం. నేనెంత లిబరల్గా చూసినా ఆయన కొచ్చేదానికంటె ఆయన కిచ్చినదే ఎక్కువవుతాంది. పైసలెక్క డికెల్లి తెచ్చియ్యాలె... నా వల్ల కాదు. అందరికి ట్లిస్తూపోతే, నే బిచ్చమెత్తుకబతకాలి... నువ్వు పోయి చెప్పు... ఏభైవేల రూపాయలకు చెక్కు రాసిస్త... అంతకు మించి నేనివ్వడానికిలేదు... అది మల్ల ఊకె ఇచ్చినట్టె... అయిన నాకు బాదలేదు... ఆయన మంచిగ కంపెనీకొరకు పనిచేసిన మనిషి. ఆ అభిమానం నాకున్నది కన్నా ఈ పైసలిస్తున్న. ఖర్చుచెయ్యకుండ ఫిక్సెడ్ చెయ్యమని చెప్పు... ఆయన భార్యతో" అంటూ గబగబ చెక్కు రాసిచ్చేడు.

ప్రభాకరంలో రక్తం మరిగింది. రెండేళ్ళలో వర్క్‌మీద ఎంతలాభం వచ్చిందో, దాన్లో శ్రీరాములుగారికెంత వాటావుందో, ఇన్‌కంటాక్స్ లెక్కలు రాస్తున్న అతడికి బాగా తెలుసు. పుస్తకాల్లో చూపించే లాభాన్నే అతడు శ్రీరాములుగారికి వచ్చే దానిగా చూపుతున్నాడనీ అతడు గ్రహించేడు. అతడేదో అనబోతుంటే, దొర అతని మాటలకు అడ్డు వచ్చేడు.

"నువ్వు ఏమడగొద్దు... నేను చెప్పినట్టు చెప్పు... ఎవరికన్న ఏదన్న అనుమానముంటె నన్నడగమను... అట్లనే రేపటెల్లుండలో, వాళ్ళిద్దర్నీ సైటుకు పోవాలన్నానని చెప్పు... వాళ్ల వొదిన్నీ పిల్లల్నీ పులెత్తుకపోదు... పక్కనే మేం లేమా? నువ్వు నడువ్..." అని చెప్పి లోపలకి పోయేడాయన.

ప్రభాకరం అక్కడనుంచి తిన్నగా శ్రీరాములుగారింటికి వెళ్ళేడు. ముందే తనొచ్చి ఏసంగతీ చెపుతానని ప్రభాకరం చెప్పడంవల్ల పాణీ, వెంకటరావు, కుటుంబసభ్యులందరూ ఇంట్లోనే ఉన్నారు. శ్రీరాములుగారి తరపు బంధువులు కూడా ఒకరిద్దరు పెద్ద పొజిషన్లలో వున్న వాళ్ళు అక్కడే వున్నారు

ప్రభాకరాన్ని సాదరంగా ఆహ్వానించింది శ్రీరాములుగారి భార్య. నుదుటి బొట్టులేని ఆమె మొహాన్ని చూడటం కష్టమయిందతనికి. హాల్లో గోడకి శ్రీరాములుగారి ఫోటో వేలాడదీసి చెమ్కీదండ తగిలించేరు. ఫోటోలో ఆయన చిరునవ్వు చిందిస్తున్న మొహం తన వంకే చూస్తున్నట్టనిపించి మనస్సులో కలుక్కుమంది ప్రభాకరానికి.

"ఏమన్నాడు ప్రభాకరం... ఆ రాక్షసుడు... పైసలెప్పుడిస్తడంట...? లేక ఇవ్వ నంటుండా...?" వెంకట్రావు సూటిగా విషయంలోకి వచ్చేడు.

"ఇచ్చుడేంది... ఇవ్వకపోవుడేంది... ముక్కుమీద గుద్ది మరీ తీసుకుంటము... నువ్వట్లంట వేమిరా?" పాణి, వెంకట్రావుని మందలించేడు.

"అబ్బ... మీరు ఊర్కోండయ్యా... ఆయన్ని చెప్పనీ" అంది శ్రీరాములగారి భార్య గౌరీశ్యామల.

"ఆయన సంగతి మీకు తెలియదామ్మా... 'ఓడనెక్కేదాకా ఓడ మల్లయ్య దిగంగానే బోడి మల్లయ్య' అనే మనిషి కదా! నాకు చెప్పటాన్కి నోరు రాకుండున్నది. రెండేండ్లక్రితం వరకు శ్రీరాములుగారికీ, ఆయనకీ మధ్య లెక్కలు ఫైనలయ్యేనంట... ఈ రెండేండ్లకీ శ్రీరాములుగారి వాటాకొచ్చే లాభంకన్న ఆయన కుటుంబంకోసం, వాడుకున్న పైసలూ, ఆయన దవాఖాన ఖర్చులూ ఎక్కువైనయ్యంట"

ఇంకా ప్రభాకరంమాట పూర్తి చెయ్యకుండానే, ఆగ్రహంతో నోటికొచ్చినట్టు కేకలు పెట్టడం మొదలుపెట్టేడు వెంకట్రావు. అతని ఆవేశం చూసి ప్రభాకరం భయపడ్డాడు.

అతనేం అఘాయిత్యం చేస్తాడేమోనని... కుర్చీ లోంచి లేచి వెంకట్రావు దగ్గరగా వెళ్ళి భుజం పట్టుకున్నాడు.

''వెంకట్రావు... ఏందిది...? ఎందుకట్లవుతున్నవు... జర చల్లబడు... నేను చెప్పింది విను... తర్వాత ఏం చెయ్యాలో ఆలోచన చెయ్యొచ్చు... నువ్వు ముందు కూర్చో'' అని అతన్ని బలవంతంగా కుర్చీలో కూర్చోబెట్టేడు.

పైన ఫేన్ వేగంగా తిరుగుతోంది. గాలి బాగానే వీస్తున్నా అక్కడ వాతావరణం బిగుసుకుపోయినట్లుంది. ప్రభాకరం ఒక్కసారి ఎదురుగా వున్న కిటికీలోంచి బయటకు చూసేడు. దూరంగా వున్న మైదానంలో పిల్లలు కొంతమంది క్రికెట్ ఆట ఆడుకుంటున్నారు. తను చెప్పవలసిన మాటలు ఒకసారి మననం చేసుకున్నాడు.

''చూడండి... నేను ముందు ఆయన నాకు చెప్పి పంపినమాటలు మీకు చెప్పవలసివుంది... ఆ తర్వాత ఏం చెయ్యాలె, ఎట్ల చెయ్యాలె, అన్నది ఆలోచించే బాధ్యత, మీతో బాటు నామీదకూడా వుందని నేననుకుంటున్న. ఆ మంచిమనిషికి పాణీ, వెంకట్రావు లెట్లనో, నేను కూడా అట్లనే. ఆయనకి అన్యాయం జరుగకుండ నేను చేయవలసింది తప్పక చెయ్యగలను. నేను మీ వాడినే. నన్ను నమ్ముతలేవా వెంకట్రావు...?''

''నువ్వామాటనుడేంది ప్రభాకరం. నువ్వెన్నిమాట్లు మాకు సాయంజెయ్యలే. నువ్వున్నవనే మాకు ధైర్యం. నువ్వు మా తీరు పన్లు చెయ్యవనీ నీ పన్లన్నీ మాటలతో కాక చేతలతో చేసి చూపిస్తవనీ. మాకు ఏర్పాటె... పైసలియ్యక్కర్లేదన్నమాట వినేసరికి నాకు అగ్గితగిలినట్లయింది. ఇక నేనేమన- నువ్వెట్ల చెపితే అట్లనే చేస్త'' వెంకట్రావు నొచ్చుకుంటూ అన్నాడు.

''ఆయనేమన్నడంటె, శ్రీరాములు గారికి హిసాబు ప్రకారం పైసలొచ్చెడిది లేకున్నా ఆయన ఋణం తీర్చుకునెటందుకు ఏభైవేల రూపాయలిస్తనన్నడు. అనుడేకాదు... మీ వొదినె పేరున చెక్కురాసిచ్చిండు. ఈ దినం దేటుతోనేలే'' అని తన జేబులోంచి, చెక్కుతీసి వెంకట్రావు చేతికందించేడు.

ఎవరూ ఏం మాట్లాడలే. కానీ వాళ్లందరి నిశ్శబ్దం వెనుక సెగలు కక్కుతున్న అగ్నిపర్వ్రాలకున్నంతటి తాపం వున్నదని గ్రహించేడ తను. అంతవరకు తలుపు నానుకునినిలబడి వున్న శ్రీరాములుగారి భార్య ముందుగా మాట్లాడింది.

''ప్రభాకరం... నా పెండ్లయినప్పటినుండి ఆయన సంగతి చూసినదాన్ని. ఆయన నడిపించినట్లు నడిచినదాన్ని. ఈ రోజు ఆయన మమ్మల్ని విడిచిపెట్టిపోయినా, ఆయన పద్ధతి మాత్రం నేను విడువలేను. ఆయన తెలివి తక్కువ మాటలాడే మనిషికాదు. నాతో అన్నారు మనవాటా లెక్క చూస్తే రెండు లక్షల దాకా వస్తయి. అవే అడిగిన. నా ఆపరేషను నాడియ్యమన్న. ఆ పైసలు జాగ్రత్త చేసుకుని సంసారం నడుపు. పిల్లలకి రెక్కలొచ్చేదాకా అని నాతో చెప్పిన్రు. ఆసుపత్రి ఖర్చులు అన్నీ ప్రకాశరావుగారే పెట్టుకుంటమని చెపితేనే ఆయన ఆపరేషన్‌కి సిద్ధపడిన్రు. లేకపోతే ఆయన వద్దనే అన్నరు. ఆ మాటలు నాముందుగనే వారిద్దరి మధ్య నడిచినయి. ఇప్పుడు ఆ ఖర్చులు మొత్తం ఆయనికిచ్చేదాన్లో పట్టుకుంటె మేమేమైపోవాలో నాకు తెలియకున్నది. మాకు వచ్చే పైసలు నిజంగా లేకుంటె మాకేమియ్యవద్దు. దానధర్మాల కోసం నా మొగుడు గవర్నమెంటు ఉద్యోగం విడిచిపెట్టి ఈయన దగ్గర పనిలో చేరలేదు. ఎక్కువ కష్టపడి ఎక్కువ సంపాదించుకుంటె బాగా బతకొచ్చని ఆయన ఈయన్తో కలిసిండు. ఇప్పుడా చెక్కు తీస్కపోయి నా మాటలు ఆయన్తోని చెప్పు. ఆ పైన ఆయన ఇచ్చినా మంచిదే. ఇవ్వకపోయినా మంచిదే. రామలక్ష్మణుల్లాటి నా మరుదులున్నరు. మమ్మల్నాదరించే బంధువులున్నారు. నీలాటిమంచి మనసున్న స్నేహితులున్నారు. మేం బత్కలేమన్న భయం నాకులేదు. నా మాటలు చెప్పినపుడు ఇంటి రిజిస్ట్రేషన్ సంగతొక్కసారి అడుగు. ఆయనే మంటడో చూసి అప్పుడేమి చెయ్యాలో చూసుకొనవచ్చు'' అంది.

పాణి అన్నాడు ''ప్రభాకరం మా అన్న లెక్కలు నేనొక్కసారి చూడాలనుకుంటున్న. నేను కూడా నీతోనొస్త... వెంకట్రావూ నువ్వు




కూడా రా... లెక్కలేమి రాసిండో చూడకపోతే మనకేదీ తెల్వదు''

''పద... ప్రభాకరం పోదాం. ఆయనేమంటడో అక్కడే మేం మాట్లాడ్తంగని తెగేదాకా లాగినంక భయమేమున్నది. ఈ రోజుతో తేలిపోతది'' అని అడుగుముందుకేసేడు వెంకట్రావు. ప్రభాకరం కూడా లేచేడు. ''సరేనమ్మా... నేను పోయి మీరన్నది చెపుతాను. ఆయనేం చేసేదీ, ఏమన్నదీ చూసేక తర్వాత సంగతి చూడొచ్చు. వస్తాను'' అని కదిలేడు. అతని వెనుకే పాణి, వెంకట్రావులు కదిలేరు. ప్రభాకరం తిరిగి ప్రకాశరావు దొర దగ్గిరకి వచ్చేసరికి ఆయన గుమ్మంలోనే ఉన్నాడు. ప్రభాకరం తను అనుకున్నట్టుగానే పని పూర్తి చేసుకునొస్తాడా? లేదా? అని ఆత్రుతగా ఉన్నట్టున్న దొర, ప్రభాకరం వెనుకనే వస్తున్న పాణినీ వెంకట్రావునీ చూసి మొహం చిట్లించేడు. కుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నట్టుండిపోయేడు.

ప్రభాకరం అతని ముందు నిలబడ్డాడు. దొర తలెత్తేడు అప్పుడే పాణీని, వెంకట్రావునీ గమనించినవాడిలా.

''ఏమయ్యా... ఎన్నాళ్లిక్కడ్నే వుంటరు. సైట్ల పనేమవుతున్నదో ఆలోచనేమన్న ఉన్నదా. మీకు నాల్గుదినాల్ల చీఫ్ ఇంజనీర్ ఇన్స్పెక్షనున్నది. పాపం మీ అన్న పోనే పోయిండు. మీరు మరి నాల్గు రోజులుంటే మరింత బాధగనే ఉంటది. పోయి పని చూసుకుంటె, మీ బాధ మరిచిపోవచ్చు. ఆయన ఆత్మకు శాంతి వుంటది. ఈ రాత్రి బయల్దేర్రని. వెంకట్రావూ... నువ్వుపోయి ఈస్టర్న్ ఇంజనీరింగ్ కంపెనీలో శానిటరీ సామాన్లు కొనేడిదుంది. ఏమంటున్న'' అని డ్రాయరు సొరుగుతీసి, అక్కడున్న కాగితాల్లోంచి ఓ కాగితం తీసి అతనికిచ్చేడు. ''ఇదుగో లిస్ట్ రాపించి తెచ్చినా.. పట్టు'' అన్నాడు.

వెంకట్రావు ఆ కాగితం అందుకున్నాడు. చెక్కుబుక్కు తీసి దొర కొనుగోలు నిమిత్తం చెక్ రాయబోతుండగా,

''నేనిప్పుడు పోను'' అన్నాడు చిన్నపిల్లాడు హఠం చేసినట్టు. చటుక్కున తలపైకెత్తేడు దొర. దళసరి కళ్లద్దాల్లోనుంచి వెంకట్రావువంక చురుగ్గా చూసేడు. టేబులు మీదకి వంగి రాయబోతున్నవాడల్లా పెన్ను చెక్‌బుక్ మీదనే వుంచి, నిటారుగా కుర్చీలో కూర్చుని సూటిగా చూస్తూ అడిగేడు

''అదేం''

''అదేమంటె అంతె! నేను ఇప్పుడు పోయేదిలేదు''

''సంగతేమంటున్న'' గద్దించేడు దొర.

''మా అన్న పైసలు మీరిస్తెనే నేను పోవుడు. లేకపోతే లేదు'' తేల్చేసేడతను. అతని ముక్కు పుటాలు అదురుతున్నాయి.

చూపుడు వేలితో ముక్కుమీద సాలోచనగా రాసుకుంటూ ''గట్లనా అంతవరకొచ్చిందన్నమాట. నీ ముట్టెపొగరు. పని చెయ్యడానికి పౌరుషం లేదుగని పైసలడగడానికి పౌరుషంతోని వచ్చినవన్నమాట. ఏం పాణీ... నీ ముచ్చటేంది. నువ్వు పోతవా... పోవా? నువ్వు మీ అన్నకంటె పెద్ద తీస్‌మార్ ఖానువిలే. ఔ ప్రభాకరం... నువ్వు నే చెప్పమన్నట్టు చెప్పి పైసలిచ్చినవా లేదా?'' ప్రభాకరం వంక తిరిగి అడిగేడు. కోపంతో అతని మొహం వికారంగా మారింది. తనముందు తలెత్తి కూడా మాట్లాడలేని వెంకట్రావు అదరకుండా బెదరకుండా నిలబడి లెక్కతేలితే గానీ సైటుకు పోనని చెప్పడం దొరకి వంటికి కారం రాసినట్లైంది.

''మీరు చెప్పమన్నట్టు చెప్పి చెక్కు ఆమెకిచ్చేను సార్. ఆవిడ ఆ డబ్బువద్దన్నరు. ఆవిడతో శ్రీరాములుగారు అన్ని లెక్కలు చూసుకున్నప్పటికీ రెండు లక్షలు వస్తయ్యని చెప్పిన్రంట. ఆ పైసలిస్తె అమె తీసుకుంటనంటున్నరు. ఇదిగో ఆమె ఈ చెక్కు తిరిగిచ్చేసిన్రు''

''కత మంచిగున్నదే. ఆయన ఆమెతో అట్లెట్ల చెప్పుతరు. పోయేముందు మతిమల్లపోయిందేమయ్యా ఆయ్నకు. అయినా మా ఇద్దరి మధ్య లెక్కలు ఆమెకెట్ల తెలుస్తయి. మంచి చాలు మనిమన్నట్టుంది ఆమె''

''మంచిగ మాటాడున్రి... ఎక్వతక్వ మాట్లాడితె మంచి గుండదు'' రోషంగా అన్నాడు పాణి.

ఒక్క విసురున కుర్చీలోంచి లేచేడు దొర.

''ఎవడురా... నువ్వు నాతోని మాట్లాడుతున్న వని తెలిసే మాట్లాడుతున్నవా? నాలిక చీరుత.. జాగ్రత్త బద్మాష్''

''ఏంది చీరేది? ఇక్కడెవ్వరు చేతులు ముడ్సుకలేరు. పుక్కటిగ పైసలెగబెడితే ఊర్కునె టోల్లంగాము. మా అన్న లేకపోయినా, మేమే మీ అంత ఉల్లూగాళ్లంకాదు. ముందు లెక్కలు చెప్పున్రి. మాకు ఎట్లెట్ల పైసలు లెక్కబెట్టిన్రో ఎందుకు పైనల్ రావంటున్నరో అది మాకు తెల్వాలె''

''నోర్ముయ్... మీ అన్న చచ్చిండు. ఆయన్కీ నాకుమధ్య జరిగిన పైసలెక్క మీకు నేను చెప్పెడిది లేదు. నేను చెప్ప... మీ చేతనైంది చేసుకోవచ్చు''

''గట్లైతే మీ పీకుడు పని మాకొద్దు. మేమిద్దరం ఈ నిమిషంనుండి పని మానుకుంటున్నము. సైట్ల మేసన్ల లెక్కలున్నయి. పరాబోల్ల లెక్కలున్నయి. ఆ పుస్తకాలు ఇచ్చెడిదిలేదు. ఏ మొనగాడు చేస్తడోమేం కూడా జూస్తము. మా అన్న పైసలెట్లియ్యరో అది సుత తేల్చు కుంటము. ఛల్... నడ్వురా పానీ. ఈనతో మనకేంది. ఇన్ని దినాలు అన్న ఏమనుకుంటడో అని ఆగినంకానీ ఈనమీద ప్రేమతోని మనమేం పన్జెయ్యలే'' వెనక్కి తిరిగేడు వెంకట్రావు. అతను ఉద్రేకంతో ఊగిపోతున్నాడు.

ప్రభాకరం పరిస్థితి విషమిస్తోందని గ్రహించేడు. ప్రకాశరావు దొరలో కూడా ఆవేశం తగ్గుమొహం పట్టింది. అప్పుడన్నాడు ప్రభాకరం...

''ఏమయ్యా వెంకట్రావు. నీ దిమాక్ గాని ఖరాబయ్యిందా ఏం. ఎందుకట్ల నోరు చేస్తవు. జరనెమ్మదిగ అడిగితె ఆయన మల్లకాదంటారా. ఆయనకి మాత్రం ఎవరికో ఒకరికి లెక్కలు చెప్పాలని తెల్వదా. ఆయన నా చేతనే లెక్క చేపించిన్రు. గాలెక్క... చెప్పరా.. నాకు చూపిన లెక్క మీకు చూపరా. నీకు తొందరెక్కువ జర ఆగు''

అంటూ దొరవైపు తిరిగేడు

ప్రభాకరం అప్పుడు గమనించేడు. తను వెంకట్రావుతో మాట్లాడుతున్నంత సేపు ఆయన చూస్తూనే ఉన్నాడు. లోపల తీవ్రమయిన కోపంవుంటే వుండొచ్చుగాక. కానీ ఇప్పుడు తనేం చెపితే దానికి కనీసం వినడమైనా చేస్తాడు. చేయక తప్పని స్థితిలో ఉన్నాడాయన. తనతో అవసరం వున్నవాళ్లు తనంటే పడతారుకానీ, తనతో తెగతెంపులు చేసుకుంటామన్న వాళ్లు తనేమన్నా పడరన్న సంగతి తెలీనివాడు కాదుకదా! అంతేగాక వాళ్లిద్దరి అవసరం ఇప్పుడాయనకీ చాలా ఎక్కువగావుంది. పాత సైటులో వర్కు పైనల్ స్టేజిలోవుంది. పైనల్ పేమెంట్లు చెయ్యవలసి వుంది. కొత్త కాంట్రాక్టులు రెండు వచ్చివున్నాయి. ఈ దశలో వెంకట్రావు, పానీలు చాలా అవసరమైన మనుషులు. అసలీ కంట్రాక్టు వర్కులే అంత. పని చేసేవాడికి పని ఇచ్చేవాడు ఎంత అవసరమో పనిచ్చేవాడికి పని చేసేవాడు అంతకన్నా రెట్టింపు అవసరం. ఈ ఆలోచనలు మనసులో కలిగాయేమో ప్రభాకరం ఏం చెపుతాడో అని చూస్తూ ఉన్నాడు.

''సార్.. మీరు కోపం కావొద్దు. నిన్న నాకు చూపిన డైరీల్ల లెక్కలు వాళ్లిద్దరికీ ఒకసారి చెప్పితే వాళ్లకి అనుమానముండదు. మీకు మాటరాదు. నేనిట్ల అంటున్నందుకు మీరేమనుకోవద్దు. లెక్కలు తెలియకపోతే ఎంతో వచ్చెడిదుందని వాళ్లు అనుకోనుడు, మీరేమి రాదనంటె బాధపడుడు ఎప్పటికీ వుండిపోవుడే గానీ మరి పోదు. జర నా మాట కూడా ఆలోచించండి. వాళ్లు అట్ల మాట్లాడినందుకు తప్పు పట్టుకోవద్దు. మాట్లాడే తీరు తెల్వక అన్నరుగానీ మీ మీద ద్వేషంతోనైతెగాదు''

ప్రభాకరం వంక నిశితంగా చూసేడు ప్రకాశరావు దొర. అతని కళ్లల్లో వీడు నాకు చెప్పేటంతటి వాడయినాడా అన్న భావం కనిపించినా ప్రభాకరం చలించలేదు. అతడు తన మనసులో ఎప్పుడో సంకల్పించుకున్నాడు. ఎలాగైనా తనీ విషయంలో న్యాయం జరిగించి తీరుతాడు. చివరివరకు ఆయన ఏం చెయ్యగలడో ఎంత వరకు చెయ్యగలడో వేచి చూస్తాడు. లేనప్పుడు అతను అన్యాయానికే సిద్ధపడితే మర్చిపోని గుణపాఠం నేర్పి తీరుతాడు. అది మాత్రం ఖాయం.

''నీ సంగతి కూడా బాగున్నది ప్రభాకరం. నేను వాళ్లకు ఏం లెక్కలు చెప్పాలె. నిన్న నీకు





చూడమని ఇచ్చిన లెక్కలేకద. నువ్వు చెప్పలేకపోయినవా. వాండ్లు లెక్కలు లెక్కలు అనబడితిరి. నువ్వు కూడా చూసినా, అట్లనే అంటవేమయ్యా. మనిషన్నక గింతంత తెల్వియిన వుండాలె. లేకపోతే చెప్పినట్లైనా వినాలె. మీ తోని నేనీ వన్లెట్లజెయ్యాలె. ఇట్లయితె కుక్కతోక బట్టి గోదారీదినట్టె. ఆ నువ్వే మంటవు వెంకట్రావు ఇటురా నీకేమి లెక్కలు కావల్నో చూసుకోవచ్చి. ఏమయ్యా బడే నవాబ్. నువ్ మల్లరా'' అని తన టేబుల్ డ్రాయర్లో ఉన్న డైరీలు కొన్ని తీసేడు.

ఏదో విజయం సాధించిన తృప్తికలిగింది వెంకట్రావుకీ, పాణీకీ. వాళ్లు బయల్దేరి టేబుల్ దగ్గరకు వెళ్లేరు.

ఒక డైరీ తెరిచి వాళ్లముందు పెడుతూ,

''మీ అన్న ఇంటి వాడకం పైసలు మొత్తం డేటు వైజున్నయి ఈ రెండేండ్లవి. అంతకు ముందు లెక్కలు బరాబర్ చూసుకుని ఆయనకి పొయ్యే పైసలిచ్చేసిన. అట్ల ఆయన రాసిన రశీదు చూపమంటరా లోనున్నది''

''అక్కర్లేదు... మా అన్న మల్ల ఆ సంగతి మాకు నుత చెప్పిండులెండి''

''మంచిది అట్లయితే ఈ వాడకం పైసల్ మొత్తం ఎంతయితదో మీరు కూడా లెక్క చెయ్యండి. అన్నట్టు మరిచిన వీటన్నిటికీ ముట్టినట్టు చెక్కుబుక్కు ఫాయిల్ల శ్రీరాములుగారి దస్కత్తులున్నయి. కావాలంటే ఆ చెక్కుబుక్కు ఫాయిల్సు ప్రభాకరం చూపుతడు'' పళ్లు బిగించి కృత్రిమ సహనాన్నినటిస్తూ చెప్పేడు దొర.

''ఈ పక్క పొంటి రాసినవి ఈ రెండేండ్ల వర్కులో ఆయన వాటాకిందొచ్చిన పైసలు. మొత్తం గారెండు చూస్కొని ఇంకెన్ని పైసలొస్తయొ మీరే చెప్పుర్రి. నేను మాటాలడ'' అని చెప్పి ఆయనలోపలకివెళ్లేడు.

వెంకట్రావు, పాణీ ఆ పుస్తకాలు తీసుకుని చూసేరు. దాన్లో శ్రీరాములు గారు ఇంటి ఖర్చుల నిమిత్తం కావలసినప్పుడల్లా తీసుకున్న మొత్తాలు వరుసగా తారీఖులతో సహా వేసి వున్నాయి. మరొక దగ్గర ఆనువత్రి ఖర్చులన్నీ వివరంగా దొర స్వహస్తంతో రాసివున్నాయి. ఆ పక్కనే మరికొంత మొత్తం వేరే పద్దుకింద రాసివుంది. అది చూసిన పాణి కనుబొమలు ముడిపడ్డాయి. వెంకట్రావు పద్దుల మొత్తం కూడటంలో మునిగిపోయున్నాడు. ప్రభాకరం పేపరు తిరగేస్తున్నాడు. అతని మనసులో ఏవేవో ఆలోచనలు గందరగోళంగా ముసురుకుంటున్నాయి. కాంపౌండువాల్ మీద కాకి ఒకటి వాలి అదే పనిగా అరుస్తోంది.

కరెంట్ పోయినట్టుంది యశోద బావిలోంచి నీళ్లు తోడుతుంటె, గిలక కిర్రుమంటూ గోలపెడుతోంది. లోపల గదిలోనుంచి ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు దొర.

''రాత్రొచ్చిర్రా... ఆ గెస్టవుస్‌ల ఎందుకు సాబ్... నాకొక్క ఫోన్ గొట్టకపోయిర్రా. మంచి హొటల్ల రూమ్ తీసుంచెటోన్ని. చక్రవర్తి సార్ కూడున్నరా. నేను సాయంత్రమొచ్చి కలుస్త. ఏంలే... పాత వర్కుల ఎస్టిమేషన్ కాస్టు డిఫరెన్స్‌కు అప్పీలు చేస్తున్న. కొంచెం మాట్లాడెడిది వుంది. ఆ అట్లనా... మంచిది. ఉంటసార్! సాయంకాలం సీకార్‌కు పోదం. రిజర్వ్ చేపిస్త. దయుంచుర్రి'' నవ్వుతూ ఫోన్ పెట్టేసేడు. బయటకి వచ్చినపుడు మాత్రం ఆ మొహంలో నవ్వులేదు. సీరియస్‌గా వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

''యశోదా చా కాలేదా'' విసుగ్గా కేకేసాడు.

''తెస్తున్న దొరా!'' అంటూనే ఎడమ వైపు కర్టెన్ వొత్తిగించుకుంటూ ట్రేలో కప్పుతో టీ తెచ్చి టేబుల్ మీదుంచింది ఆ ముసలామె.

చప్పుడు చేస్తూ టీ తాగడం మొదలుపెట్టేడు అతను. టీ తాగుతూనే పేపర్ చూస్తున్నాడు. కొంచెం సేపుండి,

''ఏమయ్య చూసిర్రాలేదా. ఎంతకొచ్చింది?'' అనడిగేడు.

పాణి జవాబు ఇచ్చేడు

''చూసినము... కానీ దాన్లో పద్దులుకొన్ని అర్థమయితలేదు''

విసుగుదల ప్రకటించేడు దొర ''అర్థం కాకపోవుడేంది. దేనికొరకో రాసిపెట్టినకదా''

''అదే తెలుస్తలేదు'' ఈసారి వెంకట్రావు అన్నాడు.

''నీది కోడి దిమాక్ కన్కనే తెలుస్తలేదు''



కామెంట్ చేసేడు.

టీతాగడం ముగించి, ట్రేలో వున్న బాగాలు నోట్లో వేసుకున్నాడు. "మీ అన్నవాడకం తెలుస్త లేదా. దవాఖాన ఖర్చులు తెలుస్తలెవ్వా. సైట్ల నీకిచ్చిన పైసల లెక్కతెలుస్త లేదా. ఏమి తెలుస్తలేదు. తెలుస్తలేదంటె దాని మతల బేంది?"

"తెలుస్తలేదంటె, ఆ పద్దులు తప్పని నా మతలబు" పాణి అన్నాడు.

"ఆహా... నా లెక్కే తప్పంటవే. ఎట్ల తప్పు. ఏది తప్పు చెప్పు"

"మా అన్న ఆపరేషన్ ఖర్చులు మీరు మొత్తం రాసిపెట్టిన్రు. అవే లక్షా నలభై నాలుగు వేల వర్కు వున్నయి. ఆ ఖర్చు మొత్తం మీరు పెట్టుకుంటమనే చెప్పిన్రట. మా వొదినె అన్నది. ఆపరేషన్ ఆయన వొద్దంటే మీరె నేను ఖర్చుపెట్టుకుంట నన్నరట. ఆయనతో అట్లని ఆయన పోయినంక ఆ లెక్కలు చూపించుట తప్పని నేనంటున్న"

ప్రకాశరావు దొర చిన్నగా నవ్వేడు. తన పంజాలో చిక్కుకున్న కుందేలును చూసి పులి నవ్వితే ఎలా వుంటుందో అలా వుంది ఆ నవ్వు. పాణి నిశ్చలంగా నిలబడ్డాడు. ప్రభాకరం మవునంగా గమనిస్తున్నాడు.

"మంచి తెల్వి ఉన్నదిలే నీకు పాణీ. ఆసుపత్రి ఖర్చులు మొత్తం నేను పెట్టుకుంట నంటినా. అందుకని ఆ లెక్కలు నేను చూపొద్దా. మీ వొదినె అన్నదా ఆ మాట. ఔ నిజమే.. ఒకసారి మీ ఇంట్లనే మీ అన్న గురించి పోయినవుడు ఆ ముచ్చట జరిగింది నేను కాదంటలేను.

"అప్పుడు కిడ్నీ ఆపరేషన్ చేసినట్టయితె, ఆయన హెల్త్ బాగుంటదని డాక్టర్లు చెప్పితే, మస్తుపైసలు ఖర్చవుతయి, ఆపరేషనొద్దని ఆయనన్నడు. అప్పుడామె కండ్ల నీళ్లు పెడితె పైసల్ నేనిస్త. ఎనకసిరి చూసుకోవచ్చు ఎట్ల యితె అట్లయితది అని మా అన్న. అనలే దంటలేను. అట్ల నేనెందుకన్న. ఆయన పేరు పైసలున్నయి వాన్లపట్టుకోవచ్చనే అన్న ఆయన ఒక్క పైస జేబులోనుంచి తియ్యకుండ మొత్తం అన్నిటికి నేనే ఇచ్చిన. ఉపకారం చేస్తె ఉరుమొచ్చి పడ్డదన్నట్టు. నా జేబులోకెల్లి తీసి ఖర్చుపెడితె ఆ పైసలు నేనే పెట్టుకోవాలంటున్నవునువ్వు. ఆశకు హద్దుండాలె. అయినా నాకు తెల్వకడుగుత. మీ అన్న నాకేమన్న చుట్టమా? పక్కమా? ఆయనేమన్న నాకు ఊకనే పనిచేసిండా? ఆయన చేసిందానికన్న ఎక్కువనే చేసిన. చుట్టమయిన పక్కమైన వందో, వెయ్యో అంటె పెడుతరుగానీ నా తీరున లక్షలు ఖర్చుపెడుతరా? గనక ఆ లెక్కలు. తప్పెట్లయితయి? ఎవరనగలరు తప్పని. నీలాటి హౌలాగాడంటె చెల్లుతదా?" కుర్చీలో వెనక్కి వాలేడు.

వెంకట్రావు, పాణీ నిశ్చేష్టులయ్యేరు.

ప్రభాకరం దొర మాటలను అసహ్యంచుకున్నాడు. అతన్లో దొరపట్ల తీవ్రమైన క్రోధం కలిగింది.

"ఇంతమోసమా" వెంకట్రావు ఆక్రోశంగా అడిగేడు. అతన్లో కోపంలేదు ఆవేదనవుంది. దుఃఖంవుంది. ఆ వ్యక్తిని తనేమి చెయ్యలేనన్న సంగతి అతని మనసులోకి చీకటి గదిలోకి లైటువెయ్యగానే వెలుతురు ప్రవేశించినట్టు ప్రవేశించింది. తమ్ముడి చెయ్యి పట్టుకుని "రా పాణీ! పోదాం" అన్నాడు.

దొర విలాసంగా కుర్చీలో ఊగుతున్నాడు. అతనికి వాళ్ల అసహాయస్థితి ఆనందాన్ని కలిగిస్తోంది.

అప్పుడు పాణి విసురుగా తన చెయ్యి వదిలించుకున్నాడు.

"నువ్వుండు" అని రెండడుగులు ముందుకు వేసి దొర ఎదురుగా వున్న టేబులు మీద రెండు చేతులూ ఆనించేడు. ఆ క్షణంలో పాణిలో ఒక కొత్త వ్యక్తి కనిపించేడు ప్రభాకరానికి.

"సరె... దానికి ఒప్పుకుంట. మరిసైట్ల నేను పని చేసినపుడు నాకిచ్చిన పైసలు దీన్లో కలిపింది దేనికన్నట్టు అవి మల్ల మా అన్నకిచ్చినట్టవుతయా?"

"కావా?" చిత్రంగా చూస్తూ అడిగేడు దొర.

"మీ అన్న కండ్లు కనిపించక సైటుకు వచ్చుడే లేకపోయె. మరాయన ఏ పనీ చెయ్య







కుండ పైసలెట్ల తీసుకుంటరు. అందుకు నిన్ను ఆయన బదులు పంపిండు. సమజయిందా. నువ్వు పని చేసినావంటె, ఆయన పని చేసినట్టన్నమాట. కన్కనే నీకిచ్చిన పైసలు ఆయనికిచ్చిన వైతయి. అందుకే ఆయన లెక్కలో కలిపిన''

''శభాష్... మంచి లాభం. ఒకే జీతమిచ్చి ఇద్దరి చేత పనిచేయించిన్రన్నమాట. ఒకే దెబ్బకు రెండు పిట్టల్లెక్క ఒకే జీతానికి ఇద్దరు పనిచేసిన్రు. ఇక్కడ మా అన్న అక్కడ నేను. మా అన్నకి జీతమిస్తె నేను మీకు వెట్టి చేసినట్టుకాలేదా. నీ బాంచెన్ దొరా నీ తెల్వికి నీ కాల్లు మొక్కాలని నాకయితె మా ఉన్నది. కానీ మా అన్న ఊకోడు''

భారంగా ఊపిరి పీల్చి వదిలేడు పాణి. దొర మొహంలో రంగులు మారుతున్నాయి.

''కాని ఒక్కటడుగుత. పదిహేను సంవత్సరాల కిందట మేము బాగా చిన్న పిల్లలప్పుడు మా అన్న గవర్నమెంటుల నౌకరి చేస్తుండె. అప్పుడు రోజులు నాకు బాగా గుర్తె. అన్న హుషారుగా వుండెటోడు. మమ్ముల్ను ఆడించేవాడు. పాడించేవాడు. మాకున్నది మేం తిని హాయిగనె వుండెటోల్లం ఆయన్కి ప్రమోషను వచ్చెముందు మీ దెయ్యపు చేతిలో పడిపోయేడు. ఆ నిజం... నేనన్నది మీ చెయ్యి దెయ్యపు చెయ్యే. మీ తాన కొల్వు చేసుడు రాక్షసుని దగ్గర కొలువు చేసుడే. ఏం ఫరక్‌లేదు. మీరేదో ఇన్తరని మా అందర్ని బాగా పైకి తీసుకురావచ్చుని మాపిచ్చి అన్నయ్య భ్రమపడినాడు. రాత్రనక, వగలనక మీ చుట్టూ మీ వన్లు చుట్టూ తిరిగి మీకు లాభాల మీద లాభాలు తెచ్చిపెట్టితందుకు కష్టపడి వంటికి జబ్బు తెచ్చుకున్నాడు. పదిహేను సంవత్సరాల్ల మీరీ నలభై లక్షల మేడ కట్టుకున్నారు. ఊర్లల్లో భూములు, తోటలు, దొడ్లుకొన్నరు. బేంకులల్ల డిపాజిట్లు చేసుకున్నరు. ఇంకేమేమో ఎట్లెట్లో దాచుకున్నరు. మా అన్నకేమిచ్చిన్రు. అదే నేనడుగుతున్న''

దొరముక్కుపుటాలు అదురుతున్నాయి.

కళ్లు పులికళ్లులా మెరిసేయి. బలవంతంగా ఆవేశం అణుచుకున్నాడు.

"నీకు ఈ రోజు మంచిగలేనట్టున్నది. నువ్వు నోటికచ్చినట్టల్ల మాట్లాడుతున్నవ్. మరింకేమన్న మాట్లాడితె నేనేమి చేస్తనో నాకే తెల్వదు. చనిపోయిన శ్రీరాములుగారి మొహం చూసి ఊకుంటున్న. ముందు నువ్వు బయటకి నడువ్" అన్నాడు బుసకొట్టినట్టు.

వెంకట్రావుకి ప్రభాకరం కనుసైగచేసేడు తీసుకుపో అన్నట్టు. పాణి ఆవేశం అతనికి అర్థమైంది. నిజానికి పాణికంటె ఎక్కువగానే ప్రభాకరంలో సెగరేగుతోంది. అంతచేసిన శ్రీరాములుగారి కుటుంబానికే అన్యాయం చేస్తున్న ఈ మనిషి ఈ కృతఘ్నుడు తనకేమీ ఒరగబెట్టేది వుండదనీ, తానున్నది మర్రిచెట్టు నీడన కాక, తాటి చెట్టు నీడననీ అతనికి అర్థమైంది.

"పాణీ.. నువ్వు రారా. మాటలతో వినని మనిషి దగ్గర మాటలాడుట వొట్టి తాశీల్ పని. మనం చేసేదేదో చేద్దం పద" అని పాణి చెయ్యివట్టి విసురుగా తీసుకుపోబోయేడు వెంకట్రావు.

"ఏందిరా నువ్వు చేసేది నీ ముండ. ఊకుంటుంటె నోటికచ్చినట్టు మాట్లాడ్తున్నరె. ఏం చేస్తర్రా మీరు. మీరు పీకెడిదేంది. కూసాని చిడతలు గొట్టుకొంర్డి. మళ్లీ నా ముందటికొస్తె చంపి పడేస్త. పోతున్నరా లేదా?" ఉరుముతూ కుర్చీలోంచి పైకి లేచేడాయన.

పడగమీద కొట్టిన తాచులా తల ఎత్తేడు వెంకట్రావు. అతని చెయ్యి విడిపించుకుని రెండడుగులు ముందుకేసేడు పాణి.

"ఏదీ చంపి పడేస్తవా, నువ్వు. సైతాన్ కాబచ్చా. నువ్వేగని దొర పుట్టక పుడితే ఆ పని చెయ్యి నువ్వో నేనో తేలిపోవాలి ఈ రోజు. ఇన్నాళ్ల పాణి కాదు వీడు. జాగ్రత్త. ఆఖరి మాట చెప్తున్న నువ్వేగని మర్యాద వున్న వానివైతే, ఇప్పుడు కాదు నెల రోజులు టైమిస్తున్నా. మంచిగ మా అన్నకి ఇస్తానని వప్పుకున్న పైసలు చెక్కు రాసియ్యి. మా అన్నకోసమే కట్టించినానన్న ఇల్లు మా వొదిన పేర్న రిజిస్ట్రేషన్ చెయ్యి. లేకపోతే ఊరుకోనేందుకు నేను ధర్మరాజులాటి శ్రీరాములును కాదు.భీముడులాటి పాణిని. ఆయనకున్న తెల్వితోపాటు ఆయనకు లేని ధైర్యమున్న మనిషిని. ఏం చెయ్యాలో ఎట్ల చెయ్యాలో నా ఆలోచన నాకున్నది. చేసి చూపుత ఖబడ్దార్" చెయ్యి జాపి హెచ్చరించి వెనక్కి తిరిగేడు.

"పదరా... ఇగ పోవచ్చు. ఈ దినంతోని పీడాబాయె" అని వెంకట్రావు చెయ్యి పట్టుకుని పాణి బయటకి నడిచేడు.

ఆగ్రహంతో ఊగిపోతూ దొర టేబులు మీదున్న పేపర్ వెయిట్ పాణికేసి విసరబోయేడు. కానీ ప్రభాకరం చెయ్యి అతని చేతిని పట్టుకు ఆపేసింది.

పాణి ధైర్యానికి లోలోనే మెచ్చుకున్నాడు ప్రభాకరం. "వద్దు సార్.. ఏం పని చేస్తున్నరు. జర ఆలోచించండి" ఆ పేపర్‌వెయిట్ ఆయన చేతిలోంచి తీసుకుని మళ్లీ టేబులు మీద పెట్టేస్తూ మందలిస్తున్నట్టుగా అన్నాడు ప్రభాకరం. వెంకట్రావు గమనించేడు ఆ సంగతి. గబగబా తమ్ముణ్ణి తీసుకుని గేటుదాటేడు.

ఏం చెయ్యాలో తోచక ఎదురుగా వున్న ప్రభాకరం మీద విరుచుకుపడ్డాడు దొర.

"నీలాటి బుర్ర లేనోడికి పని చెపుతె, ఇట్లనే అవుతది. నేనేం చెప్పిన నువ్వేమి చేసుకొచ్చినవ్. వీని పొగరు తలకెక్కిపోయింది. నన్నే బెదిరిస్తడు. నేను తల్చుకుంటె ఇప్పుడె నూకలు చెల్లిపోతయ్ వీనికి. బుర్ర పట్టని మాటలు పేలుతున్నడులే. అదీ చూస్త వీడేమి చేస్తడో. వీని తాతేమి చేస్తడో. నేను మల్ల చూస్త" హుంకరిస్తూ లోపలకిపోయేడు.

ప్రభాకరం సాలోచనగా దొర వెళ్లిన వేపు చూస్తూ వుండిపోయేడు. అతని మనసులో ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో ఒక పథకం నెమ్మదిగా రూపుదిద్దుకుంటోంది. ఇలాటి మనిషికి, నయవంచకుడికి కొట్టే దెబ్బ మామూలుగా వుండకూడదు. తిరిగి లేవలేకుండా కొట్టాలి... పాముకి పడగమీద కొట్టినట్టు, పులికి గుండెల్లో




గురి చూసితుపాకీ పేల్చినట్టు.



చెమట ధారాపాతమైపోతోంది. మిట్ట మధ్యాహ్నామేమో ఎండ దుర్నిరీక్ష్యంగా వుంది.

ఎక్కడా పక్షి సంచారంలేదు. మానవ మాత్రుడెవరూ కనుచూపు దూరంలో కాన రావటంలేదు.

నాలుగు నెల్లకిందట కొత్తగా తీసుకున్న మరి రెండు వర్క్‌ల ఆజమాయిషీ గురించి ఆ సైటులకు వెళ్లి తిరిగి వచ్చేస్తున్నాడు ప్రభాకరం. మళ్లీ మధ్యాహ్నం భోజనం తర్వాత ఓ గంట పోయేక తిరిగి వెళుతూ వుంటాడు. ఇంకా క్వార్టర్లు పూర్తిగా హేండోవరు కాలేదు. అతి కొద్దిగా మాత్రమే పన్లువుండిపోయేయి. ఇవి అయిపోగానే కాంప్‌అక్కడినుంచి ఏదో ఒక సైటుకు మార్చుకోవాలి.

మెత్తగ కరిగివున్న తార్రోడ్డు మీద రాజదూత్ దూసుకుపోతుంటే సరసరమంటూ చప్పుడవుతోంది.

అడపాదడపా బొగ్గులోడ్ చేసుకు వెళుతున్న లారీలు బొగ్గులోడ్ కోసం వస్తున్న లారీలు మాత్రం రోడ్ మీద ప్రయాణం చేస్తున్నాయి.

వేడిగా వీచే గాలిని తట్టుకోవటానికి చెవులను కప్పుతూ తెల్లటి కేప్, కళ్లకు నల్లద్దాలు ధరించి, తదేకంగా దృష్టి రోడ్‌మీదే నిలిపి అతడు డ్రైవ్ చేస్తున్నాడు.

పచ్చటి ఆతడి శరీర ఛాయ ఎండ వేడిమికి నలుపు రంగులోకి తిరుగుతోంది. రెగ్యులర్ డ్రింకింగ్ హాబిట్ వల్ల కాబోలు సన్నగావుండేఅతను కొద్దిగా లావయ్యేడు. బుగ్గలు పుష్టిగా వుండి, కొత్తగా పెంచిన గడ్డం వలన వున్న వయసుకంటె పెద్దవాడిగా కనిపిస్తున్నాడు.

కలిగిన రకరకాల అనుభవాలవల్ల మనిషి రాటుతేలి మంచి కార్యదక్షుడయ్యేడు. సివిల్ వర్కుల్లో బాగా ఆరితేరి, సైటు పనులూ, వాటితోబాటు ఆఫీసు విషయాల్లో కూడా పూర్తిగా అతనే అన్ని బాధ్యతలూ నిర్వహిస్తున్నాడు. పని చేసేవాళ్లను అతను ఆదరంగా చూసి వీలయినన్ని సదుపాయాలు వాళ్లకి కలిపించడంద్వారా, వాళ్లలో మంచి స్ఫూర్తి కలిగిస్తున్నాడు.

దొర చాలావరకు సైటు విషయాలు ప్రభాకరం మీదనే వదిలిపెట్టేడు. ఎప్పుడోగాని సైటుకు రావడంలేదు.

జమా ఖర్చులన్నీ ప్రభాకరమే చూసుకుంటున్నాడు. ఆఫీసులో బిల్సు పాస్ చేయించీ, చెక్కులు రెడీ చేయించేక ఫోన్ చేస్తే 'దొర' ఆ చెక్కులు తీసుకోవడానికి వస్తాడు. పేమెంటు గురించి డబ్బు కావలసి వస్తే ప్రభాకరమే హైద్రాబాదు పోయి చెక్కు తీసుకుని, అక్కడి వ్యవహారాలూ, సైటుకు అవసరయ్యే మెటీరియలు కొనుగోలూ, చూసుకుంటున్నాడు.

ప్రకాశరావు దొర చాలామటుకు తన వ్యవహారాలు పరిమితం చేసుకుంటున్నాడు. గ్రామంలో ఎక్కువగా వుంటూ, అక్కడ భూముల్లో తోటలు వేయించడం, వాటి ఆలనా, పాలనా చూసుకోవడంలో ఎక్కువ కాలం గడుపుతున్నాడు. అతన్లో విపరీతమైన మార్పు వచ్చింది. వయస్సు అరవైదాటి పోయింది. పది తరాలకు సరిపడా సంపాదించి పెట్టేడు. ఉన్న ఒక్కకొడుకూ తన తర్వాత కంట్రాక్టు వ్యాపారం చూసుకుంటాడన్న ఆశ ఏనాడో అంతరించిపోయింది. అతనెంతజల్సాగా ఖర్చుపెట్టుకున్నా బ్యాంకు డిపాజిట్లమీద వచ్చే వడ్డీలో సగం కూడాఖర్చుకాదు. అందుకని కొడుకు విషయం పట్టించుకోవడం మానేశాడు దొర. పరిస్థితులు కూడా మునుపట్లాలేవని ఆయన గ్రహించేడు. రోజులు పూర్తిగా మారిపోయేయి. పూర్వంలా అదిరించీ, బెదిరించీ పనులు చేయించగల

రోజులు పోతున్నాయన్న సంగతి ఆయనకి తెలిసివచ్చింది. అదీగాక పూర్వం కంట్రాక్టు వ్యాపారం ఏకొద్దిమందికో పరిమితమై కంట్రాక్ట ర్లకు సమాజంలో ఒక ప్రత్యేక గౌరవం వుండేది. కానీ మారిపోతున్న కాలంలో ఎందరో అక్షరజ్ఞానం లేని వాళ్ళుకూడా లేబరు కంట్రా క్టుల్లో వుండే లాభాల రుచి తెలిసి చిన్నచిన్న పెట్టి కంట్రాక్టులతో మొదలుపెట్టి అంచెలంచె లుగా పైకి వచ్చేస్తున్నారు.

తనకింద మేస్త్రీగా పనిచేసేవ్యక్తి, తనతోబా టు టెండరు వేయడానికి సిద్ధమైపోవటాన్ని దొర ఏమాత్రం భరించలేకపోతున్నాడు. మిని మమ్ మార్జిన్‌తో పని చేయడానికి ఉరకలు వేస్తూ ముందుకు వస్తున్న కొత్తతరం కంట్రాక్ట ర్లంటే అతనికి విపరీతమైన క్రోధం వుంది.

కాలం ఎప్పుడూ ఒకేతీరుగా ఎవరికీ గడవ దు. అనూహ్యమైన మార్పులూ, సందిగ్ధ పరిస్థి తులూ, ఎల్లప్పుడూ ఎదురుచూస్తూనే ఉంటాయి. దర్పం, ధనమదంతో ప్రవర్తించే వాళ్లు తమ కృత్యాలకు తగిన మూల్యం చె ల్లించవలసిన రోజు రాక తప్పదు.

కంట్రాక్టువర్కు పులిమీద స్వారీ వంటిది. వర్కు తర్వాత వర్కు కొనసాగుతూనే ఉండాలి. ఇవ్వవలసిన వాళ్ళకెలాగూ ముందే డబ్బు ఇవ్వాలి. లేకపోతే పని కుంటుపడిపోతుంది. అలాగే రావల్సిన బిల్లులూ వెంటవెంటనే అందిపోయేలా మేనేజి చేసుకోవాలి. ఓ మాదిరి కంట్రాక్టరు నాలుగు వర్కులు తీసుకుని, వాటి ఫైనల్ పేమెంట్లుగాని ఏవో కారణాలవల్ల అందకపోతే, చెరువు నీటినుంచి, గట్టునపడ్డ చేపలా గిలగిల్లాడవలసిందే. దానితోపాటు చే తినిండా డబ్బు కనబడేసరికి లేనిపోని వ్యసనా లకు, దర్జాలకు అలవాటుపడితే, ఎంత డబ్బు దుర్వ్యయం అవుతుందో లెక్కేలేదు. చాప కింద నీరులా, కంట్రాక్టరు దగ్గర పనిచేసేవా ళ్లు, రకరకాలుగా కంట్రాక్టరుని మోసంచేసి డబ్బు దిగమింగిపోయే భయం ఎప్పుడూ వుంది. అందుకే ఈ వ్యాపారం, అంపశయ్యా మీద అనిమిష నిద్రలాటిది. కీకారణ్యంలో ఒంటరి ప్రయాణం లాటిది. కల్లోల జలధిలో దిక్సూచిలేని నావలాటిది.

తన నోటిదురుసుతనంతో, డబ్బుకోసం తన దగ్గిర వళ్లు దాచుకోకుండా కష్టపడి పనిచేసి తనకు లాభాల మేడను కట్టిపెడుతున్న వాళ్ళ నెందర్నో నొప్పిస్తూ, తన స్వార్ధానికి వాడుకుని పురుగులకంటె హీనంగా చూసేవాడు దొర. పని విపరీతమై, వాళ్ళలో పనంటే, ఆసక్తి నశించి, మందకొడిగా తయారై, మంచి ప్రా యంలోనే శక్తినీ, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి నిర్వీర్యులై పోయేవారు. వాళ్లు ఎంత శ్రమప డినా, ఒక్క పొగడ్తకానీ, ఒక్క మంచి మాటకానీ వాళ్ళకు లభించేదికాదు. అలా జరిగివుంటే వాళ్ళలో రెట్టింపు వుత్సాహం కలిగేది. కొండంత ఆత్మబలం కలిగేది. కానీ ఏనాడూ ఎవర్నీ ప్రకాశరావు దొర మెచ్చుకోలేదు. ఫలితం వాళ్ళలో చైతన్యం నశించిపోయి, వుత్సాహం ఆవిరైపోయి, తలలూపే గొర్రెల్లా మిగిలిపోయేవారు. లేదా విసుగుచెంది, ఈ దొరకో దండం, ఈయన పనికో దండం, అను కుని పారిపోయేవారు. ఎవరైనా ఎదురు తిరి గితే, అతనే వారిని పంపేసేవాడు. ప్రభాకరం, వెంకటేశ్వరరావు, పాణి వంటివారు ఏ కొద్ది మందో, దొరకంటె మొండిగా వుండి, తమ సమర్ధతను రుజువుచేసుకోగలిగారు కనుకనే, అతను వాళ్లనేమైనా అన్నా వాళ్ళను వదులుకో వటానికి ఇష్టపడడు. కాళ్ళ బేరానికైనా వచ్చి, వాళ్ళను నిలుపుకుంటాడు. అయితే అందుకు గాను అతను వాళ్ళకు చెల్లించే ప్రతిఫలం, వాళ్ళు చేసే పనితో పోలిస్తే బహుతక్కువ.

ప్రభాకరం, ప్రకాశరావు దొరకి అందరికన్న అతిముఖ్యుడు కావటానికి, అతన్ని విడిచిపెట్ట డానికి ఇష్టపడకపోవటానికీ, ప్రభాకరం వ్రాసే ఇన్‌కమ్‌టాక్సు లెక్కలే అసలు కారణం. వర్కు సైట్లో మిగిలిన వారంతా రాత్రింబవళ్లు కష్టప డి పనిచేయించి సంపాదించి పెట్టే లాభాల ను, అతితక్కువగా చూపించి, వీలయినంత తక్కువ ఆదాయపు పన్ను పడేలా చేయగలిగే నేర్పు అతడు ఆరునెలల వ్యవధిలోనే సంపా దించేడు. అతనికి ఆ లెక్కలు రాసే విధానం నేర్పిన ఆడిటర్ ప్రభాకరం వేగాన్ని చూసి ఆశ్చర్యపోయేడు. సంవత్సరకాలంలో జరిగిన ఆర్థిక వ్యవహారాలన్నిటినీ, మూడు నెలలకా లంలో కూర్చుని, అంకెల గారడీచేసి ప్రభా




కరం బాలన్సు షీటు వేస్తే, చూసి... భుజం తట్టి 'శభాష్' అనకుండా వుండలేకపోయేడు. ఆ తర్వాత ప్రభాకరం పని చేసినంతకాలం 'దొరకి తలభారం తగ్గిపోయింది. ఎవరికీ తెలియని దొర ఆస్తి వ్యవహారాలు, ప్రభాకరం వేలికొనల్లో వుండేవి. అది కాస్త పక్క బెదురుగానే వుండేది అతనికి. కానీ, తప్పదు.

వెంకటేశ్వరరావు మొదట్లో ప్రభాకరాన్ని దూరంగా వుంచేవాడు తన ప్రాబల్యం తగ్గిపోతుందేమోనని. తర్వాత్తర్వాత అతను అర్థంచేసుకున్నాడు. ప్రభాకరంలో ఏమాత్రం స్వార్థ చింతనలేదనీ, ఇంకా ధన సంబంధమైన మాలిన్యాలు అతన్ని అంటలేదనీ ఆ విషయం అర్థమయేక అతడు ప్రభాకరాన్ని అభిమానించసాగేడు. ఓసారి సలహా ఇచ్చేడతను.

''పద్దెనిమిది సంవత్సరాలసంది ఈన కొల్వులోఉన్నా... ఈన సైకిలు మీద తిర్గి పనిచేయించటం నాకు తెల్సు. ఇన్ని రోజుల్ల ఈన ఇంత పెద్దవాడయిండు. కానీ నాకేమైన ఫాయిదున్నదా? వొంటికైతే ఏళ్లొచ్చినయ్. పెండ్లయి, పిల్లలు బుట్టింద్రు. కానీ ఎప్పుడూ చేసిన కష్టం తిండికీ, బట్టకీ సరిపోబట్టె... ఎన్నడైనా కాలునొచ్చినా, చెయ్యి నొచ్చినా, ఆనాటితో సరి... ఏదో గింతంత పెద్దలిచ్చిన భూములుండబట్టి నాకెట్లయిన గడుస్తది... నాకా ఫికరు లేదు... ఏమీ లేని నీకెట్లయితది. చెప్పు. సోంచాయించు తమ్మీ... కనుక ఏం చెయ్యాలే... దీప ముండగనే ఇల్లు చక్కబెట్టుకోవాలె. లేకుంటె ఏదైన గవర్నమెంటు కొల్వుకు ప్రయత్నించాలె. నీ మంచి కొరకు చెప్తున్న''

''పోన్లే అన్నా... దొర నాతో ఏమన్నడో తెలుసా... శ్రీరాములుగార్ని చూసుకున్నట్టె చూసుకుంటననీ... నాకెంత అవసరముంటె అన్ని పైసలిస్తననీ, నాకే లోటులేకుండ చూస్తననీ చెప్పిండు... అట్ల చేసినా మంచిదే... లేదా బత్కలేనన్న బయమేమీ నాకు లేదు భాయ్... నసీబ్ ఎట్లుంటె అట్లయితది. మనం మంచి గుంటె, మనకి మంచే జర్గుతదని నేనను కుంట''

ప్రభాకరం అలా మాట్లాడేనరికి, వెంకటేశ్వర్రావు మరేం చెప్పదల్చుకోలేదు. ఈ మనిషికి అర్థంకావటానికి ఇంకా సమయం వుందని అతను భావించేడు. అనేక విషయాల్లో ఎంతో తెలివిగా ప్రవర్తించే వాళ్ళు కూడా ఏదో ఒక కోణంలో సరిగా ఆలోచించలేకపోతారు. హృదయ దౌర్బల్యమో, తమ శక్తిపై తమకుకల అంధవిశ్వాసమో వాళ్ళ ఆలోచనాశక్తిని మందగింపచేస్తుంది.

ఆలోచనల్లో మునిగి డ్రైవ్ చేస్తున్న ప్రభాకరం, హఠాత్తుగా ఎదురుగా వస్తున్న బొగ్గులారీని చూసి, అసంకల్పితంగా హేండిల్ పక్కకి తిప్పేడు. ఇంచుమించుగా అతన్ని రాసుకుంటున్నట్టుగా పక్కనుండి అతివేగంగా దూసుకుపోయింది ఆ లారీ... వెంట్రుక వాసి తేడాలో మింగెయ్యబోయిన మృత్యువు నాలుక తాటిస్తూ పక్కకి తొలగిపోయింది. కలిగిన షాక్ కి చెమటలు పట్టేసి, అంతా అంధకారమయిపోయింది. ముందుకు సాగిపోతున్న మోటర్ సైకిల్ రోడ్డుపక్కగా వేసివున్న కంకర్రాళ్లగుట్టను గుద్దుకుని కిందపడిపోయింది.

ఆ ఎర్రని ఎండలో కాలుతున్న తార్రోడ్డు మీద పడీపడగానే స్పృహతప్పిపోయాడు ప్రభాకరం. అతనిమీద మోటార్‌సైకిల్ పడిపోయింది. దాని ఇంజన్... ఇంకా గుర్...మంటూ చప్పుడుచేస్తూనేవుంది.

మరో పదినిముషాలు అదేస్థితిలో పడిఉన్నాడు ప్రభాకరం. ఇంతలో వర్క్‌సైట్‌నించి, క్వారీకి బయల్దేరిన ముక్తార్‌లారీ అటుగా వచ్చింది. దూరంనించే ముక్తార్ చూసేడు ప్రభాకరాన్ని... వెంటనే ఎక్సిలేటర్ బలంగా తొక్కి ప్రభాకరం పడివున్న దగ్గిర రోడ్డుమధ్యగా లారీ ఆపుచేసి, ఒక్క గెంతుగెంతేడు.

''ఒరేయ్ రాజేశం... నీళ్ళు అందుకో' అని క్లీనర్‌కి కేక పెట్టేడు. గబగబా మోటార్ సైకిల్ తీసి పక్కన పడేశాడు. లారీ బాడీలోంచి దిగిన ఇద్దరు లోడింగు కూలీలు ప్రభాకరాన్ని జాగ్రత్తగా ఎత్తుకుని, కొంచెం నీడనిస్తున్న తురాయి చెట్టు ఒకదానికిందకి తీసుకుపోయేరు. ముక్తార్, క్లీనర్ రాజేశం అందించిన నీళ్ళు తీసుకుని ప్రభాకరం మొహంమీద జల్లేడు. నోరుతెరిచి నోట్లో మరికొన్ని నీళ్లు పోసేడు. ప్రభాకరం గబగబా నీళ్ళు తాగేడు. కొద్దిగా మెలుకువ వచ్చింది. చుట్టూ లారీలోంచి దిగిన కళాసీలు

గుంపుగా నిలబడి ఆత్రుతగా చూస్తున్నారు. ఇద్దరు తమ తలపాగాలు విప్పి ప్రభాకరానికి గాలి తగిలేలా విసుర్తున్నారు. ఒకటి రెండు బొగ్గు లారీలు, ముక్తార్ లారీ అడ్డంగా వుండటంవల్ల ఆగిపోయేయి. ఆ డ్రైవర్లు హారన్‌కొడుతుంటే, ముక్తార్ బండబూతులు తిట్టేడు వాళ్ళని.

''సార్... ఎట్లుంది... నడ్వగలరా... బండ్లో పోదాం రండిసార్'' అని జాగ్రత్తగా లేవతీసేడు. ఒంట్లో ఎముకలేవో విరిగినట్టున్నాయి. కదలలేక బాధగా మూలిగేడు ప్రభాకరం. ముక్తార్‌కి పరిస్థితి అర్థమైంది. ప్రభాకరం తల తిప్పేసరికి మెడమీద తగిలిన గాయం నుండి నెత్తురుకారుతుండడం కనిపించింది. మరిక అతడాలస్యం చెయ్యకుండా నలుగురు మనుష్యులసాయంతో, ప్రభాకరాన్ని లారీలో జాగ్రత్తగా చేర్చేడు. కిందున్న నెత్తుటి మడుగు అతన్లో చెప్పరాని భయం కలిగించింది. కళాసీల తుండుగుడ్డల్ని జాగ్రత్తగా ప్రభాకరం తలకింద ఎత్తుగా పెట్టేడు. క్లీనర్ని మరో కళాసీని అతన్ని జాగ్రత్తగా పట్టుకోమని చెప్పి వాయువేగంతో, సింగరేణి హాస్పిటల్‌కి చేర్చేడు.

ప్రభాకరానికి మళ్లీ తెలివి తప్పిపోయింది.

★ ★ ★

అంతా చీకటి... ఎక్కడో అంధకార కుహరంలోకి మెల్లగా జారిపోతూన్న అనుభూతి. రానురాను ఊపిరి పీల్చుకోవటం కష్టమతున్న ఫీలింగ్... చీకటిగా, చలిగా, వున్న వాతావరణంనుంచి బయటపడాలని ప్రయత్నం చేస్తున్నా... ఫలించటంలేదు.

పక్కకి ఒత్తిగిల్లబోయేడు ప్రభాకం. ఉధృతమైన బాధ సుళ్లుతిరుగుతూ, పెనుతరంగంలా విరుచుకుపడింది. ''అబ్బా...'' అని మూలుగుతూ స్పృహలోకి వచ్చేడు ప్రభాకరం. నెమ్మదిగా అతని కళ్లు చుట్టూవున్న పరిసరాలను పరికించేయి. హాస్పిటలు వాతావరణం తెలిసింది. తన శరీరంవంక చూసుకున్నాడు. కుడి చేయి పూర్తిగా బేండేజీలో వుంది. మెడచుట్టూ, కదపలేకుండా, పెద్ద బేండేజీ... నెమ్మదిగా తనకైన ఏక్సిడెంటు గుర్తొచ్చింది. ముక్తార్ తన నెత్తుకు లారీలో చేర్చడం జ్ఞాపకం వచ్చింది. మనస్సులోనే అతనికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

అయిదు నిముషాలు గడిచేక ఓ నర్సు లోపలకి వచ్చింది. తనొక్కడే చిన్న గదిలో బెడ్‌మీద ఉన్నాడు. అది స్పెషల్‌రూమ్ అని అర్థమైందతనికి. ప్రభాకరం మెలుకువగా ఉండడం చూసి ఆ నర్స్ గబగబా ముందుకు వచ్చింది. బెడ్‌మీదనున్న దుప్పటి సరిచేస్తూ,

''ఎలా వుంది సార్... ఒంట్లో'' అనడిగింది పల్స్ చూస్తూ.

''నొప్పి... చాలా నొప్పిగా వుది. సిస్టర్'' మాట్లడలేకపోయాడు స్పష్టంగా. మెడనరాలు తెగిపోతున్నట్టనిపించింది.

''మీరు మరి మాట్లాడకండి. ఈ ఇంజక్షన్‌తో నొప్పి తగ్గుతుంది'' అంటూ ఓ ఇంజక్షన్ చేసింది అతని ఎడమచేతిమీద.

ప్రభాకరంకి బాగా దాహంగా అనిపించి, సైగచేసేడు నర్స్‌కి. ఆమె జాగ్రత్తగా ఎంతో నైపుణ్యంతో అతని పెదవులమధ్యనుంచి మంచినీళ్లు తాగించి, వెళ్ళిపోయింది.

మరికాసేపటికి తలుపు తోసుకుని వెంకటేశ్వర్రావు, సూర్యనారాయణ లిద్దరూ లోపలకి వచ్చేరు.

ప్రభాకరం వాళ్ళని చూసి కొద్దిగా నవ్వేడు. ఎప్పుడూ హడావుడిగా కేకలు పెట్టే వెంకటేశ్వరావు కాడతను ఆరోజు. మొహం దిగులుగా వాడిపోయి వుంది. నారాయణరావు మొహంలో మాత్రం యధావిధిగా ఏ భావమూ ప్రకటితం కావటంలేదు.

''ప్రభాకరం... ఎట్లున్నదయ్యా... ఇంతపనెట్ల చేస్తివి...?'' వెంకటేశ్వర్రావు దిగులుగా అడిగేడు.

ప్రభాకరం ఒక్కణం ఆగి నెమ్మదిగా అన్నాడు. ''నేనేమి కావాలని చేసుకున్ననంటవా ఏంది... జస్ట్ ఏక్సిడెంటు అయింది''

''జస్ట్ ఏక్సిడెంటంట... ఏక్సిడెంటు... ముక్తార్‌గని క్వారీకిపోకుంటే... దినవారాలయితుండె... పాగల్‌కే జాలాద్ లెక్క మాట్లాడతవు'' కసురుకున్నాడు.

తర్వాత నెమ్మదిగా తనే అన్నాడు... ''అ




మ్మొచ్చింది. పొద్దుగాల... తమ్ముడ్ని తోడు తీస్కొచ్చింది''

ప్రభాకరానికి ఒక్కక్షణం పేగు కదిలింది. విన్నది నిజమేనా అనుకుని, అడిగేడు ''ఏమన్నావు... అమ్మొచ్చిందా... ఎట్ల... ఎట్ల తెలిసిందామెకు?''

అంతవరకు మాట్లాడకుండా నిలబడ్డ నారాయణరావు అతని ప్రశ్నకు సమాధానమిచ్చేడు.

''మొన్న నీకు ఏక్సిడెంట యినాక, హైద్రాబాద్ ఫోన్ చేసి నేనే చెప్పిన. దొర లేడు. ప్రవీణమ్మ ఫోన్ రిసీవుచేసుకున్నది. ఆమె చాలా పరేషానయింది. ఆమె నీ డైరీల మీ ఇంటి అడ్రస్ చూసి, ఫోన్ చేసి చెప్పిందట. మీ అమ్మ, మీ తమ్ముడు ఈరోజు పొద్దున్నే వచ్చిన్రు''

''ఏదీ... ఎక్కడున్నది'' ప్రభాకరం చూపులు పరిసరాల్లో తారట్లాడేయి.

''ఉన్నదిలే... ఇంటిదగ్గరున్నది. శ్యామల సముదాయిస్తున్నది. ఇందాక ఫోన్చేస్తే, నీకు తెల్విరాలేదన్నరు. ఇగిప్పుడు మేం పొయ్యి నంక పంపుత''

నర్స్ మళ్లీ లోపలకి వచ్చింది.

''మీరు ఎక్కువగా మాట్లాడించొద్దు. మెడనరాలు దెబ్బతింటయి. ఇక మీరు పొండి'' అన్నదామె.

ఆమె మాటలు తు.చ.తప్పక పాటించేరు వాళ్ళిద్దరూ. ''మేం పొయ్యొస్తం... అమ్మను పంపుత తోడతనే... దొరస్తె రేపొస్తడు'' అని చెప్పి వాళ్ళిద్దరూ నిష్క్రమించేరు.

నర్స్ నిశ్శబ్దంగా తన పని చేస్తోంది. ప్రభాకరంకి తల్లి వచ్చిందని తెలిసి ఎంతో సంతోషం కలిగింది. ప్రవీణకు తనంటె వున్న అభిమానం అతడికి ఆనందాన్ని కలిగించింది.

నర్సు చేసిన ఇంజక్షన్ ప్రభావంవల్ల అతనికి మళ్ళీ మగత కమ్ముకొచ్చింది.

మళ్ళీ ప్రభాకరం కళ్లు తెరిచేసరికి, తల్లి చేయి అతని నుదురు మీదవుంది. పక్కనే స్టూలుమీద కూర్చుని ఆమె అతని మంచంమీద తలవాల్చి కళ్లు మూసుకుని వుంది. గదిలో లైటు చక్కగా వెలుగుతోంది. పైన ఫేను జోరుగా తిరుగుతోంది.

తల కాస్త పక్కకి తిప్పి గది కుడివైపున్న గ్లాస్ విండోవైపు చూసేసరికి చీకటిరాత్రి కావడంవల్ల నల్లగా ఉన్న ఆకాశంలో నక్షత్రాలు గుంపులుగా చేరి మాటాడుకుంటున్నట్టుగా కనిపించేయి.

ప్రభాకరం ఎడమచేయెత్తి తన నుదురుమీదున్న తల్లిచేతిమీద ఆప్యాయంగా వేసేడు. అతనెందుకో ఎంత ప్రయత్నం చేసినా ఆ చెయ్యి కదపలేకపోతున్నాడు. అసలతనికి తన చెయ్యి లేదేమోనని కూడా అనిపించింది.

అతని తల్లి ఉలిక్కిపడ్డట్టయ్యి, కళ్లు విప్పింది. ఎదురుగా తనవంకే చూస్తూ కొడుకు కనిపించేడు.

చెంపలమీద నెరసిన జుట్టు, పాపిడిదగ్గర వెంట్రుకలు ఎక్కువగా ఊడిపోవటంతో వెడల్పుగా కనిపిస్తున్న చర్మం... తన తల్లి పాడయిపోయింది. మొహంమీద ముడతలెక్కువయ్యేయి. చిన్న నుదురు మీద కుంకుమబొట్టు, ఆమె తల తిప్పేసరికి ఎర్రగా మెరిసింది.

ఆమె తన చేతిని కొడుకు నుదుటిమీద నుంచి జరిపి మొహాన్ని తడిమింది.

''ఏరా బాబూ... అమ్మనీ, అందర్నీ మరిచిపోయేవేంరా? ప్రాణాలమీదకు తెచ్చుకుని మాకు కడుపుశోకం పెడదామనుకుంటున్నావురా... నువ్వా... వచ్చెయ్యరా... ఎక్కడో తొండలు గుడ్లు పెట్టే దగ్గిర ఎందుకురా... ఎన్ని ఉత్తరాలు రాసేన్రా నీకు? మరి రాకుండా పోదామనుకున్నావేమో... నీకు తగ్గిపోనీ... నిన్నో క్షణం ఉండనివ్వను... మీ అమ్మ సంగతి తెలునుకదా... ఆ''

ప్రభాకరం తల్లి మాటలకు నవ్వుకున్నాడు. ఆమెలో ఆవేదన, ఆవేశంగా మారిపోయింది.

''రాజు కూడా వచ్చేడన్నారు?'' మాట మార్చేడు.

''వచ్చేడ్రా... పాపం... వెర్రి నాగన్న... కొత్తగా ఉద్యోగంలో చేరేడా... సెలవుల్లేవని అన్నా కూడావినక జీతం ముఖ్యంకాదు నాకు... మా అన్న ముఖ్యం అని, బయల్దేరి వచ్చేడు. వాడేగానీ రాకపోతే, నేనీ చోటుకు రాగలన్రా?

అరగంట కిందటవరకు కూర్చున్నాడు. పది దాటి పోతోందని నేనే వెళ్ళి నాలుగు మెతుకులు తినేసిరా... అని బలవంతపెట్టి పంపేను... నీకు కొంచెం హార్లిక్సు కలుపుతానుండు'' అంటూ లేచి చకచకా హార్లిక్సు కలిపి ప్రభాకరాన్ని పైకి లేవదీసి నెమ్మదిగా తాగించింది.

బుద్ధిగా ఆమె చెప్పినట్టు చేసేడతను. అతనికి అలా చేయటం ఆనందంగానే వుంది. అతన్లో కొత్త శక్తిని కలిగించింది ఆమె రాక.

... సుమారు నెల రోజులు పట్టింది ప్రభాకరానికి నయం కావడానికి. దొర ఒకటి రెండు సార్లొచ్చి చూసి వెళ్ళేడు. అతను మాట్లాడే విధానం ప్రభాకరానికి అసంతృప్తి కలిగించింది. ఆత్మీయంగా వుండేదికాదు అతని పరామర్శ... పని కుంటుపడిపోతోందన్న సంగతి స్పష్టంగా ప్రకటించడంతో ప్రభాకరం మనస్సు బాధపడింది. అయినా అతను తన తల్లికి తన కష్టాన్ని తెలీనీకుండా జాగ్రత్తపడ్డాడు.

అతనికి బాగా ఓపిక వచ్చి తిరుగాడుతుండగా, తల్లి వెళ్ళిపోతాననడంతో టెలిగ్రామిచ్చి తమ్ముడిని పిలిపించి, అతనితో ఆమెను పంపేసాడు. తొందర్లోనే వస్తానని మాట ఇచ్చేకనే ఆమె వదల్లేక వదల్లేక వెళ్ళింది.

★ ★ ★

కార్తీకం చివరిరోజులు... ఉషోదయం అవుతున్నవేళ... ఆకాశం నీలిరంగుల చిత్రంలా అందంగా వుంది... సూర్యుడు మంచు దుప్పటి తొలగించి నభో మండలంనుంచి భూమండలాన్ని వీక్షించటానికి క్షితిజగవాక్షం ముంగిటకు రాబోతున్నాడు. పొగమంచు దట్టంగా ఆవరించి వుండటంచేత పరిసరాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి.

లారీ ఒకటి హెడ్‌లైట్లకాంతిలో పొగమంచులో దారిచూసుకుంటూ వేగంగా వస్తోంది. లారీలో సిమెంటు రేకులు లోడ్ చేసి వున్నాయి. ప్రభాకరంతో పాటు పాణి కూడా ఆ లారీలో వస్తున్నాడు. ప్రకాశరావుతో ఆరోజు అంత గొడవైన తర్వాత, పాణీ వెంకట్రావు ఇద్దరూ మరి దొర పనికి గుడ్‌బై చెప్పేసేరు.





వెంకట్రావు చాలా ఏళ్ళుగా కంట్రాక్టు ఫీల్డ్‌లో వున్నవాడవటంచేత, అతను హైద్రాబాదులోనే అన్న కుటుంబానికి అండగా వుంటూ, నగరం చుట్టుపక్కల స్వంతంగా సివిల్ వర్కులు తీసుకోవాలన్న నిర్ణయానికి వచ్చేడు. అందుకే ఎంతోమంది కంట్రాక్టర్లు, అతన్ని తమదగ్గర పనిచేయమనీ, అతనికి కావలసినంత జీతం ఇస్తామనీ అన్నా అతడందుకు వప్పుకోలేదు. శ్రీరాములుగారి భార్యకూడా కావలసిన పెట్టుబడిగా బేంకులో తన పేరున వున్న డబ్బు పెట్టడానికి అంగీకరించింది. పాణీ, వెంకట్రావులు తీసుకున్న ఆ నిర్ణయం చాలా మంచిదని, వాళ్ళకి కావలసిన సహాయం తనెప్పుడయినా చేస్తాననీ ప్రభాకరం వాళ్ళతో చెప్పేడు. చెప్పడమే కాకుండా, కుకట్‌పల్లి ఏరియాలో ఒక పెద్ద కంట్రాక్టరు తీసుకున్న పనిలో శానిటరీ వర్క్ సబ్ కంట్రాక్టు వెంకట్రావుకి ఇప్పించేడు. ఆరునెలలకాలంలో పూర్తయ్యే ఆ పనిలో ఇరవైనుంచి ఇరవై అయిదువేల వరకు లాభం వుంటుంది. వెంకట్రావు తను కూడా ప్రయత్నంచేసి, మరొకరి దగ్గర వుడ్ వర్క్ కాంట్రాక్టు కూడా తీసుకున్నాడు. దానితో ఆ అన్నదమ్ములిద్దర్లో, నూతన వుత్సాహం కలిగింది. భవిష్యత్తుమీద ఆశ, తమ సామర్థ్యాన్ని నిరూపించుకోవాలన్న తపన ఏర్పడ్డాయి. శ్రీరాములుగారు పోయేక చుట్టూ చింతల చీకట్లు ఆవరించుకున్న ఆ కుటుంబంలో, ఆశల వెలుగులు విరబూస్తున్నాయి. ప్రకాశరావు దొర నెల రోజులు గడిచినా, ఇవ్వాల్సిన డబ్బు గురించి గానీ, ఇంటి రిజిస్ట్రేషన్ గురించి గానీ, ఒక్క మాటైనా అనలేదు. ఆరోజు గొడవ తర్వాత శ్రీరాములగారి కుటుంబానికీ, దొర కుటుంబానికీ మధ్య కనిపించని తెర ఒకటి పడిపోయింది. పక్కపక్కనే వుంటున్న ఆ రెండు కుటుంబాలూ, రెండు వేరువేరు ద్వీపాల్లో నివశించే వాళ్ళుగా మారిపోయేరు.

దూరంగా చాలా దూరంగానే... దొర చుట్టూ తెలియని దారాలేవో ముడిపడుతున్నాయి. క్రమంగా చిన్న చిన్నవే గానీ వైఫల్యాలు ఎదురవుతున్నాయి. వరుసగా జరుగుతున్న సంఘటనలతో దొరలో హిమనగంలా వుండేటటువంటి మనోబలం సన్నగిల్లుతోంది. పాతవర్క్ హేండోవరు చేసి ఫైనల్ బిల్లు తీసుకోవాల్సివుంది. కొత్తగా తీసుకున్న రెండు వర్కులూ, శ్రీరాము

లుగారుండగా, టెండర్‌వేసి తీసుకున్నవి. వాటిలో ఒకటి స్ట్రక్చరల్ కంట్రాక్టు. ప్రకాశరావు దొరకి స్ట్రక్చరల్ వర్క్ కొత్త... అయినా శ్రీరాములుగారు అంతా తను చూసుకుంటాననీ, మంచి పర్సంటేజీ వచ్చే వర్కనీ చెప్పడంతో ఆయన అంగీకరించి ఆ టెండర్ తీసుకున్నాడు. తనకి హామీ ఇచ్చిన వ్యక్తి మరణించడంతో, ఆ కంట్రాక్టు వర్క్ మెడకో గుదిబండలా తగిలింది. తీసుకున్న వర్క్ మానేయలేడు. తప్పని సరిగా దానికోసం ఒక ఇంజనీరుని పెట్టుకు తీరవలసివచ్చింది. మంచి ఇంజనీరు కోసం చాలా ప్రయత్నించేడు. కానీ శ్రీరాములుగారి కుటుంబానికి దొర చేసిన అన్యాయం, ఆనోటా, ఈనోటా పడి అందరికీ తెలియడంవల్లా, ఆయన దగ్గర పనిచేసేవాళ్ళని ఆయన ట్రీట్ చేసే విధానం తెలిసిపోవడం వల్లా, అనుభవం వున్నవాళ్ళెవరూ, దొర దగ్గరకు రావటానికి అంగీకరించలేదు. తను పిలవకుండానే తన దగ్గర ఉద్యోగాలకోసం వస్తారనుకున్న అతను, తను పిలిచినా సరే ఎవరూ రాకపోవడం చూసి బాగా ఆశ్చర్యపడ్డాడు. అయినా పట్టువదలక, ఒక రిటైర్డ్ మిలిటరీ ఇంజనీర్‌ని నెలకి ఏడువేల రూపాయల జీతంమీద తీసుకున్నాడు.

ఆ ఇంజనీర్ పేరు మోహనరావు... అతను వర్క్‌సైట్లో పని చేయడానికి వచ్చేక రెండురోజులు చూసేడు ప్రభాకరం అతని పనితీరు. అతనిదంతా మిలటరీ పద్ధతి. టైముకి ఆయనకి బ్రేక్‌ఫాస్ట్, లంచ్, ఆయన ఇచ్చిన మెనూ ప్రకారం అందించాలి. వర్క్‌మీదకి కూడా టైము ప్రకారం వెళ్ళి టైము ప్రకారం టంచన్‌గా తిరిగి వచ్చేస్తాడు. పని మధ్యలో వున్నా... మరి కొంచెం సేపటిలో అయిపోతుందన్నా అతను మాత్రం వుండడు. తను చెప్పినట్టు ఎవరైనా చెయ్యలేకపోతే, వెంటనే వాళ్ళను పనిలోంచి పొమ్మనేవాడు. పనివాళ్ళంతా అతన్ని 'పిచ్చి ఇంజనీరు' అని పిలవడానికి ఎక్కువ రోజులు పట్టలేదు. రోజూ మాంసం, మద్యం తప్పని సరిగా వుండాలి. ఆ ఖర్చంతా కంపెనీ మెస్



భరించాల్సిందే... ఈయన మరికొన్నాళ్లు పనిచేస్తే, ఆయనకున్న పేరే కంపెనీకి వచ్చేట్టుంది అనుకున్నాడు ప్రభాకరం. వర్క్‌లో కూడా అనేక పొరబాట్లు జరుగుతూ వుండటంవల్ల అనవసర ఖర్చు పెరిగిపోవడంతోబాటు, డిపార్టుమెంట్‌నుంచి రెండుమూడు తాఖీదులు అందుకోవాల్సి వచ్చింది.

పాణి నిద్రమత్తులో జోగుతున్నాడు. ప్రభాకరం కొంచెం చలి అనిపించి సిగరెట్ తీసి వెలిగించేడు. ఉండుండి ఏదో వాహనం ఎదురవుతుంటే, దాన్ని తప్పిస్తూ వేగంగా పోనిస్తున్నాడు డ్రైవర్‌గా ప్రమోట్ చేయబడ్డ షెర్పుద్దీన్. ప్రభాకరమే అతనికి లైసెన్సు ఇప్పించి డ్రైవర్‌గా మార్చేడు. చుట్టూ చూస్తున్న ప్రభాకరం దృష్టికి రోడ్డు పక్కగా పడివున్నదేదో కనిపించి.

'షెర్పుద్దీన్ బండాపు!'' అని ఆదేశించేడు.

ఉలిక్కిపడి షెర్పుద్దీన్ బ్రేకుమీద కాలు గట్టిగా అదిమేడు.

''క్యాహువా సాబ్!'' అంటూ.

అప్పటికే ఇరవై గజాల దూరం వచ్చి ఆగిన లారీనుండి గబగబా కిందకి దిగి వెనక్కి నడిచేడు ప్రభాకరం. లారీ ఆగడంతోనే పాణి నిద్రమత్తు తొలిగిపోయి అతను కూడా

''ఏమైంది గురూ!!'' అని అడిగేడు. కానీ ప్రభాకరం జవాబేమీ ఇవ్వకపోవడంతో తను కూడా దిగి అతని వెనుకే కదిలేడు.

ప్రభాకరం తన దృష్టినాకర్షించిన ప్రదేశం చేరుకునేసరికి, అక్కడి దృశ్యం అతనికి గగుర్పాటు కలిగించింది. అతని వెనకే అక్కడికి చేరుకున్న పాణి భయంతో వణికేడు.

రోడ్డు పక్కగా మూడడుగుల ఎత్తులో కొంత దూరం వరకు దట్టంగా చిన్నచిన్న పొదలు ఉన్నాయి. ఆ వెనుకగా పొడవైన చెట్లతో, తీగెలతో అడవి ప్రారంభమైంది. అడవి చాలా విస్తృతంగా వుంది. కొంచెం దగ్గర్లో చిన్న గుట్ట ఒకటీ, దానివెనగ్గా కొండల శ్రేణీవున్నాయి. ఆ పరిసరాల్లో ఎన్నిసార్లోఅటు ప్రయాణం చేసి వున్నందున వాళ్ళెవరికీ కొత్తకాదు. అవి కాదు ప్రభాకరం దృష్టినాకర్షించినవి. రెండు శరీరాలు ఖాకీదుస్తుల్లో వున్నవి పొదల మధ్యగా, రోడ్డు అంచున విసిరేసినట్టుగా పడి వున్నాయి. లారీ మలుపు తిరిగినప్పుడు హెడ్‌లైట్ల కాంతిలో, ఆ వ్యక్తులు పూర్తిగా కనిపించలేదు. కానీ అందులో ఒకవ్యక్తి చేతికున్న వాచీ మాత్రం మెరుస్తూ కనిపించడంచేత ప్రభాకరం లారీ ఆపించేడు. కానీ అక్కడికొచ్చిచూసేక ఆ దృశ్యం అతన్ని కలవరపర్చింది.

''పోలీసుల్లా వున్నారు...'' అస్పష్టంగా గొణిగేడు పాణి ప్రభాకరం భుజం వెనుకనుంచి.

తలూపేడు ప్రభాకరం. రెండు అడుగులు ముందుకు వేసి పొదలు పక్కకి వత్తిగించేడు. అప్పటికి తెలవారవస్తోంది. పొగమంచు క్రమక్రమంగా అదృశ్యమవుతోంది. ఆకులమీద బిందువులుగా ఏర్పడిన మంచు బొట్లుగా రాలి క్రిందనేలను తడుపుతోంది. పరిసరాలన్నీ నిశ్శబ్దాన్ని గానం చేస్తున్నాయి.

పూర్తి ఖాకీ యూనిఫాంలో ఉన్నారు అక్కడ పడివున్న వారిద్దరూ... ఎక్కడనుంచో ఈడ్చుకుంటూ వచ్చి పడేసినట్టున్నారు. ఒక వ్యక్తి కాలుకి వుండాల్సిన బూటులేదు... ఎక్కడో జారిపోయింది కాబోలు. అతను సన్నగా వయస్సు మీరిన వాడిలావున్నాడు. తల అసహజంగా వంపుతిరిగివుంది. గాయం ఎక్కడ తగిలిందో కానీ చొక్కా రక్తసిక్తమైవుంది. రెండు గుండీలు తెగిపోయి వుండటంవల్లనేమో నడుం దగ్గర చొక్కా చివరలు చెదిరిపోయి లోపలున్న బనియను కనిపిస్తోంది తెల్లగా.

రెండోవ్యక్తి పచ్చటి రంగులో బలంగా వున్నాడు. హేట్‌లేని అతని తలమీద వొత్తైన ఉంగరాల జుత్తు ఆకర్షణీయంగా ఉంది. ఎడమ చెంపమీద లోతైన గాయం విచ్చుకుని వుంది. రక్తం ధారగా కారినంతమేరా చారికలు కట్టి ఉన్నాయి. పొడవుగా వున్న ఆవ్యక్తి యువకుడే.

పాణి భుజంపట్టి లాగబోతుంటే విడిపించుకుని ముందుకు కదిలి కొద్దిగా వంగి చూసేడు ప్రభాకరం ఆ యువకుడి ఛాతీమీద కనిపిస్తున్న ప్లాస్టిక్ ప్లేటు వంక... ''విష్ణుపవన్'' నెమ్మదిగా చదివేడు.

అప్పటికే అక్కడికి చేరుకున్న షెర్పుద్దీన్ ఆ పేరు విని, పడివున్న ఆ వ్యక్తిని గుర్తుపట్టేడు.




"ఈన మన ఏరియా సి.ఐ. ప్రభాక రంసాబ్... వొచ్చి ఏడాదన్నా పూర్తికాలేదు... పెద్ద పులి అనంటరు సాబ్... కేటుగాళ్ళకు, దాదా లకు ఈన్నుచూస్తే చాలు మూత్రం బందయి తది... పాపం... నంపి పారేసినట్టున్నరు... ఎవ రో దొంగబాడకవ్‌లు" సానుభూతి ప్రకటించే డు.

"పద గురూ... మనకెందుకు పోలీసుల గొడవ... మనకీ దినం బొచ్చెడు పనున్నది... నడు... నడు..." హెచ్చరిస్తూ కదలబోయేడు పాణి.

పాణి మణికట్టు పట్టుకు ఆపేడు ప్రభా కరం. అతని దృష్టి నిశితంగా ఆ ఇనస్పెక్టర్ శరీరంమీదే వుంది.

"కొంచెం ఉండు పాణీ... నాకెందుకో అను మానంగా వుంది" అంటూ... ప్రభాకరం రెండ డుగులు ముందుకు వేసి ఇనస్పెక్టర్ శరీరం పక్కగా మోకాలు వేసి కూర్చున్నాడు. కొంచెంసేపు పరీక్షించేడు. లేచి నిలబడ్డాడు.

"పాణీ... ఈయనకింకా ప్రాణం పోలేదు... మనం త్వరగా హాస్పిటల్‌కి తీసుకుపోతే, బతు కుతాడేమో... షెర్పుద్దీన్ కొంచెం సాయంప ట్టు... నువ్వూరా పాణీ... ఓ చెయ్యి వెయ్యాలి... చాలా భారీ మనిషిలా ఉన్నాడు" అని పిలిచి రెండో వ్యక్తిని కూడా పరీక్షించేడు కానీ అతను చనిపోయి చాలాసేపయివుంటుందని ప్రభాక రానికి వెంటనే అర్థమైపోయింది.

"మనకెందుకు... ఈ అనవసరంగొడవలు... లేనిపోనివి తెచ్చి మన నెత్తికి చుడితె తెంపుకో లేక చావాలె. చెవుతే వినని మనిషి వయి తివి" అని విసుక్కుంటూ సాయంచెయ్యడాని కి ముందుకొచ్చేడు పాణి. అప్పటికే షెర్పుద్దీన్ ఆ ఇనస్పెక్టర్ రెండు కాళ్లవద్ద చేరి పైకి లేవనెత్తడానికి సిద్ధంగా వున్నాడు.

వంటినిండా గాయాలతో ఉన్నా ఇంకా ఆ ఇనస్పెక్టర్‌లో ప్రాణం కొట్టుకులాడుతోంది. లారీ కేబిన్‌లోకి చేర్చేటపుడు అతను పెదాలు కదపడం చూసి, వాటర్ బాటిల్‌లో వున్న నీరు అతని గొంతులో కొద్దికొద్దిగా పోసేడు ప్రభా కరం.

ఇనస్పెక్టర్ కళ్ళు ఒక్కసారి తెరుచుకు న్నాయి. ఆనక్తిగా ముందుకు వంగేరు ముగ్గు రూ. అంతలోనే మళ్లీ మూతలు పడ్డాయి. అతను ఇంకా తెలివిలోకి రాలేదని గ్రహించే రు.

షెర్పుద్దీన్ లారీస్టార్టు చేసి విపరీతమైన వేగంతో, పోనిచ్చేడు. అదే పనిగా హారన్‌కొట్టు కుంటూ, పోయిన ఆ లారీ సరిగ్గా ఆసుపత్రి గేటు ముందుకి వచ్చేకే ఆపేడు.

తర్వాత జరగవలసినవన్నీ వెంట వెంటనే జరిగిపోయేయి. హాస్పిటల్‌నుండి పోలీస్ డి పార్ట్‌మెంటుకు ఫోన్ వెళ్ళిన పదినిముషాల నుంచి ఆ ఆవరణ అంతా పోలీస్‌బలగంతో నిండిపోయింది.

ఇన్‌స్పెక్టర్ దుస్తుల్లో ఉన్న ఓ నలభై ఏళ్లవ్య క్తి కొంతసేపయాక ప్రభాకరం వాళ్ళు ఉన్న దగ్గరకొచ్చేడు.

"నా పేరు సాయిచంద్. పవన్‌గారు మా సి.ఐ.. మీరు ఆయన్ని చూసి తెచ్చి వుండక పోతే... మా డిపార్ట్‌మెంట్ ఒక సమర్థుడైన ఆఫీసర్ను పోగొట్టుకొని వుండేది. మీరు చేసిన సహాయానికి మేం మీకు రుణపడి వుంటాం. డాక్టరుగారు చెప్పేరు. మరో గంట ఆలస్యం అయితే ఆయన చనిపోయివుండేవారని... మీ రు శ్రమ అనుకోకపోతే, కొన్ని వివరాలు నాకు చెప్పినట్లయితే, మా రిపోర్టుకు ఉపయోగపడ తాయి. ఉండండి" అని ఒక కానిస్టేబుల్‌ను కేకేసి వేడిగా కాఫీలు తెప్పించేడు.

ప్రభాకరం ఒక్కొక్కటిగా తను చూసిన వివరాలు, ఆప్రదేశం గుర్తులు, అక్కడే మరో శరీరం వున్న సంగతి. ఆ వ్యక్తి ప్రాణాలు పోవడం చేత తాను తీసుకురాలేదన్న సంగతీ అన్నీ విశదంగా చెప్పి, అవే విషయాలు రాసిచ్చి సంతకం చేసేడు.

పొద్దు బాగా పైకి వచ్చింది. ఆ ఇన్‌స్పెక్టర్ ఎంతో మర్యాదగా ప్రభాకరం దగ్గర వీడ్కోలు తీసుకుని, వాళ్ళు వెళ్ళిపోడానికి అనుమతిచ్చే డు. లారీలోకి ఎక్కిన షెర్పుద్దీన్ ఇంకా స్టార్టుచె య్యకముందే, పూర్తిగా ఆయుధాలు ధరించిన పోలీసులుతో నిండివున్న జీపులు రెండు అడవి దిశగా దూసుకుపోయేయి. సైరన్

మోగించుకుంటూ... ఒక్క నిముషంపాటు అటువేపు చూసేరు లారీలో వున్న ముగ్గురూ... అంతలోనే గరగరమంటూ లారీ స్టార్టయ్యి వర్క్‌సైట్ దిశగా సాగిపోయింది.

★ ★ ★

మూడు నెలలు గడిచేయి...

పవర్‌హవుస్ స్యూయేజ్ లైన్ వేయడంకోసం పాలమూరునుంచి వచ్చిన వడ్డెరలు తవ్వుతున్న ట్రెంచ్‌లో పదడుగుల తర్వాత బండ పడిందని చెపితే వొచ్చి చూస్తున్నాడు ప్రభాకరం. ఆ కంట్రాక్టు సుమారుగా నాలుగు కిలోమీటర్లు చుట్టు కొలతలో వుంటుంది. చీమల గుంపు బెల్లం ముక్క తినేస్తున్నట్టు ప్రపంచం మొత్తంమీద మట్టి పనికి పేరు పొందిన మహబూబ్‌నగర్ కూలీలు గుంపులు గుంపులుగా, మహా వేగంగా తవ్వకం కొనసాగిస్తున్నారు. వాళ్ళంతా సుమారు పదిహేను రోజులుగా పనిచేస్తున్నారు. నాలుగు వందలమంది పైబడే వుంటారు. ఆ పనివాళ్ళతో కంట్రాక్టరుకు ప్రత్యక్ష సంబంధం ఏమీ వుండదు. వాళ్ళకి వంతుల వారీగా పని కేటాయించేది వాళ్ళ మేస్త్రీలే... వెండి పిడి వున్న గజం బద్ద చేత పుచ్చుకుని, బంగారు చెవి తమ్మెట్లతో వున్న మేస్త్రీ లింగన్న దూరంనుంచి ప్రభాకరాన్ని, అతని కూడా వున్న మోహనరావును చూసి దగ్గరగా వచ్చేడు. తెల్లని పంచె చెంగులు కింద జీరాడుతున్నాయి. వెండి బిళ్లల మొలత్రాడు ఓ వారగా జారి కనిపిస్తోంది.

''బండవడ్డది. పేలిస్తెగని పని నడవది'' ప్రభాకరం వంక చూస్తూ అన్నాడు.

సమ్మెటతో కొడితె కాదా లింగన్న?'' అడిగేడు ప్రభాకరం.

''ఎంతని గొట్టమంటరు? అంతా చట్టు బండైపాయె. రెండొందల గజాల వరకున్నది. ఎట్ల గొట్టయితది... ఈ.డీ.లు తెప్పించుమ్రి... ఈ ఒక్క జాగల్నే కాదు... చాలావరకు బండనే వున్నది. మీరెట్ల జేస్తరో. నాకు తెల్వదు. నాల్గయిదు దినాలవరకు నా లేబరుకు ఎట్లనో పని చూపుత... అప్పటికి పేలుడు సామానుతోబాటు కంప్రెషన్ గూడ తెప్పించిన్రా పని పూర్తయి నంకనే మేం పోతము... లేకపోతే లేబరును తీస్క ఒరిస్సా లేచి పోయెడిది ఖాయం... ఒక్క దినం పనాగినా నాకు వేలల్ల వుంటది నుక్సాన్. ఏమి జేసెడిదీ సోంచాయించుమ్రి'' అని చెప్పి.

''ఏమ్రా మల్లిగా... అడ్లు దంచుతున్నావురా...? గడ్డపారకి నొప్పిలేస్తున్నదేమ్రా... గట్టిగ అడుస్తలేవేమి... నీ పీన్గ కుక్కలుతిన...కానీ... కానీ'' అంటూ పనివాణ్ణొకణ్ణి అదిలిస్తూ ముందుకు సాగిపోయేడు.

కొత్తగా వచ్చి పడ్డ సమస్యకి పరిష్కారం వెంటనే ఆలోచించకపోతే, లింగన్న చెప్పినట్టు చేస్తాడన్నది మాత్రం యదార్థం. లింగన్నతో బాటున్న మరో ముగ్గురు మేస్త్రీలూ లేచిపోవడం జరిగితే, పధ్నాలుగు అడుగుల లోతుకన్న ఎక్కువే తవ్వవలసిన ట్రెంచ్ వర్కు ఆగిపోతుంది. నెలా పదిహేనురోజులకన్న ఎక్కువ సీజన్ లేదు. వర్షాలు మొదలయితే పని అంతా రసాభాస అయిపోవటం, నష్టం లక్షల్లో వుండటం భయపెడుతున్న యదార్థాలు. ముందు చేసిన వర్కుల్లో ఫైనల్ బిల్లులు కాకపోవడంవల్ల, ఈ ఎమ్‌డీల రూపంలో, ఇతర సెక్యూరిటీ డిపాజిట్ల రూపంలో కంపెనీ డబ్బు చాలావరకు వుండిపోవడంవల్లా, ఎడ్వాన్సుల రూపంలో లేబర్‌మీద ఎక్కువ డబ్బు వుండిపోవటంచేత, నెలానెలా జరపవలసిన పేమెంటుకి డబ్బు సమకూర్చడం ఒక సమస్యగా తయారైంది. ఇప్పుడు ఈ పని సగంలో ఆగిపోతే చాలా ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. ఇంతకు ముందు చేయవలసిన పేమెంటుకి ప్రభాకరం డబ్బడిగినవుడు దొర చిటపటలాడేడు... నన్ను ముంచుతున్నారని తిట్టేడు. ఇక ఇప్పుడీసంగతి చెపితే ఆయనెంత ఎగురుతాడో అనిపించి ప్రభాకరం నిట్టూర్చేడు. మోహనరావు మాత్రం పక్కనే వున్న మోటార్‌సైకిల్ నానుకుని నిలబడి సిగార్ పీలుస్తూ తన్మయత్వం చెందుతున్నాడు.

''మోహనరావు సాబ్! ఏం చేద్దామంటారు?'' యధాలాపంగా అడిగేడు ప్రభాకరం తన ఆలోచనల్లో తానుంటూ.

ప్రభాకరం ప్రశ్నకి మోహనరావు నుండి





వెంటనే జవాబు వచ్చింది.

"ఏం చెయ్యడం అంటారేమండీ... ఆ లింగన్నగాడి పొగరు చూస్తే నాకు మండు తోంది. ఆ లేబర్ కంట్రాక్టరు వెధవకే అంత తల తిరుగుడైతే, వాడికి డబ్బిచ్చి పని చేయించుకుంటున్న మనకెంత వుండాలి? అయినా వాడికి పనిచ్చింది మీరు కనక నేనేమీ కల్పించుకోలేదు... వాడిని పిల్చి గట్టిగా చెప్పండి. మీరు చెప్పకపోతే నేను చెప్తాను. బండ పడినా బొగ్గు పడినా... ఆరు నూరయినా, నూరు ఆరయినా వాడు పని పూర్తిచేసాకే వెళ్ళాలి. గడ్డపారతో పగలకొడతాడో, వాడి గజం బద్దతో చితగ్గొడతాడో మనకనవసరం. ఒప్పుకున్న ప్రకారం తవ్వకం అయ్యాకే వాడు గానీ, వాడి లేబరుగానీ కదలాలి... లేకపోతే కాళ్ళు విరగ్గొట్టి కూచోపెడతాం. ఏమనుకుంటు న్నాడో... ఏమో... మిలటరీ పద్ధతంటే అది. మీకు చేతకాకపోతే నాకొదిలిపెట్టండి... తేల్చేస్తాను"

పరిస్థితిమీద అవగాహన లేకుండా, మూర్ఖంగా మాట్లాడుతున్న మోహనరావువంక చూస్తుంటే, ప్రభాకరానికి చిరాకు కలిగింది. ఎటువంటి మనిషి ఇతడు. లింగన్న మాట్లాడింది అగ్రిమెంటు మేరకే అన్నసంగతి కూడా అతని ఆవేశంలో మర్చిపోతున్నాడు. సమయానికి తను వుండటం మంచిదే అయ్యింది. లేకపోతే, ఇతగాడు లింగన్నతో అవాకులూ, చవాకులూ పేలి వుండేవాడు. మాట పట్టింపుకి మారుపేరైన ఆ వడ్డెర మేస్త్రీ పని ఆపేసి వెళ్ళిపోయి వుండేవాడు. చేసిన పని కన్నా తీసుకున్న ఎడ్వాన్సు ఎప్పుడూ ఎక్కువే వుండేలా చూసుకోవడం ఆ మట్టి పని మేస్త్రీలకు బాగా అలవాటు కనుక, నష్టపోయేది తామే... సగంవరకు చేసి ఒక మేస్త్రీ ఆపేసిన పని ఇంకొకరితో చేయించడానికి తలప్రాణం తోకకిరావడం, ఖర్చు రెండు మూడు రెట్లు పెరిగిపోయి లాభం రావలసిన కంట్రాక్టు పీకలవరకు నష్టాన్ని తెచ్చిపెట్టేది.

గబగబా ఈ ఆలోచనలన్నీ మనసులో మెదిలి ప్రభాకరం, మరొకమారు తాను మోహనరావుతో కలిసి సైటుకు రావడం మంచి పనయిందని అనుకున్నాడు.

"మీరేం లింగన్నతో అనకండి. నేను దొరతో మాట్లాడి ఏం చెయ్యమంటారో తెలుసుకుంటాను.. పోదాం పదండి" అంటూ అక్కడినుంచి కదిలేడు ప్రభాకరం.

సిగార్ నేలమీద పారేసి, మోటార్‌సైకిల్ స్టార్టు చేసేడు మోహనరావు.

ఫోన్‌లో కాంటాక్టు చేసి సంగతి చెపితే ప్రకాశరావు దొర నిప్పులు తొక్కిన కోతిలా చిందులేశాడు. అందర్నీ కట్టకట్టుకుని ట్రెంచిల్లో దూకమన్నాడు. నాదగ్గర ఒక్క పైసా లేదు... వర్కు ఎలా కాలిపోతే అలా కాలిపోనీమన్నాడు. సమర్థతలేని సోమరిపోతులంతా తనదగ్గిర వన్లోకి చేరి తనకి క్షవర కల్యాణం జరిపిస్తున్నారని తిట్టిపోసేడు. అరగంటసేపు నోటికొచ్చినట్టల్లా తిట్టేక.

"ఆ లింగన్న గాడట్లంటె నువ్వేం పీకుతున్నావు? దొర... వాడిట్లన్నడు... వీడిట్లంటుండు... అని నాకు చెప్పనీకి ఫోన్ పెట్టించిననుకున్నవా... అడ? హుంకరించేడు.

అతని తీరు బాగా అలవాటైన ప్రభాకరం ఓపికగా బదులిచ్చేడు.

"నేపోయి మా చూసిన సార్... లింగన్న వట్టిగనే చెప్పలేదు. ఏడెనిమిది జాగాల్ల బండ పడింది. బాగా లోతుగనే వున్నది. గడ్డపారలతో, గన్నులతో, పోయేట్లు లేదు. ఒక్కోదగ్గర ఏడెనిమిది అడుగుల్లనే పడ్డది. అది పగలగొట్టితె గాని ట్రెంచి పూర్తిగా తవ్వనీకికాదు... సాగర రావు కంట్రాక్టరు దగ్గరకి పోయొచ్చిన... కంప్రెషర్ అద్దెకి అడుగుదమని. ఆయన మైనింగు వర్కు, కంప్రెషర్ రిపేరుకు రావడంతో ఆగిపోయున్నది. నేడో, రేపో అది రిపేరై వొచ్చినా, ఇయ్యలేనన్నడు. ఇక్కడ మరెవ్వరి వద్ద కంప్రెషర్ లేదు. డిపార్టుమెంట్ల ఈ.డీ.లకు పెర్మిషన్ కోసం దరఖాస్తురాసిచ్చిన. వాండ్లు పెర్మిట్ ఇచ్చినంక, గాని కొనడానికి కాదు... మనకి మెస్ సామాన్లిచ్చె వెంకటేసాన్ని పోయి కలుస్తె, కావలసిన ఈ.డీ.లు (ఎలక్ట్రానిక్ డిటనేటర్లు) ఇస్తనన్నడు. జిలెటిన్లు మాత్రం తనతాన ఎక్కువ లెవ్వు బయట తెచ్చుకోమన్నడు... మీకివన్నీ చెప్పుదమని ఫోన్ చేసిన... పైసలు మాత్రం జరూరు ఇవ్వమంటున్నడు" అని

ఊరుకున్నాడు.

అవతలవైపునించి దొర కాసేపు ఏం మాట్లాడలేదు. తర్వాత అడిగేడు.

"పోలీసులతోని గొడవొచ్చె వనయితె కాదు కదా! రోజులేం మంచిగలేవు... తాడు పట్టిన గని పామైతున్నది. అంత నా ఖర్మానికొచ్చింది తియ్... నువ్వొక పని చెయ్యి... రామచంద్ర రావు... నీకేర్పాటెకదా... ఎఫ్.పి.ఐ వర్కులు చేస్తడు. నాకు బావయితడు. ఆయనదగ్గరకు పో... నేనాయనకు ఫోన్ చేసి చెప్పుత... బ్లాస్టింగు సామాను కెన్ని పైసలు కావల్నో లెక్క చేసి, ఆ పైసలు ఆయన్కి చెప్పితీసుకో. లెక్క బరాబర్ రాసుంచు. గత నెలలోనే అయితద న్న బిల్లు ఆ ఎకవుంట్సు ఆఫీసరు సాలెగాడు పండబెడుతుండు. వానిదగ్గరకు పోయి ఎట్లనో ఆ బిల్లు చేపియ్యి... రెండు మూడు దినాల్ల నేనొస్త కంప్రెషర్ ఇక్కడగని దొర్కతదేమొ నే విచారిస్త... రాత్రి పదిగంటలకొక్కసారి ఫోన్ చెయ్యి... దాని ముచ్చట ఏం జెయ్యాల్నో చూడొచ్చు... లేనిపోని గొడవలు వస్తయ్యని బుగులువుడుతున్నది... ఇదెక్కడి బండపడిందయ్యా... నా ప్రాణానికి... ఇంక వుండు" అని ఫోన్ పెట్టేశాడు దొర.

ప్రభాకరం లేచి బయటకు నడవబోతుండగా ఆఫీసు ఆవరణలోకి పోలీసు జీప్ వచ్చి ఆగింది. అడుగు వెయ్యకముందే అపశకునం ఎదురైనట్లు అనిపించింది. గుమ్మంలోనే ఆగిపోయేడు.

ఆగిన జీపులోంచి, ఆరడుగుల రెండంగుళాలు పొడవున్న ఆజానుబాహుడైన ఇన్స్పెక్టర్ వ్యక్తి కిందకి దిగేడు. పొడవుకు తగ్గ విగ్రహంతో చాలా హుందాగా, మాన్లీగా వున్నాడతను. బెల్టుకివున్న బ్రవున్ లెదర్‌కేస్ మూత పెట్టి వుంది. దాన్లో సర్వీస్ రివాల్వర్ వుండటంవల్ల కాబోలు బరువుగా వేలాడుతోంది. అతని కళ్లకు ధరించిన రేబాన్ కళ్లద్దాలు లేత ఆకుపచ్చరంగులో సూర్యకాంతిలో మిలమిల లాడుతున్నాయి. ఆ ఇన్స్పెక్టర్‌కి తమ ఆఫీసుతో ఏం పనో, అర్థంకాలేదు ప్రభాకరానికి. మొహం చిట్లించేడు.

జీపు దిగి ప్రభాకరం వున్న దగ్గరకి కొలిచిన ట్టుగా అడుగులేస్తూ వచ్చేడు ఆ ఇన్స్పెక్టర్ దుస్తుల్లోని వ్యక్తి. జీపు డ్రైవరు కిందకి దిగి జీపు పక్కనే వినయంగా నిలబడి వున్నాడు.

ప్రభాకరం అతనూ, ఎదురెదురుగా నిలబడ్డారు. ఓ క్షణం తటపటాయించి అతనే అడిగాడు.

"ఎక్స్‌క్యూజ్‌మీ... ఈజిట్ ప్రకాష్ రావ్స్ ఆఫీస్?"

"యస్... బట్ హూమ్ డు యూ వాంట్?" ప్రభాకరం ప్రశ్నించేడతన్ని

రిలీఫ్‌గా శ్వాస తీసుకున్నాడతను. "ఐ యామ్ విష్ణు... విష్ణుపవన్... ఐ వాంట్ టు మీట్ ప్రభాకరం. వేరీజ్ హి...?"

ఛక్ మని మెరుపు మెరిసినట్లుగా అతనెవరో బోధపడ్డది ప్రభాకరానికి. అతన్లో అంతవరకు చోటుచేసుకున్న అనవసర ఆందోళన తొలగిపోయింది. దానిస్థానే సంభ్రమం చోటుచేసుకోగా.

"రండి... లోపలకు రండి... నేనే ప్రభాకరాన్ని..." అని హడావుడిగా ఆహ్వానించేడు.

అతనక్కడే ఆగిపోయేడు. కళ్లద్దాలు ఎడమచేత్తో తీసి పట్టుకున్నాడు. ప్రభాకరాన్ని ఓ క్షణంపాటు పరిశీలనగా చూసేడు. తెల్లటి విశాలమైన అతని నేత్రాలు ప్రభాకరాన్ని స్నేహపూర్వకంగా సమాశ్వాసించేయి. ఒక్కడుగు ముందుకు వేసి ప్రభాకరం చేతిని పట్టుకుని కరచాలనం చేస్తూ.

"థేంక్ యూ.. మై సేవియర్... థౌజండ్ థాంక్స్ టుయూ" అన్నాడు. ప్రభాకరం సిగ్గుపడ్డాడు. "దోంట్‌సే లైక్‌దట్... ఐహావ్‌డన్ మై డ్యూటీ... నా జాగాలో ఎవరున్నా చేసేపనే అది... అందులో నా గొప్పతనం ఏం లేదు"

"నో..." తల అడ్డంగా తిప్పేసేడతను.

"మీ జాగాలో మరెవరున్నా... నేను ఈ పాటికి పరలోకానికి పాతకాపై వుండేవాణ్ణి... మీరు కాదన్నా... ఆ సంగతి నాకు తెల్సు... నడిరోడ్డున, నలుగురూ తిరిగే సమయంలో. ఎవడో, ఎవర్నో పొడిచేస్తే, పొడిచిన వాణ్ణి పట్టుకోవటం సంగతటుంచి, పొడవబడ్డ వాణ్ణి ఆస్పత్రికి తీసుకువెళ్ళగలిగే సానుభూతిగానీ, ధైర్యంగానీ నూటికి ఒక్కడిలో కూడాలేని ఈ




సమాజంలో నక్సలైట్లు చిత్రహింసల పాలు చేసి అడవిలో పారేసిన వాణ్ణి, అందులోనూ ప్రజలు అసహ్యించుకుంటున్న ఖాకీ వ్యక్తిని మానవత్వంతో, మృత్యుముఖంనించి తప్పించడం... తప్పకుండా గొప్పతనమే. సమాజంలో ఇంకా ఇలాటి వ్యక్తులు వున్నారని తెలుసుకున్నందుకు నాకెంతో ఆనందంగా వుంది. రెండోది మీరు నాకు వ్యక్తిగతంగా మహోపకారం చేసేరు. డాక్టర్లు చెప్పేరు. మరొక్క గంట ఆలస్యం అయివుంటే, నా ప్రాణాలు పోయి వుండేవని... మీరు నాకు ప్రాణ బిక్షపెట్టేరు. నేను నా విధినిర్వహణలో కర్కోటకంగా వుంటే వుండొచ్చు... కానీ ప్రభాకరంగారూ... నేను మొదటమనిషిని... తర్వాతే నా వృత్తి... నేను మీకు రుణపడ్డాను... వెంటనే మిమ్మల్ని కలుసుకోవాలనుకున్నాను. రెండు మూడుసార్లు జవాన్లని పంపిస్తే మీరు హైదరాబాద్‌లో వున్నట్టు తెలిసింది. ఈరోజు డ్యూటీలో జాయిన్ కాగానే ముందుగా మిమ్మల్ని కలుసుకోవాలని స్వయంగా నేనే వచ్చేను. మిమ్మల్ని చూసేను. తమ్ముళ్ళుగానీ, అన్నలుగానీ లేని నాకు మీరు దేవుడిచ్చిన తమ్ముడిలా కనిపిస్తున్నారు'' అని ఆగేడు. అతని కళ్ళు ఆర్ద్రతతో నిండిపోయేయి.

ప్రభాకరం అతని అభిమానానికి చలించేడు. కానీ ఆ పరిస్థితి అతనికి ఇబ్బందికరంగా వుంది.

''నేను చేసిన పనిని మీరు చాలా ఎక్కువ చేసి చెపుతున్నారు. కాసేపు ఆ విషయం మరిచిపోండి. ఇదుగో ఇలా కూర్చోండి. అని తన టేబులుకెదురుగా వున్న కుర్చీలో చనువుగా అతని భుజంమీద చెయ్యివేసి కూర్చోబెట్టేడు. ''షెరీఫ్'' అని కేక పెట్టేడు. కొమరయ్యా తర్వాత వంటవాడిగా వచ్చి చేరిన షెరీఫ్ పూర్వాశ్రమంలో ఒక పిక్‌పాకెటర్... ఆ వృత్తి మానేసి వంటపనిలో స్థిరపడ్డాక వాడి జీవితం హాయిగానే గడిచిపోతోంది. కానీ పోలీసు జీపు రావటం, దాంట్లోంచి ఓ ఇన్‌స్పెక్టర్ దిగడం చూసి, తనకోసమే అని భయపడి చస్తున్నాడు వాడు. ప్రభాకరం జవాబు రాకపోవడంతో కిచెన్‌లోకి వెళ్ళి చూస్తే ఓ మూల చేరి భయంగా వొదిగి నించున్నాడు వాడు. ప్రభాకరంలోనికి రాగానే కాళ్ళకి చుట్టేసుకున్నాడు.

''నన్నొప్పచెప్పకండి సార్. బొక్క లిరగ్గొడతరు. నేనుదందా మానుకున్ననన్నా ఇడుస్తలేరు... మీ కాల్మొక్కుతా... నన్ను పంపకండి సార్'' అని వలవల ఏడవటం మొదలుపెట్టేడు.

ప్రభాకరానికి వాడి భయం అర్ధమైనవ్వేసేడు.

''లే... లే... షెరీఫ్... ఆయనొచ్చింది నీకోసం కాదులే... నిన్నేం తీస్కపోరుగానీ... మంచిగ రెండు 'చా' జెయ్యి... గట్లనే ప్లేట్ల బిస్కట్లు తీస్కరా... నీకేం భయంలేదు... నీ ప్రాణానికి నేనడ్డముంట... సరా... జల్దీ కానీ'' అని సముదాయించేడు. వాడికి వెయ్యేనుగుల బలం వచ్చి

''నిమేట్ల జేస్త... సార్'' అని వస్లో జొరపడిపోయేడు.

టీ తాగుతూ రిలాక్సింగ్‌గా కుర్చీలో జేరబడి ప్రశ్నించేడు విష్ణు.

''ఇప్పుడు చెప్పండి... ప్రభాకర్. మీ విశేషాలు''

''నా గురించి చెప్పడానికి పెద్ద విశేషాలేం లేవు, గోదావరి జిల్లాలో పుట్టిపెరిగాను. డిగ్రీ చేతికందేక ఉద్యోగ ప్రయత్నంలో ఇటువైపు వచ్చి ఈ కంట్రాక్టర్ దగ్గిర చేరేను. స్థిరంగా ఇక్కడే వుంటానో, వుండనో నాకే తెలీదు. తల్లీ... తమ్ముళ్లూ, అందరూ మా ఊర్లోనే వున్నారు. అదీ నా గురించి నే చెప్పగలిగేది'' క్లుప్తంగా చెప్పేడు ప్రభాకరం.

''గోదావరి జిల్లా అంటే...''

''తూర్పుగోదావరిలెండి''

''ఏ ఊరు?'' కొంచెం ఆసక్తి కనపర్చేడతను.

''కాకినాడ''

కుతూహలంగా కొంచెం ముందుకి వంగేడు. ''మా అత్తవారి ఊరూ... అదే. చూశారా... ఇద్దరం ఒకే ప్రాంతంవాళ్లం. ఇంచుమించు ఒకే వయసువాళ్లం కూడా. రాష్ట్రంలో ఓ చివర వున్న ఈ ప్రాంతంలో, ఎదురెదురుగా కూర్చుని మాట్లాడుకుంటున్నాం. నాకీ విషయం కొంచెం చిత్రంగానే వుంది. ఎందుకంటే ఏ రకంగానూ



మనిద్దరికీ పరిచయం అయ్యే ఆస్కారం లేదు. కానీ విధి మనద్దర్నీ స్నేహితులుగా కలిపింది. ఈ స్నేహం విడిపోకుండా వుండాలని నేను గాఢంగా కోరుకుంటున్నాను. అందుకే ఈ రాత్రి మీరు మా ఇంటికి డిన్నర్‌కి రావాలి. నా భార్య కూడా మిమ్మల్ని చూసి ఎంతో సంతోషిస్తుంది. ఈ డిన్నర్ ప్రపోజల్ తనదే. వస్తున్నారుకదూ!''

ప్రభాకరం ఇబ్బందిగా కదిలేడు. అతనికి తను విష్ణుతో స్నేహం చేయడానికి తగిన వ్యక్తిని కాదేమోనన్న న్యూనతాభావం మనసులో ఏమూలో వుండి, వస్తానని చెప్పలేకపోతున్నాడు. అంతలోనే స్నేహపూర్వకంగా అతను పిలుస్తుంటే రానని చెప్పడం కూడా భావ్యం కాదేమోనన్న సంకోచం కూడా కలుగుతోంది. అతనేం చెప్పకపోవడం చూసి మళ్లీ విష్ణే అన్నాడు.

''ఎందుకు ఆలోచిస్తున్నారు. తొమ్మిదికల్లా జీపు పంపుతాను. వచ్చేయండి. మళ్లీ జీపులోనే దింపుతాను. ఏం''

''అహ... వద్దులెండి. నా మోటార్‌సైకిల్ మీద వచ్చేస్తాను. కానీ...''

''అదేం పనికిరాదు. మీరు కాదంటానికి వీల్లేదు'' తల అడ్డంగా ఊపేడతను లేచినిలబడి. హ్యాట్ తలపై సర్దుకుంటూ.

అతనితోపాటే నడుస్తూ బయటికి వచ్చేడు ప్రభాకరం. మొహమాటపడుతూనే విష్ణు ప్రతిపాదనకి అంగీకరించక తప్పలేదతనికి.

''గుడ్... మరినేను వెళతాను ప్రభాకరం. ఇంటి దగ్గర కలుసుకుందాం. సీయూ. దేర్'' నవ్వుతూ ప్రభాకరం భుజంమీద చరిచి జీపు ఎక్కేడు. అంతకుముందే డ్రైవరు జీపు స్టార్టు చేసేడు.

''బై... సాకేతతో మీరు వస్తున్న సంగతి చెపితే ఎంతో సంతోషిస్తుంది. సారీ... సాకేత ఎవరో మీకు చెప్పలేదుకదూ. మై బెటర్ హాఫ్. మై స్వీట్ వైఫ్... వుంటాను'' డ్రైవర్ అతడి సంజ్ఞ గ్రహించి జీపు కదిలించేడు.



"సాకేత... సాకేత ఒకనాటి తన ఆరాధ్యదేవత. తన జీవనగమనంలో దీపకాంతి కాగలదనుకున్న ఆ సాకేత, ఈ సాకేతగానీ కాదుకదా! ప్రభాకరం మనస్సు అవుననే అంటోంది. అంతలోనే అతనికి తాము విడిపోయేముందు సాకేత అన్నమాటలు జ్ఞాపకం వచ్చేయి.

"నన్ను క్షమించు. నాకు పవన్‌తో పెళ్లి నిర్ణయించేరు. అది జరగాలి తప్పదు"

పవన్ ఆమెకు బావ అని అంతకుముందెప్పుడో మాటల సందర్భంలో ఆమె చెప్పిన సంగతి కూడా అతనికి స్ఫురణకి వచ్చింది.

ప్రభాకరానికి నవ్వొచ్చింది. ఏమిటి ఈ జీవన వైచిత్రి. అంతవరకు దృఢంగా వుండే అనుబంధాలు అనుకోకుండా తెగిపోతూ, ఎన్నడో దూరమైన ఆత్మీయులు అనుకోకుండా చేరువవుతూ వుండడం చూస్తే మహాప్రవాహంలో, ఏ అల తాకిడికో దగ్గరై కలిసి కాసేపు ప్రయాణించి, అంతలోనే మరో అల విడదీస్తే, విడిపోయే గడ్డిపోచల్లాటివే ఈ బంధాలు అన్న వేదాంతం, నిర్లిప్తతా భావం మనసును తమ వశం చేసుకుంటున్నాయి.

సాకేతమీద అతనికి ద్వేషంలేదు. ఆమె తనని మోసం చేసిందని అతనేనాడూ అనుకోలేదు. తామిద్దరూ కలిసికన్న స్వప్నాన్ని సాక్షాత్కారం చేసుకోవటానికి అప్పట్లో తామిద్దరూ అశక్తులు. తాను ఆర్థికంగా, ఆమె సామాజికంగా. అందువల్లనే అతడు ఆమె జీవితంలోంచి నిశ్శబ్దంగానే నిష్క్రమించేడు. మళ్లీ ఏనాడూ తన నీడ కూడా ఆమె జీవితంపై పడకూడదని తీర్మానించుకున్నాడు.

ఈరోజు విష్ణు పవన్ ఆమె భర్త అని తెలిసేక, అతనిలో ఆమెపట్ల వున్న అనురాగాన్ని స్పష్టంగా విన్నాక, అతను ఆరాత్రి డిన్నర్‌కి వెళ్లకూడదని నిశ్చయించుకున్నాడు. అందుకే ఆరాత్రి ఎనిమిదవుతుండగా విష్ణుకి ఫోన్‌చేసి తాను అత్యవసరంగా హైదరాబాదు వెళ్లవలసిరావటంచేత డిన్నర్‌కి రాలేకపోతున్నాననీ,

క్షమించమని కోరుతూ అతని భార్యకి కూడా తన క్షమాపణలు అందజేయమని కోరేడు. హైదరాబాద్‌నుంచి రాగానే తప్పకుండా కలుస్తానని రాలేకపోయినందుకు అన్యధా భావించవద్దని మరోసారి చెప్పేడు.

ఫోన్ పెట్టేశాక అతనికి ఎందుకో ఒక్కసారి ఒకేఒక్కసారి సాకేతని చూడాలనిపించింది. మమతల చైతన్య స్రవంతి మనసులో ఉవ్వెత్తున చెలరేగింది. కానీ అతనిప్పుడు మునుపటి ప్రభాకరం కాడు. మనసుకు నిర్ణయాలనే మరమేకులు బిగించి బందీ చేయగలిగే మనోస్థైర్యం సంపాదించుకున్న ఇంగితజ్ఞుడు. అందుకే ఆలస్యం చేయకుండా, అర్జెంటుగా మాట్లాడవలసిన పని వుండడంతో తాను వెంటనే బయల్దేరి వస్తున్నానని దొరకి ఫోన్‌చేసి చెప్పి హైదరాబాద్ సూపర్ ఎక్స్‌ప్రెస్ బస్ ఎక్కేశాడు.



**తె**లతెలవారుతూ ఉండగా దొర బంగ్లా ముందు ఆటో దిగేడు ప్రభాకరం. ఆటో వంపించి బ్రీఫ్‌కేస్ పట్టుకుని లోపలకుపోబోతుంటే అప్పుడు మిల్క్ పాకెట్లున్న బాస్కెట్ చేతపట్టుకుని వస్తున్న అవ్వ ఎదురైంది.

"అచ్చినవా! ప్రభాకరం... ఇదె వచ్చుడా..." పలకరించిందామె.

"ఔగానీ మంచిగున్నవా అవ్వా?" కుశలప్రశ్న వేశాడు ప్రభాకరం.

లోపలకిపోయి గెస్ట్‌రూమ్ తాళంచెవులు తెచ్చి ఇచ్చిందామె. అప్పటికే దొర లేవడం, స్నానం చేయడం పూర్తి అయిపోయినట్టున్నాయి. పూజామందిరంలో లైటు వెలుగుతోంది. ఎలాంటి పరిస్థితుల్లోనూ కనీసం రెండు గంటలసేపు పూజాకార్యక్రమాలు ముగించుకొని కానీ ఆయన బయటకి రాడు.

ప్రభాకరం తన గదిలోకిపోయి, బట్టలు మార్చుకుని బ్రష్‌చేయడం పూర్తయ్యేసరికి అవ్వ కాఫీ కప్పుతో వచ్చింది.

"నువ్వు వెయ్యేండ్లు బతకాలవ్వా. నీ అంత మంచిగా అందర్నీ అరుసుకుండెటోల్లను నేనింతవర్కు జూడలే..." కాఫీ తాగబోతూ అవ్వని పొగిడేడు ప్రభాకరం.

"అట్లనొద్దు బిడ్డా...! నాకు బత్కుమీద ఆశ లేదు. అడవిలో కట్టెలెక్క ఎన్నేండ్లు బతికేం లాభమున్నది. ఏభైఏండ్లు పైనే అయింది. దొరల గడీల్ల బత్కబట్టి దొరసాన్ని నేనెత్తుకుని పెంచిన ఆమె పిల్లల్ను మనుమల్ని నుత నేనే ఎత్తుకుంటున్న. నన్ను కన్నవాళ్లు పోయిన్రెప్పుడో. తోడబుట్టిన వాళ్లెట్లున్నరో నాకు తెల్వదు. ఒక్క తమ్ముడు వుండెటోడు. నాలుగేండ్ల కిందట వొచ్చి కల్సిపోయిండు. వాడు కూడ..." చీపురుతో గది ఊడుస్తున్న ఆమె నిస్త్రాణగా గోడకి జేరబడి నిలబడిపోయింది. నల్లగా, ముడతలు పడివున్న ఆమె చెంపలమీద కన్నీళ్లు ధారకట్టాయి. తాగుతున్న కాఫీకప్పు టేబులుమీద వుంచి ప్రభాకరం కంగారుగా లేచేడు. ఎన్నడూ బాధపడినట్టు కనిపించని ఆమె ఏడుస్తున్నది. ఒక డోర్‌మేట్‌లాగానో, ఒక సాధారణ గృహోపకరణంలాగానో, చూడబడుతూ వున్న యశోదవ్వ ఏనాడూ తనకో గుర్తింపు కావాలన్న తాపత్రయమే కన్పించనీయని ఆ అరణందాసి, అరవైఏళ్లు పైబడిన అశక్తురాలు కంటినీరు పెడుతున్నది. ఏ వ్యథ ఆమె గుండెగోడల్ని తొలిచేస్తోందో, ఏ కష్టకారణం ఆమె మనసును మెలిపెడుతున్నదో.

ప్రభాకరం అవ్వ దగ్గరగా వెళ్లేడు. అతన్లో సానుభూతి కలిగింది.

"అవ్వా...!" ఆదరంగా పిలిచేడు.

రంగు తెలీకుండా వెలిసిపోయిన చీర చెరగుతో చప్పున కళ్లు తుడుచుకుందామె.

"ఏమైందవ్వా... ఎందుకట్ల ఏడుస్తవ్.





నాతోని చెప్పు. చెప్పవా...?'' ఆమె కళ్లెత్తి ప్రభాకరం వంక సూటిగా చూసింది. పచ్చటి రంగులో వుండి, తెల్లటిబనీను, నీలంరంగు లుంగీ ధరించి ఎత్తుగా, బలంగా వున్న ప్రభాకరంలో ఆమెకి తన బాధను పంచుకునే ఆత్మీయమైన వ్యక్తి గోచరించేడు. కానీ అంతలోనే ఆమె చీపురు తీసుకుని వంగి గది ఊడవటం ప్రారంభించింది.

తన ప్రశ్నకు ఆమె మౌనమే సమాధానం అని తెలిసినా ప్రభాకరం ఊరుకోలేదు.

ఆమె చేతులో చీపురుకట్ట లాగి విసురుగా అవతల పడేశాడు. ''నీకేమి కష్టమొచ్చిందో చెప్పు. నువ్వు చెప్పాలె. లేకపోతే నేను ఇడువ. నా సంగద్దెల్వదా నీకు. ఆఁ...''

''చెప్తుత. నాకో తమ్ముడుండెటోడుగదా వానికి నేనంటె ఎంతో ఇష్టం. ఎన్నోసార్లన్నడు నాతోని రారాదె. గంజో, గట్కో తాగి వుండొచ్చని. నేనద్దంటి. వాడెక్కడ్నో హుస్నాబాద్‌ల నైటువాచుమెన్ పన్జేస్తుండు. వాని పెండ్లం, పిల్లల్తోని వాడికి కస్టమయితాంది. నేను పోయి వానిమీద బడితె ఎట్ల. నాకిక్కడ మంచిగనే గడుస్తాంది. నేన్లేకపోతె దొర్సాని కాలు కదవనీకిరాదు. ఎట్ల ఇడిచిపోత.ఏభైరూపాయిల్లెక్క దొరనెలకిజీతమిస్తున్నడాయె. గందుకె నేను రానంటి. వాడొచ్చిపోయేప్పుడల్లా, నూరో, రెండు నూర్లో పైసలు దొరతాన అడుక్కుని ఇస్తుంటి. దొరసానిచ్చెడి పాతబట్టలు కూడా ఇస్తుంటి. గట్లిచ్చుడు నాకు మంచిగున్నది. వాన్కి కూడా అలవాటయినది''

ఆమె శ్వాస పీల్చుకునేందుకు కాబోలు కాసేపు ఆగింది. ప్రభాకరం ఏం అనలేదు. అతనికి ఒకటి ఆశ్చర్యం కలిగించింది. యశోద రాగబంధాల కతీతురాల్లాంటి యశోద. తనకే సక్రమంగా రోజు గడుస్తుందో లేదో అన్న విషయం పెద్ద ప్రశ్నగామారి భయపెడుతుంటే తన చివరిరోజులు ఎలా గడుస్తాయో అని దిగులు పడుతుండే యశోద తన తమ్ముడిపట్ల గుండెలోతుల్లో ఎంత అభిమానం దాచుకుందో అని, తనకున్న అతిస్వల్ప ఆదాయాన్నీ అతనికి సహాయం చెయ్యడంలో ఆమె పొందే ఆనందం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించేయి. హిమాలయ శిఖరంకన్న ఉన్నతమూ, అగాధమైన సముద్రంకన్న లోతూ ఆడదాని మనస్సు అనే ప్రాచీన సూక్తి స్వభావం అతనికి ఆవిష్కృతమైంది.

''పదిరోజులకింద నా మేనల్లుడొచ్చిండు ప్రభాకరం. తమ్ముడు మంచిగున్నడా? అని అడ్గితె వాడేడ్వబట్టిండు. నాకు బుగులైంది. ఏమనడిగితె తెల్సింది. నా తమ్ముడు చనిపోయిండని. వానికి పోయేముందు నన్ను చూడాలన్నడట. మనిషిని పంప్రిట. కానీమేమప్పటికి రాజపురం పోయుంటిమి. దొరే ఉన్నరు ఇంట్ల. ''అయ్యో అట్లనా. కబురు చెప్పి నేతోలిస్త. నువ్వుపో'' అన్నడంట. ఆ పొల్లగాడు పొయ్యిండు. మేమచ్చేటప్పటికి మరొక్క వారమైంది. ఆ తర్వాత రెండుదినాలకు మల్ల మా ఊరి మనిషొచ్చిండు. నేపోకపోతినని సంగద్దెల్సి నా గుండె చెర్వయింది. దొరచ్చినంక పోయొస్తనంటె ఔనే ఎసోదా. సంగతి నీకు చెపుతననుకొంటనే యాద్ మరచిననే అన్నడు. అయ్యేటియన్నీ అయిపోయుంటయికదే. ఇప్పుడు నువ్ పొయ్యి జేసెడుదేమున్నది. రేపు చుట్టపోల్లు వచ్చెడిదుంది. దొర్సానికి పనికష్టమయితది. నెమ్మదిమీద పోదువులే ఊకుండుమన్నడు. నేనేమంట. గుడ్లనీల్లు తిప్పుకుంట ఏమనలే''

ఆమె బాధ పడుతూవుంది.

ప్రభాకరానికి ఆగ్రహం కలిగింది. మనుములనుకుంటాడో... మిషన్లనుకుంటాడో దొర తన దగ్గిర పనిచేసేవాళ్లను అనుకున్నాడు.

యశోదవ్వ అంతలోనే మళ్లీ అంది.

''నే దానికి నుత ఎక్వ కస్టపడలే ప్రభాకరం. నీకు తెల్వదేమోగానీ నాకాయన ముచ్చట తెలీనిదేమున్నది. ఇట్లెన్నయినయో. అందుగ్గాదు. ఆ తర్వాత నెలయినంక, నా మేనల్లుడొచ్చిండు మల్ల. చెప్పలేక చెప్పలేక అన్నడు. నాయన పోయిండుకదా. చెల్లెకి లగ్గం చేద్దామనుకుంటన్నం. నమ్మందం మంచిదున్నది. కానీ పైసలు కొంచెం తక్వయితయి. మూడువేలన్న నువ్వు సాయం చెయ్యి అత్తమ్మా. దొరనడుగుమన్నడు. ఊకె వద్దు. రెండు సమ్మత్సరాల్ల తీరుస్తనన్నడు. నాకు మనసు పినపిసైంది.

వాని తండ్రి పోయిన పోకపోతి. ఇంక నాకు మిగిలున్నది వాడొక్కడు. ఏనాటికైన నేను పోయినంక నా పేరు పెట్టి ఏడ్జెటోల్లు వాండ్లే నాయె. ఈ సాయిమైన చెయ్యాలనుకున్న వాడ్నుండుమన్న. పొద్దుమీకు దొరచ్చిండు. ఆయన రాంగానే టపా జూసుకుంట కూసున్న. డు. చా తీస్కపోయి ముంగట బెట్టి "దొరా... కొన్ని పైసలు కావాలన్న" పలకలే. నా మేనల్లు డు గుమ్మం పక్కన్నే వున్నడు. మల్లొక్కమారు వాన్ని చూపి సంగతి చెప్పి అడిగిన. గప్పుడు లేచిండాయన. నోటికచ్చినట్టల్ల తిట్టిండు. అందరు పైసల్తే పైసల్తే అంటరు. ముల్లేమన్న దాచిబెట్టినవేమే మంచిగ తినితిని బలుస్తు న్నవు. పైసల్లేవు. గియినల్లేవు. నువ్ చేసిన పనికీ నువ్ తిన్నదానికి సరి. ఎక్కవ మాట్లాడితే ఇంట్లకెల్లి నడువ్. అని అదిలిచ్చిండు. నేజ చ్చినా ననుకుంటి. అసలు ప్రశాంత్‌బాబుంటే అంతవరకు ౘ కపోవు. ఆయనే ఇచ్చెటోడు. ఆయన అమెరీకపోబట్టి నాకొచ్చినయి తిప్ప లు. దొరసానొచ్చి చెప్పబోతే సుత ఆయన ఇన్లే. నువ్విచ్చిన కొమ్ములే దానికన్నడు. నూరో, ఇన్నూరో అయితె ఏమోగానీ వేలెట్లిస్త. ఎందుకి స్తన్నడు. నాకు మాటరాలే. ఏడ్చుకుంట బయ టకుపోతి. నా మేనల్లుడు అన్నడు. "అత్తా.. నువ్వింకెందుకీడ పనిజేసుడు. నాతోనిరా. ఎట్ల యిన పెంచుత. ఇక్కడే వున్నవంటె నీపని ముసలెద్దు లెక్కయితది సుమా" అన్నడు. ఏ మొగంతోని వానెంట పోగలను. వాండ్లకు జేసె డదేమి లేకపోయి, వాండ్లమీద ఎందుకు బరు వుకావాలె. నువ్వుపో. ఎట్లయిన లగ్గంనాటికొస్త. కొన్ని పైసలు మాతెస్తనని వాన్ని పంపిన. లగ్గమెల్లుటనే నేనేం జెయ్యాలె ప్రభాకరం. అందుకు నాకు వశపడ్తలేదు. బిడ్డా అట్లున్నది ఈ ముసల్దాని నశీబు" నిట్టూర్చి తన దుఃఖాని కి కారణాన్ని చెప్పిందామె. అంతలోనే తన పనిగుర్తొచ్చి గబగబా చీపురుతో గది ఊడ్చి వడివడిగా కిందకి వెళ్లిపోయిందామె.

టేబులుమీదున్న కాఫీ చల్లారిపోయింది. పొద్దున్నే ప్రభాకరం మనస్సు వికలమైంది. అధునాతమై, ఉన్నతంగా వున్న భవనంలో వున్నప్పటికీ అతనికి తానొక నల్లటి మురికికూ పంలో ఈదులాడుతున్న భావం కలిగింది. వరుసగా దొర చేస్తున్న మోసాలను దగ్గరగా చూస్తున్న అతనికి, తను అతని దగ్గరెంత కాలం పనిచేసినా ఫలితంలేదనీ, తన జీవిత పయనంలో, తగిలిన ఈ మొదటి మజిలీని మరింక ఎక్కువ తాత్సారం చేయకుండా విడి చిపెట్టడం శ్రేయస్కరం అనీ చాలా బలంగా తోచింది. వెళ్లాలి. వెళ్లితీరాలి. కానీ వెళ్లే ముందు. ఈ ధనపిశాచిని, ఈ మోసగాణ్ణి తిరిగి లేవలేని దెబ్బకొట్టి మరీ వెళ్లాలి. చనిపో యిన శ్రీరాములుగారు మనసులో మెదిలేరు. వెంకట్రావు, పాణీ, వెంకటేశ్వర్రావు, నారాయణ రెడ్డీ ఎందరో ఎందరో ఈ కిరాతకుడి మోసానికి బలిపశువులై మౌనంగా తలలొగ్గారు. తను వాళ్ల తరపున ఒక చక్కని గుణపాఠం నేర్పుతా డు. అది మాత్రం తప్పదు. లోలోపలే తీర్మా నించుకున్నాడతను.

ప్రభాకరం తయారయి కిందకిదిగి ప్రకాశ రావు దొర పూజ ముగించి వొచ్చేవరకు పేపరు తిరగేస్తూ కూర్చున్నాడు.

"ఊ... ఏందో జరూరు పనన్నవంట. ఏం మునిగింది సైట్ల" కుర్చీలో కూర్చుంటూ అడి గాడాయన. ఆయన రావడంతోనే లేచి నించు న్న ప్రభాకరం వెంటనే అన్నాడు.

"అవున్సార్. ఈరోజుగనీ రేపుగనీ కంప్రెషర్ తీసుకోకపోతె సైట్ల వడ్డెర్లపని రుకాయించిపో తది. మీరు మూడ్రోజుల తర్వాతనే వొస్తమన్న రు. ఈ.డీ.లు. జిలెటన్లు ఆడ మాదొర్కుతయి. వాటికి పైసల్ కావాలె. ఎట్లన్నజేసి ఆద్దెకో లేక ఖరీదు చేసైనా కంప్రెషర్ తీస్కపోవాలె. అద్దెకి తీస్కునే దానికన్న కొంటెనె లాభముంటదని సాగర్‌రావంటున్నడు. గట్లనే మట్టిపని జరిగే తానకి పవర్ సప్లయిచేసెటందుకు ఎలక్ట్రికల్ సామాన్లు కూడా కొనాల్సున్నది. ఇంక రెండు మూడు చిల్లరపన్లున్నయి. సాయంత్రమయ్యి నంక సైట్ల పనులు చేసినంక లారీని తోల్కర మ్మని చెప్పిన..."

"గట్ల చెప్పుల్ల కాల్లు బెట్టుకున్నట్లస్తె పన్లు కావాల్న వద్దా? కంప్రెషర్ కొనైన తీస్కపోవా లంటవులే. నీదేమిపోయెడిదుంది? పైసలు బెట్టనీకి నా నెత్తిపగుల్తున్నది. ఆ బిల్లుల సంగతేమయింది? గాముచ్చట జెప్పవు?'

"ఆఫీసు పెద్ద బిల్లు ఫైనాన్సు డిపార్టు




మంట్లున్నది. నిన్నపోయి ఎకవుంట్స్ ఆఫీస రు సీతారాంను కలుస్తె గురువారం నాటికి చెక్కురాస్తమన్నడు''

''గురువారమంటె...''

''ఈరోజు సోమవారంగదా. రేపొచ్చె గురువారంనాటికే''

''ఖాయమేనా...'' అనుమానంగా అన్నాడు దొర.

''ప్రామిస్ జేసిండు''

''వాని మొగం. గట్లనే అని ఎనకసిరి సారీ అన్న అంటడు. సరె... నేను నాస్తజేసినంక మార్కెట్‌కి పోదం. నువ్వు తిన్నవా?'' అనడుగుతూనే లోపలకి వెళ్లిపోయేడు దొర.

పగలంతా మార్కెట్‌లో తిరిగి బాగా ఎంక్వైరీ చేసేక కంప్రెషర్ అద్దెకి తీసుకోవడం కన్న కొత్తది కొనడమే లాభసాటి అని తేలిపోయింది. కంప్రెషర్ ఒకటి కొనేసి కావలసిన ఎలక్ట్రికల్ సామాన్లు, మిగిలిన చిల్లరపనులూ చూసుకుని, ఆ రాత్రిగానీ లేకపోతే మర్నాడు ఉదయంగానీ డెలివరీ తీసుకుంటామని చెప్పి ఇంటికి చేరేసరికి రాత్రయిపోయింది. వర్క్‌సైట్‌కి ఫోన్‌చేస్తే లారీ సాయంత్రందాకా క్వారీ ట్రిప్పులు కొట్టి ఏడుగంటల ప్రాంతంలో హైదరాబాద్‌కు బయల్దేరిందని నూర్‌అహ్మద్ చెప్పేడు. దొర తన గదిలోకి పోయేడు. ప్రభాకరం కూడా తన గదిలోకిపోయి, స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. నాలుగువేల పైగా మిగిలిన కేష్‌ని బేగుతోసహా బీరువాలో పెట్టి లాక్‌చేసి, ఒక్కసారి శ్రీరాములుగారి ఇంటిదాకా పోయి రావాలనుకున్నాడు. గేటు దాటుతుండేసరికి వెంకట్రావు ఎదురొచ్చేడు.

''ఏమయ్యా! ప్రభాకరం. ఈమధ్య కనిపిస్తలేవు. ఇందాకనే ఇంటికొచ్చేప్పటికి అవ్వ అన్నది. ప్రభాకరం వచ్చిండే. రేపు మల్లపోతడంట అని. మళ్లీ కలుసుడెప్పుడో అని నేను ఉరికొచ్చిన'' స్నేహపూర్వకంగా భుజంమీద చెయ్యివేసి అభిమానంగా అన్నాడు.

''మంచోనివే. నేను హైదరాబాద్ వొచ్చినప్పుడల్లా అక్కను కలిసేపోతున్న. నువ్వే దొర్కుతలేవు. మొన్న ట్రిప్పుల పాణి నుత కల్సిండు. నరేగాని దందా ఎట్లున్నది?''

వెంకట్రావు సంతోషంగా నవ్వేడు.

''దందా మంచిగనే నడుస్తున్నది ప్రభాకరం. నాల్గు పైసలు కండ్లబడుతున్నయ్. మరి బతికెందుకు భయంలేదు. ఆ ముండకొడుకు కొల్వునుండి బయటవడ్డది మంచిగయింది. మా శనిదినాలు పోయినయ్. సాల్వేన్సీ రెండు లక్షలకు తీసుకున్న. బండి కూడా ఈ వారంలో తీసుకుంటున్నము. నాల్గు సైట్లల పనిజేయడమాయె. పాణి కూడా హుషారుగ పనిజేపిస్తున్నడు. ఔగానీ... ఇప్పుడెటు బోతున్నవు. పన్లేకపోతే రారాదు. మంచిగ హొటల్ల భోజనంచేసి సిన్మకి పోదం...''

ప్రభాకరం తలూపేడు. ''ఉండుపోయి దొర్సానికి చెప్పొస్త'' అని మళ్లీ లోపలకి వెళ్లి జానకమ్మగారితో భోజనానికి రానని, వచ్చేసరికి లేటవుతుందని చెప్పి వెంటనే తిరిగివచ్చేసేడు.

ఆరాత్రి వెంకట్రావుతో గడిపి ఇంటికి తిరిగొచ్చేసరికి చాలా రాత్రయ్యింది. మాటల సందర్భంలో దొర, ఇంటి రిజిస్ట్రేషన్ చెయ్యలేదనీ, కనీసం ఇస్తానన్న ఏభైవేలు కూడా ఇవ్వలేదని వెంకట్రావు బాధపడుతూ చెప్పేక ప్రభాకరం అతనికి తన మనసులోని ఆలోచన వివరంగా చెప్పేడు. వెంకట్రావు కదిలిపోయేడు. ''మా కోసం నువ్వు చిక్కుల్లో పడతవేమో ప్రభాకరం. అట్లొద్దు. వాడొక కట్లపాము. దేముడు చల్లగా చూస్తే మూడు నాలుగేళ్లు దాటకుండనే మేం పైకి రాగల్గుతాం'' ప్రభాకరం అతనిమాట వినిపించుకోలేదు. తన నిర్ణయం మారదని చెప్పి, అందుకు కావలసినదంతా తాను ముందే సిద్ధం చేసుకున్నానని మర్నాడు పొద్దున్నే తననొక్కసారి కలిసి తాను అతన్తో చెప్పినట్టు చేయమనీ గట్టిగా చెప్పి వచ్చేసేడు.

పడుకున్న వెంటనే అతనికి నిద్రపట్టలేదు. సీలింగ్‌వేపు చూస్తూ, వెల్లకిలా పడుక్కుని, వున్న అతని మనసులోని ఆలోచనలు అస్పష్టంగా కదులుతూ ఒక క్రమంలోకి చేరేకగానీ అతనికి నిద్రరాలేదు. తను చేయాలనుకున్నపనికి కావలసిన వాటి గురించి ఒక స్పష్టమైన అవగాహన ఏర్పడ్డాక, అతనికి స్థిమితం చిక్కింది. నిద్రపోవడం ఆలస్యం కావడంతో

అతను లేచేసరికి ఏడుగంటలు దాటిపోయింది. కంగారుగా లేచి కిటికీ దగ్గరగా చేరిన అతనికి కింద ఆగివున్న లారీ, దానికానుకుని నిలబడిన డ్రైవర్లు, క్లీనరూ సిగరెట్లు తాగుతూ కన్పించేరు. నిముషాల్లో రెడీ అయ్యేడు ప్రభాకరం. బీరువా తెరిచి కేష్‌బాగు తీసుకున్నాడు. అప్పటికే రెండుసార్లు అతని గదిదాకా వచ్చి అతను లేవకపోవడంవల్ల వెనక్కుపోయిన అవ్వ మరోమారు అతనికోసం అదే సమయానికి వచ్చింది.

''లేచినవా... ఉండుపోయి చా దెస్త'' నంటు పోబోయేనరికి ఏదో ఆలోచన తట్టి ఆమెను ఆగమన్నాడు ప్రభాకరం. ఆమె దగ్గరగాపోయి ఆమె చేతిలో కొన్ని నోట్లు పెట్టి.

''ఇవి వుంచవ్వా.. పెండ్లికిపో. ఈ పైసలు నీ వాండ్లకియ్యి'' అన్నాడు. అవ్వ భయపడ్డది.

''ఇదేంది... నువ్విచ్చుడేంది ప్రభాకరం. వొద్దు. నాకొద్దు'' అని చెయ్యి వెనక్కులాక్కుంది.

''మరేంకాదులే. తీస్కో. ఈ వెయ్యి రూపాయలు పెద్ద గనమేంకాదు. దొర పైసలే. నేనెట్లనో జేస్త. నువ్వుంచవ్వా. నేచెప్తున్నకదా. నేనిచ్చినట్టు చెప్పొద్దు. ఆయనకెట్ల జెయ్యాల్నో నాకేర్పాటె. నువ్వు వట్టిగపోకుండ ఇస్తున్న. నీకేం ఫికరులేదు. నువ్వేం మాటాడొద్దు. పో... పోయి చా తే'' అని గబగబా అంటూ ఆ నోట్లు మళ్లీ ఆమె చేతిలో పెట్టేడు ప్రభాకరం. అతనికి ఆమెని చూస్తే బాధగా వుంది.

యశోదవ్వ కదలిపోయింది. కరిగిపోయింది. వలవల ఏడ్చింది.

''బిడ్డా... ఎవరుకన్న బిడ్డవో కానీ... నీ మనసు చాన మంచిది. ఈ ముసలవ్వ మీద నీకు దయకలగడం నేచేనుకున్న పున్నెమనుకుంట. మంచిమాట అనెటోల్లులేని నా బతుకుల కష్టమే కానీ సుకమన్నది లేకుండె. నాకున్న పెద్ద బుగులు, నిన్ను చూసినంక తగ్గిపోయింది. వెయ్యేండ్లు చల్లంగ నువ్వు బతకాలె. నీ కాల్మొక్కుత. నీ బాంచెన్ బిడ్డా ప్రభాకరం''

''తప్పవ్వా... పెద్దదానివి నువ్వట్లనరాదు. నీ వంటిదాన్ని దుక్కపెట్టుడు మంచిదికాదు. అదాయన్కి తెల్వాలె. తెల్వకపోతే తెలియజెప్పాలె. నేనాపని జెయ్యాల్ననే అనుకుంటున్న నువ్వికపో. నేనిట్లిచ్చినట్టు ఎవ్వరికీ చెప్పకు''

అవ్వ ప్రభాకరానికి రెండు చేతులూ జోడించి నమస్కరించి కిందకి వెళ్లిపోయింది. ఒక్కక్షణం తను చేసిన పని గురించి ఆత్మవిమర్శ చేసుకున్నాడతను. అతనికి తృప్తికరంగానే సమాధానం లభించింది. మరింక ఆలస్యం చేయకుండా కిందకి దిగి వెళ్లేడు.

ఆరోజు పొద్దున్నే పోయి లారీలో, కంప్రెషర్ లోడ్ చేయించి, ఇతరత్రా మరికొన్నివస్తు చూసుకుని, నేరుగా ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసుకు పోయ్యేడు ప్రభాకరం.

సర్కిల్ టూ లో అతనికి బాగా పరిచయమున్న ఆఫీసర్ భాస్కర్రావు. ప్రభాకరం చనువుగా పోయి ఆయనముందున్న కుర్చీలో చతికిలబడ్డాడు. తల వంచి ఏదో ఫైలు తీవ్రంగా పరిశీలిస్తున్న అతను తలెత్తి ప్రభాకరాన్ని చూసి పలకరింపుగా నవ్వి ఫైలు మూసి టేబులు మీద పెట్టేడు. రెండు చేతులూ తీరిగ్గా టేబులుమీద ఆనించి.

''ఏమయ్యా! చాలారోజులకు కనిపించావు... ఎస్సెస్‌మెంటేమన్న వుందా ఏంటి? ఊరికే రావు కదా నువ్వు. నువ్వు రావాలనుకున్నా మీ మొగుడు రానివ్వడు కదా!'' అన్నాడు.

''ఎస్సెస్‌మెంట్లు అన్నీ పూర్తయిపోయేయి సార్! మీలాంటి వాళ్ళ దయవల్ల ప్రస్తుతం పెండింగు లేమీ లేవు... ఏవో కొన్ని రిఫండ్ ఆర్డర్స్ వున్నాయని మీ అసిస్టెంటు ఫోన్‌చేస్తే స్వయంగా తీసుకుపోదామని వచ్చేను... ఎలాగూ ఆఫీసుకు వచ్చేను కదా మిమ్మల్ని ఒకసారి చూసిపోదామని ఇటొచ్చేను'' అంటూ ఏదో జ్ఞాపకం వొచ్చినట్టు జేబులు వెతుక్కుని ఒక గిఫ్ట్ బాక్సు తీసేడు. దానివంకే ఆశగా చూసేడు భాస్కర్రావు. ఓ నిముషంపాటు దానిపై అతన్లో ఆసక్తి కలిగించి, దాన్ని అతనిముందు పెట్టేడు.

''ఇది వుంచండి సార్... వొరిజినల్ పార్కర్ పెన్ సెట్... వారంకిందట అమెరికానుంచి మా ప్రశాంత్‌బాబు, నాకోసమని ఎవరితోనో పంపేరట. నిన్న నేను రాగానే ఆయన మిసెస్ నాకిచ్చేరు. నాబోటిగాడికి ఏపెన్నయితే నేంటి




సార్... దుమ్ములో, ధూళిలో తిరిగే వాణ్ణి. వెంటనే మీరు జ్ఞాపకం వొచ్చేరు. మీకోసమే అది తెచ్చేను ఉంచండి''

భాస్కర్రావు కళ్లు వెలిగిపోయేయి. గబగబా గిఫ్ట్ బాక్స్ ఓపెన్ చేసి దాన్లో వున్న పెన్నులు చేతిలోకి తీసుకున్నాడు. అతని మొహంలో సంతోషం ట్యూబులైటు వెలుగులా దాగటంలేదు.

''చాలా థేంక్సయ్యా... ప్రభాకరం. ఎలాగైనా నీకు నేనంటే చాలా అభిమానం. నిజంగా వ్రాసేందుకు సరైన పెన్ను లేక చచ్చిపోతున్నా నంటేనమ్ము... డర్బీ ఇండియన్ పెన్స్... సరైన సమయానికి మంచి బహుమతిచ్చేవయ్యా... వుండు... కాఫీ తాగి వెళుదువుగాని'' అని బెల్ నొక్కి అటెండర్ని పిలిచి రెండు కాఫీలు తెమ్మని ఆర్డరిచ్చేడు.

ప్రభాకరం లోలోపల నవ్వుకున్నాడు... ఆ తర్వాత కాసేపు ఇద్దరిమధ్యా లోకాభిరామాయణం కొనసాగింది. కాఫీ తాగి వెళ్ళేలోగా అతన్నుంచి తనకు కావలసిన వివరాలు తెలుసుకుని, కొన్ని సలహాలు తీసుకుని బయటపడ్డాడు ప్రభాకరం.

లారీ వర్క్‌సైట్‌కి చేరుకునేసరికి చీకటి పడింది. కొత్తగా తయారయిన ఆ టౌన్‌షిప్ క్వార్టర్లు అప్పటికే చాలామంది స్టాఫ్‌తో నిండి వున్నాయి. వేరువేరు ప్రాంతాలవాళ్ళు, విభిన్న భాషా రాష్ట్రాలకు చెందిన స్టాఫ్‌తో ఆ టౌన్‌షిప్ ఒక చిన్న భారతదేశంలాగానేవుంది. టౌన్‌షిప్‌ను దాటుకుంటూపోయి చివరగా వున్న తమ ఆఫీస్ క్వార్టర్స్ దగ్గర ఆగింది లారీ. క్వార్టర్స్ చుట్టూ విశాలమైన ఆవరణ బార్బ్‌డ్ వైర్ ఫెన్సింగ్‌తో ఏర్పాటుచేయబడివుంది. వరుసగా నాలుగు క్వార్టర్లు తమ ఆధీనంలో వున్నాయి. అన్నీ పక్కపక్కనే వుండి ఒకే ఆవరణలో వున్నాయి. అదే వరుసల్లో ఇతర కన్‌స్ట్రక్షన్ కంపెనీలకు కేటాయించిన క్వార్టర్స్ కూడా వున్నాయి.

లారీ ఆగడంతోనే ప్రభాకరం కిందికి దిగేడు.

''రాజలింగూ... రేప్పొద్దుగాల అన్‌లోడ్ చెయ్యొచ్చుగానీ... బండి అట్లనే వుంచి నువ్వింటికిపో'' అని డ్రైవర్‌తో చెప్పి తన బ్రీఫ్‌కేస్ చేత్తో పట్టుకుని ఆఫీసుగదివైపు నడిచేడు ప్రభాకరం.

లారీ ఆగిన దగ్గరే వరుసగా మరో నాలుగు లారీలు నిలబెట్టి వున్నాయి. వాటికి కొంత దూరంలో మట్టి లిఫ్ట్ చేయటానికిగాను కొత్తగా కొన్న ట్రాక్టర్లు రెండు వున్నాయి. ఆఫీసుగదికి ఎడమవైపు ఆరు డీజెల్ బారెల్స్ కనబడుతున్నాయి.

ఆవరణలో పెద్ద ఫ్లడ్‌లైట్ వెలుగుతోంది. కొన్ని పాత టైర్లూ, రిపేరులో వున్న కాంక్రీటు మిక్సరు ఒకటీ, పాతసైటు నుంచి తీసుకొచ్చిన లైమ్ గ్రైండర్లూ, మరికొన్ని అవసరమైన కన్‌స్ట్రక్షన్ మెటీరియల్సూ అడ్డదిడ్డంగా పడి వున్నాయి. ఆఫీసుగదిలో లైటు వెలుగుతోంది.

లారీ వచ్చి ఆగిన చప్పుడు విని క్వార్టర్స్‌లో చేరి వున్న స్టాఫ్ అందరూ బయటకి వచ్చి ప్రభాకరానికి నమస్కారం చేసేరు. వాళ్లలో చాలామంది కొత్తగా పన్లోకి వచ్చిన వారు. ఓ ఇద్దరు పాలిటెక్నిక్ చదువుకున్న వాళ్లు కూడా వున్నారు. అంతా హుషారుగా, కళ్ళల్లో కొత్త కాంతులతో, కనిపిస్తున్నారు. వాళ్లని చూసి ప్రభాకరం లోలోపల జాలిపడ్డాడు.

అంతలోనే షెరీఫ్ లోపలనుంచి గబగబా వచ్చి అతని చేతిలో వున్న బ్రీఫ్‌కేస్ అందుకుని లోపలకు వెళ్ళేడు. స్టాఫ్ మెంబర్లను పలకరించి ఇపుడే వస్తాను వుండమని చెప్పి ఆఫీసుగది నానుకుని వెనగ్గా ఉన్న గదిలోకి డోర్ కర్టెన్ తొలగించుకుని వెళ్ళేడు ప్రభాకరం. బూట్లు విప్పదీసి బట్టలు మార్చుకునేసరికి, షెరీఫ్ బకెట్‌తో వేడినీళ్లు తీసుకువచ్చి బాత్‌రూంలో వుంచేడు. పదినిముషాల్లో తన స్నానం, ఇతర కార్యక్రమాలు ముగించుకుని వచ్చి ఆఫీసుగదిలో టేబులుముందు కుర్చీలో కూర్చున్నాడు ప్రభాకరం. ఎదురుగా వున్న తలుపు దగ్గర చేతులు కట్టుకుని నిలబడి వున్నారు స్టాఫ్ అంతా. కిటికీలోంచి నల్లటి ఆకాశంలో మెరుస్తున్న నక్షత్రాలు కనిపిస్తున్నాయి.

టీ తాగుతూ ప్రభాకరం ఒక్కొక్కర్నే వివరంగా అడిగి వాళ్ల కప్పజెప్పిన పనుల్లో ప్రో

గ్రెస్ ఎలా వుందో తెలుసుకున్నాడు. తర్వాత రోజు ఎవరేం చెయ్యాలో, కొన్ని సూచనలిచ్చి వాళ్ళని పంపేసాడు.

"షెరీఫ్! నూర్ అహ్మద్‌ని పోయి పిలువ్" అని వంటవాడికి పురమాయించి, ఉత్తరాలు ఏమైనా వున్నాయేమోనని వెతికేడు. ఇంతలో ఫోన్ మోగింది. రిసీవర్ చేతిలోకి తీసుకున్నాడు.

"హల్లో.. దిసీజ్ ప్రభాకరం... ఫ్రమ్ ప్రకాష్ రావు కన్‌స్ట్రక్షన్ కంపెనీ"

"నేను... మోహన్రావును మాట్లాడుతున్నా. ఎంతసేపయింది మీరొచ్చి" అడిగేడతను.

"ఓ అరగంట కావొచ్చు. విశేషాలేమైనా వున్నాయా?" అడిగేడు.

"ఏమున్నాయి. ఆ లింగన్నగాడికి పొగరెక్కిపోయింది. రేపుగానీ బ్లాస్టింగ్ మొదలుపెట్టకపోతే పనాపుజేస్తానంటున్నాడు. అందుకే మీరొచ్చేరో లేదో తెలుసుకోవాలని ఫోన్ చేసేను. కంప్రెషర్ దొరికిందా?"

"దొరికింది. కొత్తది తీసుకున్నాం. రాక్ డ్రిల్లింగ్‌కి ప్రాబ్లెమ్‌లేదు. వెంకటేసం ఎవరిదగ్గర్నో ఇప్పిస్తనన్నాడు గదా? జిలెటిన్లు, ఈ.డీ.లు తీసుకున్నారా?" అనుమానంగా అడిగేడు.

"ఆ... మధ్యాహ్నమే ఓ నూట ఏభై తెచ్చేము... నేను, నూర్ అహ్మద్ పోయి ఆఫీస్ క్వార్టర్ పక్కనే వున్న బాస్ క్వార్టర్‌లో వుంచి లాక్‌చేసేము... పర్మిట్ లేనివి కదా... ఎవరికన్నా తెలిస్తే ప్రమాదమని"

"మంచి పనే చేసేరు... పర్మిషన్ రేపు తీసుకోవచ్చు లెండి... ఇంకేమన్నా చెప్పాల్సినదుందా?"

"ప్రస్తుతానికేం లేవు లెండి... రేపునేనొచ్చేక మాట్లాడుతాను"

"సరే... ఉంటాను" అని ప్రభాకరం ఫోన్ క్రెడిల్ చేసేడు.

ఇంతలో నూర్ అహ్మద్‌ని వెంటబెట్టుకుని షెరీఫ్ వచ్చేడు. అతను కంగారుగా లోపలకి వచ్చేడు. లైట్‌గా ఆల్కహాల్ వాసన సోకింది ప్రభాకరానికి. గమనించనట్టు నటించేడు.

"ఇప్పుడే పిల్లోనికి మందు కావల్నొస్తే టౌన్ షిప్‌లోకి పోతినిసార్! మీరొచ్చేరని తెలియలేదు" అన్నాడు.

"సర్లెండి... ఏవైనా లెటర్స్ వున్నాయా?" అడిగేడతన్ని

తలూపి, గబగబా, అతని గదిలోకి వెళ్ళి, డ్రాయర్ తాళం తెరిచి కొన్ని ఉత్తరాలు పట్టుకొచ్చేడు. అవి అందుకున్నాడు ప్రభాకరం. దొర పేరుతో వచ్చిన అఫీషియల్ లెటర్సు, కాక ప్రభాకరానికి రెండు ఉత్తరాలు వచ్చేయి. ఒకటి ఇంటి దగ్గర్నుంచి తల్లి వ్రాసినదీ. మరొకటి మహబూబ్‌నగర్ నుండి నారాయణరెడ్డి వ్రాసినదీ. అవి రెండూ జేబులో పెట్టుకున్నాడు. ఆఫీస్ లెటర్సు ఓపెన్ చేసి చూసేడు. అవన్నీ అంత ముఖ్యమైనవి కావు.

"సర్... మీకోసం ఎవరో ఇన్‌స్పెక్టర్ పవన్‌గారట... రెండు సార్లు ఫోన్ చేసేరు. మీరొస్తే చెప్పమని చెప్పేరు"

పవన్... తనకోసం రెండుసార్లు ఫోన్ చేసేడని విన్నాక తాను ఆరోజు అతనింటికి భోజనానికి వెళ్ళకుండా తప్పుచేసేనేమో అనుకున్నాడు. తను అతన్నొకసారి కలవకపోతే బావుండదనిపించింది ప్రభాకరానికి.

"సరె... నేను రేపు ఆయన్తో మాట్లాడతాను లెండి... మీ పని చూడండి" అని చెప్పి వడివడిగా తన గదిలోకి పోయి, మంచంమీద వాలిపోయేడు.

ముందుగా నారాయణరెడ్డి నుంచి వచ్చిన ఉత్తరం చించేడు. లింగారావు కంట్రాక్టరు దగ్గర రెడ్డి మూడేళ్ళు పనిచేసి కోతవడ్డ వజ్రంలా తయారయ్యేడు. ఆ సరికి అతని అన్నకి రెడ్డి అనుపానులు తెలిసి అతనొచ్చి బతిమిలాడి, తనతో తీసుకుపోయేడు వాళ్ల స్వంత ఊరికి. కంట్రాక్టుపనుల్లో బాగా ఆరితేరిన రెడ్డి స్వయంగా పనులు తీసుకుని చకచకా పైకి వచ్చేడు. ఆ వివరాలన్నీ ప్రభాకరం మధ్యమధ్య వాళ్ళనోటా, వాళ్ళనోటా విన్నాడు స్వయంగా రెడ్డే ఉత్తరం రాయడంతో ఏం రాశాడోనన్న ఆసక్తితో చదివేడు ఉత్తరాన్ని. పెద్దగా ఏం రాయలేదు అతను. ప్రభాకరాన్ని యోగక్షేమాలడుగుతూ, తన సమాచారం, తన పట్ల అన్న వదిన, ఇతర బంధువులూ చూపుతున్న ఆదరాభిమానాలను పేర్కొంటూ, రెండు





పేరాలు రాసేడు. తన వివాహం నిశ్చయమైందనీ, త్వరలోనే శుభలేఖ వంపుతున్నాననీ రాస్తూ, తప్పనిసరిగా రావాలని కోరేడు. పాతమిత్రులందరినీ అడిగినట్లు చెప్పమని ఏవైనా విశేషాలుంటే ఉత్తరం రాయమని రాసేడు. సలహా ఇచ్చేంత వాణ్ణి కానుగానీ, దొర దగ్గర పని మానేసుకుని స్వంతంగా చేసుకుంటే, మా అందరిలాగానే మీరూ పైకి రావొచ్చని సూచించేడు. మర్రిచెట్టు నీడలో మరే మొక్కలూ పెరగవన్నది మీకూ తెలుసు కదా... అని కూడా అతను రాసేడు.

ఆ ఉత్తరం పక్కన పెట్టేడు ప్రభాకరం.

తల్లి రాసిన ఉత్తరం కళ్లకద్దుకుని విప్పేడు.

ఆమె పెద్ద ఉత్తరమే రాసింది. అక్కడి పరిస్థితులు వివరంగా రాసింది. ఉద్యోగస్తురాలైన చెల్లెల్ని చేసుకుంటానని, ఆమెతోపాటు పనిచేసే, రాజేష్ అనే కుర్రాడు అడిగేడనీ, తమ్ముడు వెళ్ళి వాళ్ళ కుటుంబ సభ్యులతో మాట్లాడేడనీ, ఆ సంబంధం తామందరికీ నచ్చిందనీ తెలియజేసి ప్రభాకరాన్ని ఓసారి వచ్చి మిగతా విషయాలు మాట్లాడి వెళ్లమని రాసింది. డబ్బు విషయంలో ఇబ్బందేం లేదనీ, అతను నెలనెలా పంపుతున్న మొత్తంతోబాటు, తమ్ముడూ, చెల్లెలూ సంపాదిస్తున్న దాన్లో బేంకులో దాచిందీ కలిపి బాగానే సరిపోతుందని కూడా ఆమె తెలియజేసింది.

చివర్లో తన ఆరోగ్యం అంతగా బాగుండటం లేదని, రాస్తూ పెళ్ళీడు దాటిపోకుండా, త్వరగా అతనో ఇంటివాడయితే చూడాలనుకుంటున్నాననీ, చాలామంది తమ పిల్లనిస్తామని తిరుగుతున్నారని కూడా రాసింది. తొందర్లో అతను రావాలని హెచ్చరిస్తూ ఆమె తన ఉత్తరాన్ని ముగించింది.

అదే ఉత్తరంలో తమ్ముడు ఒక అప్లికేషన్ ఫారం పంపుతూ ఒక నోట్ పెట్టేడు. వెంటనే ఆ అప్లికేషన్ నింపి పంపమని దాంతోపాటు సర్టిఫికేట్ల ట్రూకాపీలు జతపరచాలనీ రాస్తూ, ప్రభుత్వ సంస్థ ఒకదాన్లో ప్రభాకరానికి ఆ

ఉద్యోగం తప్పకుండా వచ్చేలా అతని మిత్రుడు చేస్తానని హామీ ఇచ్చేడనీ, అశ్రద్ధ చేయకుండా వెంటనే పంపమనీ రాసేడు.

షెరీఫ్ వచ్చి భోజనం రెడీ అయ్యిందని చెప్పేక ప్రభాకరం లేచి వెళ్లి భోజనం చేసి వచ్చి పడుక్కున్నాడు. కానీ ఆ రాత్రి అతనికి అంత తొందరగా నిద్రరాలేదు. ఆలోచనలతో మెదడంతా గజిబిజిగా తయారైంది. అతని కెందుకోగానీ ఆ పరిసరాలనుండి తాను విడిపోతున్న ఫీలింగ్ కలిగింది. కొద్దిరోజులే... ఆ తర్వాత తను అక్కడవుండబోవడంలేదన్న భావం అతని మదిలో పదేపదే మెదలసాగింది. పొద్దున్న లేవగానే, తమ్ముడు కోరినట్టుగా ఆ అప్లికేషన్ నింపి పంపాలని, తల్లికి తాను త్వరలో వస్తున్నట్టు రాయాలని నిర్ణయించుకున్నాక ప్రశాంతంగా నిద్రపట్టింది. .

★ ★ ★

''సార్... సార్'' అని ఎవరో పిలుస్తుంటే ఉలిక్కిపడి నిద్రలేచేడు ప్రభాకరం. ఎదురుగా షెరీఫ్ నించున్నాడు. నిద్రలేమితో ఎర్రబారిన కళ్ళు నులుముకుంటూ మంచం దిగేడు ప్రభాకరం.

''నాయుడు సార్... మీకోసం చూస్తున్నారు సార్''

ఎనిమిదిగంటలు కావొస్తూంది సమయం... వేసవి కాలం కావడంతో సూర్యుడు బాగా పైకొచ్చేడు. ఎండ అంత పొద్దున్నే చిరచిరలాడుతోంది. తువ్వాలు భుజంమీద వేసుకుని, లుంగీ సర్దుకుని ఆఫీసుగదిలోకి అడుగుపెట్టేడు ప్రభాకరం.

''నమస్కారమండీ! కంప్రెషర్ ఎక్కడ అన్‌లోడు చేయమంటారో చెపితే, అన్‌లోడ్ చేయిస్తాను. దానికోసమే బండ్లు ఆగేయి. ఆ పనైతేగానీ బళ్ళు బయల్దేరవు సార్'' నిద్రలేపినందుకు సంజాయిషీ ఇచ్చుకున్నట్టు అన్నాడతను.

''ఒక్క పది నిముషాలుండండి నాయుడుగారూ... నేనూ మీతో సైట్‌లోకి వచ్చి చూసి చెపుతాను'' అని బాత్‌రూంలోకి పోయి తొందర తొందరగా తన పన్లు ముగించుకున్నాడు ప్రభాకరం.

బట్టలు వేసుకుని షెరీఫ్ ఇచ్చిన టీ తాగుతూ అతన్తో చెప్పేడు.''మోహన్రావుగారొస్తే... సైట్లోకి వచ్చెయ్యమను. నేనట్నుంచి రాంగనే నాస్త జేస్త... నువ్వు తయారుంచు''

అని పోయి కంప్రెషర్ లోడ్‌తో వున్న లారీ కేబిన్‌లో కూర్చున్నాడు. డ్రైవర్ రాజలింగుకి హైద్రాబాద్ ట్రిప్పుకు వెళ్ళిరావడంతో, ఆ రోజు ఆఫ్. ప్రభాకరం లారీలో ఎక్కి కూర్చోవటం చూసి షెర్పుద్దీన్ తన లారీ దగ్గర నిలబడి లేబర్‌తో మాట్లాడుతున్న వాడల్లా గబగబావచ్చి డ్రైవర్‌వైపున్న తలుపు తెరిచి, ప్రభాకరానికి నమస్తే చెప్పి, క్లీనర్‌వైపున్న సీట్లో కూర్చున్న నాయుడివంక తిరిగి,

''నాయుడు సార్! మాసార్ కూర్చున్న బండినే తోల్త... నా బండి వెంకటయ్యగానికివ్వండి... ఈ పొద్దు... సార్ కూర్చున్న బండి తోలి చాలా దినాలయింది... అంతే కాద్సార్...'' అని ప్రభాకరం వంక నవ్వుతూ చూసి లారీ స్టార్ట్ చేసేడు.

ప్రభాకరం నవ్వి ఊరుకున్నాడు. షెర్పుద్దీన్‌కు తానంటే పంచప్రాణాలూ అన్న సంగతి అతనికి తెలుసు. ఎవరన్నా ప్రభాకరం సైట్లో లేనప్పుడు, అతని గురించి ఏదైనా విమర్శ చేయబోతే, ఆ చుట్టు పక్కల షెర్పుద్దీన్ లేకుండా వుండేలా చూసుకుంటారు. అతను ప్రభాకరానికి నమ్మిన బంటనీ, తన కంటికి కనిపించిన చెడు ఏదైనా వుంటే ప్రభాకరానికి వెంటనే తెలియచేస్తాడనీ వాళ్ళకి పక్క బెదురుగా వుంటుంది. ఆ మాట నిజం కూడా... ఆవారాలా తిరుగుతున్న షెర్పుద్దీన్‌ని ఎవరో తీసుకువచ్చి ఏదైనా పన్లో పెట్టుకోమన్నప్పుడు, కాసేపు ఆలోచించి అతన్ని క్లీనర్‌గా వుంచేడు 'ముక్తార్' బండిలో. రాత్రనక, పగలనక కష్టపడి పని చేసే అతన్ని చాలా రోజులు గమనించేక తనే ముందు డబ్బు ఖర్చుపెట్టి, అతనికి డ్రైవింగ్ లైసెన్సు సంపాదించి పెట్టేడు. ముక్తార్ సింగరేణి కంపెనీలో 'క్రేన్ ఆపరేటర్' ఉద్యోగం వచ్చి వెళ్లిపోతే, అతని లారీ, షెర్పుద్దీన్‌కి అప్పచెప్పేడు. అందువల్ల ప్రభాకరం అన్నా అతని మాట అన్నా షెర్పుద్దీన్‌కి శిరోధార్యం.

విశాలంగా ఉన్న ఆ భారీ ప్రాజెక్టు ప్రదే




శంలో మిట్టపల్లాల్లో ఎగిరిపడుతూ, ఊగిపోతూ, ప్రయాణిస్తోంది లారీ. వీలయినంత జాగ్రత్తగా నడుపుతున్నాడు లారీని షెర్ఫుద్దీన్. ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభమై ఎక్కువకాలం కాలేదు. సెక్యూరిటీ మెజర్స్‌కోసం ప్రారంభించిన భారీ కాంపౌండ్‌వాల్ అక్కడక్కడా కనబడుతోంది.

''షెర్ఫుద్దీన్ లారీ ఆఫీస్ దగ్గర ఆపు...'' అని ప్రభాకర్ చెప్పడంతోనే లారీని అటు తిప్పి సరిగ్గా ఆఫీస్ షెడ్ దగ్గర ఆపేడు షెర్ఫుద్దీన్.

నాయుడు దిగేడు ముందుగా... అతని వెనక ప్రభాకరం దిగి పరిసరాలు ఒకసారి పరిశీలించేడు. కంప్రెషర్ ఎక్కడ అన్‌లోడ్ చెయ్యాలో, పవర్ తీసుకునేవీలు ఎక్కడవుందో అని చూసేడు.

ఇంతలో తలపాగా చుట్టుకున్న వడ్డెరమేస్త్రీ నారాయణ అటుగా వచ్చేడు. లావుగా బుర్రమీసాల్తో తాగుడువల్ల ఎర్రబారిన కళ్ళతో వున్నాడతను.

"ఊకె చూసి పోనీకి వొచ్చిన్రా... బండ పగులకొట్టుడుకేమన్న జేస్తున్నరా సారూ...! వనోళ్లను తెచ్చేదాకా, తే... తే... అని మా నంపుతరు... తెచ్చినంక పని సాగనీక నంపుతరు. అంత చేతగాకపోతే, మీ దొర పనెందుకు పట్టాలె సామీ. ఇంతవర్కు ఎందరిదగ్గర్నో చేనున్నము... మీ పన్ల పడుతున్నపాట్లు ఎక్కడ పడలే''

"ఎందుకట్లా వొర్లుతవ్... నారాయణా... గిదేమి ఇట్లకావాలంటె అట్ల పోయి తెచ్చెడి వస్తువా ఏంది? ఒక్కటి రెండు దినాలు లేబరు నావలేని నువ్వేమి ముతామేస్త్రివి...? మేమేమన్న ఊకె వన్నమా? రాత్రికి రాత్రి పోయి కంప్రెషర్ కొనుక్కచ్చినము. ఇగ మీరెంత హుషారుగా పని చేసిన్తరో. నేను మల్లచూడనా... లింగన్నెటుబోయె... జర పిల్వు'' అంటూ సన్నగా మందలించేడతన్ని ప్రభాకరం.

"లింగన్న లేడయ్యా...వడ్కాపూర్ పోయిండు... చుట్టాలున్నరంట... పొద్దుమీకి వస్తడు''

"మీరేమొ చుట్టరికాలు జెయ్యాలె... మంచిగ తిరగాలె... గా లేబరు ఎటుపడితె అటు తవ్వివడేస్తరు''

అతన్తో మాట్లాడుతుండగనే మోహన్రావు మోటార్ సైకిల్‌మీద వచ్చేడు.

''గుడ్‌మార్నింగ్ ప్రభాకర్. మొత్తానికి కంప్రెషర్ తీసుకొచ్చేరటగదా. వెరీగుడ్... ఎక్కడనుంచి బ్లాస్టింగ్ మొదలు పెడదామంటారు?''

''ముందు వెనుకవేపునుంచి మొదలుపెడదాం మోహన్రావుసాబ్... అక్కడే ఎక్కువ జాగాల్లో రాయివడింది కదా? చకచక పని సాగుతుంది. ఇటువక్క ఆ తర్వాత చేద్దాం''

డిపార్టుమెంటు సప్లయిచేసిన ఆరడుగుల వ్యాసమున్న పైపులు వరుసగా ట్రెంచ్‌ల దగ్గర్లో వడేసివున్నాయి. చాలా సులభంగా ఒక మనిషి వాటిల్లోంచి నడిచి వెళ్ళేటంత పెద్దవిగా వున్నాయవి. వాటిని పద్నాలుగు అడుగుల లోతుగా తవ్విన ట్రెంచ్‌లలో అమర్చి కాంక్రీటు పనిచేసి, కర్మాగారం వాడుకనీరు పోయే వైపు లైనుగా వెయ్యాలి. తిన్నగా గోదావరి నదిలోకి పోతుంది ఆ నీరు.

ఒకసారి మోహన్రావుతో కలిసి తాము అనుకున్నదగ్గరకు పోయి చూసేడు ప్రభాకరం. అక్కడ పొడవుగా కనుచూపు మేర ఆనినంతవరకూ తిన్నగా తవ్వివుంది నేల. ఎనిమిది అడుగుల లోతువరకూ తవ్వేక అక్కడ రాయి పడడంతో పని ఆపేసి ముందుకి వెళ్ళేరు పని వాళ్ళు. సుమారు పదిహేను అడుగుల పొడవునా ట్రెంచ్ వెడల్పున్నంత మేరా తెల్లరాయి కనబడుతోంది. ఒక పనివాణ్ణి గడ్డపార తెమ్మని కేకేసేడు ప్రభాకరం. వాడితోబాటు వాళ్లముతామేస్త్రి బాలన్న కూడా వచ్చేడు.

గోతిలోకి దిగి రాయిమీద నిలబడ్డాడు. మోహన్రావు కూడా నెమ్మదిగా ఆ గోతిలోకి దిగేడు.

''అడ్డుగ ఎంత దూరముంటది బండ'' అడిగేడు ఆ పనివాణ్ణి.

''అబ్బో... సాన లోపలకుంటది దొరా... గజంకన్న ఎక్కువుంటుంది'' జవాబిచ్చేడువాడు.

''ఏది... ఇక్కడ కొంత గోడ తవ్వు చూద్దాము

గాని''

వాడు తట్ట తీసుకు రమ్మని వాడి మనిషిని కేకేసి చకచకా ఏడడుగుల పొడవున్న గడ్డపారతో పది నిముషాలపైగా తవ్వేడు. గోడలో చిన్న కంతలాగ ఏర్పడింది. మట్టి అంతటినీ తీసేక చూస్తే ఇంకా లోపలకే రాయి వున్నట్టు తోచింది.

''సరే... నువ్వుపో'' అని వాడితో చెప్పి...

''బాలన్నా... రేపు వేకువనే ఈ బండ పగుల గొట్టిస్త. ఇక్కడ పూర్తిలోతు కొట్టిపిచ్చు. మందిని ఇక్కడ పెట్టాలె. తెల్సిందా?'' అని,

''రండి మోహన్రావుగారూ. కంప్రెషర్ ఇక్కడ అన్‌లోడు చెయ్యించి, పవర్ సప్లై సంగతి చూడాలి. మీరా పని చూస్తే నేనాఫీసుకు పోయి బ్లాస్టింగ్ పర్మిషన్, మరికొన్ని విషయాలూ చూసుకొనాల్సివుంది. మోటార్ సైకిల్ నేను తీసుకుపోతాను. అన్‌లోడ్ పనికాగానే లారీని పంపెయ్యండి'' అని చెప్పి మోటార్ సైకిల్ మీద తమ క్వార్టర్స్‌కు బయలుదేరేడు ప్రభాకరం.

బ్లాస్టింగ్ పర్మిషన్ అంత తొందరగా దొరక లేదు. స్కిల్డ్ బ్లాస్టర్‌ను రిక్రూట్ చేయకుండా బ్లాస్టింగ్ జరుపరాదని సెక్యూరిటీ చీఫ్ అబ్జక్ట్ చేసేడు. కాసేపు ఆలోచించి, సాగర్‌రావు దగ్గరున్న బ్లాస్టర్ గౌండర్‌ను తీసుకొచ్చి సెక్యూరిటీ రిక్వైర్‌మెంట్స్ పూర్తి చేసేడు.

ఆ సాయంత్రం బ్లాస్టింగ్ చేయాల్సిన బండమీద నాలుగేసి అంగుళాల ఎడంలో గౌండర్ గుర్తుపెట్టిన మార్కుల ప్రకారం రాయిని డ్రిల్ చేయడం మొదలుపెట్టేరు. కంప్రెషర్‌కి రాక్ డ్రిల్లర్ నమర్చి, కొబ్బరికాయ కొట్టి పూజచేసి స్విచ్ ఆన్ చేయగానే హిస్‌మన్న చప్పుడుతో వైబ్రేషన్ వేగంగా మొదలయ్యింది. గౌండర్ ఒక అసిస్టెంటును తీసుకుని డ్రిల్లింగ్ పని పూర్తి చేసేడు. డ్రిల్లింగ్ పూర్తయ్యేక బ్లాస్టింగ్ అప్పుడు చేయవద్దనీ మర్నాడు తెల్లవారు ఝామున చేద్దామనీ అతననడంతో అప్పటికి పని ఆపేసేరు.

బ్లాస్టింగ్ ఎప్పుడూ జనసంచారంలేని వేళల్లోనే అంటే తెల్లవారకముందు ఇంకా బాగా చీకటి వుండగానో, లేకపోతే బాగా రాత్రి వేళల్లోనో చేస్తారు, ప్రమాదాలు జరక్కుండా వుండటానికి.

మర్నాడు పొద్దున్నే అనుభవజ్ఞుడైన గౌండర్ స్టాఫ్ అందరూ దూరంగా వుండి చూస్తుండగా బ్లాస్టింగ్ జరిపేడు. అడుగున్నర లోతుగా వున్న బండ తునాతునకలైపోయింది. వడ్డెరలు సంతోషంగా కేకలేస్తూ ట్రెంచ్‌లోకి దిగి, చకచకా ఆ రాతి శకలాలను ఎత్తి పారబోయటం మొదలుపెట్టేరు. కాసేపు అక్కడే గడిపి ప్రభాకరంతో సహా స్టాఫ్ అందరూ తిరుగు మొహం పట్టేరు.

★ ★ ★

రోడ్ మీద పాన్‌డబ్బా దగ్గర మోటారు సైకిలు స్టాండువేసి సిగరెట్లు కొనుక్కున్నాడు ప్రభాకరం. ఆ సాయంత్రం వరకూ వేరే సైటులోని స్టోరేజి టాంక్‌కి మర్నాడు వేయవలసిన స్లాబుకు కావలసిన ఏర్పాట్లు చేయడంతోనే సరిపోయింది అతనికి.

మోటార్ సైకిల్ స్టార్ట్ చేయబోతుంటే...

''మిస్టర్ ప్రభాకర్.. యూఆర్ అండర్‌అరెస్ట్'' అన్న కఠిన స్వరంతోబాటు గట్టిగా స్టిక్ గుచ్చుకోవడంతో తుళ్ళిపడి వెనక్కి తిరిగేడు. ఎదురుగా నవ్వుతూ విష్ణు... కనిపించేడు. పోలీస్ జీపు అక్కడికి కొంతదూరంలో ఆగి వుంది.

''చంపేసేరండీ... హడలగొట్టేసేరు కదా. మరింక ఆలస్యందేనికి. సంకెళ్ళువేసెయ్యండి'' అంటూ రెండు చేతులూ ముందుకి చాచేడు ప్రభాకరం తను కూడా నవ్వుతూ.

రోడ్ మీద పోతున్న కొందరు ఆసక్తిగా వాళ్ళిద్దర్నీ గమనించడం చూసి..

''పదండి పదండి మీరు నాతోబాటు జీప్‌లో మా ఇంటికి వస్తున్నారు. మీ వాహనం మావాడు తెస్తాడులెండి. ఆలస్యం చేస్తే పుకార్లు పుడతాయి'' అంటూ చనువుగా అతని చేయి పట్టుకున్నాడు విష్ణు.

ప్రభాకరం మరికాదనలేకపోయేడు.

విష్ణు సూచనల ప్రకారం ప్రభాకరం నడుపుతున్న మోటార్ సైకిల్‌పోయి ఒక చిన్న ఇంటి




ముందు ఆగింది.

ఇల్లు చిన్నదిగానేవుంది. ముందున్న కాంపౌండ్ వాల్‌కి ఉన్న ఐరన్‌గేటు చిన్న వాహనాలు పోయేటందుకు మాత్రమే అనువుగావుంది. ఆర్డర్లీ ఒకతను వచ్చి గబగబా గేటు తీసేడు.

"రండి" అంటూ లోపలకి నడిచేడు విష్ణు. అతని వెనకే అడుగులు వేస్తూ వుంటే చటుక్కున సాకేత వుంటున్న చోటుకి వస్తున్నానన్న స్పృహ కలిగి మరి అడుగుముందుకు పడలేదు.

"ఆగి పోయారేం రండి మీతో చాలా కష్టమే సుమండీ" వెనక్కి వచ్చి ప్రభాకరం చెయ్యిపట్టుకుని లోపలకి తీసుకుపోయేడు విష్ణు.

"రెండు నిమిషాలు ఈ సోఫాలో కూర్చోండి. ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ జవాబు కెదురు చూడకుండా లోపల గుమ్మానికున్న కర్టెన్ వొత్తిగించుకుంటూ వెళ్లిపోయేడు.

తలెత్తి ఆ గదిని పరీక్షగా చూసేడు. అక్కడే వున్న చిన్న రోజ్‌వుడ్ చెక్కబీరువా మీద వున్న ఫొటో అతని దృష్టి నాకర్షించింది. లేచివెళ్లి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

అనుమానం లేదు. తన ఊహ పూర్తిగా యదార్థం. హుందాగా విష్ణు చెయ్యి భుజం చుట్టూ వెయ్యగా, సన్నగా చిరునవ్వు నవ్వుతూన్న ఆమె సాకేత. నిస్సంశయంగా సాకేతే.

"అక్కడేం చేస్తున్నారు. ఓ ఆ ఫొటోనా ఆవిడేనండీ బాబూ.. నా అర్ధశరీరం. కిందటిసారి మీరొస్తారని ఎదురు చూసింది. ఇప్పుడు మీరొచ్చే సరికి తను ఊరు వెళ్లిపోయింది. ఎవరైనా మన ప్రాంతం వాళ్లు కనిపిస్తే ఎంత సంతోషిస్తుందో చెప్పలేను. నా ప్రాణం కాపాడిన మిమ్మల్నొకసారి చూడాలనీ మీకు తన చేత్తో భోజనం పెట్టాలని ఎంతగానో ఆశపడింది. సరిగ్గా సమయానికి లేకపోయింది. రండి కాఫీ తాగండి"

ప్రభాకరం హతాశుడయ్యేడు. అతనికిప్పుడు ఎలాగైనా ఒకసారి ఆమెను చూడాలని వుంది. కానీ ఆమె లేదని తెలిసేక అతని ఆవేశం తగ్గి ఆలోచన మొదలయ్యింది. ఆవేశం ఎంత క్షణికమైంది. ఆవేశంలో చేసే పనుల వల్ల అనర్థాలు జరుగుతాయనడం పూర్తిగా సమంజసం. ప్రశాంతమైన మనసుతో వచ్చి సోఫాలో చతికిలబడి ఎదురుగా టీపాయ్ మీదున్న కాఫీ అందుకున్నాడు.

ఆ రాత్రి తనే స్వయంగా వంటచేసి ప్రభాకరం భోజనం చేస్తేగానీ వెళ్లనివ్వలేదతను. అంతసేపూ సరదాగా కబుర్లు చెపుతూ ఎంతో అభిమానంగా ప్రవర్తించేడు.

ప్రభాకరం బయల్దేరబోతుండగా,

"చూడండి, ప్రభాకరం ఇక్కడ నేనొకడ్ని మీకెప్పుడు ఎటువంటి సహాయం అవసరమైనా చేయడానికి సిద్ధంగా ఉన్నాను. నా దగ్గర మీకెటువంటి సంకోచంగానీ, సంశయంగానీ అక్కర్లేదు. యు ఆర్ మై ఫ్రెండ్. అండ్ యు ఆర్ మోస్ట్ వెల్‌కమ్ ఆల్వేజ్ టు మై హౌస్... ఒకేనా" అని భుజం మీద చెయ్యి వేసి చెప్పేడు.

★ ★ ★

చటుక్కున లారీ సడెన్ బ్రేకు వేసేడు షెర్ఫుద్దీన్. కీచుమన్న చప్పుడుతో కలపలోడ్‌తో వున్న లారీ సైట్ ఆఫీసుకు మూడొందల గజాల ముందున్న మలుపులో ఆగిపోయింది. పరుగెత్తుకుంటూ వచ్చి లారీ నాపమంటూ సైగ చేసిన వాచ్‌మేన్ నర్సింగ్ నిలబడే ఓపిక లేనట్టు లారీ బాడీకి చేరబడి గసపోస్తున్నాడు. బట్టలన్నీ చిరిగి పేలికలయిపోయేయి. మొహం మీద దెబ్బలేవో తగలటం వల్ల కాబోలు కుడివైపు చెంప చీరుకుపోయి రక్తం కారుతోంది. ఏం జరిగిందో అసలు సంగతేమిటో అర్థం కాలేదు ఎవరికీ. గబుక్కున కిందకి దిగేడు షెర్ఫుద్దీన్.

"నర్సింగ్ ఏమయింది నర్సింగ్. ముచ్చట జెప్పవు" నర్సింగ్ వెంటనే జవాబివ్వలేకపోయేడు. చెయ్యి జాపి సైట్ ఆఫీస్ వంక చూసేడు.

"గది గట్టు జూడు" ఆవైపు ఆదుర్దాగా చూసేడు. లారీలో కూర్చున్న ప్రభాకరం కూడా అనుకోకుండా అటువైపు చూసేడు. ఆఫీసు వుండే జాగా, పైన ఆకాశంలో ఎర్రటికాంతి వ్యాపిస్తూ వుంది. నల్లటి పొగ సుడులు తిరుగుతూ పైకి లేవడం ప్రారంభమయింది. ఎన్నో

కంఠాలు గందరగోళంగా వినిపిస్తున్నాయి.

చటుక్కున కిందకి దిగి "నర్సింగ్ ఆఫీసు కాలిపోతున్నట్టుంది. లారీ ఎక్కు. షెర్ఫుద్దీన్ నువ్వు స్టార్టుజెయ్యి" అని కంగారుగా హెచ్చరించబోతే నర్సింగ్ చటుక్కున కిందకి జారి ప్రభాకరం కాళ్లు పట్టేసుకున్నాడు.

"వొద్దు పోవద్దు సారూ... చంపిపడేస్తరు. దొరను చంపబోయిన్రు. నేను, రాజమల్లు అడ్డుకుని దొరను గెస్ట్ హౌస్‌కు ఎట్లనో కార్ల పంపినము. రాజమల్లు కాళ్లిరగగొట్టిన్రు. నేను పారిపోయి వచ్చి ఆ మూల పొంటి దాగుంటె మీరొస్తున్న లారీ కండ్లవడ్డది. మీరు పోరాదని ఆపుజేసిన, అన్నా షెర్ఫుద్దీన్! నువ్వు బండి మలుపు. ఆ మూక వొచ్చిపడే ముందుగాలనే పోకుంటె అందరికీ ప్రమాదమున్నది. నడువన్నా" అన్నాడు తన పట్టువదలకుండానే షెర్ఫుద్దీన్ వంక చూస్తూ.

ప్రభాకరంకేమీ అర్థం కాలేదు. అతను ముందు రోజు సాయంత్రమే కరీంనగర్ పోయి సులేమాన్ సామిల్లులో డోర్లకీ, డోర్ ఫ్రేములకీ కావలసిన కలప ఖరీదు చేసుకుని లారీలో లోడ్ చేసుకుని అక్కడనుండి తెల్లవారు ఝామునే బయల్దేరి వస్తున్నాడు. ఇంకా పూర్తిగా ఎనిమిది గంటలు కూడా కాలేదు సమయం. టౌన్‌షిప్‌లో సందడి ఇప్పుడిప్పుడే ప్రారంభమవుతోంది. దొరవచ్చి వారం రోజులబట్టి సైటులోనే వున్నాడు. పైపు లైను వర్క్ జోరుగా సాగిపోతోంది.

పరిస్థితి అంతా సవ్యంగానే వుంది. మరి ఇప్పుడింత సడెన్‌గా ఆఫీసు తగలబడిపోతుండడమేమిటి? దొర పారిపోవడమెందుకు వచ్చింది. మిగతా స్టాఫ్ ఏమయినట్టు. ఎంత ఆలోచించినా ఏమీ సమాధానం తోచలేదు.

"నర్సింగ్ ముందు నువ్వు పైకిలే. నేనడిగిందానికి చక్కగ చెప్పు. ఆఫీసు తగలబెట్టిందెవరు? రాజలింగు కాళ్లు విరగ్గొట్టిందెవరు?"

"వేరెటోల్లు ఎవరూ లేరు సారూ! పాలమూరువడ్డెర కొడుకులే మందమందలుగ వచ్చి అంటపెట్టిన్రు"

"ఎందుకట్ల జేసిన్రు?"

"పొద్దున పొద్దున్నే బ్లాస్టింగ్ చేసిన్రు సారూ! గౌండర్ మస్తుగ తాగి పంటే, మన తానుండే మెకానిక్ పిల్లగాడు తాజుద్దీన్ దొరనే "బ్లాస్టింగ్ చెయ్యిపో... దినాం వాని ఎన్క జూస్త లేవా. ఎట్ల జెయ్యాల్లో నేర్వలేదా. గామాత్రం చాలూ లేకపోతె నువ్వెట్ల మెకానిక్కు పని జేస్తున్నవు?" అని తిట్టి పంపిండు. వాడు పొయ్యి ముందెన్క జూడకుండా బ్లాస్టింగ్ చేసిండు. చెవిటి ముసలోడు ఆడనే మలుపులో తొవ్వుతున్నాడు. వాని ఎంట వాని అల్లుడు గూడున్నడు. వాండ్లు సీటీ విన్లే. మలుపులో వుండుడు వల్ల జెండా మల్ల కండ్ల బడుండదు. బండపడి ఆడనే జచ్చిన్రు. మస్తులొల్లవుతున్నది. తాజుద్దీన్‌గాడు ఎటో పరారయ్యిండు, గౌండర్‌గాడుసుత ఎట్నో ఉరికి పొయ్యిండు. లేబరు ముఠామేస్త్రిలొచ్చి నోటికచ్చినట్టు తిట్టి.. దొరను తన్నబోతే ఎట్లనో మేమడ్డుపడి ఆయన్ను కారెక్కించి దాటిపించినం. స్టాఫందర్నీ దొరికినోల్లను కొట్టిన్రు. వాండ్లొస్తున్న ముచ్చట దెల్సి' ఎక్కడివాండ్లక్కడురికిపోయిన్రు దొరా... మీరిప్పుడు పోవద్దు. ఆ ముండకొడుకులు పీర్లూగి నట్లూగుతున్నరు. ఏమన్న జేస్తరు"

మధ్యమధ్య ఆయాసపడుతూ తడారిపోతున్న పెదాలను నాలుకతో తడుపుకుంటూ సమాచారం మొత్తం, నర్సింగ్ తెలియజేసేడు.

ప్రభాకరం దిగ్భ్రాంతి చెందిపోయేడు. అతని నోటి మాట రాలేదు. ఏం చెయ్యాలన్నదీ అతని ఆలోచనల్లోకి రావటంలేదు. రెండు నిమిషాలు పోయేక అడిగేడు...

"ఇద్దరూ చనిపోయిన్రా. ఇంకెవరికన్న దెబ్బలు తగిల్నాయా నర్సింగ్?"

"అయ్యో... ఆ ఇద్దరు ఆడనే జచ్చిన్రయ్యా. వాండ్లు బండమీద నిలబడి పక్కనున్న గోడ తవ్వుతుంటిరి. ఆ బండ ఆట్నే గోతిలోకెల్లి ఆకాశంలోకి లేచి పొయ్యి మళ్ల కిందవడ్డది. దానికిందబడ్డరు వాళ్లు. చప్పుడు మల్లజెయ్యనీకి లేదు. మరిద్దరు మట్టి మోస్తున్న వాండ్లకు గూడ రాళ్లొచ్చి తగిల్నయి. ఒకనికి చెవ్వు లేచిపోతే, ఇంకొకనికి రెండుకాళ్లు విరిగిపోయినై.

"మరి వాళ్లనేం చేసిన్రు"

"గిట్లయిన వెంటనే డిపార్ట్‌మెంటు ఇంజనీర్‌సాబ్ కానంగద్దెల్సి ఆసుపత్రి కారుకు ఫోన్





జేసిండు. వాండ్లొచ్చి వాళ్లిద్దర్నీ దవాఖానకు కొంచబోయిన్రు''

ముందు తాను పోయి దొరను కలుసుకోవాలి. అదృష్టవశాత్తూ ఆయన సైట్లో వున్నప్పుడే ఈ ప్రమాదం జరిగింది. ఆయన తాజుద్దీన్ చేత బ్లాస్టింగ్ చేయించి వుండకపోతే, ప్రమాదం జరగకపోయేదేమో. వాడు తన ఉత్సాహంలో తీసుకోవలసిన జాగ్రత్తలు తీసుకోకపోవడమే ఈ అనర్థానికి కారణం.

నర్సింగ్‌ని తీసుకుని వేగంగా గెస్ట్ హవుస్ దగ్గరకి లారీలో చేరేడు ప్రభాకరం. మోహన్రావు, నాయుడు మొదలైన స్టాఫంతా అక్కడే వున్నారు. ప్రభాకరం లారీ దిగగానే అందరూ అతన్ని చుట్టు ముట్టేరు.

''వెరీ ఘాస్ట్లీ సైట్ ప్రభాకరం. యుద్ధంలో చావుకూడా అంత భయంకరంగా వుండదు ఆ ముసలాడి తల టమోటా పండులా చితికిపోయిది. చూడలేకపోయేను'' మోహన్రావు వికృతంగా మొహం పెట్టి అన్నాడు.

ఇంకెవరో ఏదో అనబోతూండగా ప్రభాకరం పట్టించుకోకుండా ''దొర ఎక్కడున్నారు?'' అని ప్రశ్నించేడు.

'లోపలగదిలో వున్నారు. మనవాళ్లు తప్ప ఇంకెవరు వచ్చినా రానివ్వద్దని చెప్పి తలుపు గట్టిగా బిడాయించేరు'' మళ్లీ మోహన్రావే అన్నాడు.

'నేను వెళతాను లోపలకి'' అంటూ ప్రభాకరు గబగబా లోపల గది దగ్గిరకి నడిచి తలుపు గట్టిగా కొట్టేడు.

'ఎవరు? ఎవరిది?'' దొర స్వరంలో ఏదో తెలీని భయం.

'నేను ప్రభాకరాన్ని తలుపు తెర్వండి''

చటుక్కున తలుపు తెరుచుకుంది.

గుమ్మంలో ప్రత్యక్షమయిన దొరమొహంలో ఏనాడూ గోచరించని దైన్యం, భయం ప్రభాకరం స్పష్టంగా గమనించేడు.

పెద్ద పులిలాంటి దొర కంటిచూపుతో ఎదుటోళ్ల మనస్సుల్లో కల్లోలం రేకెత్తించగలిగేది. ఈ దొరేనా అన్న అనుమానం కలిగించేలా వుంది ఆయన తీరు.

''వొచ్చినవా... ప్రభాకరం విన్నవా? ఇప్పుడెట్లజెయ్యాలె. నాకే మర్థమయితలేదు. ప్రాణం జారవుతున్నది''

ఒక్కక్షణం పాటు జాలిలాంటి భావం ప్రభాకరం మనసులో మెదిలింది. కానీ అంతలోనే అతను దాన్ని తొక్కిపెట్టేడు.

ప్రభాకరం అస్పష్టంగా తలూపేడు.

''నాకూ ఏమి తెలుస్తలేదు. పోలీస్ కేసయితదేమో.'' పచ్చని దొరమొహం మీద మంచి ముత్యాల్లా చెమట బిందువులేర్పడ్డాయి.

''నాకు మల్ల అదే బుగులవుతున్నది. చెడ్డ పరేషాన్ వొచ్చిపడ్డది. బయటకి పోదమంటె ఆ వడ్డెర ముండకొడుకులు చంపెటట్లున్నరు. ఫోన్ జూస్తె డెడ్ అయి వున్నదాయె''

ప్రభాకరం ఒక నిర్ణయానికి వచ్చేడు.

''మీరిక్కడ్నే వుండండి సార్! నేను సైటుకు పోయి, మేస్త్రీలతోని మాట్లాడి వస్త. వీలయితే లింగన్ననో, నారాయణనో వెంటబెట్టుకునొస్త. మీరు మాట్లాడుదురుగాని. ఎన్నో కొన్ని పైసలిస్తమని, అంటే వాల్లు కాదనరనుకుంట. నేనొచ్చి ఏ ముచ్చటా మీకు చెప్పినంక ఏమి చేసెడిదీ చూడొచ్చు. పోలీస్ కంప్లయింట్ ఈసరికి పోయుంటది. దెబ్బ తాకినోల్లను డిపార్ట్‌మెంటు దవాఖానలో జేర్చిరంట కదా!''

దొర మొహంలో ఆనందం కనిపించింది.

''నువ్వు పోతవా... మంచిది ప్రభాకరం. నాకు ముత్యమోలె దొర్కినవు. ఇన్ని దినాలు ఎందర్ని మస్తు మేపిన. ఒక్కడంటె ఒక్కడు గామాట అన్లే. ఎట్లయినజెయ్యి. ఎన్ని పైసలయిన ఖర్చువెట్టు నేనేమన. ఈ మిత్తి తప్పింది చాలు. ఆ బరువంతానీదే. పోలీసోండ్లకు పైసలు నూకితె కేసు, గీసు అదె మాఫీ అవుతది. ఈ లేబరుతోని వున్నది ప్రాబ్లమ్... ఉండు''

అని చెప్పి రెండు చేతోల్తో నోట్ల కట్టలు తీసుకు వచ్చి ప్రభాకరం చేతిలో పెట్టేడు.

''ముందుగాల వాండ్ల లొల్లి లేకుండగజెయ్యి. తినుడుకు తాగుడుకు పైసలిస్తె వాళ్లు మా ఊకుంటరు. మేస్త్రీలను పట్కొని వాళ్ల నోర్లు ముయ్యాలె. ఎంతన్న నరె ఇస్తామను. నా పేరు బదనామ్ కావొద్దు. ఇగ నువ్వెట్లు చెప్పితె అట్లు వినెటోన్నిగాని వేరుగాదు. నువ్వు నాకు కొడుకుకన్న ఎక్కువ ప్రభాకరం. నాకు పని జేసెటోడె పెద్దకొడుకు. పోయిరా! నీ కొరకు

చూస్తుంట''

అని సంతోషంగా ప్రభాకరాన్ని పంపి తేలిక పడ్డ మనసుతో తన గది తలుపులు వేసుకున్నా డతను.

ప్రభాకరం ఒక్కడే సైటు ఆఫీసు దగ్గిరకు మోటార్ సైకిల్ మీద వెళ్లేసరికి వాళ్లు తెలీని ఆవేశంతో ఆఫీసును ధ్వంసం చేసి, ఆ తర్వాత ఏం చెయ్యడానికీ తోచక గుంపులు గుంపులుగా చెదిరిపోయి, కొందరు ఆస్పత్రి దారిపట్టేరు. కొందరు ట్రెంచ్‌లో పడివున్న శవాల దగ్గర్లో మట్టిగుట్టల మీద కూర్చుని రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. మరి కొందరు తాగడానికి పోయినట్టున్నారు. మొ త్తం మీద వాళ్లెవరిలోమొట్టమొదటి ఆవేశం ఇప్పుడు లేదు. తాము చేసిన పన్లకు పర్యవ సానం ఎలా వుంటుందోనన్న భయం నెమ్మ దిగా వాళ్లలో చోటు చేసుకుంటోంది. వాళ్ల మేస్త్రీలు తామెంత చెప్పినా వినకుండా, రెచ్చి పోయినందుకు ఆ లేబరును తీవ్రంగా మంద లిస్తున్నారు. ఆ సమయంలో వెళ్లేడు ప్రభా కరం అక్కడకి. అతను ఊర్లోలేడని, వాళ్లకు ముందే తెలిసి వుండటంవల్ల జరిగిన దాన్లో అతని ప్రమేయం ఏదీ లేదని కూడా తెలుసు. అందుకే అతన్ని చూడగానే వాళ్లెవరూ ఉద్రేక పడి మీదకు రాలేదు. జరిగిన సంగతంతా మేస్త్రీలనోటి నుండి మొదటిసారిగా వింటున్న ట్టు విన్నాడతను. తరువాత వాళ్లు ఆవేశపడి ఆఫీసుకాల్చి వేసినందుకు, దొరను తన్నబోయి నందుకు, రాజలింగు కాళ్లు విరగకొట్టినందుకు తీవ్రంగా మందలించేడు. పనివాళ్లకు తెలీక పోతే, పరిస్థితులు చక్కదిద్దలేని మీకు మేస్త్రీ పనెందుకు. మీరు మేస్త్రీ లెట్లవుతారని పని వాళ్లముందే వాళ్లని మందలించేడు. పోయిన వాడు తిరిగి వస్తాడా. మనం ఏదో మార్గం చూసి వాడి కుటుంబానికి బతుకు తెరువు చూడాలి గానీ. అని వాళ్లని తన రూట్లోకి తెచ్చుకున్నాడు. చావు దుఃఖం తీరడానికి వాళ్లందరికీ తాగడాని కి పోయించమని, అందుకు కావలసిన డబ్బు ఒక మేస్త్రీకిచ్చి మరో ఇద్దరు మేస్త్రీలను తనతో తీసుకుని ముందుగా ఆసుపత్రికి బయలుదేరే డు. అతని మోటారు సైకిల్ ఆసుపత్రి రోడ్ వైపు తిరగడం, రోడ్‌కి అవతల వైపునుంచి వేగంగా వచ్చిన పోలీస్ జీప్ ఒకటి సైట్ ఆఫీసుకు పోయే రోడ్ మీదకు మలుపు తిర గడం కొద్ది నిముషాల తేడాలో జరిగింది. ఆ జీప్‌లో వున్నది ఇనస్పెక్టర్ విష్ణుపవన్. బిగించిన అతని పెదాల్లో పట్టుదల వ్యక్తమవు తోంది.



అద్దాల మేడలో వుండి రాళ్లు విసిరితే మొదట్లో ఏం కాకపోతే కాకపోవచ్చేమో. కానీ ఆ రాళ్లు విసిరి ఆనందించే వ్యక్తికి, ఎక్కువ కాలం కాకుండానే అంతకు రెట్టింపు రాళ్లొచ్చి తగిలి తీరుతాయి. అద్దాలమేడ అసంఖ్యాక మైన ముక్కలు గానే మిగిలిపోతుంది.

ప్రకాశరావు దొర విషయంలో ఇప్పుడా సద ర్భమే తటస్థించింది. అర్థబలమూ, అంగుబల మూ లేని వ్యక్తి కాడతను. కానీ అతని దురదృ ష్టంవల్ల అవేమీ అతన్నిప్పుడు ఆదుకోలేకపో యేయి. లాకప్ గదిలో కూర్చుని తన దుస్థితికి, అవమానంతో మనసు కుమిలిపోతుంటే, శూన్య మైపోయిన మెదడుతో లాకప్ గది ఊచల్లోంచి ఎదురుగా కనబడుతున్న 'సత్యమేవజయతే' అన్న సూక్తి వంక చూస్తూ కూర్చున్నాడు. ఆది వారం కావడంవల్ల చర్చి గంటలు దూ రంనుంచి మెల్లగా వినబడుతున్నాయి.

ప్రభాకరం పోలీస్ స్టేషన్‌లోకి అడుగుపెట్టే సరికి అంతకుముందు హాస్పిటల్ దగ్గర సవ న్ను అతను తీసుకు వెళ్లినపుడు వివరాలు ఎంక్వైరీ చేసిన ఇనస్పెక్టర్ సీట్లో కూర్చుని ఉన్నాడు.

"ఓహో... మీరా... రండి... కూర్చోండి" అంటూ అతను ప్రభాకరానికి సీటు అర్







చేశు.

బాగున్నారా! ఏం పని మీదవొచ్చేరు?'' అని అడిగేడతను.

మీరు అరెస్ట్... చేసేరు... ప్రకాశరావుగా ర్ని ఆయన మా బాస్. సంగతేమిటో కొంచెం చెతారా?''

ఆ కంట్రాక్టరా.. పవన్‌గారు అరెస్ట్ చేసి తీసొచ్చేరు. బెయిల్ కూడా కుదరదు ఈ రోజ అనుమానంగా అన్నాడతను.

కారణం ఏమిటి?''

డిపార్ట్‌మెంట్ కంప్లయింట్ అనుకుంటా నుఅదీగాక ఆయన గదిలో కొంత పేలుడు స్తాను కూడా దొరికింది. దొంగతనంగా ఆయుధాల వ్యాపారం చేస్తున్నారన్న అను వం కావొచ్చు. చాలా తీవ్రమైన కేసది. వివాలు నాకంతగా తెలీవు. మీరు పవన్‌గార్ని అగి తెలుసుకోండి. మీరడిగితే ఆయన ఏహ ఉపకారం చెయ్యొచ్చు. ఎంతైనా మీరు ఆయన ప్రాణదాత కదా!'' నవ్వుతూ అన్నాడత

లేచి నిలబడ్డాడు ప్రభాకరం.

''ఒక్కసారి నేను ప్రకాశరావుగారితో మాట్లాడ తాను. వీలవుతుందా?''

''తప్పకుండా'' అని ఒక కానిస్టేబుల్‌ని పిలిచి ప్రభాకరాన్ని ప్రకాశరావున్న లాకప్ రూం దగ్గరకి తీసుకు వెళ్లమని చెప్పేడు ఆ ఇనస్పెక్టర్.

లాకప్ రూంలోవున్న ప్రకాశరావును చూసి ప్రభాకరం బాధపడ్డాడు. ఏసి రూమ్‌లో విశ్ర మించే వ్యక్తి, కనీస సౌకర్యాలు కూడా లేని ఆ గదిలో మౌనంగా తల దించుకుని కూర్చున్నా డు. అడుగుల చప్పుడు విని తలెత్తి చూసి, ఎదురుగా ప్రభాకరం కనిపించేసరికి చప్పున లేచి ఊచల దగ్గిరకి వచ్చేడు.

''చూశావా... ప్రభాకరం నాకెటువంటి రోజు లొచ్చినయో... కనీసం లాయర్‌కి ఫోన్ చేస్తానన్న విన్లే ఆ ఇనస్పెక్టర్. నాకేమి వశపడుతలేదు.



తల పగులగొట్టుకుని చావాలని వున్నది. ఎట్లయిన జేసి నన్నిడిపించు. నేనొక్క నిమిషం ఉండలేనయ్యా. నీకు మొక్కుత... నువ్వే నాకిప్పుడు దిక్కు. నేను దొంగతనంగా పేలుడు సామాన్లమ్ముతనంటున్నరు. జిందగీలో ఇంత చెడ్డ మాట నా గురించొస్తదని నేనెన్నడనుకోలే. నువ్వు చెప్పితె వింటడట ఆ ఇనస్పెక్టర్. ఆయన్తోని చెప్పు... నన్నిడిపుమను. లాయర్తోని పోయి మాట్లాడి బెయిల్ తీసుకురా. విన్నవా. నేనిక్కడిక వుండలేను. నానుంచి కాదు... పోపో''

ఆ వ్యక్తిలో మనోబలం మందగించిపోయింది. వరుసగా ఒకదానిమీద ఒకటిగా అతని ఆత్మవిశ్వాసం మీద, బలంగా సమ్మెట పోట్లలా తగులుతున్న దెబ్బలకు, అతడు తట్టుకోలేకపోతున్నాడు.

''కొద్దిసేపు ఎట్లనో ఓర్చుకొండి. నేను పోయి ఆయన్తోని మాట్లాడుత. మిమ్మల్నెట్లయిన బయటకి తెచ్చె బాధ్యతనాది. మీరేమి పరేషాన్ కాకుండండి. అంత చక్కగయితది''

అని చెప్పి వడివడిగా, అక్కడ్నుంచి పవన్ ఇంటికి బయల్దేరేడు ప్రభాకరం.

కారు పెరేడ్‌గ్రౌండ్స్‌దాటి, పారడైజ్ దగ్గరికి చేరేసరికి సమయం పగలు పదకొండు గంటలు దాటిపోయింది.

ప్రభాకరం విష్ణుతో చాలాసేపు మాట్లాడేడు విష్ణు మొదట్లో ప్రకాశరావును విడిచిపెట్టడానికి అంగీకరించలేదు. అతని మీద చాలా బలమైన కంప్లయింట్‌లు వున్నాయని కనుక అతన్నెలాగయినా కేసు పెట్టకుండా వదిలేది లేదనీ అన్నాడు. ప్రభాకరం ఎంతో నచ్చచెప్పేక చనిపోయినవాళ్ల కుటుంబాలకు వాళ్లడిగినంత నష్టపరిహారం ఇప్పిస్తానని, విష్ణు ఎలా చెపితే అలా నడుచుకునేందుకు ఆయన్ని ఒప్పిస్తాననీ ఇదొక్కటి తన కోసం చెయ్యమనీ అడిగేక అందుకు వొప్పుకున్నాడు.

తర్వాత జరగవలసిన పనులన్నీ చకచకా జరిగిపోయేయి. మృతుల కుటుంబాలకు గాయపడ్డవారికి వారడిగిన నష్టపరిహారం ఇవ్వడానికి దొరమారు మాటాడకుండా అంగీకరించేడు. తక్షణ ఖర్చుల నిమిత్తం కొంత మొత్తానికి చెక్కు రాసి విష్ణు సమక్షంలో మధ్యవర్తులకు ఇచ్చేడాయన.

ఆ రోజంతా మిగిలిన పనులు చక్కపెట్టుకోవడంతోనే సరిపోయింది. బ్లాస్టింగ్ అయినంత వరకు పైప్‌లైన్ వర్కు పూర్తి చెయ్యమని, తిరిగి బ్లాస్టింగ్ అనుమతి లభించేక మిగిలిన పని పూర్తి చెయ్యవచ్చనీ మోహన్రావుకి ఆ పని అప్పజెప్పేరు. కానీ వాళ్లకీ తెలుసు పని ఇంత కుముందు జరిగినట్టు జరగదనీ అంతేకాదు బహుశా ఆ పనితోనే దొర కంట్రాక్టరు జీతం కూడా ముగిసి పోవచ్చని, అతను చేసే ఆ పనే ఆఖరు పననీ కూడా ప్రభాకరానికి అనిపించింది.

తను ఇక బయల్దేరే సమయం వన్నమైందనీ, జీవితంలో స్థిరపడడానికీ ప్రశాంతంగా జీవించడానికీ, ఈ ఒడిదుడకుల విలువలులేని జీవితానికి తిలోదకాలిచ్చి, మరొక మార్గంలో తన పయనాన్ని కొనసాగించవలసిన తరుణం ఏర్పడిందనీ అతనిమనసులో ఓ భావం మెదిలింది. అన్నేళ్లుగా పరిచయమైన పరిసరాలన్నీ ఆ భావం కలగంతో కొత్తగా గోచరించసాగేయి. ఏం జీవితంఇది. ఇన్ని సంవత్సరాలు ఎలా గడిపేడు.ఏం సాధించేడు. జవాబు దొరకలేదు.

వీడ్కోలు చెపుతుండగా, విష్ణు ప్రభాకరంతో కరచాలనం చేస్తూ అన్నాడు...

''మీ భావాలు, మీ ఆలోచనలు నాకు తెలిసినంతవరకు మంచివి. కానీ ప్రభాకరం! ఇలాటి దోపిడీదారుణ్ణి పచ్చి స్వార్థపరుణ్ణీ మీరు వెనకవేసుకు రావడం నాకర్థంకావటంలేదు. ఎనీహౌ మీ కోసం కేవలం మీడిగేరని నేను ఈ కేసు వదిలేస్తున్నాను విష్ యు బెస్టాఫ్ లక్''

ప్రభాకరం కొద్దిసేపు ఆలోచనలోపడ్డు. తర్వాత చెప్పేడు

''విష్ణుగారూ! మీకు ఈ విషయంలోను ఇబ్బంది కలిగించినందుకు క్షమించండి. నాకు ఆయన మీద ప్రత్యేకమైన అభిమానం ఏదీ లేదు. ఆయన చేసిన పన్లకి.. ఆయన తప్పకుండా తగిన శిక్ష అనుభవించాలి.ఇదే నా కోరిక. పులిని 'చంపాలంటే, బుల్లెట్‌తోనా




పని చేయాలి తప్ప. కర్రతో కొడితే చావదు. మీకు త్వరలోనే అర్థమవుతుంది. మరి నేను వెళ్లి వస్తాను. మీ శ్రీమతిగారికి నేను తెలుసు. ఆవిడకు నా నమస్కారాలుచెప్పండి'' అని ముందుకు కదిలి, తన కోసం కారులో కూర్చుని ఎదుట చూస్తున్న ప్రకాశరావు దొర పక్కనే కూర్చున్నాడు.

వాతావరణం మబ్బుపట్టి వెలుతురు తక్కువగా వుంది. సన్నగా చినుకులు రాలుతున్నాయి. ముందురోజు రాత్రి బాగా వర్షం పడింది కాబోలు కారుచక్రాలు రోడ్డుమీదున్న గోతుల్లో పడ్డప్పుడు వాటిలోని నీళ్లు పైకి ఎత్తగా చిమ్ముతున్నాయి.

ఆ దృశ్యాలను యధాలాపంగా చూస్తున్నాడు ప్రభాకరం. శారీరకంగా, మానసికంగానూ బాగా అలసిపోయివున్నాడతడు. ప్రకాశరావు దొరమాత్రం తలవెనక్కు జారేసి కునుకు తీస్తున్నాడు. మరి కొద్దిసేపట్లో తగలబోయే ఆఘాతం గురించి ఏమాత్రం తెలిసినా, అతను నిద్రపోయేవాడు కాదేమో.

బంగళాముందుకు కారు వచ్చేసరికి గేటు పక్క రెండుకార్లు ఆగివుండటం చూశాడు. ప్రభాకరం. కారు ఆగిన కుదుపుకు కళ్లు తెరిచేడు ప్రకాశరావు దొర. గేటు తెరిచేవుంది. గేటు పక్క నిలబడ్డ రెండు నీలంరంగు కార్లను చూసే అతని మొహం పాలిపోయింది. వాటిమీదున్న ప్రభుత్వచిహ్నాలు అతన్లో కలవరాన్నికలిగించేయి. ప్రభాకరంవైపు ప్రశ్నార్థకంగా చూశాడతను. అదురుతున్న గుండెలతో ప్రభాకరం తల పక్కకు తిప్పేడు. తనెదురు చూస్తున్న సమయం వచ్చేసిందని అతనికి తెలిసిపోయింది.

కారు ఆగగానే యూనిఫారం దుస్తుల్లో వున్న ఇద్దరు వ్యక్తులు కారు దగ్గరకి వచ్చేరు.

''ప్రకాశరావంటే ఎవరు...?'' కొద్దిగా వయసుపెద్దగా వున్న వ్యక్తి ప్రశ్నించేడు వాళ్లని.

''నేనే... ఎందుకు...?'' ముక్కుమీదకు జారిపోయిన కళ్లద్దాల్ని సవరించుకుంటూ వణుకుతున్న స్వరంతో అడిగాడు దొర.

''మిస్టర్ ఆర్ ఫ్రమ్ ఇన్‌కమ్‌టాక్స్ విజిలెన్స్ డిపార్ట్‌మెంట్ యుహేవ్ టు కోపరేట్ విత్ అజ్. వుయ్ కేమ్ టు రెయిడ్ యువర్ హవుస్...''

క్లుప్తంగా కటువుగా అతనామాటలు చెప్పడంతోనే దొర మొహం రక్తంచుక్క లేనంతగా పాలిపోయింది.

తూలిపడబోయినవాడల్లా కారు విండోను పట్టుకుని అలాగే నిలబడిపోయేడు. నోటమాట రాలేదు. అతన్ని చూస్తుంటే, ప్రభాకరానికి ఆఖరి గొడ్డలివేటు తిని నేలకూలబోతున్న మహావృక్షం కళ్లముందు కదలినట్లయింది. పెదిమలు బిగించి ఏం మాట్లాడకుండా వుండిపోయేడు ప్రభాకరం.

''మీరెవరు?'' సూటిగా అతన్నే చూస్తూ ప్రశ్నించేడు మరొక ఆఫీసరు.

''నా పేరు ప్రభాకరం'' అంతకన్నా చెప్పలేదు ప్రభాకరం. కానీ ఆ పేరు వినగానే అవతల వ్యక్తి కళ్లలో లిప్తకాలంపాటు గౌరవభావం కదలాడింది.

''మీరేనా... ప్రభాకరం. మీ స్టేటుమెంటు మాకు చాలా ముఖ్యం. దయచేసి మీరు కూడా ఎటూ వెళ్ళొద్దు. మీరిచ్చిన రిపోర్ట్ మా రెయిడ్‌కి ఆధారం''

ఫిరంగి గుండొచ్చి గుద్దినట్లు ఫీలింగ్ దొర కళ్లల్లో.

''ప్రభాకరం నువ్వా నువ్వేనా...'' అస్పష్టంగా ఉచ్చరించేయి అతని పెదాలు ఆ మాటలను ''యూ ఛీట్...''

ఆ మాట అని మరింక వెనక్కి తిరక్కుండా చకచకా లోపలికి నడిచేడు ప్రకాశరావు దొర. ఆడిటర్లకు కనీసం ఫోన్ కూడా చెయ్యలేదు. తనంత తానే స్వయంగా తన కన్‌సీల్డ్ ఛెస్ట్‌లలో దాచుకున్న వెండి, బంగారాల్నీ నల్లడబ్బు కట్టల్నీ అధికార్ల కప్పగించేసేడు. రికార్డులన్నిటినీ వాళ్లు స్వాధీనం చేసుకున్నారు. సుమారు ఎనిమిదిగంటలవరకూ సాగింది రెయిడ్. దొర నిలువుదోపిడీకి గురయినవాడిలా అయిపోయేడు.

విచిత్రంగా అతన్ని ప్రశాంతత ఆవరించింది. అతని అరుపులు కేకలతో ప్రతిధ్వనిస్తుండే ఆ బంగళాలో శ్మశాన నిశ్శబ్దం నిండిపోయింది. పెదవి విప్పి మాట్లాడటానికి ఎవరూ సాహసించటంలేదు.

సాయంత్రం తిరిగి ఆ అధికారులు వెళ్లిపోయేముందు కావలసిన అన్ని కాగితాల మీదా చకచకా సంతకాలు పెట్టేశాడు దొర.

ప్రభాకరం కూడా తన స్టేటుమెంటు వివరంగా రాసిచ్చేడు. కంట్రాక్టు వర్కు చేసేది ఒకేవ్యక్తి అయినా, ఇన్‌కంటాక్సు ఎగవేయటానికి బినామీ పార్ట్నర్ల పేర్లతో, వాళ్ల పేర్లతో బోగస్ పేర్లతో, మూడు వేరు, వేరు ఫర్మ్‌లుగా రిజిస్ట్రేషన్ చేసి ప్రతీ సంవత్సరం లాభాలను పంచకుండానే పంచినట్లుగా చూపి టాక్సు తగ్గించుకోవటం, పార్ట్నర్ల పేర్లతో ఫోర్జరీ సంతకాలు చెయ్యటం మొదలైనవన్నీ వివరంగా రాసిచ్చేడు. శ్రీరాములుగారి పేరు వాటాదారుగా వాడుకున్నా, ఆయన పేరుతో చూపిన లాభాలవాటా, ఆయనకి ఇవ్వలేదని అందుకే ఆయన శ్రీమతి భర్తకు రావలసిన దానికోసం పిటీషన్ దాఖలు చేసుకున్నదనీ, వాళ్లతో చెప్పేడు.

వాళ్లు వెళ్లిపోయేరు.

రాత్రిచాలాసేపటివరకు వరండాలో దొర ప్రభాకరం ఎదురెదురుగా నిలబడ్డారు.

ఇద్దరి మధ్యా మౌనం.

దొరలో తాను మొట్టమొదట చూసిన దొర ప్రత్యక్షమయ్యేడు.

ఏం చెయ్యగలడతను?

ఏం చెయ్యాలనుకుంటున్నాడు?

''నీ కండ్లు చల్లపడ్డాయా? నువ్వింత చాపకింద నీరులెక్క ముంచుతవనుకోలే. నా దగ్గిర చేసిన వాండ్లల్లో నువ్వంటెనే నాకు ఇష్టం. మొన్న పోలీస్ స్టేషన్నుంచి వొచ్చినంక నేను పూర్తిగా మారుదమనుకున్న మంచి కంట్రాక్టరుగా జేద్దమనీ నువ్వెట్లు చేస్తే దానికి కాదనొద్దనీ అనుకున్న. నేను దందా మానుకుని ఊర్ల రామా కృష్ణా అనుకొనే వయస్సొచ్చిందని పోదమనీ అనుకున్న. కానీ నువ్వేమి జేస్తివి. అన్నం పెట్టిన ఇంటికే కన్నమేస్తివి. నీ మాటలు నేవిన. నీకారణాలు నీకుండొచ్చు. నీతీ, నిజాయితీ అని నువ్వు ఏదేదో అనొచ్చు. నేను మల్ల నీతిగనే కంట్రాక్టులు జేసిన! ఇప్పటోండ్ల లెక్క ఇస్కతోని, మట్టితోని గట్టలే. గదినీకె తెల్సు. ఎంత నష్టపడిన ఎంత కష్టపడ్డా నేనె వరి కాళ్లు పట్టుకొనెటోణ్ణి కాను. నేను దొరని చివరవరకూ దొరనే. ఇంక నీ కొలువు నాకవసరంలేదు. నేను నిన్నేమన. నువ్వంటే నాకు కోపంలేదు. నీతీరు నీది. నా తీరు నాది ఈ రోజుతోని మనిద్దరి మధ్య బంధం తెగిపోయింది. ఎక్కడున్న మంచిగ బతుకు''

ప్రభాకరం స్వరం పెగల్లేదు.

కంఠం రుద్ధమైంది.

దొర నిజంగా దొరేననిపించుకున్నాడు. తను తొందరపడ్డాడా...? నిజంగానే తప్పుచేసేడా? పదిమందికి ఆశ్రయమిచ్చే పచ్చని చెట్టు తెగనరికాడా...?''

ఈ కంట్రాక్టరు అక్రమార్జనను ప్రభు[illegible] పరంచేస్తే సరిపోతుందా? ఎందరెందరు కోట్లకు పడగలెత్తిన కంట్రాక్టర్లు, ఇతరూ లేరు. వారందరినీ తను నిరోధించగలడా?

నిస్సంశయంగా తనాపని చేయలేడు.

ఒక తల నరికితే మరొక తల పుట్టుకొచ్చే రాక్షసుల్లా ఈ ధనరాక్షసులు పుట్టుకొనే వుంటారు. వాళ్లందర్నీ తనేం చెయ్యలేడని నిర్వివాదాంశం.

కానీ... కానీ... తనకున్న పరిధిలో [illegible] చేయగలిగినంతా చేసేడు. ఆ తృప్తి చ[illegible] తనకు. తప్పవుతే అవుగాక.

బేగ్ భుజానికి తగుల్చుకొని, గేటు తల[illegible]లు తీసి ముందుకు అడుగెయ్యబోతూ [illegible]సారి వెనక్కి తిరిగిచూసేడు.

దొర లోపలెక్కడో వున్నట్టున్నాడు.

దొరసాని గదిలోంచి బయటకు రావట[illegible]దు. గ్రిల్స్‌నానుకుని నించున్న ప్రవీణ చ[illegible]ల్తో అతని చూపులు కలిసేయి.

చప్పున ఆమె కళ్లు తుడుచుకోవటం చు[illegible] తలవంచుకుని ముందుకు సాగిపోయేడు [illegible]భాకరం.

వేకువఝాము కావడంతో ఇంకా ఆకాశ[illegible] చీకట్లు వీడిపోలేదు.

ధృవనక్షత్రం మాత్రం దివిటీలా వెల[illegible]తోంది. అవును. తృప్తికి మించిన సుఖముున్నది కనుక...!?!





# చతుర కథలు

## గెలుపు

మా రమణ కవిత్వం రాస్తాడు. రోజుకో కవిత రాస్తేగానీ వాడికి తిన్నది అరగదని వాడే చెప్పాడు. రమణ నాకు బాల్యమిత్రుడు, సహోద్యోగి. కవిగా ఎలాంటివాడైనా మనిషిగా మంచివాడు కావడంవల్ల తన కవిత్వంతో పెట్టే చిత్రహింసల్ని ఓపిగ్గా భరిస్తున్నాను.

ఓరోజు ఉదయం వచ్చి నన్ను నిద్రలేపి "కవితా సంకలనం వేస్తున్నానోచ్చి!" అన్నాడు.

అదేదో పెద్ద శుభవార్తలా నిద్రలేపి మరీ చెప్పడంతో నాకు వళ్ళుమండింది.

"నువ్వు రాసే చెత్తకి సంకలనం ఒకటా! మతిగానీ పోయిందా నీకు అటువంటి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు!" అన్నాను కళ్ళు నలుపుకొంటూ.

"కవిత్వం గురించి నీకేం తెలుసురా! దానిని ఆస్వాదించడానికి రసహృదయం కావాలి!" అన్నాడు పెద్ద పోజులో.

"వంకాయకూర రుచి చెప్పడానికి వంటమనిషిగానక్కరలేదన్నాడు శ్రీశ్రీ. నువ్వు రాసేది కావలసినవాళ్ళం మేమే భరించలేక చస్తుంటే యింకెవడు చదువుతాడురా ఆ కవిత్వం" అన్నాను.

"నవ్వి పోదురుగాక నాకేమి సిగ్గు" అంటూ ఓ పోజు అభినయించాడు వాడు.

"నవ్విపోవడంమాట అలావుంచు. నీ చేతి చమురు బాగా వదులుతుంది. యిప్పుడు బాగా రాస్తున్నవాళ్ళే కవితాసంకలనాలు వేసినా అమ్ముడుపోవడంలేదు. 'అభినందనలతో', 'ప్రేమతో', 'భక్తితో', 'ముక్తితో అంటూ పరిచయస్తులందరికీ పంచిపెట్టుకొంటున్నారు. ఈ ప్రయత్నం మానుకో' అని గట్టిగా నచ్చచెప్పే ప్రయత్నం చేశాను.



వాడు నా మాటలు చెవినపెట్టలేదు. పోగాలము దాపురించినప్పుడు మిత్రవాక్యం వినబడదుగదామరి. నెల తిరిగేలోగా ఏడెనిమిదివేల దాకా ఖర్చుచేసి 'కవితాసంకలనం' వేసేసుకున్నాడు.

మా ఆఫీసుదగ్గర వున్న బుక్‌షాపువాళ్ళని బతిమాలుకొని యాభైశాతం కమీషన్‌మీద పది కాపీలు యిచ్చాడు. అమ్మకం అయిన తరువాతనే డబ్బులు యిచ్చే షరతుకు ఒప్పుకున్నాడు. మరో పదిశాతం కూడా ఇచ్చి షాపులోకి ఎంటర్ అవ్వగానే కస్టమర్ దృష్టిని ఆకర్షించేలా తన కవితాసంకలనం ప్రతులను అన్నివైపులా స్వహస్తాలతో సర్దుకున్నాడు. ప్రతిరోజూ ఆఫీసు అయిన తరువాత వాడూ, నేను షాపుకు వెళ్ళడం, పుస్తకాల దుమ్ము దులిపి మళ్ళా సర్దడం మా నిత్యకృత్యం అయిపోయింది. ఇలా నెలరోజులు గడిచిపోయింది. ఒక్కటీ సేల్ అవలా? మావాడు షాపువాళ్ళ కమీషన్ మరో పదిహేనుశాతం పెంచాడు. ఎలాగైనా తన పుస్తకం అమ్మి నామీద గెలుపు సాధించాలని వాడి తాపత్రయం. అలాగైనా పదిరోజులవరకూ ఒక్క పుస్తకం కూడా అమ్ముడుపోలేదు.

పదకొండవరోజున మేము షాపు మెట్లు ఎక్కుతుంటే పదమూడు, పధ్నాలుగు సంవత్సరాల వయస్సుండే ఓ కాన్వెంటు యూనిఫాం అమ్మాయి చేతిలో మావాడి కవితాసంకలనం, మహాకవి శ్రీశ్రీ 'మహాప్రస్థానం' కన్పించాయి. అది చూసిన రమణ పులకించిపోయాడు. నేనూ ఆశ్చర్యపోయాను.

"పాపా! ఆ కవితాసంకలనం రాసిన కవిని నేనే. ఆటోగ్రాఫ్ రాసివ్వనా?'' అన్నాడు రమణ పరమానందంగా జేబులోంచి పెన్ను తీస్తూ.

"యిందులో ఏ పుస్తకం అంకుల్ మీరు రాసింది!" అందా పాప అమాయకంగా! రమణ షాక్ అయ్యాడు! మా రియాక్షన్లకి ఆ అమ్మాయి బెదిరిపోయింది.

నేను వెంటనే తేరుకుని "నువ్వు కవితలు బాగా చదువుతావా పాపా!" అన్నాను కాస్త అనునయంగా.

"లేదంకుల్! మా ఫ్రెండు చదువుతుంది. తను రాస్తుంది కూడా. రేపు దాని బర్త్‌డే! ప్రజంటు చేద్దామని కొన్నాను"

"ఇవే ఎందుకు కొన్నావ్?"

"కవిత్వం ఎలా వుండాలో ఈ పుస్తకం చదివితే తెలుస్తుందట! కవిత్వం ఎలా వుండకూడదో ఈ పుస్తకం చదివితే తెలుస్తుందట!! సేల్సుమెన్ చెప్పాడు'' అందా కాన్వెంటుపాప ఆ రెండు పుస్తకాలూ చూసి అందంగా కళ్ళు తిప్పుతూ.

బహుశా సేల్సుమెన్ మావాడిమీద జాలిపడి బాగా ఆలోచించి సేల్సుకోసం ఈ టెక్నిక్ ఎన్నుకొని వుంటాడు. యిదే పద్ధతి కొనసాగిస్తే మావాడి 'సంకలనం' అతి త్వరలోనే మరో ముద్రణకు నోచుకోవచ్చునన్న నమ్మకం నాకు కలిగింది.

"కంగ్రాచ్యులేషన్స్ మిత్రమా! నువ్వే గెలిచావు'' అన్నాను అభినందిస్తూ. ఎందుచేతనో మావాడినుంచి ఉలుకూ, పలుకూలేదు.

**-రతన్‌బాబు**

---

## చెక్కు

సాయంకాలం వంట ముగించి స్నానానికి వెళ్లబోతుండగా డోర్‌బెల్ చప్పుడు వినిపించింది. ఎవరై ఉంటారబ్బా అని క్షణకాలం ఆలోచిస్తుండేసరికే మళ్లీ బెల్ మోత... ఈసారి ఆగకుండా బజ్జర్ నొక్కుతున్నాడెవరో మహానుభావుడు.

పరుగులాంటి నడకతో వెళ్లి తలుపు తెరిచాను, ఎదురుగా ఓ కొత్తశాల్తీ! ఎక్కడో అతన్నిదివరకే చూసినట్లనిపిస్తున్నా ఎవరో గుర్తుకు రాలేదు. నన్ను చూసి రెండు చేతులూ జోడించి నమస్కరించాడు. లోపలికి రమ్మనడమా? మానడమా? ఛ! ఛ! ఇంటికొచ్చిన అతిథిని బయటే నిలబెట్టి గుడ్లప్పగించి చూడటం ఏం సబబు? చిన్నగా తలపంకించి నవ్వి "రండి! లోపలికి!" అని కుర్చీ చూపించాను. ఎవరితను? కరెంట్ మీటర్ రీడింగ్ చూసుకోవడానికి వచ్చిన ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ వాడా? .మా కంపెనీ ప్రొడక్టులే వాడండని నుత్తివేసే కేన్వా




సరా? దొంగాడా? ఎవరై ఉంటారు? అని ఆలోచిస్తున్న నా మౌనాన్ని భంగం చేస్తూ "నన్ను గుర్తు పట్టలేదా మేడం!" అన్నాడు మర్యాదగా ఆగంతకుడు. "ఆఁ పట్టకేం మీరు తెలియక పోవడమేమిటి?" అంటూ మాటలు మింగేశాను. అతనే డైరెక్టుగా విషయంలోకి వచ్చాడు.

"నేను మద్రాసు నుండి వచ్చానండీ! నా పేరు శ్యాంసుందర్. మీరు సినిమాలెక్కువగా చూడరా ఏం? తెరపై తరచూ కన్పిస్తుంటా నైండి!!" అన్నాడు.

"అర్రెర్రె... ఔనౌను!"

సిల్వర్ స్క్రీనే కాదు బుల్లితెరపైకూడా చాలాసార్లే కన్పించాడు. మేకప్ లేదుకదా! అందుకే నేను పోల్చుకోలేకపోయాను. కనుక తప్పు నా మెమొరీదికాదు, అతనిదే!

"ఆఁ! చెప్పండి! వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ" అడిగాను గంభీరంగా.

"నేనో పిక్చర్ తీస్తున్నాను. దానికి మాటలు, పాటలు, కథ అన్నీ మీరే రాసివ్వాలి. కాదన కండి. ఇవి చేతులు కావు" అని నా చేతులు పట్టుకోబోయాడు.

"నేను కథలు రాస్తానని ఎవరు చెప్పారు" అడిగాను గుటకలు మింగుతూ.

"బయట బోర్డు చూశానుగా మీ పేరు, దానికింద మీ అర్హతలు... ఫలాన పత్రికలో మీరు ధారావాహికంగా రాస్తున్న నవలా చదువుతున్నాను. ఇంత ప్రసిద్ధి చెందిన రచయిత్రి మీరు, మీ గురించొకరు చెప్పాలటండీ" అన్నాడు.

హతోస్మి.

ఆ ప్రసిద్ధ రచయిత్రి పేరూ, నా పేరూ ఒక్కటే కానీ ఆ అర్హతలూ బోర్డూ అంటున్నాడు అవేవీ నాకు లేవే? నాకేమీ అర్థం కాలేదు.

"నా చిత్రానికి మీరే కథ, మాటలు, పాటలు రాస్తే సూపర్ హిట్టవుతుందని నా నమ్మకం"

హుర్రే అని అరవాలన్పించింది.

కథ, మాటలు, పాటలు అంటే మాటలు కాదు, గొప్ప ఛాన్సే!

కానీ నేను రాయగలనా అనేదే సమస్య. ఎందుకంటే నేను చదువుకున్నది ఆరో క్లాసు వరకే. అది కూడా గవర్నమెంటు స్కూల్లో. వాళ్లేం చెప్పారో... నేనేం చదువుకున్నానోగానీ నామటుకు నేను కూడదీసుకున్నా సినిమా టైటిల్సయినా తప్పుల్లేకుండా చదవలేను.

ఏమిటి చెయ్యటం?

"ఎలాగో శ్రీవారిని బతిమాలి రాయించి నా పేరు పెట్టుకుంటే పోలా?" ఐడియా బుర్రలో వెలగ్గానే నవ్వుకున్నాను లోలోపల. ఆపై గట్టిగా పైకే నవ్వేశాను.

"ఎందుకలా నవ్వుతున్నారు?" ఆశ్చర్యంగా అన్నాడు శ్యాం సుందర్.

ఏం చెబుతాను? అసలు విషయం చెబితే ఇంకేమైనా ఉందా? క్షణంపాటు ఆలోచించి, "ఓ దానికేం భాగ్యం అలాగే రాస్తాను. ఎన్నాళ్లలో ఇవ్వమంటారు? మీకు ముందుగా కథ చెబుతాను. అది నచ్చేసుకుంటే మాటలూ, పాటలూ చిటికెలో అయిపోతాయి" అన్నాను దర్జాగా.

"థ్యాంక్సండీ! కథ ఎప్పటికి రెడీ చేస్తారు?" అడిగాడు శ్యాంసుందర్.

"ఎల్లుండి ఇదే టైంకి రండి. ఇచ్చేస్తా... అన్నట్లు మీకు తెలుసో తెలియదోకానీ నేను పాటలు బ్రహ్మాండంగా పాడతాను. మీరు ఎవరిచేత పాడించాలనుకుంటున్నారు. ఇంకా ఎవర్నీ అనుకోకుంటే నేను రాసిన పాటల్ని నేనే పాడతాను" కోశాను.

శ్యాంసుందర్ తెగ సంతోషపడిపోయాడు.

"వెరీగుడ్! వెరీగుడ్! మీరే పాడుదురుగాని" అంటూ బ్యాగులోనుండి చెక్‌బుక్ తీసి లక్ష రూపాయలు రాసి సంతకం చేసిస్తూ "ఇది అడ్వాన్స్! పాటలు పూర్తయ్యాక మిగతా అమౌంట్" అని అతనంటుండగానే ఓ అంబులెన్స్, పోలీసుల జీపు వచ్చి వాకిట్లో ఆగాయి. ఆశ్చర్యంగా చూస్తుండిపోయాను. ఓ పది మంది హాస్పిటల్ సిబ్బందీ, డాక్టర్, పోలీసు కానిస్టేబుల్స్, ఇనస్పెక్టరూ మా గేట్లోంచి దూసుకు వచ్చి అతన్ని పట్టుకున్నారు.

"చూశారా... చూశారా! ఇక్కడున్నాడు" అని గుండెలు బాదుకున్నారు. నా ఆశ్చర్యం పదిరెట్లయింది. కొంపదీసి శ్యాంసుందర్ చిన్నప్పుడే తప్పిపోయిన కవల సోదరుడా ఏమిటి?

"ఏమిటమ్మా! ఇతనేదైనా చెబుతున్నాడా?"




అన్నారు నా వైపు తిరిగి.

"ప్రఖ్యాత నటుడూ దర్శకుడూ అయిన శ్యాంసుందర్‌గార్ని పట్టుకుంటున్నారేమిటి మీకేమైనా పిచ్చా" కోపంగా అరిచాను. నాకు అడ్వాన్సు ఇవ్వటమేగాక పాటలు పూర్తయ్యాక మరింత డబ్బిస్తానన్నాడాయె! చూస్తూ చూస్తూ ఎలా వదులుకోగలను చెప్పండి!

"ఇతను శ్యాంసుందరేనమ్మా! ఇటీవల వరసగా ఆరు సినిమాలు ఫ్లాప్ అవటంతో దివాలా తీసి దుఃఖంలో మునిగిపోయాడు. స్క్రూ లూజై రాన్రాను అది ముదిరిపోవటంతో ఈమధ్యే మా మెంటల్ హాస్పిటల్లో చేర్చారు. కాపలాదారు టీ కోసం అలా బయటికెళ్లేసరికి ఇతనిలా పారిపోయి వచ్చాడు. పొద్దున్నుండీ వెతకలేక చచ్చే చావయిపోయిందనుకోండి! మిమ్మల్నేమీ ఇబ్బంది పెట్టలేదుకదా!" అంటూ వాళ్లు శ్యాంసుందర్ని లాక్కుపోయారు.

నా చేతిలో చెక్కు భద్రంగా అలాగే ఉండిపోయింది.

-జ్యోతిరాణి

## చుట్టం

చిరుద్యోగి సుబ్బారావు భార్యా, ముగ్గురు పిల్లల్తో వైజాగ్‌లో తనకొచ్చే జీతంతో అతి జాగ్రత్తగా నెట్టుకొస్తున్నాడు. అప్పుడప్పుడూ చుట్టాల తాకిడి కష్టమైనా తప్పటం లేదు.

ఒకసారి భార్యకి దూరపు చుట్టం, వరుసకు అన్నయ్య అయిన గోపాలం వచ్చాడు. భార్య అతని రాకకి తెగ సంబరపడిపోయి, రాకరాక వచ్చినందుకు అడుగులకు మడుగులు వత్తుతోంది. అతడు రెండు మూడు రోజులయినా కదలటంలేదు. సరిగదా మాటవరసకు వెళ్తానన్నా 'రేపెళ్లువుగానిలే, ఎల్లుండి వెళ్లువుగానిలే' అని భార్య అతని ప్రయత్నాన్ని విరమింపచేస్తోంది. అతడూ ఉద్యోగస్తుడు కాకపోవటం చేతా, కొంచెం సోమరికావటం చేతా మరి కదలటం లేదు.

అసలే వేసవికాలం కుళాయిలు సరిగా రావటంలేదు. స్నానానికి ఇబ్బందిగా ఉంది... రెండే గదులు అవటంవల్ల పడుకోడానికీ ఇబ్బందిగానే ఉంది. పైగా గదిలో ఉన్న ఒకే




ఫ్యాను కింద అతను మంచంవేసుకుని పడు కుంటున్నాడు. అతన్ని పొమ్మని ఎలా చెప్పాలో సుబ్బారావుకి తెలీటంలేదు. భార్యని చెప్ప మంటే ఏం బాగుంటుంది? రాకరాక వచ్చాడు? అంటోంది.

సుబ్బారావు ఆరోజు ఆఫీసులో ఉండగా అతని చెవిలో ఎనౌన్సుమెంటు పడింది. "రెండు రోజులు మాత్రమే! ది గ్రేట్ జెమినీ సర్కస్ అత్యద్భుత ప్రదర్శనలతో మీ కళ్ళకు విందుచేసే సర్కస్ మరో రెండు రోజులు మాత్రమే! త్వరపడండి" అని! సుబ్బారావు ఎగిరి గంతేశాడు.

ఇంటికి వెళ్ళేక పిల్లల్ని పిల్చి చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు.

రోజూలాగే ఆ చుట్టం గోపాలం 'బావా నేనెళ్తాను' అని తయారయాడు. "వెళ్దూగాని లే, ఇంటికెళ్ళి ఏంచెయ్యాలి? వచ్చిన దగ్గర్నుంచీ వెళిపోతానని ఒకటే గోల. అయినా అంతమొహమాటం దేనికి? నేనేం పైదాన్నా. అదే నీ సొంత చెల్లెలయితే ఇలానే మొహమాటపడతావా?" అంది సుబ్బారావు భార్య. గొప్ప కోపం వచ్చింది సుబ్బారావుకు. గోపాలం ఈలోగా మళ్ళీ బేగ్‌ని దించేసాడు.

ఇంతలో పిల్లలు గుమిగూడారు. "మామయ్యా! నువ్వెళ్ళకూడదు. ఇక్కడే ఉండిపోవాలి" మారాం చేయసాగారు.

"సరే లెండర్రా, అలాగే కానీండర్రా!" అన్నాడు.

"మామయ్యా! జెమినీ సర్కస్ వచ్చింది. రెండురోజులే ఉంటుందిట. నాన్నని తీసుకెళ్ళమంటే డబ్బుల్లేవని కసురుతున్నారు. నువ్వు తీసుకెళ్ళు మామయ్యా!" అన్నారు.

"పోనీ తీసుకెళ్ళవోయ్ మీ చెల్లెలికీ సర్కస్ అంటే సరదాయే. టికెట్టు ఇరవై రూపాయలే" అన్నాడు సుబ్బారావు.

గోపాలం గుడ్లు తేలేశాడు. మొత్తం ఆరు టికెట్లు నూటిరవయ్యి. ఆటోఛార్జీలు. ఇంకా పై ఖర్చులు. నూటయాభై దాటుతుంది. మనసులోనే లెక్కేసుకొని నీళ్లునమిలాడు.




ఆ తరువాత బేగ్ సర్దుకుని, 'చెల్లాయ్... నేను అసలు సంగతి మరిచేపోయాను. మొన్నటికే ఇంటికి వచ్చేస్తానన్నాను. నేను లేకపోతే చంటాడు వాళ్ళమ్మని కాల్చుకుతింటాడు, నేనర్జంటుగా వెళ్ళాలి" అని చెల్లెలు ఎంత ఉండమన్నా ఉండక ఇంట్లోంచి పరుగు తీసాడు.

"పాపం! చంటాడంటే ఎంత ప్రేమా!' అంటూ నవ్వుకున్నాడు సుబ్బారావు.

-లావాసుర్మూర్తి

# సాగరతీర మార్గాన సుదూరాలకు...

సుదీర్ఘమైన భారతదేశపు సముద్రతీరం వెంట ప్రయాణిస్తూ ఆయా తీర ప్రాంతాలను సందర్శించడం ఓ అద్భుతానుభవం. పశ్చిమ ప్రాంతపు ద్వారక, పోర్బందర్‌లనుండి గోవా మీదుగా దిగువనున్న కన్యాకుమారికి చేరి అక్కడినుండి ఉత్తరంగా మద్రాస్, విశాఖపట్నంల మీదుగా కలకత్తాకి సముద్రతీరం గుండా చేసే ప్రయాణం ఉత్సాహభరితంగా వుంటుంది. ఇంచుమించు ముక్కోణాకారంలో కనిపించే భారతీయ చిత్రపటాన్ని పరిశీలిస్తే మూడు వైపులా దేశ సరిహద్దులు సముద్రాలకి ఆనుకునే కనిపిస్తాయి. పశ్చిమాన అరేబియా సముద్రం, తూర్పున బంగాళాఖాతం, దిగువన హిందూ మహాసముద్రం విస్తరించి వున్నాయి. ఇండియాలోని తొమ్మిది రాష్ట్రాలు ఆయా సముద్రతీరాలకు చేరువగా వుండి దేశాభివృద్ధిలోను, ఆర్థిక వ్యవస్థలోను ముఖ్యపాత్రను నిర్వహిస్తున్నాయి. ఈ తీర ప్రాంతపు అందాలను నీటి మీద ప్రయాణిస్తూ చూడాలి కానీ నేలమీదనుండి కాదు. పశ్చిమోత్తర ప్రాంతమయిన గుజరాత్‌లోని ద్వారక లేదా కచ్‌నుంచి ప్రారంభించి కన్యాకుమారి మీదుగా కలకత్తాకు చేరడంతో ఈ తీర ప్రాంతాల దర్శనం సమగ్రంగా అవుతుంది.

గుజరాత్ కేవలం జైన దేవాలయాలకి, లేదా ఘిర్ అడవులలోని పులులకే పరిమితం

***దక్షిణ ధృవానికి, వెరవల్‌కి మధ్య విస్తరించిన విశాల సాగరం***





కొచ్చిన్‌లో ఇప్పటికీ వాడుకలో వున్న చైనీయుల చేపల వలలు



అనుభూతులకు ఆలవాలం కోవలమ్ బీచ్



కోలాహలంగా కనిపించే వెగటార్ బీచ్



లక్షదీవులలోని 'బంగారమ్' దీవి.

అనుకోనవసరంలేదు. దాని తీరప్రాంతానికీ ఓ అద్భుత చరిత్రే వుంది. కచ్ ప్రాంతం ఇండియా, పాకిస్తాన్‌లను వేరు చేసే ఓ ద్వీపంలా కనిపిస్తుంది. ముఖ్యంగా జూన్‌నుంచి అక్టోబర్ వరకు ఈ ప్రాంతమంతా వర్షాలు, వరదలతో ప్రయాణానికి సైతం వీలులేకుండా వుంటుంది. వానలు తగ్గి శీతాకాలం ప్రవేశించే సరికి ఫ్లెమింగోలు, పెలికాన్ మొదలైన పక్షులు గుంపులు గుంపులుగా కనిపిస్తాయి. కచ్‌లోని వన్యమృగ సంరక్షణ కేంద్రంలో కనిపించే ప్రమాదకరమయిన అడవి జంతువులను చూసితీరవలసిందే. అక్కడి గ్రామీణ స్త్రీలు ఎంబ్రాయిడరీ చేసిన దుస్తులతోటి, వంటి నిండా బరువైన వెండి ఆభరణాలతోటి చూడ ముచ్చటగా కనిపిస్తారు.

కచ్‌లోని మాండ్వీ అనే చిన్న రేవు పట్టణం నుండి దక్షిణానికి ప్రయాణం ప్రారంభిస్తే శ్రీకృష్ణుడు పుట్టిన ద్వారక చేరుకుంటాం. శ్రీకృష్ణుడి పుట్టిన రోజయిన జన్మాష్టమినాడు వేలాది ప్రజలు అక్కడ ఉట్టి కొట్టే ఉత్సవం చేసుకుంటారు. ద్వారక తీరం నుంచి తిరిగి తిన్నగా ప్రయాణం సాగిస్తే వరసగా పోర్బందర్, బోర్వాడ్, వెరవల్, సోమనాథ్ తీర ప్రాంతాలను దాటి దక్షిణ ప్రాంతపు చివరి భాగంలో డయ్యూకి చేరుకుంటాం.

లక్షదీవులలోని ఒక దీవి



ఒకప్పుడు పోర్బందర్ అరబ్బులకు వ్యాపార కేంద్రంగా పేరుపొంది, అటుపైన అది జాతిపిత గాంధీ పుట్టిన ప్రాంతంగా వాసికెక్కింది. ఇక్కడినుంచే మక్కాకు వెళ్లే యాత్రికుల సముద్ర ప్రయాణం ప్రారంభమవుతుంది. ప్రస్తుతం ఈ తీరంలో చేపల వ్యాపారం, చేపల పడవలను తయారు చేసే వ్యాపారం జోరుగా సాగుతున్నాయి. పోర్బందర్ నుండి కొన్ని కిలోమీటర్ల తీరం గుండా దిగువకు ప్రయాణిస్తే ప్రఖ్యాత సోమనాథ్ దేవాలయ ప్రాంతం దర్శనమిస్తుంది. అటుపైన తగిలే డయ్యూ 38 చదరపు కిలోమీటర్ల వైశాల్యంగల దీవి. కేంద్రపాలిత ప్రాంతమయిన ఈ దీవి 1535 నుంచి 1961 వరకు పోర్చుగీసు వారి అధీనంలో వుండేది. మధ్యలో 1670 నుంచి 1717 వరకు మాత్రం దీన్ని మస్కట్‌కు చెందిన అరబ్బులు పాలించారు. పర్షియా నుంచి వచ్చే పార్శీలు ముందుగా ఈ దీవిపై దిగి అక్కడినుంచి భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు ప్రయాణం చేసేవారు. 1961లో భారతీయ సైనికులు ఆపరేషన్ విజయ్ పేర ఈ డయ్యూను దిగ్బంధం చేసి పోర్చుగీసు పాలనను అంతం చేసి భారతదేశ అధీనంలోకి తీసుకు వచ్చారు. పోర్చుగీసు పాలన కాలం నుండి ఇప్పటి వరకూ దీని తీర ప్రాంతాల్లో ఎన్నో రకాల వ్యాపారాలు ముమ్మరంగా సాగుతూనే వున్నాయి.



బొంబాయిలోని గేట్‌వే ఆఫ్ ఇండియా

1547లో పోర్చుగీసువాళ్లు ఇక్కడ ఒక కోటను నిర్మించి దాని చుట్టూ ఫిరంగులను అమర్చారు. ఇప్పటికీ ఈ కోట, వెలవెలబోతున్న ఫిరంగులూ మనకి కనిపిస్తాయి. కోట పైకెక్కి చూస్తే గుజరాత్ ఒక ద్వీపంలా కనిపిస్తుంది.

డయ్యూ తరువాత సాగే తీర ప్రయాణంలో దక్షిణ ద్వీపకల్పపు కొనలో వున్న భవ్‌నగర్ తటస్థపడుతుంది. ఇది అద్భుతమైన జైనదేవాలయాలకు ప్రసిద్ధి. అటుపైన చేరుకునే

బీచ్ ఒడ్డున కన్నుల పండుగ చేసే కొబ్బరితోటలు



ప్రాంతం కాంబే సింధుశాఖ. దాని తరువాత డామన్, సూరత్‌లు.

సూరత్ ఓడరేవు ఒకప్పుడు వ్యాపార కేంద్రంగా వుండేది. ప్రస్తుతం అది ఒక పెద్ద పారిశ్రామిక నగరం. డామన్ డయ్యూలాగే కేంద్ర పాలిత ప్రాంతం. రెండు పోర్చుగీసు చర్చ్‌లు, రెండు కోటలు, చేపల మార్కెట్లు, నౌకాశ్రయం ఇక్కడ చూడదగిన విశేషాలు.

అటుపైన ఇంకా ముందుకు వెడితే మనకు దర్శనమిచ్చేది బొంబాయి తీర ప్రాంతం. ఇది ఎప్పుడూ హడావిడిగా ఎన్నెన్నో వ్యాపారాలతో, ఓడల రాకపోకలతో కళకళలాడుతూ ఎప్పుడూ సందడిగా వుంటుంది బొంబాయి నగరం. ఆధునికత అక్కడివారిలో కొట్టొచ్చిన ట్టు కనపడుతుంది. 1509లో ఇక్కడికి వచ్చిన పోర్చుగీసు వారు ఈ ప్రాంతం అద్భుత నగరంగా తయారు కావడానికి పునాది వేశారు. ఒకప్పుడు ముంబాయిగా ప్రసిద్ధమైన ఈ బొంబాయి ఏడు చిన్న ద్వీపాలుగా విభజింపబడి వుండేది. వాటిని పోర్చుగీసువారు కేథరిన్, రెండవ ఛార్లెస్‌ల వివాహ సమయంలో బ్రిటిష్‌వారికి వరకట్నంగా ఇచ్చారని కథనం. అటు తర్వాత ఈ ఏడు ద్వీపాలు కలిసి పోయి ఓ పెద్ద నగరంగా రూపుదిద్దుకుంది. అరబ్బు



క్విలన్ మీదుగా నీటిప్రయాణం

---

వుంటుంది. రకరకాల వస్తువుల ఎగుమతి దిగుమతులతో కోలాహలంగా వుంటుంది. బొంబాయి తీరంలో ఓడ దిగిన ప్రయాణీకులు నగరంలో కాలుపెడితే వారికది రెండో న్యూయార్క్ అనిపించవచ్చు. మల్టీస్టోరీడ్ బిల్డింగ్‌లు, రకరకాల మనుషులు, వారి విభిన్న ఆచార వ్యవహారాలు వంటి భారతదేశపు ఆకర్షణలతో వర్తకులు వ్యాపార నిమిత్తం వచ్చే వారిక్కడికి. బ్రిటిష్‌వారు సిల్క్, మజ్లిన్ మొదలయిన వస్త్రాల వ్యాపారం కోసం, సుగంధ ద్రవ్యాల కోసం వచ్చేవారిక్కడికి. ఈ తీర ప్రాంతంలో సందర్శించాల్సిన విశేషాలు చాలా వున్నాయి. పూనె దగ్గర హాజీహాలీ మసీదు సముద్ర మధ్యంలో నిర్మించబడివుంది. వందలాది యాత్రికులు నీటిమట్టం తగ్గే సమయానికి ఈ మసీదును దర్శించేందుకు వస్తారు. చౌపతీ బీచ్ సాయంత్రం సమయాల్లో కన్నుల పండు





వగా దర్శనమిస్తుంది. రకరకాల తినుబండారాలు చక్కని లైట్లలో నోరూరిస్తాయి. పొద్దున్నే వాకింగ్, జాగింగ్‌లకొచ్చేవాళ్లు, పెంపుడు కుక్కలను వ్యాహ్యాళికి తీసుకొచ్చేవాళ్లతో ఉదయం కూడా ఈ బీచ్ చూడముచ్చటగా వుంటుంది. ఇక్కడ ముఖ్యంగా చూడదగిన ప్రాంతం ఎలిఫెంటా ఐలెండ్. ఇది గేట్‌వేఆఫ్ ఇండియా నుంచి పది కిలో మీటర్లు బోటులో ప్రయాణం చేస్తే కనపడుతుంది. నాలుగు, తొమ్మిది శతాబ్దాల మధ్యకాలంలో నిర్మించబడిన నాలుగు గుహాలయాలు ఈ ఎలిఫెంటా ద్వీపంలో దర్శనమిస్తాయి. ఇవి పోర్చుగీసువారి కాలంలో బాగా దెబ్బతిన్నాయి. ఎలిఫెంటాకు వర్షాకాలంలో లాంచీలు నడవవు. బొంబాయి సముద్రతీరాన ఫిబ్రవరి, మార్చి నెలల్లో జరిగే ఉత్సవంలో శాస్త్రీయ సంగీత కళాకారులెందరో పాల్గొని కచేరీలు చేస్తారు. అలాగే నృత్య ప్రదర్శనలు కూడా వుంటాయి. అర్ధరాత్రిదాకా జరిగే ఈ ఉత్సవాలు ఓ మంచి సాంస్కృతికోత్సవంగా మారాయి.

బొంబాయిలో ఏటా జరిగే గణేశ్ వుత్సవాలు సుప్రసిద్ధం. 9వ రోజు సముద్రంలో జరిగే గణేశ నిమజ్జనం చూడ్డానికి ఎంతోమంది చుట్టుపక్కల ప్రాంతాలనుంచి చిన్నచిన్న బోట్లలో సైతం వస్తారు.

బొంబాయి తరువాత మనం చేరుకునేది కొంకణితీరం. గోవాలోని ఈ తీరంలో దిగి ముఖ్యంగా చూడవలసింది పోర్చుగీసువారు నిర్మించిన ఎత్తయిన కోట. ఫోర్ట్ అగౌడా, టిరెఖాల్ కోటలు ప్రస్తుతం హొటళ్లుగా మారి దర్శనమిస్తున్నాయి.

గోవా అందమైన బీచిలకి ప్రసిద్ధి. ఇక్కడి బంగారు రంగులో మెరిసే ఇసుకపై సూర్య స్నానం చెయ్యడం ఓ మరువలేని అనుభూతి. ఇక్కడి సముద్రతీర జలాల్లో ఎన్నో రకాల ఆటల పోటీలు జరుగుతూ వుంటాయి. ముందు సముద్ర తీరపు అందాల్ని ప్రత్యేకతలనీ చూశాక గోవా పట్టణంలోకి అడుగెడితే మరెన్నో దర్శనీయ విశేషాలు ఎదురవుతాయి. పోర్చుగీసు వారి అధీన కాలంలో నిర్మించబడిన ఎన్నో చర్చీలు అద్భుత నిర్మాణ కౌశలంతో చూపరులను ఆకట్టుకుంటాయి.

గోవానుంచి 400 కిలోమీటర్ల ప్రయాణం తర్వాత కర్నాటక తీరం దగ్గర పడుతుంది. ఈ తీరం పొడవునా కొబ్బరి చెట్లు, వరి పొలాలు మైళ్ల దూరం విస్తరించుకుని కనిపిస్తాయి. యాత్రాస్థలమైన ఉడిపి, పారిశ్రామిక పట్టణమైన మంగుళూరు మార్గంలో ఎదురవుతాయి. కర్నాటక చేరిన యాత్రికులు అక్కడి హొయశిల దేవాలయాలు చూసి ముగ్ధులవుతారు.

*కాలికట్ నీటిపైసాగే ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కలప వ్యాపారం*





తీరప్రయాణపు ఆఖరి మజిలీ కన్యాకుమారి

మైసూరు, బెంగుళూరు పట్టణాలలోను, ఆ పరిసరాలలోను చూడదగిన విశేషాలు చూశాక తిరిగి ప్రయాణం ప్రారంభిస్తే కేరళకు చేరుకుంటాం.

కేరళలో బీచిలు, నదులు, కాలువలు లెఖ్ఖ లేనన్ని వున్నాయి. ఇది పచ్చని ప్రకృతి సౌందర్యానికి ఆలవాలమైన ప్రాంతం. అక్షరాశ్యత శాతం కేరళలో ఎక్కువ. మసీదులు, చర్చీలు అసంఖ్యాకంగా వున్నాయి. కొచ్చిన్‌లో యూదుల దేవాలయంవుంది.

ఇక్కడి రోడ్లు ప్రత్యేకంగా చూడవలసినవి. కర్నాటక, కేరళల నుంచి దక్షిణంవైపు ప్రయాణిస్తే మహే అనే ఒకప్పటి ఫ్రెంచి ప్రాంతం కనిపిస్తుంది. అది ఆ తర్వాత కాలంలో పాండిచేరితోపాటు ఇండియా అధీనంలోకి వచ్చింది. అక్కడినుండి దిగువకు వస్తే 1498లో వాస్కోడిగామా అడుగుపెట్టిన కాలికట్ దర్శనమిస్తుంది. బ్రిటిష్‌వారి అధీనంలోకి పోకపూర్వం ఇది రెండు పోర్చుగీసు ఆక్రమణలకు ఎదురు నిల్చి పోరాడింది. ఇక్కడ మరీ ఆకర్షించే ప్రాంతం ఎర్నాకుళానికి, కొచ్చిన్‌కి మధ్యగల భాగం. విస్తరించిన చెట్లతో, పచ్చని ప్రకృతి కన్నుల పండుగ చేస్తుంది. కొచ్చిన్ అందమైన పట్టణం. ఇక్కడ చరిత్ర, సంస్కృతుల అద్భుత సమ్మేళనం అడుగడుగునా గోచరిస్తుంది. చైనీయుల చేపల వలలు ఇప్పటికీ ఇక్కడ వాడుకలో వున్నాయి. భారతదేశంలోని చర్చిలన్నిటిలోకి పురాతనమైన చర్చి ఇక్కడ వుంది.

పురాతన పోర్చుగీసు గృహాలు, డచ్ భవనాలు, ఇంగ్లీషువారి అభిరుచికి ప్రతీకగా ఫోర్ట్‌కొచ్చిన్, వీటన్నిటి మధ్య విస్తరించిన కొబ్బరితోటలు కనువిందు చేసే దృశ్యాలు. చిన్నబోటు తీసుకుని సముద్రపునీరు కాలువల్లా పారే నీటిపై నడుపుకుంటూ పోతే అక్కడక్కడ చిన్నచి



చొరవాడ్ వద్ద ఉరకలు వేసే నదీజలాలు





న్న ఇళ్లు, పిల్లలు బోట్లపై స్కూళ్లకి వెళ్లడం స్త్రీలు అక్కడ నీరు నిండిన గుంటల్లో బట్టలు తుక్కోవడం, చిన్నచిన్న మడుగుల్లో జాలర్లు చేపలు పట్టడం... ఇలా ఎన్నో దృశ్యాలు కంట పడతాయి.

అక్కడినుంచి ప్రయాణం తిరిగి మొదలు పెడితే త్రివేండ్రం ఆ తర్వాత కోవలం బీచ్ చేరుకుంటాం. గోవాకున్నంత ప్రసిద్ధి లేకపోయినా కోవలం కూడా టూరిస్ట్ మ్యాప్‌లో ప్రముఖ స్థానాన్నే పొందింది. మంచి హొటళ్లు, బీచిలు ఉన్నాయిక్కడ. కేరళనుంచి తమిళనాడు తీరానికి చేరేలోగా కన్యాకుమారి దగ్గర కూర్చుని ధ్యానమగ్నుడయ్యాడంటారు. ఆ రాక్‌ని దాని మీద నిర్మించిన వివేకానంద మెమోరియల్‌ను దర్శించడానికి స్టీమర్ సర్వీసువుంది. దీనిపై పయనించి రావటం కూడా ఒక అనుభవమే.

అటుపైన ప్రయాణం రామేశ్వరానికి కొనసాగుతుంది. ఇక్కడ రామనాధస్వామి దేవాలయం, కోదండరస్వామి దేవాలయాలు దర్శనీయాలు. అక్కడి తీరంగుండా ఉత్తరానికి పయనిస్తే కొడక్కనై, అటుపైన తిన్నగా సాగితే కేథలిక్ యాత్రాస్థలమైన వేలంకన్ని, అటుపైన ముస్లిం యాత్రాస్థలమైన నాగూర్ దర్శన



కేరళలోని బేకల్‌ఫోర్ట్‌నానుకుని వున్న బీచ్

పడుతుంది. మూడు మహా సముద్రాల సంగమాన్నిక్కడే దర్శిస్తూ భారత ఉపఖండపు అంచుకు చేరుకుంటాం. ఇక్కడ సూర్యోదయ సూర్యాస్తమయాలను ఒకేసారి చూడగలగడం ఓ అద్భుతమైన అనుభూతి.

కన్యాకుమారిని ముఖ్యంగా యాత్రాస్థలంగా చెప్పుకోవచ్చు. అమ్మవారు అక్కడ కన్యగా భక్తులచే కొలవబడుతోంది. సముద్రతీరంలో కుమారి ఘాట్ దగ్గర నిర్మించిన దేవాలయంలో విరాజమానమైన ఈ దేవిని వేలాది మంది భక్తులు సముద్రస్నానానంతరం, దర్శించుకుంటారు. హిందువేతరులను గుడి దాకా రానిచ్చినా గర్భగుడిలోకి ప్రవేశించనివ్వరు. తీరానికి సుమారు ఓ కిలోమీటరు దూరంలో సముద్రంలో వివేకానందరాక్ వుంది. 1928లో స్వామి వివేకానంద ఆ రాతిపై మిస్తాయి. దాని తరువాత మనం చేరేది ఒకప్పటి ఫ్రెంచి వర్తక కేంద్రమయిన కారైకాల్, అటుపైన పాండిచేరి, అక్కడనుంచి మహాబలిపురం చేరుకుంటాం.

మహాబలిపురం అద్భుత శిల్పకళను ప్రతిబింబించే దేవాలయాలకు ప్రసిద్ధి. తీరానికి దగ్గరగానే రాతితో చెక్కిన రథాలు, రాతి కట్టడాలు దర్శనమిస్తాయి. మంచి బీచ్‌లు గల తీరప్రాంతమిది. రకరకాల చేపలు, పీతలు సమృద్ధిగా దొరుకుతాయి. ఈ మహాబలిపురపు శిల్పకళా నైపుణ్యానికి ముగ్ధులమై తేరుకునేలోగానే నందడిగావుండే మద్రాసు తీర ప్రాంతంలో అడుగుపెడతాం.

ఇక్కడ సెయింట్ జార్జ్‌ఫోర్ట్, సెయింట్ మేరీస్ చర్చి చూడదగిన విశేషాలలోకొన్ని మ్యూజియం, స్నేక్‌పాక్ వగైరాలు అనేకం చూశాక చివరిగా మెరినాబీచ్‌లో అడుగిడితే 13 కి.మీ.ల దూరం విస్తరించిన బీచ్ అద్భుతంగా కనపడుతుంది.

అక్కడినుంచి బయలుదేరి విశాఖపట్నం చేరుతాం. ఇక్కడి డాల్ఫిన్స్‌నోస్, ఉక్కు ఫ్యాక్టరీ, సమీపంలోనే ఉన్న సింహాచలం చూడదగినవి. తదుపరి చక్కటి దేవాలయాలకి ఆలవాలమైన ఒరిస్సాకి వస్తాం. ఒరిస్సాలోని మూడు ముఖ్యపట్టణాలైన భువనేశ్వర్, పూరి, కోణార్క్‌లలో, భువనేశ్వర్ మాత్రం తీరానికి దూరంగా వుందిగానీ మిగిలిన రెండూ సముద్రానికి దగ్గరలోనే వున్నాయి. భారతదేశంలో నాలుగు పవిత్ర నగరాల్లో పూరీ ఒకటి అంటారు. వేలాది యాత్రికులు ఏటా పూరీ జగన్నాధుని దర్శిస్తారు. జూన్, జూలైలలో జగన్నాధ రథయాత్రకోసం వచ్చే భక్తులతో పూరీ నిండు గర్భిణిలా కనిపిస్తుంది.

పూరీ ఆలయంలోనికి హిందువేతరులకు ప్రవేశం లేదు. రాతి రథం ఆకారంలో నిర్మించబడిన కోణార్క్ సూర్యదేవాలయం 13వ శతాబ్దం నాటిది. ఇందులోకి మత వివక్షత లేకుండా అందరికీ ప్రవేశాన్నిస్తారు. ఆ రాతి రథం అప్పటికప్పుడు కదిలి ముందుకు వెడుతుందా అన్నట్టు చక్కటి రాతి చక్రాలపై అలవోకగా నిలిచి కనిపిస్తుంది.

పూరీకి దక్షిణంగా కొన్ని మైళ్ల దూరంలో చిలక సరస్సు వుంది. ఓ చిన్న ఇసుక మేటతో సముద్రం నుంచి దూరమయిన నీరు అక్కడొక సరస్సులా ఏర్పడింది. వేలాది పక్షులు శీతాకాలంలో అక్కడికి వలస వస్తాయి. ఒరిస్సా సరిహద్దునుంచి విస్తరించినతీరం అటు పక్క పశ్చిమ బెంగాల్ మీదుగా వెళ్లి బంగ్లాదేశ్‌తో కలుస్తుంది. ఇదంతా గంగానదికి, సముద్రానికి మధ్యగల డెల్టా ప్రాంతం. ఇక్కడ 25,00 చ.కి.మీ.ల వరకూ విస్తరించిన దట్టమైన అడవివుంది. సుందర్ బాన్స్ ఈ ప్రాంతానివే. పులులు మొదలైన భూచరాలకేకాక, మొసళ్లు మొదలైన ప్రమాదకర జలచరాలకి కూడా ఈ ప్రాంతం పెట్టిందిపేరు. ఈ ప్రాంతాన్ని చేరడం లేదా మ్యాప్‌లో చిత్రించడం కూడా కష్టమే. ఇక్కడ వరదలెక్కువ. హుగ్లీ నది కలకత్తాకు దక్షిణంగా ప్రవహిస్తూ బంగాళాఖాతంలో వచ్చి కలుస్తుంది. పశ్చిమబెంగాల్ మీద కలకత్తా ప్రభావం బాగావుంది. పశ్చిమ బెంగాల్ గ్రామీణ ప్రాంతాలనుంచి అనేక మంది కలకత్తాకు వచ్చి అక్కడ కొన్నాళ్లు పట్నవాస జీవితాన్ని గడిపి, కొన్ని అలవాట్లని, ఆచారాలని స్వంతం చేసుకుని తిరిగి తమ ప్రాంతాలకు చేరుకుంటూ వుంటారు.

ఇలా గుజరాత్‌తో మొదలయి, కలకత్తాతో ముగిసే ప్రయాణం ఎన్నో అద్భుత అనుభవాలను మిగులుస్తుంది. అందులో కొన్ని శాశ్వతంగా మనసు పొరల్లో నిక్షిప్తమయిపోతాయంటే ఆశ్చర్యంలేదు.

కార్ నికోబార్ తీరప్రాంతం



# పరిణత ముత్యాలు

★ సంతోషం ఒక్కటే మంచిది. దానికి తావు ఇక్కడే. అందుకు సమయం కూడా ఇప్పుడే. సంతోషానికి దారి ఇతరులను సంతోషపెట్టడమే. ఇదే నామతం.

— రాబర్ట్

★ ఆపదలు వచ్చినప్పుడు సాహసంగా ఉంటే నగం విజయాన్ని సాధించినట్టే.

- ప్లాటస్

★ మనిషి గుణాలన్నింటిలోనూ సాహసం అన్నింటికంటే మొదటిది. సాహసమే అన్ని ఇతర గుణాలకు బాధ్యత వహిస్తుంది

-చర్చిల్

★ జూదమూ, వాదమూ వేదనను కలిగిస్తాయి.

— అవ్వైయ్యార్

★ వితండవాదానికి ఉత్తమమైన సమాధానం- దానిని కొనసాగనివ్వడమే.

— సిడ్నీస్మిత్

★ నేరం చేసినవాడిని శిక్షించడమే ప్రధానంకాదు. ఆ నేరం చేయడానికి ఏ పరిస్థితులు అతడిని పురికొల్పాయో వాటిని తొలగించడం ప్రధానం.

— ఎమ్.ఎన్.రాయ్

★ వెన్నెలలోనే ప్రేయసి అందం తెలుస్తుంది. ఆ లేవెలుగులో నగం అందం మాత్రమే చూడగలం. మిగతా నగం అందాన్ని మనసుతో చూస్తాం. అందుకనే పగటి వెలుగులోకన్నా రాత్రి వెన్నెల్లో ముఖ సౌందర్యం ద్విగుణీకృతం అవుతుంది.

- జోసెఫ్ బెల్

★ సౌందర్యం, ఆనందం విడదీయరాని శక్తులు.

- అరవిందయోగి

★ చట్టం అప్పుడప్పుడు నిద్రిస్తుంది- కాని చావదు.

— లోకోక్తి

★ చట్టం ఎలుకబోనువంటిది. అందులోకి ప్రవేశించడం సులభం, బయటికి రావడం కష్టం.

— బాల్ఫోర్

★ న్యాయస్థానాల్లో ఫలితం అనిశ్చితమైనది. వ్యయం మాత్రం తప్పనిది.

— ఎస్. బాట్లర్

★ న్యాయం కోసం కోర్టుకు వెళ్లడమంటే పిల్లికోసం ఆవును వదులుకొనడంలాంటిది.

— చైనా సామెత

★ చట్టం లేకుండా ప్రభుత్వం ఉండగలదు. కాని ప్రభుత్వం లేకుండా చట్టం ఉండలేదు.

-బెర్ట్రండ్‌రస్సెల్

★ నిజానికి చరిత్ర అంటే ఏమిటి? మార్పుల అంచనా మాత్రమే.

— నెహ్రూ

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 482. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 482. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 482. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 482. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad–500 482. |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: March 1, 1994

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/– RAMOJI RAO**
Publisher

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 290328. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977, Rajahmundry 71390, Karimnagar 8316.

